# తెలుగు సామెతలు - ఒక సవిమర్శక పరిశీలనము


**డా॥ టి.వి. రామనరసయ్య**

ప్రిన్సిపాల్


డాక్టరేటు పట్టముకొరకు
ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు
సమర్పించిన పరిశోధన గ్రంథము.


పర్యవేక్షకులు :

**ఆచార్య వి. ఆనందమూర్తిగారు**

తెలుగుశాఖాధ్యక్షులు (రిటైర్డ్)
ఉస్మానియా విశ్వవిద్యాలయము

ప్రథమ ముద్రణము – జనవరి 1994
1,000 ప్రతులు.



తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయముతో
ముద్రితము

మూల్యం రూ. 80-00

ప్రతులకు :
**శ్రీమతి జ్ఞానకుమారి,**
B-20/F-3, సంజీవరెడ్డినగర్
హైదరాబాదు–500 038.

1994



# గ్రంథకర్త పరిచయము

పేరు : డా॥ టి.వి. రామనరసయ్య
*M A , M.Phil , Ph D.*
*P.G D.T A.*

తల్లిదండ్రులు : శ్రీమతి కనకమ్మ, కీ॥శే॥ శ్రీ రాజమల్లయ్య

విద్యాభ్యాసము : హైస్కూలు వరకు Z.P.H.S. చొప్పదండిలో
డిగ్రీవరకు S.R.R. ప్రభుత్వ కళాశాల కరీంనగరములో.
తరువాతిచదువు ఆర్ట్స్ కళాశాల, ఉస్మానియా
విశ్వవిద్యాలయములో.

జన్మస్థలము : వెదురుగట్టు (గ్రామము), జిల్లా కరీంనగరము.

వృత్తి : ప్రస్తుతము ప్రభుత్వ కళాశాల చెన్నూరు
(ఆదిలాబాదు జిల్లా) ప్రిన్సిపాల్‌గా.

ఇతర రచనలు: తెలుగు సామెతలలో సంఘ చిత్రణము
తెలుగు సామెతలు - కథా కమామిషు (ప్రచురణలో)
సుమాంజలి (గేయ, వ్యాస సంకలనము) (ప్రచురణలో)
పలు వ్యాసములు, గేయములు రేడియోలో ప్రసారమైనవి,
పత్రికలలో ప్రచురింపబడినవి.



శ్రీ ఎం.ఎల్.ఎన్. రెడ్డి
I P S (Rtd)

శ్రీమతి నిర్మల

# అంకితం

శ్రీ ఎం.ఎల్.ఎన్. రెడ్డి గారి కుటుంబముతో నాకు దాదాపు ఇరువది నాలుగు సంవత్సరముల పరిచయమున్నది. రెడ్డిగారు ప్రస్తుతము A.P.P.S.C. ఛైర్మన్‌గా ఉన్నారు. వారు నాకు పూజ్యమిత్రులు, శ్రేయోభిలాషులు, సర్వము అని చెప్పవచ్చును. వారు గొప్ప సహృదయులే కాక గొప్ప పండితులు కూడా. "మిన్నంటినవాని పొడవెంత అన్నట్లు" అనే ఒక సామెత ఉంది. అది శ్రీ రెడ్డి గారికి అన్ని విధాలా సరిపోతుంది. శ్రీ రెడ్డిగారి గూర్చి ఎంత చెప్పినా, మరెంతో చెప్పవలసి ఉంటుంది. పార్వతీ పరమేశ్వరులనదగిన రెడ్డి దంపతులకు ఈపుస్తకమంకితమిచ్చుట నాకెంతో ముదావహము.

అందంగా, కళాత్మకంగా ముఖచిత్రాన్ని మలచిన శ్రీ ఆగాచార్యకు, పుస్తకాన్ని ఆవిష్కరించుటకు అంగీకరించిన జ్యోతిర్మయి సాహితి, సాంస్కృతిక సంస్థ, హైదారాబాదు వారికి, ముఖ్యంగా ఆచార్య శ్రీ ఎస్.వి. రామారావు గారికి కృతజ్ఞుడను.

-డా॥ టి.వి. రామనరసయ్య

SWAMI SWARUPANANDA BHARATI
( K. RAMAKRISHNA CHETTY, IPS Retd )
6-3-852/2/B/3, Aparajitha Colony, Ameerpet,
HYDERABAD.

Dt. 5th May 1994



# MESSAGE

It gives me great pleasure to write a few words about what transpired in mind when I saw the Research work, 'A critical study of Telugu Proverbs by Dr. T.V. Rama Narasaiah.

Telugu literature is oceanic. To make a special study of any one of its many aspects, a proper choice has to be made and this is the most difficult part of the whole project. Here Dr. T.V. Rama Narasaiah is blessed and his task was made easy when Padma Bhushan, Dr. C. Narayan Reddy himself made the Subject - selection for his doctorate. This is how all great classics, including Bammera Pothana's Bhagavatham have come into existence.

The proverbs as they are, do not carry any lustre with them. They are like diamonds drawn from the diamond mine. When they pass through the hands of a scholar like Dr. T V. Rama Narasaiah, they immediately attain the brilliance of polished precious stones. Every proverb is the study in question, has undergone a transformative with just a few words of explanation from the pen of Dr. T.V. Rama Narasaiah. The proverb once again becomes alive and breathing and endears to the reader.

Here I am reminded of what happened to that great work, 'Vijaya Vilasamu', when Tapi Dharma Rao dived deep into it and brought to surface many hidden gems and explained correctly the multi - dimensional nature of many of the words. After this exercise, the whole thing has become so attractive and alluring that the author, Chemakura Venkata Kavi becomes a Contemporary companion to the reader. I experienced the same feeling of gratitude when I read the criticalanalysis of Sir Desai Tirumala Rao, on 'Siva Bharatam'. They are all worthy to be studied and cherished for ever.

I have no hesitation to express the similar terms about Dr. T.V. Rama Narasaiah's, "A critical study of Telugu Proverbs", He has breathed life into these proverbs and led them into his study and given them the much needed exposure. In the end, he says that the subject is vast and one can not be expected to exhaust it. He hopes that the same would receive the attention it deserves from many others in future and progress well. This is a sure indication of his humility and good sense.

I wish to convey my hearty Congratulations to Dr. T.V. Rema Narasaiah on the success he has achieved in giving a stimulus to the readers to understand the Telugu Proverbs more easily. When properly understood and rightly used, they add to the literary wealth of user. So his research work has a great relevance to a casual as well as a more serious reader and my blessings go with it. I am sure it will find its rightful place in all the libraries and literary clubs, devoted to the promotion of Telugu literature.

*Swami Swarupananda Bharati*



**M.L.N. REDDI**
CHAIRMAN



PUBLIC SERVICE COMMISSION
ANDHRA PRADESH
HYDERABAD - 500 001
PHONE OFF 41087
RES 223774, 221544

I am conscious of the honour done to me in dedicating the dissertation, "A critical study of Telugu Proverbs" to me. My friend Dr. T.V. Rama Narsaiah has prevailed over me to accept this gesture, my own reservations in the matter notwitnstanding. It must have taken good deal of affection for Dr. Rama Narsaiah to dedicate this thesis to me. I am grateful for this gesture.

For some time past, there has been a visible increase in the interest, among Telugu scholars, in folk literature and application of cannons of criricism to this critical area of literature. Despite some recent contributions, there is a lingering feeling that this particular field has not received adequate attention and needs a wider exploration. Dr. Rama Narsaiah's effort, second in the series, is directed to this end. I hope this book fulfills a long felt need and will be a significant contribution in the field of folk literature in Telugu.

I wish the author all good luck in his endeavours in bringing this particular area into greater focus and scholarly attention.

*Sd/-*

*(M.L.N. REDDI)*

# స్వాగతం

పి.హెచ్.డి. పట్టమునకై పేరును సూచించిన ఆచార్య, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డి గారికి—

పర్యవేక్షకులుగా అంగీకరించి, అడుగడుగునా అన్నివిధాల ఎంతో సహకరించిన ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారికి —

ఆలస్యమయినను సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించుటకు దయతో అంగీకరించిన తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య S.V. రామారావు మరియు డీన్ ఆఫ్ ఆర్ట్స్ ఆచార్య చేకూరి రామారావు గారలకు—

అడిగినంతనే సలహాలనొసంగి సహాయము చేసిన గురువులు, పూజ్యులు ఆచార్య గోపాలకృష్ణారావుగారికి, ఆచార్య కులశేఖరరావుగారికి, మిత్రులు ఆచార్య ఎస్ గోపాల్ గారికి—

నాపై సదా అనురాగమును చూపి, తగిన సలహాలనొసంగి నన్ను ప్రోత్సహించిన డాక్టర్ కె భక్తవత్సలరావుగారికి—

ప్రియమిత్రులు, ఆంగ్లోపన్యాసకులు, GCGTA అధ్యక్షులు శ్రీ S.D. సుబ్బారెడ్డిగారికి—

మిత్రులు డా॥ గోవు లింగారెడ్డిగారికి—

అందంగా అచ్చువేసిన ఉజ్వాలా ప్రింటర్స్, కరీంనగర్ గారికి—

## కృతజ్ఞతాభివందనములు

పరిశోధనలో అన్నివిధాల సహాయమొనరించిన నా శ్రీమతి జ్ఞానకుమారి మరియు కుటుంబ సభ్యులకు శుభాశీస్సులు.

....టి.వి. రామనరసయ్య

పద్మభూషణ్ 29-1-94

**డా॥ సి. నారాయణరెడ్డి** హైదరాబాదు

# ఆశీరభినందన

ఒక అభిప్రాయాన్ని గానీ, ఒక వస్తువును గానీ సమదృష్టితో వివేచించి చూపడం సామ్యలక్షణం. ఆ సామ్యమే వ్యవహారంలో సామ్యతగామారి అదే "సామెత"గా పరిణమించింది. ఏది సామెత, ఏది సూక్తి అని ఖచ్చితంగా గీటుగీసి చూపడం కష్టం. నానుడులు, పలుకుబళ్లు, ఉక్తిచమత్కృతులు మొదలైనవన్నీ సామెతల పరిధిలోకే వస్తాయి.

సామాన్యంగా సామెతలంటే జనవ్యవహారంలో వున్న సూక్తులనే రూఢి వుంది. ఈ గ్రంథంలో డా॥ రామనర్సయ్య ఆ పరిధిని విస్తరించి ప్రాచీనాంధ్ర కావ్యాల్లోవున్న ఉపమాధర్మమున్న పంక్తులను, అర్థాంతరన్యాసాలను, పలుకుబళ్లను ఆరోక్తులను తన పరిశోధనాంశాలుగా తీసుకున్నాడు. అతడన్నట్లుగా సాహిత్యంలో ప్రయోగించిన పంక్తులే సామెతలయ్యాయో, సామెతలే సాహిత్యంలో చోటు చేసుకున్నాయో గిరిగీసి చెప్పడం అంత సులభంకాదు. ఆంధ్రమహాభారత, మహాభాగవత కావ్యాల్లాంటి ప్రాచీన గ్రంథాల్లోనుంచి, జానపద సాహిత్యంలో నుంచి సామేతల్లాంటి అనేక పంక్తులను ఉదాహరించి విమర్శనాత్మకంగా పరిశీలించిన డా॥ రామనర్సయ్యకు నా ఆశీరభినందన.

చిరునామా -

డా॥ టి.వి. రామనరసయ్య

ప్రిన్సిపాల్, ప్రభుత్వ డిగ్రీకళాశాల

చెన్నూర్ పోస్టు

ఆదిలాబాదు జిల్లా ఆం.ప్ర.

మీ

డా॥ సి. నారాయణరెడ్డి.

**ఆచార్య ఎం. కులశేఖరరావు**
విజ్ఞానపురి-విద్యానగరము,
హైదరాబాదు.

తెలుగు సామెతలను పరిశీలించి, ఆసక్తికరమైన సిద్ధాంత గ్రంథాన్ని డాక్టర్ టి.వి. రామనరసయ్యగారు రచించినారు. ఆ గ్రంథాన్ని కావ్యశ్రద్ధతో పఠించినాను. సామాన్య పాఠకునికి కావలసిన సమాచారం, పరిశోధకుడు గ్రహించవలసిన విషయం ఈ గ్రంథంలో గణనీయంగా ఉన్నది. డాక్టరుగారి కృషి పట్టా పొందడంలో నేకాక, విషయసేకరణలోను సార్థకమైంది.

సామెత అంటే ఏమిటి? దాని స్వభావమేమిటి? లనే ప్రశ్నలకు చాలా విపులంగా సమాధానాలు వ్రాయడానికి ప్రయత్నించిన పరిశోధకుడు. అనేక భాషల్లో ఉండే నిర్వచనాలను గ్రహించి, సారాంశాన్ని చెప్పడానికి ప్రయత్నం చేసినారు. కాని విషయం ఎంత విస్తృతి కలిగించిందంటే, దాని లక్షణాలు ఇవి, దాని నిర్వచనం ఇది అని చెప్పటం సాధ్యమే కాదు. అందుచేత **'Just what is Proverb and what is not a proverb has long been a subject of learned controversy** అని ఒక అభిప్రాయ సేకరణ దీనిలో వ్రాయడం, నాకు చాలా నచ్చింది. సామెత అంటే సర్వప్రపంచం అని నా భావం. ఎందుచేతనంటే సామెతల్లోలేనిది ప్రపంచంలో లేదు. ప్రపంచంలో ఉన్నది సామెతల్లో కనిపించకుండా ఉండదు.

మనదేశంలో నివసించే వారికి, చాలాకాలం నుంచి దేశచరిత్ర వ్రాసే అలవాటు లేదు. సామాజిక చరిత్రవైపు వారికి దృష్టియే లేదు అని ఆధునికులమైన మనం, మన ప్రాచీన తరాల వారిమీద నిందవేస్తున్నాము. కాని, మనకు జనవ్యవహారంలో లభిస్తున్న సామెతలను కొంచెం నిశితంగా పరిశీలిస్తే చరిత్ర కనిపిస్తుంది. సంస్కృతి కనిపిస్తుంది. మనవారికి కోపం వస్తే "వాడు మహా అప్రాచ్యుడు" అని అంటారు. ఇది నింద కాని నింద. పాశ్చాత్యదేశాల్లోనుండి వచ్చిన మొదటి తెగవారు మనను ఎంత వేధించినారో, ఎన్ని హింసలు పెట్టినారో నేను ఇప్పుడు చెప్పవలసిన పనిలేదు. ఇక తరువాతి పాశ్చాత్యులు భారతదేశాన్ని, జాతిని, సంస్కృతిని కొల్లగొట్టిన విషయాలు మన సంస్కృతిలో చాలా తాజాగా ఉన్నాయి. ఇక వారి సంస్కృతి ఎటువంటిదో కూడా ఈ నానుడి చెబుతున్నది. ఇంత మనవారికి చరిత్ర తెలియదు అనడంలోని పరమార్థం ఏమిటో ఆ మాట అన్నవారికే తెలియాలి.

మన సంస్కృతిలో చాలా ప్రధానమైన సాహిత్యానికి ధర్మార్థ కామ మోక్షాలు అనే నాలుగు ప్రయోజనాలు ఉన్నాయి. ఇవి కొన్నిచోట్ల ధ్వని ప్రధానంగా ఉంటే కొన్నిచోట్ల వాచ్యంగాను ఉండవచ్చును. ఎట్లా ఉన్నా వాటి సామర్థ్యం ఏమి తగ్గదు. సంస్కృతిలో ఒక భాగంగా ఉండిన సామెతలు మాత్రం ఈ ప్రయోజనానికి దూరంగా ఉంటాయా."శరణాగతులగు పురుషుల రక్షించునంత పుణ్యము గలదే" అనే సామెత ఎన్నివేల సంవత్సరాలు గడచిపోయినా ప్రయోజనాన్ని కోల్పోతుందా? భారతీయ సంస్కృతికి, నాగరిక స్వభావానికి ఇది ప్రతిబింబంగానే ఉంటుందనడంలో సందేహమేమి?

మన కావ్యాలు ముఖ్యంగా ప్రాచీన సాహిత్యం అగ్రవర్ణాలవారి ఆధిక్యతను ప్రకటిస్తున్నాయని, అందుచేత ఇప్పుడు, మరి కొంత కాలానికి వాటి ప్రయోజనం ఉండదు అనే మాటలు మనకు వినిపిస్తున్నాయి. ఈ మాటలు పలికేవారు ఈ సాహిత్యాన్ని పరిపూర్ణంగా పరిశీలించే పలుకుతున్నారా అనే సందేహం నాకు కలుగుతుంది. కేవలం జన్మచేత ఎవడు గొప్పవాడు కాదు. అప్పుడు ఇప్పుడు అంతే. ఆంధ్ర మహాభారతంలో ఒకచోట "పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజము శూద్రుకంటె నీచతముడు" అని నిరతాగ్ని జపహోమతత్పరుడైన నన్నయ్యగారే అన్నారు. కేవలం బ్రాహ్మణుడు కదా అని అతన్ని వారుకాని, మనం కాని గౌరవించే పనిలేదు. ఇంత స్పష్టంగా ప్రాచీన సాహిత్యం చెబుతూ ఉంటే, దాన్ని సరిగాచూడక ఆ మాటలను నిర్లక్ష్యం చేస్తున్నారు కాబోలు. ఒకమాట చెప్పవలె. ఏ దేశమైనా తన ప్రాచీన సాహిత్యాన్ని సంస్కృతిని విస్మరించి మనుగడ సాగించడం కష్టసాధ్యమైన పని. ఇదే సందర్భంలో, అగ్రజాతివారు కానివారిని మన ప్రాచీనులు నిందించలేదని చెప్పడానికి ఆంధ్రమహాభారతంలో రామనరసయ్యగారు ఉదాహరించిన ఈ సామెత చూడవలసిందే.

*"సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యును అతడు సద్విజుడు"*

మన సంస్కృతి అనాదిగా విద్యా విజ్ఞానాలమీద నిలిచి ఉన్నది. ధైర్యపరాక్రమాలకు విలువ ఉన్నప్పటికి ప్రథమ స్థానం మనకు విద్యాబుద్ధులే. "జ్ఞానముగలదేని బాలుడయిన గరు వృద్ధు మహాన్" అనే మాటలలో జ్ఞానానికి ఎంత విలువ ఉండేదో ఆలోచిస్తే తెలియవస్తుంది. వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, ఉపనిషత్తులు, కావ్యాలు నాటకాలు అన్నీ జ్ఞానం అనే పునాదిమీద నిలువబడిన సౌధాలే అంటే కాదనే సాహసం ఎవరికి ఉంటుంది.

మానవ స్వరూప స్వభావాలమీద సాహిత్యమంతా ఆధారపడినట్లుగా,సామెతలు కూడా అనేక సందర్భాలలో మానవ నైజాన్ని ప్రతిబింబిస్తాయి. ఎన్ని ఘనకార్యాలు

సాధించినా, ఎన్ని దేశాల జయించినా, ప్రకృతిని ఎంత తన స్వాధీనం చేసికొన్నా మానవ స్వభావం మార్పు చెందలేదు. ఈనాడు మానవుడు హేతువాదాన్ని అవలంబించి, అన్ని విషయాలను పరిశీలిస్తున్నాడు. కాని స్త్రీ పురుష సంబంధాలు, వారిలో ఉండే ప్రేమ ఏమైనా మారినాయా? పెద్దనగారు తన కావ్యంలో సంఘటనాత్మకంగా వెల్లడించిన "వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కనగాదె ఏరికిన్" అనే మాటలలో ఏమీ మార్పు రాలేదు. ఇక వస్తుందని అనుకోవడానికి ఆస్కారం లేదు.

జానపదులు సహజంగా అంతగా సంపద లేనివారు. అందుచేత వారి సామెతల్లో వారి సామాన్య జీవన విధానం కనిపిస్తుంది. ధనం ఉన్నా లేకపోయినా, అతిధి సత్కారం మనదేశంలో సంసార ధర్మం. ఆధర్మాన్ని నిర్వహించడంలో ఉండే సాధక బాధకాలను ఈ సామెత ఎంత చక్కగా వ్యక్తం చేసిందో చూడండి.

పండుగొచ్చి తేను పిండికేచేటు
అల్లుడొచ్చి తేను అత్తకేచేటు

పాపం! సామాన్య గృహిణి అయిన ఆ అత్తగారి కష్టసుఖాలు ఈ సామెతను అల్లిననాడు అద్యంతము చెప్పినట్లుగా కనిపిస్తుంది.

మన దేశంలో బహుభార్యాత్వం చెలామణిలో ఉండేది. సంపన్నులకైతే, ఇది బాధాకరం కాకపోవచ్చు. కాని సామాన్య కుటుంబాల్లోని స్త్రీలకు, సవతిపోరు దుర్భరంగా ఉండేది. జీవితమంతా మంటల్లోనే గడిచిపోయేది. అయినా ఈ దుష్ట సంప్రదాయం చాలకాలమే కొనసాగినట్లున్నది. తల్లి దండ్రులు పూనుకొన్న కుమార్తె ద్వితీయ వివాహాన్ని ఆమె ఎట్లా అమాయికంగా ప్రతిఘటించిందో ఈ సామెత చెబుతుంది.

సవతుల మీదికి నన్నియ్య బోకయ్య
సముద్రములోతుదిగి నేచూడలేను

"సంసారం సాగరం దుఃఖం" అనే నానుడి ఈ సామెతలో మరింత భయంకరంగా చేరింది.

డాక్టరు టి.వి. రామనరసయ్యగారు ప్రఖ్యాత కావ్యాలను పరిశీలించి, జానపదుల్లోనికి వెళ్ళి చాల సామెతలను సంపాదించినారు. ఇది ఉత్తమకృషి. వారు పరిశీలించిన కావ్యాల్లో శుకసప్తతి, హంసవింశతి, భోజరాజీయం వంటి ప్రజల కావ్యాలు కూడ చేరితే ఇంకా బాగుండేది. అయినా డాక్టరుగారి ఈ గ్రంథం సామెతల ఆమెతలాగానే ఉన్నది. శ్రీ రామనరసయ్యగారికి నా అభినందనలు.

*

**Dr. Veturi Ananda Murthy**
Retired Professor &
Head, Dept. of Telugu
Osmania University

Ph : 229570
6/2 RT (New),
Vijayanagar Colony,
Hyderabad - 500 457.

# అభినందనలు

"తెలుగు సామెతలు - ఒక సవిమర్శక పరిశీలనము" అనే ఈ సిద్ధాంత గ్రంథం డా॥ టి.వి. రామనరసయ్య గారి సాహిత్య కృషికి, పరిశోధన పాటవానికి అద్దం పడుతున్నది. విషయ సూచికలోని ప్రకరణాల వింగడింపు చూచినా చాలు ఈ విషయం మీద అతని దృష్టి ఎంత సమగ్రంగా ప్రసరించిందో వ్యక్తమవుతుంది. వాస్తవానికి సామెతలను గూర్చిన పరిశోధనం ఒక సముద్రాన్ని లంఘించడం వంటిది. మరి దానినీది ఆవలి యొడ్డు చేరడమనేది ఒకరి శక్తికి మించిన పనే అనిపించినా శ్రీ రామనరసయ్య ఆ పనిని అవలీలగానే సాధించినారు.

బహుకాలంగా ఈ విషయాన్ని గూర్చి వున్న అతని ఆసక్తి ఎంతోకాలం క్రితమే అతనిచేత ఎం.ఫిల్ చేయించినా పరిపాలనా బాధ్యతలు, సమస్యలు నడుమ కొంత అంతరాయం కలిగించినా పట్టువిడవక పిహెచ్.డి సిద్ధాంత గ్రంథాన్ని మరి కొంత ఆలస్యమే అయినా సహించి సమర్పించి పట్టాన్ని అందుకోగల్గడం, ఇప్పుడీ విధంగా దానిని ముద్రణకు తేవడం అభినందింపదగిన విషయం. ఇది అతని కార్య దీక్షకు, దక్షతకు నిదర్శనం.

సామెతల స్వరూప వికాసాలను పసిగట్టి నిర్వచించడం ఎంత కష్టమో వాఙ్మయ వ్యవహారంలో నలుగుతూ ఏర్పడ్డ సూక్తుల్ని, సామెతల్ని విశ్లేషించి నిర్ణయించడంకూడా అంతే కష్టం. "మైత్రింబోలెదు ధర్మము ధాత్రి దివిజులకులేదు" మిత్రద్రోహము దారుణమగు పాతకము" (పుట 42) వంటి కొన్ని సూక్తులో సామెతలుగా రూపొందదగిన శక్తిగల ఉక్తులో చెప్పడం కష్టమే! అయినా కష్టసాధ్యమైన ఈ పనిని శ్రీ రామనరసయ్య జాగరూకతతోనే నిర్వర్తించారు. ఓపికతో ఎంతో విషయాన్ని సేకరించి, జల్లెడపట్టి, విశ్లేషించి విమర్శించి సామెతల నిగ్గు తేల్చే యత్నం చేశారు.

పూర్వం ఎందరెందరో ఈ రంగంలో విశేషమైన కృషి చేశారు. అయినా చేయవలసినదీ, చేయదగినదీ ఎంతో మిగిలిపోతూనే వున్నది. తీసినకొద్దీ తేగల పాత్ర యిది.

ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని పరిశీలించేటప్పుడు భారత భాగవతాదులనేగానీ, విస్తరభీతిచేత కాబోలు తాళ్ళపాక వారి వాఙ్మయాన్ని తడవినట్లు లేదు. తాళ్ళపాక కవుల వాఙ్మయ ద్రుమమొక సుర పారిజాతం. అందులో ఏ శాఖనుముట్టినా సామెతల కుసుమాలు ఝలఝలా రాలి భావ సౌరభ్యాన్ని పరిమళింప చేస్తాయి. వాటిల్లో అందమైనవీ అందరి నోటా నలిగినవీ కోకొల్లలుగానే వున్నా రేకు రాతలో అచ్చు

కూర్పులో అర్థంకాక తిప్పలు పెడుతున్నవీ ఇంకా పరిశీలనార్హాలుగానే మిగిలి పోతున్నవీ కొన్ని లేకపోలేదు. ఉదాహరణకు

32-61 ఏ వేతనకు నాకు నేటి మాటనే మమ్మ
తేవించి యెడమాటలాడి తీరవలెగాక॥
జొనే దొరతో నెదురాడ వచ్చునా నాకు
మాని పండ్లు రాలితే మావికిందనే (2)
వద్దేయిక నాతో వట్టివట్టి సరసాలు
అద్దో ముంజే కంకణాన కద్దమాయిక (3)
లేవేనే విలచాతే లెక్కసేసేనా తామ
చావివోయ వుమినాకి చవులమా ఇల్ (?) (1)

ఇందులో చివరనున్న దాంట్లో "పద స్వరూపమే బోధపడకున్న"దని పరిష్కర్తల పాదసూచిక వున్నది. ఇలాంటివి విస్పష్టం కావాలంటే అవాఙ్మయంలోని సామెతలకు, పదప్రయోగాలకు కోశాలు ఏర్పడితేనేగానీ సాధ్యంకాదు. ఇలాటిదే మరోపదం (చూ. 32-233)--

ఇటమీద నీవు మరి ఏమి సేసేవు
చిటుకననేమే అక్కసెల్లెండ్లమైతిమి
యీ వేళ పొందులు విడేవిచ్చేవు చేతినీవే
భావమర్కటి వలెనే పైపై నీవు (3)

పరిష్కర్తల పాద సూచికలో "అరటివలె = పిల్లలు పెట్టినట్లని లక్ష్యార్థము కాబోలు." అని ఉన్నది. పదనిర్మాణం పరిశీలించినపుడు మొదటి రెండు చరణాల్లోతో గుణసూచకాలైన మనుష్యవాచకాలు "హితవరినవలెనే", "చుట్టము వలెనే" అన్నవి వుండడంచేత మూడో చరణంలోనూ గుణసూచక మనుష్య వాచకముండడమే సబబు. "భావమర్కటివలె" అన్న పాఠం "బావమఱదివలె" కాగూడునేమో పరిశీలించాలి. ప్రకరణాన్నిబట్టి ఆ అక్కచెల్లెళ్లిద్దరికీ విడేవిచ్చేనాయకుడు చివరన చెల్లెలికి బావగాను అక్కకు మఱదిగానూ తోచి "బావమఱదివలెనే" అనే అన్వయం కుదురుతుంది. పదంలో ఇలాటి సందిగ్ధ సన్నివేశాలెన్నో లేకు పారాన్నీ ప్రకరణాన్నీ పరిశీలించి, కూర్చుకొన్న కోశాలను సంప్రదించి, పరిష్కరించుకోవలసి వున్నది. సామెతల సేకరణం, పరిశీలనం ఇంకా విరివిగా జరగవలసి వున్నది.

ఈ దిశలో శ్రీ రామనరసయ్యగారి సామెతలమీద సవిమర్శక పరిశీలనం పాఠకులకు ఆలోచన కలిగించి ఆమేత లందించగలదనే విశ్వసిస్తున్నాను. ఆయనను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

హైదరాబాదు — మీ
1-3-94 — వేటూరి ఆనందమూర్తి

ఆచార్య ఎస్వీ. రామారావు
తెలుగు విభాగం
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# శుభాకాంక్షలు

సామెతలు సర్వజనావళికీ ఆమెతలు. సామాన్యుడి నుంచి విద్వాంసుడి వరకూ వాటిని ఉపయోగించని వారుండరు. భాషా దృష్టితో, సామాజికాంశాల పరిశీలనతో సామెతలను అనుశీలిస్తే ఎన్నో సాంస్కృతిక విశేషాలు వెల్లడవుతాయి. విశ్వవిద్యాలయ స్థాయిలో తత్సంబంధమైన పరిశోధన కొనసాగుతుండటం ముదావహం.

ఎం.ఫిల్. పట్టాకోసం 'తెలుగు సామెతలలో సంఘ జీవితము'ను పరామర్శించిన రామనర్సయ్య తన అధ్యయనాన్ని అంతటితో ఆపకుండా సామెతల గురించిన విస్తృత వివేచనకు పూనుకోవటం అభినందనీయం.

ఈ సిద్ధాంత గ్రంథంలో సామాజికపరంగానూ, సాహిత్యపరంగానూ, సామెతల సమాలోచన కొనసాగింది. ప్రాచీన అర్వాచీన తెలుగు, సాహిత్యంలో, శతకం-జానపదం మున్నగు సాహితీ రూపాలలో చోటుచేసుకున్న సామెతలను రచయిత సముచితంగా వివేచించారు. కౌటుంబిక సంబంధాలలో, వివిధ వర్గాల - వృత్తుల ప్రజలలో ప్రతిఫలించిన సామెతల సొరుసు సరళమైన శైలిలో సువ్యక్తం చేశారు. భాషానుశీలన, మనస్తత్వ విశ్లేషణ కూడా ఇందులో చోటు చేసుకొన్నాయి.

రామనర్సయ్య వ్యక్తిత్వం వినయసౌజన్యాలకు ప్రతిరూపం. విద్యార్థి దశలోనూ, అధ్యాపక వృత్తిలోనూ అందరినీ ఆకట్టుకొన్న స్నేహశీలి. ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారి పర్యవేక్షణలో రూపొందిన ఈ సిద్ధాంత గ్రంథం సాహిత్య జిజ్ఞాసువుల ముందుకు వస్తున్న సందర్భంలో పరిశోధన పర్యవేక్షకు లిరువురికి నా హార్దిక శుభాకాంక్షలు.

తేది: 6 మార్చి 1994 — డా॥ ఎస్వీ. రామారావు

# విషయసూచిక

## అభిప్రాయములు

# ఉపోద్ఘాతం

సామెతలు జన సామాన్యంలో నలిగిపోయిన పదబంధాలు. ఒక భావాన్ని సుందరంగా చెప్పదలచుకొన్నప్పుడు సామెతల నుపయోగించుట సర్వ సామాన్యం. పలు కావ్యాలు, పలు గ్రంథాలను పరిశీలించినపుడు సామెతలనాదిగా జన వ్యవహారంలో ఉన్నవని తెలుస్తుంది.

సామెతలు భాషా సముద్రంలోని ఆణిముత్యాల వంటివి. తరతరాలుగా మానవుడు సాధించిన ప్రగతిని సామెతలలో మనం చూడవచ్చును సామెతలు ఏ ఒక వ్యక్తి అనుభూతిలో చెందిన అభివ్యక్తీకరణ కాక, సామూహికానుభవ సారాంశ మని చెప్పవచ్చును. సామెతలు తెలుపలేని విషయాలు సర్వ సామాన్యంగా లేవని చెప్పవచ్చును.

తెలుగులో "సామెతలేని మాట - ఆమెతలేని యిల్లు" - అను సామెతే దాని ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది - మౌఖిక ప్రచారంలోనున్న వేల కొలది సామెతలు జనుల నోళ్లలో నలిగి, నలిగి తమ ప్రస్తుత రూపాలను పొందినవవి చెప్పవచ్చును. గ్రంథస్థాలైన సామెతలు గణనియమాదులకై తమ రూపాలను కొంత మార్చుకొనగా, వ్యవహారంలో నున్న సామెతలు అడపా, దడపా జనుల నోళ్లలో నలిగి తమ రూపాలను మరింత మార్చుకొన్నవి.

లెక్కకు మిక్కిలిగానున్న సామెతలనన్నింటిని సవిమర్శకంగా వివరించుట కష్టసాధ్యమయిన పని. ఐనప్పటికీ పెద్దల ఆశీస్సులతో యథాశక్తి కార్యం నెరవేర్చుటకు ప్రయత్నించెదను.

తెలుగు, తెనుగు, ఆంధ్రం అనునవి తెలుగు భాషకు పర్యాయ పదాలు. కావున ఏ ప్రాంతంలో, ఏ రూపంలో వాడబడినను మౌళికంగా అవి తెలుగు సామెతలే. అందువలన తెలుగు భాషకు సంబంధించిన సామెతల పరిశీలనమనిన అన్ని ప్రాంతాలకు వర్తించునదై, తెలుగు మాట్లాడు వారందరి మనోభావ వ్యక్తీకరణకు దర్పణంగా నిలుచునవని సవినయంగా విన్నవించుకొను చున్నాము. ఆ విధంగానే తెలుగు సామెతల పరిశీలనం చేయడమైంది.



# 2

# సామెతలు - స్వరూప స్వభావాదులు

సామెతలను గూర్చి పలువురు పండితులు పలుఅభిప్రాయాలను వెలిబుచ్చారు.

కీ.శే. డా॥ చిలుకూరి నారాయణరావు గారి అభిప్రాయం ప్రకారం సామెత అనునది సామ్యం యొక్క అసాధురూపం. సామ్యమనగా పోలిక కావున, ఒక వస్తువును మరొక వస్తువుతో పోల్చి చెప్పునది సామెత అని తెలుస్తుంది.

కీ.శే. డా॥ విశ్వనాధ సత్యనారాయణ గారు "ఒక పిండితార్థాన్ని కొద్ది మాటలలో చెబుతుంది సామెత"1 అని తెలిపిరి. పై దానివలన ఒకరి అనుభవాన్ని గాని లేదా ఒక సమాజపు అనుభవాన్ని గాని సంగ్రహంగా పోల్చి తెలుపునది సామెత అని తెలుస్తుంది.

నానుడులు, సుద్దులు, జనశ్రుతులు, శాస్త్రములు, న్యాయములు మొదలగున వన్నియు . సామెతలను నమానార్థముననే వాడబడుచున్నవి. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే అర్థ భేదం తెలుస్తుంది.

"నాడుమడి" అనునదియే నానుడిగా మారినది. సంస్కృతంలోనున్న లోకోక్తికిది ఆంధ్రానువాదమని చెప్పవచ్చును.

సూక్తులనగా నీతిని తెలుపు ప్రియమైన వాక్కులని అర్థం. సుభాషితం లనగా మంచి మాటలని అర్థం. జనశ్రుతియనగా ప్రజలలో ప్రసిద్ధికెక్కిన మాట. శాస్త్రం లనగా ఒక ప్రత్యేక కధను తెలుపు మాటలు. న్యాయమనగా పోలికనాధారముచేసికొని తెలిపే నీతి వాక్యాలు. ఇట్లు ఈ పదాలకు వేర్వేరు అర్థాలున్నను వ్యవహారంలో మాత్రము సామెతలనే సామాన్యార్థముననే ప్రయోగింపబడుచున్నవి.

సామెత-సాటవ అనునవి ఏకార్థమున ప్రయోగింపబడుచున్నవి.సాటిలయినవే సాటవ అని కీ.శే. డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు "తెలుగు సామెతలు" అను గ్రంథములో నిర్వచించిరి.

---

1. తెలుగు సామెతలు - 31వ పేజి.

శ్రీ సంపత్ రాఘవాచారి గారు సామెతనిట్లు నిర్వచించిరి.

"సామెతలలో సమత ఉండును. వాక్య నిర్మాణం రెండుదళములుగా నేర్పడి ప్రాసగాన్నియతిగాని రెండును జతకలిసికానియుండును. స్థూలముగ లోకోక్తికి సామెతకు గల భేదం నిరూపించినను దాని వివక్షణత శాస్త్ర బుద్ధికిగాని విభిన్నములుగ తోపని పరిస్థితులు కూడ లేకపోలేదు. ఈ కారణముల వలన సామెత అనగా జన వ్యవహార క్షుణ్ణమైన ఉక్తి అనే ఇప్పటికి తృప్తిపడ వచ్చును. అనగా నలుగురి నోట పడి నలిగిన మాట అని అర్థం.1

సామెతలకొక సమగ్రమైన ప్రత్యేక నిర్వచనమిచ్చుట కష్టమైనట్లే సామెతల పుట్టుపూర్వోత్తరాల గూర్చి తేల్చుట కూడా కష్టమైన పని అని చెప్పవచ్చును. అవి ప్రత్యేకముగా నొకరిచే సృష్టింపబడినవని చెప్పలేం. ఒకానొక లౌకిక తత్త్వాన్ని చక్కని మాటలలో ప్రజలకనువైన భాషలో లయబద్ధంగా చెప్పుమాట అనియు సామెతను స్థూలముగా నిర్వచింపవచ్చును. జానపద గేయాలవలె సామెతలు కూడా మౌఖిక ప్రచారాన్ని ఆధారం చేసుకొని ప్రబలినవే. అవి ఒక్కొక్కప్పుడు భావావేశం గల ఒక మహాకవి వలన ప్రభవించి ఉండవచ్చును లేదా జీవిత సారాన్ని కాచి వడపోసిన ఒక సామాన్యుని మాటలు కావచ్చును.

సామెతలు నన్నయ్యగారి భారత రచనకు ముందే ఉండి ఉండవచ్చును. శ్రీ సంపత్ రాఘవాచారిగారి సామెత అను పదం మొదట 15వ శతాబ్దిలోని వరహ పురాణంలో ప్రయోగించబడినదని తెలిపెను. వారే తత్పూర్వం కూడా అవి వ్యవహారంలలో ఉండవచ్చునని కూడా తెలిపిరి.2

సామెతలను గూర్చి ఆరుద్రగారి అభిప్రాయమిట్లున్నది.

"గతానుభవాన్ని దృష్టిలో వుంచుకొని, వర్తమానాన్ని ఆలోచిస్తూ భవిష్యత్తునకు వర్తించునది సామెత."

(రచయితతో ఇంటర్వ్యూ 3-6-82, 9-45 ఉదయం, మదరాసులో)

సామెతలను గూర్చి ఇతర భాషలలో ముఖ్యంగా ఆంగ్లభాషలో ఎట్టి నిర్వచనములున్నవో పరిశీలింతం.

---

1. తెలుగు సామెతలు - ప్రథమ ముద్రణము పీఠిక - 3వ పేజి
2. "నాకు తెలిసినంతవరకు సామెత అను పదము 15వ శతాబ్దంలోని వరాహ పురాణంలోని తొలిసారిగా ప్రయోగింపబడినది. ఎక్కడైనను తత్పూర్వ కావ్యంలలోగాని శాసనంలలోగాని ఉండిన ఉండవచ్చును."

1) Random House Dictionary– సామెత (Proveib)ను ఈ క్రింది విధంగా నిర్వచించినది.

1 A short popular saying that expresses effectively some complete truth or useful thought

(ఒక సంపూర్ణ సత్యాన్నిగాని లేదా ప్రయోజనకరమైన ఆలోచనను గాని శక్తివంతంగాతెలిపే బహుళ ప్రచారంలోఉన్న వాక్యాన్ని సామెతగా చెప్పవచ్చును.)

2. A person or thing that is commonly regarded as an embodiment or representation of some quality byword

(ఒక వ్యక్తికి లేదా ఒక వస్తువుకు సంబంధించిన, అందరికి అందుబాటులో ఉన్న, ఒక గుణాన్ని తెలుపునది కాని లేదా గుణ స్వరూపాన్ని తెలుపు ఊతపదం-గాని సామెత అని చెప్పవచ్చును.)

3 A profound saying, maxim, or oracular utterance requiring interpretation.

జనుల నోళ్ళలో ప్రచారం పొందిన, ఒక గొప్ప వ్యాఖ్యానానికి మూలంగా ఉన్న ఒక గొప్ప భాషితాన్ని సామెతగా పేర్కొనవచ్చును.

4. To make a byward of—
(ఊతపదంగా వినియోగపడునది—)

5 A proverb is such a saying popularly known and repeated usually expressing simply and concretly though often metaphorically a truth based on common sense or the practical experience of mankind like

" A stitch in time saves nine "

అనుభవము వల్ల కాని, సమయోచిత ప్రవర్తన వల్లకాని ఏర్పడిన ఒక సత్యంగాను, ఒక్కొక్కప్పుడు అందంగాను బహుళ ప్రచారాన్ని పొందినదిగాను ఉన్న సుభాషితమే సామెత అని చెప్పవచ్చును.

"మొదటి చిరుగునకు కుట్టు అప్పుడే వేస్తే, తొమ్మిది చిరుగులు తప్పును గదా" అనే ఉదాహరణాన్ని పై దానికి నిదర్శనంగా చెప్పవచ్చును.

అలాగే Maximను ఈ క్రింది విధముగా నిర్వచించిరి.

"A maxim is a brief statement of a general and practical truth, esp. one that serves as a rule of conduct or precept."

ప్రవర్తన నియమావళిగా పనికివచ్చు ఒక అనుభవంలోని సర్వసాధారణ సత్యంను తెలుపు వాక్యంగా Maximను చెప్పవచ్చును.

2. సామెతల గురించి "New Dictionary of Thoughts" అను గ్రందంలో ఈ క్రింది నిర్వచనాలు ఇవ్వబడినవి. ఆ గ్రందంలో అనేక పండితుల అభిప్రాయాలున్నవి. అర్థవంతాలైన అనేక ఉదాహరణాలను, నిర్వచనాలను కలిగి ఉన్న "New Dictionary or Thoughts" అను గ్రంధం Tryton Edwards D.D.గారి సంపాదకత్వంలో వెలువడింది. పండితుల అభిప్రాయాలు ఈ క్రింది విధంగా ఉన్నవి.

"బోవీ" అను పండితుని అభిప్రాయం ప్రకారం ఒక గొప్ప ఆలోచన ఒక గొప్ప వరం వంటిది. అట్టిదానికై భగవంతునికి మొదట, తదుపరి ఆ భావాన్ని తెలిపిన వ్యక్తిని, ఆ తదుపరి కొంతవరకు మొదట అనుభవాలను ఉదాహరణగా తెలిపే వ్యక్తిని కృతజ్ఞతతో స్మరించుకొనుట మేలని పేర్కొనెను."1

(లార్డుజాన్ రస్సెల్‌గారి అభిప్రాయం ప్రకారము సామెతలు ఒక వ్యక్తిచే ఉదాహృతమై పలువురితో సమీకృతమైన విజ్ఞానము.)

2. Proverbs are the literature of reason or the statements of absolute truth, without qualification. Like the sacred books of each man, they are sanctuary of its institution. Emerson (P.536)

(సామెతలు ఒకసంపూర్ణ సత్యంను తెలుపు భాషావాక్యాలు- ప్రతివ్యక్తికున్న పవిత్ర మత గ్రంధాలవలె, సామెతలు కూడ ప్రతివ్యక్తికి పవిత్రమైనవే.)

3. Short sentences drawn from long experience.
Cervantes (P. 536)

(సర్వెంటస్ అను పండితుని ప్రకారం సామెతలు దీర్ఘానుభవాన్ని తెలిపే చిరువాక్యాలు.)

4. Proverbs are inferior to books and formed the wisdom of the vulgar and in the earliest ages were the unwritten laws of morality. Disraeli

(సామెతలు ప్రాచీన గ్రంధాలతో పోల్చిచూచినపుడు నీచమైనవనియు, ప్రాచీన మానవుని మౌఖిక న్యాయశాస్త్రాలనియు డిస్రేలి అను పండితుని వాదము)

---

1. "A great thought is a great boon, for which God is to be first thanked, then he who is the first to utter it, and then in a lesser, but still in a considerable degree, the man who is the first to quote it to us. Bovee (P. 528)

5. Proverbs are the cream of a nation's thought -Anon
(ఒకజాతి ఆలోచన పరమావధి సామెత)

6. An apt quotation is as good as original remark.
Proverbs (P.536)

(సామెత ఒక అత్యంత సహజవిమర్శ.)

పై విధంగా "New Dictionary of thoughts" అను గ్రంథం తర్వాత 'The Macmillan Book of Proverbs, Maxims and Famous Phrases'[1] అను గ్రంథంలో సామెతలు, జాతీయములు, పలుకుబడులు ఏవిధంగా నిర్వచింపబడ్డవో పరిశీలిద్దాం.

1. Just what is proverb and what is not a proverb has long been a subject of learned controversy "Introductory note" (page V)

(సామెత ఏదో, సామెత కానిదేదో పండితుల కెప్పుడును చర్చనీయాంశమేనని ఉపోద్ఘాతంలో పేర్కొనబడింది.

2. A maxim is the sententious expression of some general truth or rule of conduct, that it is a proverb when it gets wings by winning popular acceptance, and flutters art into the high ways and by ways of the world —Introductory note (page V)

(నీతిదాయకమై, ప్రజల ప్రవర్తనను తెలుపునవి 'Maxim కాగా, అటువంటివి బహుళ ప్రచారాన్ని పొంది, ప్రజామోదాన్ని పొందినట్లయితే సామెతగా మారి, ప్రపంచ రహదారులను కళాత్మకత మొనరిస్తాయి.)

అదే గ్రంథంలో మరికొంతమంది సామెతలను ఈవిధంగా నిర్వచించారు.

ఫ్రాన్సిస్ బేకన్ అను పండితుడు, సిసిరో అను పండితుని అభిప్రాయాన్ని తెలుపుచున్నాడు. ఇంగ్లీషులో Apothegm అన్నను Proverb అన్నను ఒకే అర్థం కలదు.

1. Apothegms are according to Cicero, mucrones verberum, Painted speeches, salivas, salt pits from which one can draw the salt of discourse.

Francis Bacon - A pothegms New and old (pp. 1626)

---

1. The macmillan Book of Proverbs, maxims and Famous Phrases" (American center - madron) Edited and arranged by Burton Stevenson.

(సామెతలు అందమైన పలుకుబడులు—అలంకృత ఉపన్యాసాలు, చవులూరించే సలహాలకు నిధులు)

2. The Arabs say 'A proverb is to speech what salt is to food' The Macmillan Book of Proverbs, Maxims and Famous. Phrases (pp. 1905)

(ఉప్పు ఆహారానికి ఎంత అవసరమో, ఉపన్యాసానికి సామెత అంతే అవసరమని అరబ్బుల భావన)

3. Proverbium... (proverb) An olde sayed sawe. Thomas Cooper, The saurus Linguae Romanae of Britannicae (pp. 1565)

(స్వానుభవ సారమే సామెత అని పెద్దల అభిప్రాయం.)

4. Rev. John ward సామెతల కుండవలసిన లక్షణాలను ఈ విధంగా తెలిపాడు. అవి1

1. సంక్షిప్తంగా ఉండుట. 2. స్పష్టంగా ఉండుట. 3. బహుళ ప్రచారంలో ఉండుట. 4. అలంకారికమై ఉండుట. 5. ప్రాచీనత్వాన్ని కలిగి ఉండుట మరియు 6. పలువురి నోళ్లలో నలిగినటువంటి ఒక నిజం.

అయన తన వాదానికి సమర్థింపుగా ఈ క్రింది పండితాభిప్రాయాలను పేర్కొనెను.2

1. Agricola's "Short sentences into which the ancients have Compressed life"

(ప్రాచీనులు తమ జీవిత సారాన్ని ఈ చిరువాక్యాలలో కుదించినారు అగ్రికోలా)

2. Howell's "Sayings which combine sense, shortness and salt"

(సమయస్ఫూర్తి, సంక్షిప్తత, భాషలో ఒకరకమైన చవికలిగిన పలుకుబడులే సామెతలని హోవెల్‌గారి అభిప్రాయ )

---

1. Rev. John ward, vicar of Stratford on Avon in the reign of charles II, declared that for a proverb six things were essential. It must be (1) Snort (2) Clear (3) In common use (4) Figurative in expression and (5) Ancient.
The Macmillan Book of Proverbs maxims, and Famous phrases by Burlon Stevenson (P. 1957)

2. ఈ పండితాభిప్రాయాలు పై గ్రంథంలోనివే. (P. 1957)

3. Chamber's "Proverbs are pithy, practical, popular saying, experience of certain more or less general Conviction"

(సామెతలు సంక్షిప్తమై, అనుభవైకవేద్యమై, సర్వ సామాన్యంగా అందరి అభిప్రాయాలను పొందుపరుచుకొని ఉండునని ఛాంబర్‌గారి అభిప్రాయం)

4. Annadale's "A proverb is a short and pithy sentence forming a popular saying and expressing some result of the experience of life in a keen, quaint and lively fashion"

(జీవితాన్ని అతిశ్రద్ధతో పరిశీలించి పొందిన చైతన్యవంతమైన అనుభవాన్ని, చిరువాక్యాలలో అర్థవంతాలైన మాటలను పొదిగి, ఒకానొక బహుళ ప్రచారంగల సమర్థవంతమైన పలుకుబడిగా రూపొందింపచేయుచే సామెత అని అన్నాడేల్‌గారు అభిప్రాయబడ్డారు.

ఇట్లు Rev. John ward గారు తన భావాలకు సమర్థనగా అగ్రికోలా, హోవెల్, ఛాంబర్ మరియు అన్నాడేల్ అను పండితుల అభిప్రాయాలను ఉదాహరణంగా పేర్కొన్నారు. పైదానివలన సామెతకు బహుళ ప్రచారం ముఖ్యమైన గుణమని మనకు తెలుస్తుంది.

ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీషు డిక్షనరీ సామెతను ఈ విధంగా తెలిపింది.

"A proverb is a short, pithy saying in common and recognised use, a concise sentence often metaphorical or alliterative in form which led to express some truth, ascertained by experience or observation and familiar to all"

(సామెతను ఒక అనుభవానికి ప్రతీకగా, సంక్షిప్తమైనదానిగా, సరళంగా ఉండి ప్రచారంలో ఉండి ఆలంకారిక పదములతో కూడి, అందరి నోళ్లలో నలిగిన వాక్యంగా పేర్కొనవచ్చునని ఆ నిఘంటువు మనకు తెలుపుతుంది.)

మరికొంతమంది ఆంగ్ల పండితులు సామెతలను ఈ క్రింది విధంగా నిర్వచించారు.

1. The people's voice - The voice of God we call, And what are proverbs but the people's voice-

*-James Howell*

Before a Great Volume of Proverbs (P. 1647)

ప్రజావాణినే భగవద్వాణిగా మనం పేర్కొనుచున్నాం. సామెతలు ప్రజావాణిగా పేర్కొనవచ్చును, కావున భగవద్వాక్యములతో సమానమని చెప్పవచ్చును. బహుళః మన పెద్దలు ఇట్టి సామెతలనే భగవద్వాక్యములుగా పేర్కొనిరేమో. బైబిల్

లో సామెతలు ఎక్కువగా ఉండుట దీనికి ఉదాహరణంగా పేర్కొనవచ్చును, పదుగురాడు మాట పాటియై ధరజెల్లు" అని వేమనశతకకారుడు కూడ తెలిపెను.

2 Proverbs may not in properly be called the philosophy of the common people or according to Aristotle, the truest Religion of old philosophy,

*-James Howell*
Lexicon - Proverbs (P. 1659)

సామాన్య మానవుల వేదాంత ధోరణిగా, ప్రాచీన మానవుల సామెతలను పేర్కొనవచ్చునని అరిస్టాటిల్ పండితుడు తెలిపెనని హోవెల్ అను పండితుడు Lexicon Proverbs అను గ్రంథంలో అభిప్రాయపడెను.

3. Truth comes in a well rubbed down state in the form of the Sayings of the ancestors.

*-Khati I - King of Egypt*
Teaching No. 8 (2500 B.C.)

(పూర్వుల మాటలలోని సత్యము నిత్య స్రవంతిగా వెలువడుటయే సామెత.)

4. Short sayings drawn from long experience-

Cerrantes (Don Quixote)

(గొప్ప అనుభవముల సంక్షిప్త స్వరూపం సామెత)

5. A proverb is much matter decocted into few words.

*Thomas Fuller "Worthies"*

చిన్నచిన్న పదములలో నిక్షిప్తమైన గొప్ప విషయములే సామెతలు.

పై ఉదాహరణములు మరియు, నిర్వచనములు Lexicon Proverbs అను గ్రంథంనుండి గైకొనబడినవి.

6. It is a highway saying. *—John Dunton*
Arhen on Sport (P. 454)

(రాచబాటగా సాగే పలుకుబడియే సామెత)

7. Scraps from the table of wisdom, that will if well digested yield strong nourishment to thy mind *–Benjamin Franklin*
Poor Richard's Almanac (P. 1739)

(విజ్ఞాన వేదికపై చెదురు ముదురుగా పడిపోయిన ముక్కలు బాగా జీర్ణించుకొన్నచో మనస్సును అభివృద్ధి పరిచేవి.)

8. The Philosophy of the Vulgar. *–Isaac Disraeli*
Curiosities of Literature –The philosophy of Proverbs (P. 1823)

ఇచ్చట 'Vulgar' అను పదం గ్రామీణులు అన్న ఉద్దేశ్యమున గాని, సంస్కారహీనులైన అను అర్థమున గాని వాడబడి ఉండవచ్చును. గ్రామీణులు ఎక్కువగా చదువుకున్నవారు కాదు కావున 'Vulgar' అను పదమును గ్రామీణులు అను అర్థమున వాడుట ఉచితము.

(సామెతలు గ్రామీణుల వేదాంతంగా చెప్పవచ్చును.)

9. Discraeli also quotes a Spanish definition. "Sayings of old wines by their live sides" *–Cariosition of Literature*
The philosophy of Proveibs (P. 1823)

(సామెతలను ఒక వ్యక్తి పాత జ్ఞాపకాలుగా చెప్పుకొనవచ్చునని, పాత కాపు సారావలె శ్రేష్ఠమయినవని డిస్రేలి అను పండితుని అభిప్రాయమై యుండవచ్చును.

10. Copper Coinage of Wisdom. *–George Meredite*
Sandra Bellion (P. 1864)

(మెరిడిత్ పండితుని అభిప్రాయ ప్రకారం విజ్ఞానమనెడి రాగినాణాలు.)

11. The Apothegms of a people are the Gold and Silver coins of their language. *F.S. Cozzen*
"SAYINGS" (P. 49)

(బంగారు, వెండి నాణెముల సముదాయంగా ఒక భాషలోని సామెతలను పేర్కొనవచ్చును. అనగా ధనము మానవునికెంత అవసరమో, అదే విధముగా భాషకు సామెతలు కూడా ధనరాసుల వంటివని భావము.)

12. Proverbs may be called the Literature of the illiterate.
*–F.S. Cozzens*
"Sayings" (P. 49)

(నిరక్షరాస్యుని భాషగా సామెతలను పేర్కొనవచ్చును.)

13. Proverbs, the ready money of human experience.
*–Lowell* My Study Windows (P. 162)

(మానవ జాతి అనుభవ సంపదే సామెతలు.)

19. What can be the use of knowing about a set of maxim to which there are a complete set of antogonist maxims.

*–Syclney Smith* (P. 1806)

Lecture on the conduct of the understanding.

(ఒక అభిప్రాయాన్ని తెలుపు సామెతలను తెలుపుకొన్న ప్రయోజనమేమి. దానికి విరుద్ధమైన అభిప్రాయాలను తెలిపే సామెతలున్నాయి కదా అనే విచారాన్ని "సిడ్నీస్మిత్" అను పండితుడు వ్యక్తపరిచాడు. అనగా సామెతలను సమయానుకూలంగా, సందర్భాన్ని బట్టి ప్రయోగించాలి కాని పిల్లికి, పిడుక్కి ఒకే మంత్రమన్నట్లుగా ప్రయోగింపరాదనే సత్యాన్ని పై వాక్యములు తెలుపుచున్నవి.)

20. Proverbs. receive their chief value from the stamp and esteem of ages through which they have Passed-

*Sir William Ten ple.*

Of Ancient and Modern Learning (P. 1692)

(కాలపరీక్షలో నెగ్గి, ప్రత్యేక ప్రాధాన్యతాముద్రను కలిగియున్న వాక్యాలే సామెతలు)

పై నిర్వచనాలను పరిశీలిస్తే భాషకు సామెతలు ఎంతటి మహత్తును కలిగించునో తెలియుచున్నది. భాషకు ఇంపు, సొంపు కలిగించుటేగాక భాషాపుష్టికి సైతము సహాయముచేసేవి సామెతలే అని చెప్పవచ్చును.

సామెతలను ఆంగ్లంలో Proverbs అనెదరు. Aphorism, Apothegm Maxim మరియు Adage అను పదములు ఇంగ్లీషులో 'Proverb' అను పదమునకు పర్యాయ పదములని చెప్పవచ్చును.

సామెతల ప్రయోజనాన్ని గూర్చి మరికొంతమంది ఆంగ్ల పండితుల అభిప్రాయాలను పరిశీలించెదము. సామెతలగూర్చి తెలుగు భాషలోకంటె ఆంగ్లములోనే అభిప్రాయాలెక్కువగా తెలుపబడినందువలనను, సామెతలు ఏభాషకైనను సర్వసామాన్యముగా ఉండుటవలనను, సామెతల గూర్చి ఆంగ్ల పండితులు వెలిబుచ్చిన అభిప్రాయములు తెలుగు సామెతలకు కూడ వర్తించునని నా అభిప్రాయం. సామెతలు సర్వకాల, సర్వావస్థలందు సర్వజనులకుపయోగపడునవి కావున ఏభాషలో తెలుపబడిన అభిప్రాయాలైనను అందరకు అంగీకారమైనవనే భావిస్తున్నాను.

1. There is some degree of licentiousness and error in forming Axiom.

*-Francis Bacon*

"Novum Organum" (P. 1626)

ప్రజలలో మిక్కిలి ప్రచారం పొందినవి సామెతలు. కావున సామెతలలో కొంత ప్రజాభిప్రాయాలను వెలిబుచ్చుటలో స్వాతంత్ర్యముతోపాటు, తప్పులుకూడా దొర్లుతుంటాయని బేకన్ పండితుని అభిప్రాయము. అనగా ప్రజలు సామెతలు తెలిపే విషయం మాత్రమే గొప్పదనే భ్రమలో వుండకూడదని, సామెతలలో కూడా తప్పులుండడానికి అవకాశముంటుందని తెలుస్తుంది.

2. Most maxim mongers have prefeired the prettiness to the justness of thought and the turn to truth. –*Lord Chester field*
Letters 15th January 1753

చాలామంది సామెత ప్రయోక్తలు సత్యాన్ని చెప్పేదానికంటే, చమత్కారంగా చెప్పే విధానానికి, న్యాయమైన ఆలోచనలకు బదులు సుందరభాష దానికి ప్రాధాన్యాన్ని ఇస్తారు.

ఉదాహరణానికి "గుడ్డెద్దు చేలోపడ్డట్టు" సామెతనే తీసుకుందాం.

పై సామెతను ఒక గ్రుడ్డివానిపై ప్రయోగిస్తే ప్రయోజనముండదు. కాని సామాన్య మానవులు మరొక విషయానికి ఉదాహరణంగా పైన పేర్కొంటే సార్థక్యముంటుంది.

కాని లార్డుఛెస్టర్‌ఫీల్డ్ గారి అభిప్రాయము మరొక విధంగా ఉన్నది. పామరులు, అజ్ఞానులు ఇతరులను ఏదో ఒక విధంగా అవమానము చెయ్యాలనే తలంపుతో మాత్రమే సామెతలను ప్రయోగించెదరనియు, మహాజ్ఞానులకంటె అతిసామాన్యులే సమాజములో ఎక్కువగా నుండెదరు కావున సామెతలవలన సమకూరవలసిన ప్రయోజనము సిద్ధించుట లేదని వారి అభిప్రాయము. వారి ఉద్దేశ్యములో సామెతల ప్రయోగము పామరత్వానికి నిదర్శనం.

3, In all pointed sentences, some degree of accuracy must be sacrificed to conciseness –*Samuel Johnson*
Works (P. 286) (C 1778)

(చెణుకులుగా ప్రయోగింపబడు వాక్యాలన్నింటిలో కొంతైనా విషయము లుప్తమవుతుంది.)

4. The Genius wit and spirit of nation are discerned in ils proverbs. –*Francis Bacon.*

(ఒక జాతియొక్క మాటకారితనము, సమయస్ఫూర్తి ప్రతిభ సామెతలలో కానవగును.)

5. The Germans say "Judge a country by the quality of its proverbs."

(ఒక దేశము యొక్క వైశిష్ట్యము సామెతలలో కాననగునని జర్మనుల అభిప్రాయము)

6. The Maxims of men reveal their character. *–Vauvenargues*
Reflections (P. 107)

(వ్యక్తి శీలము అతడు ఉపయోగించు సామెతలలో కనిపించును.)

7. The French say "Judge a man by his favourite proverbs".

(అభిమానపాత్రమైన సామెతల ద్వారా అతనిని అంచనావేయమని ఫ్రెంచ్ దేశీయులు తెలిపిరి.)

8 Maxims are condensed good sense of nation.
*Sir John Mackintosh*
(a. 1832)

Quoted in the title page of Brown's "Legal Maxim".

(ఒక జాతి సంక్షిప్తీకరించిన నీతియే సామెత)

9. The proverbs of nation furnish the index to its spirit.
*J.G. Holland – Gold foil*
An exordial essay (a. 1881)

(ఒక జాతి చైతన్యమునకు సూచిక లాంటివి సామెతలు)

10. A good maxim is never out of season. *–H.G. Bohn*
Hand Book of proverbs (P. 288)

(అన్ని కాలములందు వాడబడునదే మంచి సామెత)

11. And then withal he knew of no proverbs.
Thou in this world then greves gras or herbes.
*Chaucer "Canterbury Tales"*

The wife of Bath's prologue

(సామెతలను ప్రయోగించుట తెలిసినవాడికి బాధపడవలసిన అవసరమే ఉండదు. ఎందుకనగా అవి సజీవమూలికలలాంటివికాబట్టి)

12. I know more proverbs than a book.
He also says "There is no proverb that is not true"
*– Cervantes "Don Quixote"*

(ఏ సామెత కూడ అసత్యముగాదని అతని అభిప్రాయాము.)

13. Russians say 'There is no proverb without its grain of truth".

(సత్యనిక్షిప్తముగాని సామెతే ఉండదని రష్యన్ల అభిప్రాయం)

14. I do not say a proverb is amiss when aptly or seasonably applied, but to be forever discharging them, right or wrong, hit or miss, renders conversation, insipid and vulgar.

–*Cervantes "Don Quixote"*

(సామెతలను తగుమాత్రంగా మాత్రమే వాడవలెననీ, ప్రతి సన్నివేశమునకు ఉచితానుచితములను ఎరుగక వాడినచో సమంజసముగా ఉండక పోవుటేగాక, సంభాషణ కూడ అసహ్యమగునని రచయిత అభిప్రాయం.)

"అతిసర్వత్రవర్జయేత్" ఇది సామెతలకు కూడా వర్తించునని భావం.

15. Adages and proverbs are to be accounted only as source to relish meat with, but not as substantial dishes to make a meal on.

–*Thomas Fuller*

Gnomologia - Introduction (P. 1732)

సామెత లెప్పుడును సంపూర్ణ భోజనము కానేరవు. రుచికరమైన మాంసా-హారమును భుజించుటకు అవసరమైన వ్యంజనమువలె, సామెతలు సంభాషణమున కవసరమగును. కావున ఎప్పుడును సంభాషణమంతయు సామెతలతో నింపకూడదు.

అన్నా భోజనమునకు పచ్చడి ఎంతవరకవసరమో, సామెతలును సంభాష-ణమునకంతే అవసరము. అదే పనిగా సామెతలను చీటికిమాటికి సంభాషణములో జొన్పకూడదను అభిప్రాయమును థామస్‌ఫుల్లర్ అను పండితుడు తెలిపెను.

16. A man of maxims only is like a cyclops with one eye and that eye placed in the back of his head.

–*S.T. Coleridge, Table Talk* (24–6–1827)

**Cyclops :** A member of a family of giants having a single round eye in the middle of the fore-head. (Random House Dictionary)

అసలే ఒకకన్నుగలిగినపక్షి, ఆ కన్ను ముందుండుటకుబదులు వెనకవైపు ఉండిన ఎట్లుండునో, కేవలము సామెతలను మాత్రమే ఉపయోగించు వ్యక్తి పరిస్థితి అట్లే ఉంటుందని భావము. ఏవిధముగానైతే వెనుకవైపు కన్ను ఉన్న పక్షి

తన ముందున్న వస్తువునెట్లా చూడలేడో, అట్లే సామెతలతో మాత్రమే సంభాషణము చేయదలచే వ్యక్తి సరియైన భావములను వ్యక్తీకరింపలేని స్థితిలోనుండునని భావము. పై వాక్యాన్నిబట్టి సామెతలను అవసరమైన రీతిలోనే ప్రయోగింపవలెనుగాని తెలుసు కదాయని అయినదానికీ, కానిదానికీ వాడి వాని ప్రయోజనత్వమును దెబ్బతీయరాదని భావము.

17. A man of fashion never has recourse to proverbs and aphorism.

—Lord Chester field
Letters 27th Sept' 1749.

నవ నాగరికుని సంభాషణములో సామెతలకు, పలుకుబడులకు స్థానము లేదు. అనగా సామెతలు జానపద సాహిత్యములో ఒకభాగము కావున, జానపదులు, గ్రామీణులే వానిని ఎక్కువగా వాడెదరనియు, నాగరికుడైనవ్యక్తి వానిని ఎక్కువగా వాడడనియు భావము. అదేగాక సామెతల ప్రయోగము నాగరికతకు చిహ్నము కాదని లార్డ్ ఛెస్టర్‌ఫీల్డ్‌గారి అభిప్రాయము. సామెతలపై చాలా నీచమైన అభిప్రాయము గలవారిగా లార్డ్ ఛెస్టర్‌ఫీల్డ్ గారిని చెప్పవచ్చును.

18. To repeat what has been said a thousand times is common place - (proverbs) —William Hazlitt Works (i. 381 p.)

వేయి మార్లు పలుకబడిన ఒక పలుకుబడియే పునరావృతమైనచో సామెతగా చెప్పబడును.

సామెతకుండవలసిన సామాన్యలక్షణమును పై వాక్యము తెలుపుతుంది.

19. The world is filled with the proverbs and acts and winkings of a base prudence.

—R.W. Emerson–Essays–Prudence (P. 1841)

సామెతలు ప్రపంచమంతా నిండి ఉన్నవి. అవి సత్యనిశ్చయమునకు, న్యాయనిర్ణయమునకు పునాదులవంటివి.

సామెతల బహుళప్రయోజనమును పైవాక్యము తెలుపుతుంది. అనగా సామెతలులేని భాషయేలేదనే భావమును పైవాక్యము తెలుపుతుంది.

20 'The mind of mass, when its daily maxims are put before it, revolts from any thing so stupid, so mean, so poor.

—Bagehot, Literary studies (i. 266 p.)

నిత్యజీవితములో వాడబడే సామెతలు, ప్రజలమనసులలోని నీచమైన, మూర్ఖమైన, భావశూన్యమైన భావాలకు ఎదురుతిరుగుతాయి.

ప్రజలకు నీతిమార్గాన్ని బోధించుటలో సామెతలపాత్ర ఎంతేని కలదని పై వాక్యము మనకు తెలుపుతుంది.

21 Thou shalt become an astonishment, a proverb, and a by-word, among all nations. —Old Testament

నీవొక ఆశ్చర్యముగా, సామెతగా, ఒక ఊతపదముగా అన్ని జాతులలో విలసిల్లుతావు, ప్రచారానికి సామెతలు ప్రముఖస్థానమునిచ్చును కావున నీవు మిక్కిలి ప్రచులితుడవయ్యెదవని భావము. సామెతలకు ప్రాచుర్యమొక ప్రముఖ లక్షణమని చెప్పవచ్చును.

22. And Israel shall be a proverb and a byword among all people. —Old Testament. I Kings (c. 600 B.C.)

ప్రజలందరికి ఇశ్రాయెల్ ఒక సామెతగా, ఊతపదముగా ఉంటుంది.

పైవాక్యాన్ననుసరించి ఆంగ్లములో సామెత అనేపదము క్రీ.పూ. 600 నాటికే ప్రయోగములో ఉన్నదనే వీలుకలుగుచున్నది.

23. Abdera, a town of Thrace, noted for the simplicity of its inhabitants which grew even to a proverb. —Thomas Stanley
The History of philosophy

సామెత దృష్టాంతమునకు పర్యాయపదముగా వాడబడుట పైవాక్యాలలో కానవగును. సామెతకు దృష్టాంతమొక ప్రముఖ లక్షణమనుటకు పై వాక్యమను ఉదాహరణముగా చెప్పవచ్చును.

24. That revengeful disposition of which your sex has been accused even to a proverb.
—James Fordyce "Sermons to Young Women".

సామెతను చెడు అర్థానికి పర్యాయపదముగా James Fordyce అను పండితుడు ప్రయోగించెను. పలువురి నోళ్లలో నలిగినది అనగా పదముల కాంతిని పోగొట్టుకొన్నదను ఒక ప్రత్యేక నిచార్థమున అతడు సామెతను పేర్కొనెను.

25. Foreigners, partial to a proverb, to their own country.
—Jeddaiah Morse
The American Geography —Preface (P. 1796)

పరదేశీయులు పరదేశంలో తాత్కాలికంగా స్థిరపడినవారు. తమ దేశమునకు

వలె, సామెతలపై కూడా పక్షపాతాన్ని ప్రదర్శించెదరు. అనగా దేశీయ భావములను సామెతలలోనే చూడగలమని భావము.

26. Siberia goes for a proverb for cold, India is a proverb for heat.
J.H. Newman, Historical Sketches

సైబీరియాలో చలి ఎక్కువ, ఇండియాలో వేడి ఎక్కువ అనే సంగతి జగద్విదితము. ఇచ్చట "సామెత" అను పదము "పర్యాయపదము" అను అర్థములో వాడబడింది.

27. Proverbs are easily made in cold blood.
—Dickens "Barnaby Ridge"

ఎన్నో గొప్ప ఆలోచనల వల స్వరూపమే సామెతలనే భావాన్ని పై వాక్యం తెలుపుతుంది.ఒక సామెత వెనుక ఒకగొప్ప అనుభవం, అనుభూతులు ఉంటావనే విషయాన్ని ఆ వాక్యము తెలుపుతుంది.

28. The Gods respect and the demons adore the maxim of the sages.
Doolittle – Chinese Vocabulary (ii-478 p.)

ఋషులచే ప్రయోగింపబడ్డ సామెతలను దేవతలు గౌరవించగా, రాక్షసులు పూజిస్తారు. ఇచ్చట ఋషులనగా గొప్పవారనే భావాన్ని తీసుకోవచ్చును. సామెతలపై గౌరవం ఉండుట సమంజసమైనదే కాని వానిపై గుడ్డిగా భక్తి ఉండకూడదనీ సామెతల పైనే పూర్తిగా ఆధారపడకూడదనీ పై వాక్యము తెలుపుతుంది.

29 There are words and maxims where by you may soothe the pain and cast much of the malady aside. —Horace –'Epistles"

నీ మనస్సులోని బాధను తొలగించి పవేయుచు, మనస్సును ఓదార్చుచు, తోడుగా నిలుచు పదములే సామెతలు.

సామెతలు నీతిని బోధించుటే గాక, మనస్సునకు ఒక మంచి మిత్రునివలె ఓదార్పును కలిగింప చేస్తావని భావం. అనగా బాధలలో ఉన్నవారు సామెతలను ఆశ్రయించిన వారి బాధలు తగ్గుటకు అవకాశముంటుందనే భావాన్ని పై వాక్యము తెలుపుతుంది.

30. A proverb is no proverb to you till life has illuminated it.
—John Keals-Letters (P 305)

సామెతల్లో జీవితం ప్రకాశించనట్లయితే అది సామెతే కాదు. అనగా సామెత జీవితాన్ని కాంతివంతం చేస్తుందని, అజ్ఞానాంధకారాన్ని తొలగింపచేసే విజ్ఞానదీపము వంటిదనీ పై వాక్యము వలన తెలుస్తుంది.

31. Nothing is so useless as a general maxim. —Macaulay
Essays –Machiavelli (a. 1859)

సర్వసామాన్యమైన, సార్వజనీనమైన సామెతకంటే నిష్ప్రయోజనమైనది మరొకటి లేదు. ఏ సామెతైనా కొంతవరకు దేశ, కాల పాత్రాదులననుసరించి ఉండుట వలన సార్వజనీనమైన సామెత ఉండడానికి ఆస్కారము లేదు. ఒకవేళ అటులున్నట్లయితే అది నిష్ప్రయోజనమైన సామెత అనీ, కేవలం నిష్ప్రయోజన మైనవే సార్వజనీనమైనవనీ రచయిత అభిప్రాయము.

32. Wiser man make proverbs, but fools repeat them.
—Samuel Palmer
Moral Lessons to Proverbs (Preface)

తెలివి గలవారివలన సామెతలేర్పడగా, మూర్ఖులు వానిని అనుసరిస్తారు.అనగా సామెతలను ఊరికే మాట్లాడే బదులు, దానిలోని సారాంశమును తమ జీవితాలకు అన్వయించుకోవడం ఉచితమని భావము.

33. An old saying, if it comes into use with time, becomes like an ordinance, —Plautas "Poenelus"

జీవితానికి పనికివచ్చే సామెత శాసనము వంటిది. పూర్వకాలం సామెతలు ప్రజలకు నీతిని బోధించేవై ప్రభుత్వ శాసనాల వలె ప్రజలకుపయోగపడినవి.

34. To understand a proverb and the interpretation, the words of the wise and their classic sayings.
Old Testament -"Proverbs"

గొప్పవారి మాటలను మననం చేసికొని వానిని జీవితానికి అన్వయించుకొనుటే సామెతలను అర్థం చేసుకోవడంలోని పరమార్థం.

35. A wise heart discerneth the proverbs of the wise.
Bensire - Book of Wisdom

ఒక జ్ఞాని సూక్తులను, తెలివిగల వాడు హృదయంలో పదిలపరచుకొంటాడు.

36. The wise proverb, let it not escape thee.
Bensire -"Book of Wisdom'

ఒక మంచి సామెతను వీలైనంతవరకు వదిలి పెట్టకు. సామెతల ప్రయోజన మును పై వాక్యమే తెలుపుతుంది.

37 Despise not the discourse of the wise, but acquaint thy self with their proverbs. —Bensire - Book of Wisdom

విజ్ఞాని సలహాను ఎప్పుడును తృణీకరించకు. వారు చెప్పే సామెతలను హృదయంలో పదిలపరచుకో.

38. They that are wise in words also show that they are wise in that they pour forth wise proverbs.

—Ben Sire - Book of Wisdom (xvii-291)

యుక్తముగా మాట్లాడు విజ్ఞానులు సామెతలను విజ్ఞానంతో వింపెదరు.

39. A faithful saying, and worthy of all acceptance.

—New Testament (AD. 62)

అందరికీ ఆమోదయోగ్యమైనదే ఒక నమ్మకమైన సామెత.

40. Patch grief with Proverbs.

— Shakespeare

— "Much Ado About Nothing"

బాధలను సామెతల సహాయంతో నివారించుకో-

అనగా సామెతలు వేదాంతాన్ని సైతం బోధించి, జీవన మార్గాన్ని నిర్దేశించుటకుపయోగపడుతావని భావం.

41. An old saying, that was a man when king Pepia of France was a little boy.

Shakespeare —"Love's Labour Lost"

ఫ్రాన్స్ రాజైన "పెపియా" చిన్నబాలునిగా ఉన్నపుడే సామెత ఒక పెద్దమనిషి.

సామెతలకు రాజ శాసనములకంటె ఎక్కువ అధికారమున్నదనే భావాన్ని పై వాక్యం తెలుపుతుంది.

42 The Proverb is something nasty,

Shakespeare —"Hamlet" (iii-2-359 P.)

సామెతలలో కొంత అసహ్యత కలదు.

"ఒకబూతు, ఒకనీతి ఒకసామెత". అను తెలుగు వాక్యభావాం పై ఆంగ్ల వాక్యముల్లో కానగును.

43. A maxim is only a proverb in its cater pillar stage.

—D.E. Mervin The Antiquity of Proverbs (P. 1922)

సామెత ప్రారంభదశయే Maxim అనగా సామెత (Proverb) maxim అనునవి ఒకే అర్థాన్ని బోధిస్తావని భావం.

44. Proverbs are all old, if they are new, they are not proverbs.
— Eugene Healey
Mr. Sandemon Loses His Life (P. 135)

ప్రాచీనమైనవి మాత్రమే సామెతలను అభిప్రాయాన్ని హీలే అను పండితుడు వెలిబుచ్చెను.

45. It is more trouble to make a maxim than it is to do right.
— Mark Twain – Pudelar Head
Wilson's New Calender (P. 1893)

ఒక మంచి సామెతను కూర్చుట, మంచి పని చేయుట కంటె కూడ కష్టమైనది.

46. "Classical Quotations" said Johnson "is the parole of a literary man all over the world."
— Oxford Dictionary of Quotations
— The Compilers to the reader (P. vii)

ఎచ్చటనైనా సరే ప్రాచీనాలైన సూక్తులు సాహిత్యజ్ఞుల వాగ్వ్యవహారానికి విధేయంగా ఉంటావని జాన్సన్ పండితుడు తెలిపెను.

47. Webster Dictionary లో సామెత నిర్వచనమిట్లున్నది.

A proverb is

(i) A brief epigramatic saying that is a popular by word. An of to repeated Pithy and indigeneously turned maxim.

(ii) A Profound or Oracular maxim, a truth Couched in obscure, language – parable.

(iii) One that has become a matter of talk by words.
— Webster's Third Inlernal Dictionary
— Edited by Philip B. Gore Ph.D.

సామెతను బహుళ ప్రచారంలో ఉన్న సాంఘిక న్యాయానికి పర్యాయ పదంగా, సత్య స్వరూపమైన అలంకృత వాక్యంగా, నిత్య జీవితంలో పలుమార్లు ఉపయోగింపబడే పలుకుబడిగా వెబ్‌స్టర్ డిక్షనరీ తెలుపుతుంది.

పై నిర్వచనాలతో ఏకీభవించే నిర్వచనాలు మరెన్నో కలవు.

ఉదాహరణానికి సామెతల గూర్చి J. Gergon అనునతడు "A Thousand Tibelan proverbs and wise sayings" అను గ్రంధములో ఇట్లు తెలిపెను.

1. The word "Proverb" is defined as "a brief Pithy saying, condensing in witty or striking form the wisdom of experience, an

adage, apothegm or wise saw, a familiar and wide popular saying in epigrammatical form.

In a wider sense proverbs are of the many branches of folk-lore.

2. Proverbs are by far the most numerous and most frequently employed of these forms of verbal art and are used in all kinds of situation by all strata of peoples especially by illiterate women in their gossip and seasoned people to stress a certain point or humour to a conversation.

3. Proverbs are also governed by the universal law of survival of the fittest

—Introduction

పై వాక్యాలను పరిశీలించినచో సామెతలు జానపద సాహిత్యంలో ఒక భాగమనీ, బహుళ ప్రచారంలో ఉన్నప్పటికీ స్త్రీలే ముఖ్యంగా వానిని వ్యాప్తిలోకి తెచ్చినారనీ, వాడుచుందురనియు మనకు తెలుస్తుంది.

సామెతలను అన్ని తరగతుల ప్రజలు ఉపయోగించిరి. కాని ప్రముఖంగా స్త్రీలు చేసే సంభాషణలలో, సామెతల ప్రయోగం ఎక్కువగా ఉన్నది. అట్లే చతురులైన పురుషుల మాటలలో చమత్కారానికై, ఒకప్రత్యేక భావాన్ని నిర్దిష్టంగా తెలుపుటకై సామెతలను ఆశ్రయించిరి. అన్నింటికంటె ముఖ్యమైంది, కాలాన్నెదిరించి నిలబడగలదే సామెత.

Johnson పండితుడు చేసిన వ్యాఖ్యతో ఆంగ్ల పండితుల అభిప్రాయాలను ముగిస్తాను.

"Quotation is a good king. There is a Community of thought in it."

— Johnson

— Indian Express - dt. 15-6-83

ఒక జాతి ఆలోచనంతా సామెతలలో నిక్షిప్తమై ఉంటుందని జాన్సన్ పండితుడు తెలిపెను.

పై నిర్వచనములనన్నింటిని పరిశీలించగా సామెతలకు కాలాన్ని ఎదిరించి నిలబడే శక్తితోపాటు సార్వజనీనత్వము కూడనుండ వలెనని తెలుస్తుంది.

సామెతపై శ్రీమతి సి. వేదవతిగారి అభిప్రాయమిట్లున్నది.

"అనంతమైన జీవితానుభూతులకు అందమైన వ్యాఖ్యానాలు సామెతలు, సరళత, సరసత, సహజత, సంక్షిప్తతతోపాటు, స్ఫురున దూసుకువచ్చే సూటిదనం- సామెతకు ముఖ్యలక్షణాలు.

సునిశిత హాస్యం, వ్యంగ్యోక్తి వైభవం, లోకానుభవసారం, విమర్శనావైశిష్ట్యం రంగరించుకొన్నది సామెత- అల్పాక్షరాల్లో అనంతార్థాన్ని నిక్షిప్తం చేసుకొన్న ప్రజాసూక్తం.

నిత్యజీవితంలో, అతి సామాన్యమైన సంఘటననీ, సందర్భాన్నీ పురస్కరించుకొని పుట్టిన ప్రజావాక్యం-నుండి, నానుడిగా- రూపుదిద్దుకొని, హృద్యమైన భావ గీతికవలె మనస్సును అలరిస్తుంది.

ఉపదేశాత్మకంగాను, సందేశాత్మకంగానూ మాత్రమేకాక, నిశిత విమర్శనా బాణంగానూ ఉపయోగింపబడుతుంది సామెత. సామెతలో స్థూలమైన అర్థనిర్ణయం వెనుక, గంభీరమైన జీవనమధన దర్శనం అవుతుంది. అందుకే, సామెత చతురోక్తి అయింది. చమత్కారోక్తి అయింది.

దేశచరిత్రకూ, జాతిసంస్కృతికీ, మానవనైజ స్వరూపానికీ అద్దంపడుతుంది సామెత. అయినా, ఒక్కొక్కసారి అనూచానంగా వస్తున్న ఆచార వ్యవహారాలను సైతం ధిక్కరిస్తుంది సామెత. ప్రకృతిసహజమైన సత్యాన్ని చెప్పటంతోపాటు వికృత మానసిక తత్వాన్ని కూడా ఎత్తిచూపుతుంది. విమర్శించి వేళాకోళం ఆడుతుంది. వ్యవస్థలోని లోపాలను సవ్యాఖ్యానంగా నిరసిస్తుంది."1

పై నిర్వచనాలను అనుసరించి సామెతకు ఒక ప్రత్యేక నిర్వచనాన్ని ఇచ్చుట కష్టతరమైనపని అని తెలుస్తుంది. "సామెత" అనుపదము తొలుత వరహాపురాణములో ప్రయోగించబడినప్పటికీ, అంతకుముందే నన్నయాదుల రచనలకు పూర్వముసైతం ఉండియుండవచ్చును. మౌళికంగా సామెతలు జానపద సాహిత్యానికి చెందినవి. నన్నయ్యకు ముందున్న భాష గాసట బీసటగా నున్న తెలుగుభాషగా పండితులచే చెప్పబడినప్పటికిని, అది ముఖ్యంగా జానపద సాహిత్యమే అయివుంటుంది.

సామెతను సంస్కృతంలో లోకోక్తి, న్యాయము అనియు, హిందీలో "కహావత్" అనియు, ఆంగ్లములో [Proverb] ప్రావర్బ్ అనియు, లాటిన్ భాషలో "ప్రావెర్బియమ్ [Proverbium]" అనియు, టిబేటన్ భాషలో "టాంపే" అని చెప్పుకుంటారు.

---

1. సామెత -సి. వేదవతి (నుడి - నానుడి) 1వ పే.

ఏ భాషా నిర్వచనాన్ని పరిశీలించినప్పటికి సామెతను సమగ్రముగా ఒక నిర్వచనంలో బంధించుట కష్టమని తెలుస్తుంది. సామెత స్వరూప, స్వభావాదులే సామెతలకు నిర్వచనాలని చెప్పవచ్చును.

తరతరాల జాతి అనుభవాన్ని ఒక లయబద్ధమైన, అందమైన మాటలలో కాచి వడబోసి తెలిపేదే సామెత అని చెప్పవచ్చును. సామెత ఒక విజ్ఞాన నిధియైన కవి చేతకాని, ఒక పండితునిచేతకాని సృజింపబడి ఉండవచ్చును. లేదా అక్షరజ్ఞానంలేని ఒక పామరుని లేదా పామరుల అనుభవం కావచ్చును. లేదా జన జీవనంలో నలిగి పోయిన ఒక పలుకుబడియే సామెతగా మారి ఉండవచ్చును.

సామెతకు గౌరవాన్ని, గుర్తింపును తెచ్చేది కాలమే- కాలపరీక్షకు నెగ్గి, సర్వజనామోదయోగ్యమై, సమాజ కల్యాణాన్ని బోధించే సర్వహితవాక్కులె, అనుభవవశమున సామెతలుగా మారినవి. మానవునిలో సహజ సిద్ధమైన సౌందర్యా రాధన భావము, చమత్కారంగా మాట్లాడే కోరికే సామెతలు సృజి పబడుటకు కారణాలని చెప్పవచ్చును.

శ్రీ నాంపల్లిగారి అభిప్రాయాలతో ఈ అధ్యాయాన్ని ముగిస్తాను.

"ఏ పండితుడో పామరుడో భావావేశంతో అనుభవపూర్వకంగా పలికిన పలుకులే సామెతలుగా రూపొందాయని భావించడం సమంజసం.

సామెత ఉన్నదున్నట్లుగా వాడుతుంటేనే అర్థంపర్థం చెడకుండా అందంగా శ్రుతిసుభగంగా ఉంటుంది. లేదా విరసంగామారి అసలుకే ఎసరు పెట్టినట్లు అనర్థాన్ని తెచ్చిపెడుతుంది."1

ఇట్లు సామెతలు మానవుని అపార విజ్ఞానానుభవానికి, ఆలోచనలకు నిదర్శనాలని చెప్పవచ్చును.

---

1. ప్రబంధాల్లో ప్రజాసూక్తం - దూడం నాంపల్లి.
స్రవంతి జూన్ సంచిక–1982 (సాహిత్య మాస పత్రిక)

# సామెతలు - పుట్టుపూర్వోత్తరాలు

సామెతలు ఏ కాలంలో జనించినవో చెప్పుట కష్టం. ఆదికవి వాల్మీకి రామాయణ కాలం నాటికే సామెతలు ప్రచారంలో ఉన్నట్లు ఈ క్రింది ప్రసిద్ధ వాక్యం వలన తెలుస్తుంది.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' 1

పై వాక్యం ప్రజల నుండి గైకొనబడి సామెత రూపంలో ఆదికవి కావ్యంలో చోటు చేసుకొన్నదో లేక కవిచేతనే సృజింపబడిందో చెప్పుట కష్టమైన పని. ఏది ఎట్లయినను సామెత అనునది క్రీస్తుకు పూర్వమే ప్రచారంలో ఉన్నదని చెప్పవచ్చును.

సామెతలు సామాన్యంగా జానపదులలోనే ఎక్కువగా ప్రచారములోనే ఉన్నవి. కావున భాషకు ఒక ప్రత్యేక స్వరూప, స్వభావమేర్పడక ముందే సాహిత్యంలోనే సామెతలు ఎక్కువగా ఉండడానికి అవకాశమున్నది. అనగా ఆదికవి వాల్మీకి రామాయణ కాలం నాటికే సామెతలు బహుళ ప్రచారంలో ఉండెనవి చెప్పడానికి వీలున్నది.

ఆంగ్ల భాషలో క్రీ.పూ. 3000 నాటికే సామెతలున్నట్లు ' International Book of Quotations" అను గ్రంధంలో పేర్కొనబడినది.

"జనని సంస్కృతంబు సకలభాషలకును" అని పేర్కొనబడుటవలనను, సంస్కృతంలో ఆదికవి వాల్మీకిరామాయణ కాలంనాటికే సామెతలుండుటకు అవకాశముండుటవలనను, తెలుగు భాషలో సైతం సామెతలు నన్నయ్యకుముందే ప్రచారంలో నుండుటకవకాశమున్నది.

సామెతలు మౌఖిక ప్రచారానికి ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చినవి. పండితుల కావ్యములలో కంటె పామరుల నోళ్లలోనే వానికి స్థానం ఎక్కువ. గొసట బీసటగా

1. వాల్మీకిరామాయణము.

ఉన్న తెలుగు భాషకు ఒక స్వరూపాన్ని కల్పింపచేసి మహాభారత కావ్యాన్ని నన్నయ రచించెను. గొనట బీసటగా ఉన్న తెలుగుభాషలో సువ్వాయి పదాలు, వెన్నెల మరియు ఇతర జానపద ప్రక్రియలు ఎక్కువగా ఉండెను. సామెతలు జానపద సాహిత్యంలో ఒకభాగం కావున సువ్వాయి పదములు, వెన్నెల పదాలతో కూడిన నన్నయ పూర్వ తెలుగుభాషలో కూడ సామెతలుండవచ్చును. అనగా తెలుగు భాషలో సామెతలు క్రీ.శ. 11వ శతాబ్దినాటికే ఒక ప్రత్యేకతను సంతరించు కొన్నావని చెప్పవచ్చును. మరియు సామెతలు క్రీ.శ. 11వ శతాబ్దినాటికే బహుళ ప్రచారాన్ని పొంచి ఉండవచ్చును.

ఏరులపుట్టుక, జ్ఞానులపుట్టుకను చెప్పుట ఎంతకష్టమో, అట్లే సామెతల పుట్టుకగూడ చెప్పుట కష్టం. సామెతల కాలాన్ని ఇదమిత్థంగా తెలుపుట కష్టసాధ్యమయినపని అనుటలో సందేహములేదు.

పైదానిని అనుసరించి సామెతలు క్రీ.శ. 11వ శతాబ్దికి పూర్వమే తెలుగు భాషలో ఉండెననుటకు వీలుకలుగుతుంది. సామాన్యంగా ఏ భాషలోనైనా, మొదటి కావ్యాన్ని వ్రాయుకవి, తాను జీవించిన సంఘంనుండి తన కాలంలోని, భాషలోని పలుకుబడులనుండియే కవితా సామాగ్రిని తీసుకొని రచనకు పూనుకుంటాడు. ఇచట సంస్కృత భారతానికి ఆంధ్రీకరణ జరిగింది కావున, సంస్కృత భాషలో ఉన్న పెక్కుసామెతలు తెలుగు రూపంతో, భారతమున చోటుచేసుకుని ఉండవచ్చును. నన్నయ్యకవి సంస్కృతంలోని కావ్యలక్షణాలను ఆదర్శంగా గైకొనెను. కావున ఆ భాషలోని ప్రముఖములైన సామెతలకు ప్రతిబింబాలుగా కొన్ని సామెతలను తెలుగు భాషలో సృజించి ఉండవచ్చును. ఏది ఏమయినప్పటికిని, తెలుగుభాషలో సామెతలు క్రీ.శ. 11వ శతాబ్దికి ముందే వ్యాప్తిలో ఉండెననుటకు సందేహంలేదు.



# ప్రాచీనాంధ్ర సాహిత్యంలో సామెతలు

సాహిత్యంలో సామెతలు ప్రవేశించెనో లేక సాహిత్యంలోనున్న గొప్ప వాక్యాలే సామెతలుగా ఘ్యూరినవో అని ప్రశ్నించుకొనినప్పుడు రెండును జరిగియుండ వచ్చునని సమాధానం చెప్పుకొనవలసి యుండును. సమర్థుడైన కవిచేతి సామెతలు సాహిత్యానికే ప్రత్యేకాలంకారంలుగా భాసిల్లినవి. అదియునుగాక ఆలంకారికులు లోకోక్తినికూడా అలంకారంగా గుర్తించిరి. కావున "సామెత" కావ్యానికి అలంకార ప్రాయమైనదని చెప్పవచ్చును. సామాన్యంగా సామెతలు పదోరూపంలో సాహిత్యం లొకానవచ్చును.

శతకములు గూడ కావ్యములలో నొకభాగమే కావున శతక సాహిత్యంలో కాననగు సామెతలు సైతం ప్రాచీన సాహిత్యంగానే సామెతలవరకు పరిగణించ వచ్చును.

సామెతలు, సామెతల రూపంలోనున్న పలుకుబడులు, సూక్తులు కావ్య సాహిత్యంలో కాననగును. వానినీ క్రింది విధముగా విభజింపవచ్చును.

**1. కుటుంబమునకు సంబంధించిన సామెతలు :**

సామెతలలో సమాజాన్ని చూడవచ్చును. సామెతలు ఒక ప్రత్యేక జాతి సంప్రదాయాలను, ఆలోచనలను, అభిప్రాయాలను వివరించును. సామెతలలో కుటుంబమెట్లు వివరించబడెనో ఇప్పుడు తెలిసికొనెదము. కుటుంబానికి సంబంధించి కావ్యములలో ఉన్నటువంటి సామెతలను పరిశీలించిన తెలియును. అట్టి సామెతలను ఈ క్రింది విధముగా విభజించవచ్చును.

1. అన్నతమ్ములు - దాయాదులు
2. భార్యాభర్తలు—
3 తల్లిదండ్రులు - కుమారుడు
4. తల్లిదండ్రులు - కుమార్తె
5. అతిథులు - అభ్యాగతులు.

కావ్యాలలో ప్రయోగింపబడిన సామెతలు, సామెతలవలె ఉన్న వాక్యాలను పరిశీలిస్తాము.

## 1. అన్నదమ్ములు - దాయాదులు :

లోకములో అన్నదమ్ములు పరస్పరం కలహించుకొనుట చూచుచున్నాము. రామలక్ష్మణులవలె కలసిమెలసి ఉండెడి అన్నదమ్ములు చాలాతక్కువ అనియే చెప్పవచ్చును. పాండవులు, కౌరవులు అన్నదముల కుమారులైనప్పటికిని బద్ధ శత్రువులు. కావుననే "జ్ఞాతి శత్రువు" అను సంస్కృతన్యాయం ఏర్పడింది. ఒక్కొక్కసారి అన్న ఎంత ప్రయత్నించినను, తమ్ములు అతనికి సహకారమివ్వక పోవచ్చును. అట్టిసమయంలో గుణహీనులైన సోదరులను శిక్షించుటే తగినది. వారిని గూర్చి ప్రస్తావించకపోవుటే మేలని భావము.

"జ్ఞాతులు గుణహీనులైనం విడువందగదు"1
(ఉద్యోగపర్వము ద్వి.ఆ.-91)

"జ్ఞాతి శత్రువ"నునవి ఒక సామెత. కావున దాయాదులతో వైరం సహజ మయినదని, ఎవ్వరైనను దాయాదులను ఒకకంట కనిపెట్టవలెననే భావాన్ని తెలుపు తుంది.

రామాయణ కావ్యాన్ని అనుసరించి అన్నదమ్ములు "రామలక్ష్మణులవలె కలిసి యుండవలెను" అను పలుకుబడి ఏర్పడింది ఎవ్వరైనను అన్యోన్యంగా కలిసి ఉన్న అన్నదమ్ములను రామలక్ష్మణులనుట సర్వసామాన్యం.

## 2. భార్యభర్తలు :

కుటుంబమునకు భార్యభర్తలను మూలముగా చెప్పవచ్చును. హిందూ ధర్మ ప్రకారము వివాహానికి ఒక ప్రత్యేకత కలదు. భార్యపై భర్తకు అనురాగం, భర్తపై భార్యకు విశ్వాసం ఉన్నయెడల ఆ బంధం గొప్పదని చెప్పవచ్చును.

"భార్య పురుషునందు నర్థంబ"
(ఆంధ్రమహా భాగవతము - త. స్కం - 458 వ.)

హింధూ ధర్మ సూక్ష్మలను ఆ వాక్యము తెలుపుచున్నది. పురుషునిలో సగ భాగము భార్యయే. అనగా భార్యాభర్తలు పరస్పరం అట్లు కలసి ఉండవలెనని భావం.

1. ఆంధ్ర మహాభారతము - ది.అ-91వ.

"సతిసి పతియే దైవంబు"
(ఆంధ్ర మహా భాగవతము - ష. స్కం. 513 వ.)

దితిచే లాలింపబడిన వాడై కశ్యప ప్రజాపతి ఆమె కోరికను తీర్చుటకు నిశ్చయించుకొనెను. అప్పుడామె సతికి పతియే దైవం కావున పతిసేవయే తనకు పరమ శిరోధార్యమని పలికెను. సతికి పతియే దైవమను హిందూ ధర్మమును పై వాక్యము తెలుపుచున్నది.

అట్లే గడుసరియైన భార్య గూర్చి సామెతలు కలవు. ఎంత గడుసరి ఐనప్పటికి భార్యకు భర్తపై ప్రేమ ఉంటుంది. "ఎంత వారలైనను కాంతాదాసులే"అనునది బహుశః అందువలననే ఏర్పడి ఉంటుంది.

"పతుల భ్రమింపనేరని సతులు గలరె"
(ఆంధ్ర మహాభాగవతం - ష.స్కం. 511 వ)

తన కుమారులందరును ఇంద్రునిచే హతులుకాగా దితి మిక్కిలి ప్రేమతో పతి వద్దకు వచ్చి సంతనాభిలాషియై అతనిని మరులు కొలుపుతుంది. సతులుపతులను ఏ విధంగానైనా భ్రమింపచేయగలరు గదా. భార్య మాటను వినని భర్తలు చాల తక్కువనియే చెప్పవచ్చును.

అట్లే సతికి పతి మాటయే గొప్పదను విషయాన్ని తెలుపు సామెతలు కలవు.

"పతి మాట తండ్రి మాటకంటె తగును"
(ఆంధ్ర మహాభారతము - నవ. స్కం. 563 వ)

దేవయాని యమాతికి, శర్మిష్ఠకుగల సంబంధాన్ని శుక్రాచార్యునితో వివరించుటకై పోయెను. అప్పుడు యమాతి దేవయానితో పతి మాట జవదాటగూడదనియు, తండ్రి మాట కంటె పతి మాటకే ఎక్కువ విలువను ఇవ్వవలెనని పలికెను. ఏ పతియైనను పతి మాట జవదాటగూడదని భావం. అనగా భార్యాభర్తల సంబంధాన్ని వారిలో ఉన్న అంతఃకలహాలను తండ్రికైనా తెలుపకూడదని భావం.

భార్యను రక్షించుకోవలసిన బాధ్యత భర్త పైనున్నది. తనభర్త ఉన్నతుడుగావలెనని ఏ స్త్రీ అయినప్పటికి కాంక్షిస్తుంది. ముఖ్యంగా పూర్వకాలంలో యుద్ధంలో ఓడిపోయినవారి ఆస్తులతో పాటు, స్త్రీలను కూడా బందీలుగా చేసుకొనే ఆచారం ఉండేది.

"అధముడైనవాని కాలగు కంటె నత్యధికునింట దాసియగుట మేలు"
(ఆంధ్రమహాభాగవతము—నవ. స్కం. - 406 పేజి)

" అధమునికాలయ్యేకంటె బలవంతునికి దాసిన అయినది మేలనునది "1 సామెత.

పురూరవుని కౌగిట్లో ఉన్న ఊర్వశి అన్నమాటలవి. దొంగలు ఇంట చొచ్చినప్పటికి ప్రియురాలి కౌగిలిని విడవకున్నాడని ఊర్వశి పురూరవునితో ఈసడింపుగా పలికెను. వెంటనే పురూరవుడు దొంగలందరిని చంపెను. భార్య ప్రోత్సాహముతో భర్త ఎట్టి కార్యాన్నైనను సాధింపగలడనుటకు పైకథను ఉదాహరణంగా గైకొనవచ్చును.

అట్లే సంసారముపై వ్యామోహ మెక్కువ ఉన్న వ్యక్తికి సిద్ధి ఎట్లయినా కలుగదని తెలుపు సామెతలు గలవు.

"దారాగార సుతాదులందు దగులంబు గలవానికి నెట్లు సిద్ధి కలుగును".
(ఆంధ్రమహాభాగతము—పం. స్కం. 4వ.)

భార్యాపిల్లలపై, ఇంటిపై మమకారము ఉన్నవానికి సిద్ధి కలుగనేరదు.

ప్రియవ్రతునకు సంసార సుఖములపై ఎట్లు వ్యామోహము కలిగెను. అతడెట్లు సిద్ధిని పొందకలిగెనని పరీక్షిన్నరేంద్రుడడుగగా శుకయోగీంద్రుడు అతనికి పుణ్యవ్రతుని కథను తెలుపు ఘట్టములోనిది. సిద్ధినిపొందవలెననిన ఇంటిపై, ఇల్లాలుపై, పిల్లలపై వ్యామోహం ఉండకూడదనే భావాన్ని పైవాక్యం తెలుపుతుంది.

స్త్రీకి భర్తనుమించిన దైవములేదనీ, అన్యధర్మములు ఎట్టివైనను పనికిరానివనియు ఈ క్రిందివాక్యము తెలుపుతుంది.

"సతులకునన్య మెట్టిదియును ధర్మమె భర్తృసంశ్రయగాక".
(అరణ్యపర్వము)
(ఆంధ్రమహాభారతము—స.ఆ - 241 ప.)

---

1. "తెలుగుసామెతలు"-తెలుగువిశ్వవిద్యాలయం-1986 మాడల్ కూర్పు (పే.-66)
సంపాదకవర్గం : శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు
డాక్టర్ యశోదారెడ్డి, కోదండరామిరెడ్డి

సావిత్రి కోరికపై యమధర్మరాజు ఆమెకొక వరాన్ని ఇవ్వచూపును. కాని సావిత్రి అచ్చటినుండి తిరిగి వెడలదు. అప్పుడు యమధర్మరాజు తననీవిధంగా వెంబడించుటకు గలకారణమేమని అడుగగా సావిత్రి పైవిధంగా సమాధానమిచ్చెను. సతులకు భర్త సాన్నిధ్యము తప్ప మరొక శరణ్యము లెదనే భావాన్ని పైవాక్యము తెలుపుతుంది.

అట్లే

"పతులెందు జనిననచటికి సతులుం జనవలదె"
(అరణ్యపర్వము)
(ఆంధ్రమహాభారతము—స.అ. - 220 ప)

యమధర్మరాజుతో సావిత్రి పై విధంగా పలికెను. హిందూధర్మశాస్త్రప్రకారం పతికి సతియే దైవం. పతి వెడలిన బాటయే సతి కూడా అనుసరించవలెనని పైవాక్యం తెలుపుతుంది.

నాటికీ నేటికి భర్తలేనిస్త్రీని సమాజము గౌరవింపదనుటకు నిదర్శనంగా

"మగడులేని మగువమాడ్కి-గాకున్నె"
(భీష్మపర్వము)
(ఆంధ్రమహాభారతము—ప్ర.అ. - 62 ప)

అను వాక్యాన్ని పేర్కొనవచ్చును. భర్తలేని స్త్రీని సమాజము గౌరవింపదు. ఇప్పుడు పరిస్థితులు మారినను, స్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ లేదనే చెప్పవచ్చును. భీష్ముడు లేని కౌరవ సైన్యాన్ని గూర్చి ధృతరాష్ట్రుడు అవిధంగా పలికెను. దిక్కులేని వారిని గూర్చి "అనాథ" అనుట సర్వసామాన్యం. "అనాధ" అనగా నాథుడు లేనివాడని అర్థం.

స్త్రీ పతి సేవవలన గొప్పశుభాలను పొందునని ఈ క్రింది వాక్యం తెలుపుతుంది.

"అబల భర్తృ శుశ్రూష ఫలము, సంతత శుభంబు గలదు ధర్మువొదవు"
ఆంధ్ర మహాభారతం - పం. అరణ్యపర్వం 316 ప)

ద్రౌపది సత్యభామకు పతివ్రతా ధర్మాలను తెలుపుచు పై విధంగా పలికెను. ఏ స్త్రీకైనను భర్తృ శుశ్రూషను మించిన ధర్మంలేదని భావం.

భార్యాభర్తలు కలకాలం చిలకాగోరింకల వలె కలసి ఉండవలెనని హిందూ ధర్మ శాస్త్రాలు తెలుపుచున్నవి.

"సనునే కులసతుల విడువ సత్పురుషులకున్"
(ఆం. మహాభారతం - పం.అరణ్యపర్వం 214 వ)

సూర్యుని భార్యయైన పావకాంగన పై విదంగా పలికెను. సత్పురుషుడు ఎప్పుడును కులసతి అనగా భార్యను వదల కూడదనే భావాన్ని పై వాక్యం తెలుపుతుంది.

ఆపదలలో సలహాను ఇచ్చి భార్యభర్తను ఆదుకొనుటకు ఈ క్రింది వాక్యాన్ని ఉదాహరణంగా పేర్కొన వచ్చును.

"భార్యా సమేతుడైయున్న వాని కెంతలయ్యును నా పద వెఱుక పడవు"
(ఆంధ్ర మహాభారతం - ద్వి. అరణ్యపర్వం 74 వ)

దమయంతి నలునితో పై విధంగా పలికెను. భార్యాభర్తల సంబంధం ఎంత గొప్పదో పై వాక్యం వలన తెలుస్తుంది.

అట్లే
"గణపతియ చువ్వ భార్యకు"
(ఆంధ్ర మహాభారతం - పం ఆ. 207 వ.)
పార్వతి శివునకు పతివ్రతా దర్మములను ఎరిగించు ఘట్టములోనిది.

భార్యకు భర్తే నిజమైన దైవము అనియు, అతడే ఆమెకు నిజమైన దిక్కు అనియు పార్వతి తెలిపెను.

హిందూ ధర్మశాస్త్రంలో పెళ్లికి ఒక ప్రత్యేక గౌరవము కలదు.

"పాణి గ్రహణము సేయని వనితలకు పుణ్యలోకమ ప్రాప్యము"
(అంధ్ర మహాభారతం - ద్వి.అ. 210 వ.)

గర్గి వంశానికి చెందిన ఖని అను తపోధనుడు ఒక కన్యను పెంచుకొనెను. ఆమెకు వివాహము కాకముందే అతడు స్వర్గమునకు పోయెను. ఆమె వివాహం చేసికొనక గొప్ప తపస్సు చేసి పరలోకమును కోరగా, నారదుడు అచ్చటకు వచ్చి ఆమెతో పై విధంగా పలికెను.

వివాహము కానట్టి స్త్రీకి పరలోక ప్రాప్తి లభించదు. కావున ఆమె వివాహము చేసుకొనుటయే ఉచితమని తెలిపెను. వివాహ ప్రాధాన్యాన్ని పైవాక్యం తెలుపుతుంది. అట్లే

"భామలకు పతిభక్తియ పరమమైన భూషణంబు"
(అరణ్యపర్వము ఆంధ్ర మహాభారతము - ద్వి.ఆ. 143 ప)

సుదేవుడను బ్రాహ్మణుడు పై విధంగా పలికెను. స్త్రీలకు పతిభక్తియే గొప్పదనీ, అది అన్ని అలంకారములకంటె కూడా గొప్పదనీ అతడు పలికెను. పతిభక్తి సతికి అలంకారము.

మహాభారత కాలమునకు పూర్వం ఒక స్త్రీకి పలువురు భర్తలుండుట ఆచారముగా ఉండియుండవచ్చును. బహు భర్తృత్వము నుండి ఏక భర్తృత్వమునకు మార్పు చెందిన సంధి కాలముగా మహాభారత కాలాన్ని పేర్కొనవచ్చును.

కర్ణుడు ద్రౌపదిని ఉద్దేశించి పై విధంగా పలికెను. ఏ స్త్రీకైనను ఒకే భర్త ఉండగా, పాంచాలి పంచభర్తృక. కావున సతీ స్థానమును పొందలేదని కర్ణుని అభిప్రాయం.

పెళ్లి స్త్రీకి ఎంతో ముఖ్యము. కాని ఆమెను వృద్ధునకు ఇచ్చి పెళ్లి చేయకూడదనీ, యవ్వనములో ఉన్న స్త్రీకి ఒక యువకుని తోడనే వివాహము చేసిన సమంజసముగా ఉంటుందని ఈ క్రింది వాక్యం తెలుపుతుంది.

"రూప లావణ్యవతియై వృద్ధ శ్రోత్రియుని చేతంబరిణీతమైన తరుణివోలె"
(ఆంధ్ర మహాభారతము అరణ్యపర్వము - ప్ర.ఆ. ఆంధ్ర)

ధృతరాష్ట్రాదులకు ఎన్ని నీతివాక్యములు తెలిపినప్పటికి వ్యర్థమే అని విదురుడు మిక్కిలి బాధపడెను. వృద్ధునకు యువతితో వివాహము ఏ విధముగా తగినది కాదో అట్లే రాజ్యలక్ష్మి సైతము అధర్మపరునికి తగదు. తాను ఎన్ని హితవాక్కులు నుడివినప్పటికి ప్రయోజనము లేకపోయెనే అని విదురుడు ధర్మరాజాదులతో పలికెను.

వివాహము ఎప్పుడు అనురూప వయస్కులకు తగునని ఆర్య ధర్మాలు తెలుపుచున్నవి.1

---

1. కన్యాప్యేవం పాలనీయా। శిక్షణీయా ఽ తియత్నతః॥
దేయా వరాయ విదుషే। ధనరత్న సమన్వితా॥ (ఆర్య ధర్మములు)

ఏ స్త్రీ యైనను పతి ప్రేమనే ఎల్లప్పుడు కాంక్షించుననుటకు

"పతి స్నేహము కామినులకు బలవంతము"
[ఆంధ్ర మహాభారతము - కర్ణపర్వము - ష.ఆ. 191 ప]

అను వాక్యమును ఉదాహరింపవచ్చును. హిడింబి తన సోదరుని చంపిన భీమునిపై మరులుకొనుట స్త్రీకి పతి స్నేహమే ముఖ్యమను భావాన్ని విశదీకరిస్తుంది.

స్త్రీకి ఎల్లప్పుడును పతి వద్ద ఉండుటయే మేలనే భావాన్ని ఈ క్రింది వాక్యాలు తెలుపుచున్నవి.

"పతుల కడన యువికి సతులకు హేతువు"
[ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము - చ.ఆ. 66 ప]
"సతులకే డుగడయు సతుల చూపె"
[ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము - చ.ఆ. 66 ప]

గాంధార పద్ధతిలో పరిణయమాడిన శకుంతలకు పుత్రోదయమవుతుంది. అప్పుడు కణ్వుడు ఆమెను అత్తవారింటికి పంపుచు పై విధంగా పలికెను.

భార్య కర్తవ్యాన్ని తెలుపు వాక్యంగా ఈ క్రింది వాక్యాన్ని పేర్కొనవచ్చును.

"ప్రాణ వియోగంబు సేసియయిన భార్య పతికి హితంబుల సేయవలయు"
[ఆదిపర్వము ఆం.మ.భా.-ష.ఆ. 255 ప]
అట్లుకానిచో భార్య తన ధర్మాన్ని నెరవేర్చనట్లుగానే అవుతుందని భావము.

భర్త లేని స్త్రీకి గౌరవముండదు. అటువంటి వారిని "పతిరహితాత్మయైన సతి భంగియు" [ఆం.మ.భా. ద్రోణపర్వము-ప్ర.ఆ. 16 ప] అనుట సర్వసామాన్యం. కావున భార్యాభర్తలు పరస్పరము కలసి మెలసి జీవించవలెనని పై వాక్యములు మనకు తెలుపుచున్నవి.

పై విధంగా కావ్యములలోని పలుకుబడులు, సామెతలు భార్యా భర్తల సంబంధము ఎట్లుండవలెనో తెలుపుచున్నవి.

**3. తల్లిదండ్రులు - కుమారుడు :**

పుత్రుడనగా పున్నామ నరకాన్నుండి ముక్తి కలిగించే వాడని భావం.

ఏతల్లిదండ్రులకైనను పుత్రుడనిన ఇష్టము. కుమారుడేవిధంగా ఉండాలో సుమతీ శతక కర్త ఇట్లు తెల్పుచున్నాడు.

"పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రుని గనుగొని పొగడగ
పుత్రోత్సాహంబునాడు పొందుర సుమతీ" [సుమతీ శతకము]

నిజమైన సంతోషము పుత్రుడు నీతిమంతుడై పలువురి మన్ననలను పొందినపుడే తల్లిదండ్రులకు కలుగునని భావం.

" పుత్రేణ లోకాన్ జయంతి "
(ఆంధ్ర మహాభాగవతము చ.స్క.-596 ప)

వేనుని ప్రతాపము, పరాక్రమము వలన పృథు చక్రవర్తి సైతము గౌరవము పొందెను. "పుత్రేణ లోకాన్ జయంతి" అనునది వేదవాక్యము. పుత్రుని వలన లోకములను జయించవచ్చునను భావము నాసామెత తెలుపుచున్నది.

"ఆత్మావై పుత్రః"
(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 455 ప)

"ఆత్మావై పుత్రః" అనునది వేదవాక్కు. పుత్రుడు ఆత్మకు రూపము. కావున ఏ సతికైనను పుత్రోదయమే ఆనందమును కలిగించును. దితి తనభర్తతో సంతాన ప్రాప్తికొరకై వేడుకొనే సందర్భంలోనిది.

"కొడుకులు సమర్థులైన తల్లిదండ్రుల
యిడుములు వాయుట యెందునుంగలయది"
(ఆంధ్ర మహాభారతము- ద్వి.అ. 51ప్ర) ఆదిపర్వము

మాతృదాస్య విమోచనమునకై వినత తన కుమారుడైన ఖగేంద్రునితో పలికిన మాటలవి. కొడుకులు బలవంతులు ఐనచో తల్లిదండ్రులకు కష్టములు ఉండవని భావం.

"తల్లి పనిచెననియ ధర్మవు పేయంగనగునే"
(ఆంధ్రమహాభారతము- ఆదిపర్వము-ద్వి.ఆ. 23 ప.)

చెడుకార్యము తల్లి చెప్పినప్పటికి, చేయకూడదనే భావాన్ని పై వాక్యము తెలుపుతుంది.

వినతాకద్రువలు ఆకాశములో పయనించు అశ్వంపై ప్రతిజ్ఞలు పలికిరి. వినత అశ్వం తెల్లగా ఉన్నదనగా, కద్రువ అశ్వములో నలుపు ఉన్నదని వాదించెను. ఓడిపోయినవారు గెలిచినవారికి దాసిగా ఉండవలెనని కద్రువ పంతముచేయును. తన పంతమును నెరవేర్చుకొనుటకు ఆమెతన సర్పకుమారులను ఒక్కొక్క రినే సహాయ మడుగును. జవాబుగా వారు పలికిన మాటలని తల్లి చెప్పినను ఇతరులకు అన్యాయం చేయకూడదనిభావం.

"అనిష్టుడగు తనూ జుడుగలడే"

(ఆం.మ.భారతము-ఆదిపర్వము- అ. 277 ప)

ఎట్టివాడుఐనను కుమారుడనిన తల్లికి ప్రేమే.

బ్రాహ్మణునితో కుంతీదేవి పై విధంగా పలికెను. బకుని ఆహారమునకై భీముని పంపుటలో ఉద్దేశ్యము అతనిపై ప్రేమలేకకాదనీ, భీముడు ఎట్లయినను బకుని చంపగలుగునను విశ్వాసమే కారణమనీ ఆమె బ్రాహ్మణునితో పలికెను. తల్లికి పిల్లలందరిపై సమానమైన ప్రేమ ఉండునని భావం.

"సంతానములేనివారు సద్గతి బొందగాంతురె"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-అష్ట.అ. 299 ప)

"అపుత్ర స్యగతిర్నాస్తి" అనునది ఆర్యోక్తి. జనమేజయుడు వైశంపాయను నితో పైవిధంగా పలికెను. ఎట్టివారలైనను సంతానప్రాప్తివలననే సద్గతులను పొందగలరని భావం.

"ఒక్కని కారణంబున గులంబునకెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు"

(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము- ద్వి.అ. 179వ.)

కుమారునిపై ప్రేమ ఉన్నప్పటికీ అట్టికుమారుడు దుర్మార్గుడైనచో, వానిని సంహరించి కులాన్ని రక్షించుకొనుటే ఉత్తమమని పై వాక్యము తెలుపుతుంది. పై వాక్యము శుక్రనీతిలోనిది. దుర్మార్గుడైన కుమారుడొక్కని వలన కులానికి నష్టము కలిగినట్లయితే, అట్టివానిని పరిహరించి కులాన్ని రక్షించుకొనవలెనని, దుర్మార్గుడైన దుర్యోధనునివలన కురువంశక్షయమగునను భయము కలుగుతున్నదని

విదురుడు ధృతరాష్ట్రునితో పలికెను.

"కులమునుద్ధరించు కొడుకొక్కడేచాలు" అనునని ీతివాక్యం.

"సుతులవలన నెయ్యమతి శయంబు"

[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము. ప్ర.అ. 81ప.]

దృతరాష్ట్రునితో వ్యాసుడు పై విధంగా పలికెను. ఎవ్వరికైనను సుతునివలననే నెయ్యమునెక్కువగునని భావము.

"ఒక్కకొడుకు కొడుకుగాడు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము- తృ.ఆ. 211 ప)

సోమకుడను మహర్షికి నూర్గురు భార్యలు. కాని యజ్ఞఫలమువలన అతనికి కుమారుడొక్కడే కలుగును. ఆ బాలుని ఒకనాడు చీమకుట్టగా, ఆవేదనను భరించలేక అతడుఏడ్వగా అతని తల్లులందరు కూడ మిక్కిలి తల్లడిల్లిరి. ఆసమయమున సోమకుడు ఒక్కకొడుకు కొడుకు కాడని మిక్కిలివిచారించెను. బహుసంతానము కావలెనని ఆనాటివారు కాంక్షించిరి.

"తల్లికొకడెచాలు బల్లిదుండు"

(ఆంధ్ర మహాభారతము అష్టస్కం. అ 3ప.)

బలిచక్రవర్తి వద్ద దానంగా తీసికొనిన మూడులోకాలను వామనుడు ఇంద్రునికి దానంగా ఇచ్చెను. వామనునికన్న అదితి దన్యురాలు. బలవంతుడైన కుమారుడు ఒక్కడైనాచాలునని పై వాక్యముయొక్క తాత్పర్యము. అది నిత్యసత్యము.

"సుతుశతకంబున కంటె నొక సూనృత వాక్యముమేలు"

శకుంతల దుశ్యంతునితో పైవిధంగా పలికెను. వందిమంది కుమారులకంటె ఒక సత్యవాక్యమే మేలు. కావున సత్యమే ఎన్నటికైనను జయించునని ఆమెపలికెను.

"పతిబడసిన సుతులబడయగ నతివలు కోరుదురు"

(ఆంధ్రమహాభారతము- ఆదిపర్వము తృ.ఆ. 171 ప)

"స్వర్గద్వారంబు అనపత్యులుగాననో పరబెమునులంయ్యున్"

(ఆంధ్రమహాభారతము- పం.ఆ. 69ప)

అను వాక్యములు స్త్రీ సంతానముకొరకై మాత్రమే వివాహము చేసికొను ననియు, స్వర్గద్వారము సంతానవతులకే లభించునని తెలుపుచున్నవి.

కావున ఏ దంపతులైనా సంతానము కలుగుటకై పూజలుచేయుదురు. గృహస్థాశ్రమమునకు సంతానము పరమావధి అని చెప్పవచ్చును.

## 4. తల్లిదండ్రులు - కుమార్తె :

తల్లిదండ్రులు తమ కుమార్తెను విజ్ఞానవంతురాలుగాచేసి, యౌవనవతులైన తర్వాత మంచిశీలముకల యువకునితో వివాహము చేయుటకై ప్రయత్నించాలి.

"కూతులగన్నఫలము తగినవరులకు ధర్మచరితులకే గాన్పగాదె"
(ఆదిపర్వము - ఆంధ్ర మహాభారతము స.ఆ. - 87 వ.)

వసిష్ట మహాముని సూర్యునితో పైవిధంగా పలికెను. సూర్యుని కుమార్తె అయిన తపతికి సంవరణుడే తగిన వరుడని తెలుపుచు, కూతుళ్లను కన్నందుకు తగిన వరుని జూచి పరిణయము చేయుటే తగిందని సూర్యునికి తెలిపెను. అది నిత్యసత్యము.

"కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితంబు"
(ఆంధ్రమహాభారతము—ఆదిపర్వము స.ఆ - 25 వ)

పురోహితుడు విచారముగా ఉన్న ద్రుపదునితో పైవిధంగా పలికెను. పాండవుల జాడతెలియక వారు పరలోకప్రాప్తిపొందిరేమో అని విచారపడుచుండగా పురోహితుడు పైవిధంగా పలికి అతనిని సాంత్వన పరచెను. పాండవులు కారణజన్ములు కావున వారికి మరణములేదు. స్వయంవరములో పాల్గొనుట రాజుల కర్తవ్యం.

కన్యాదానమునకు హిందూసమాజంలో ఎంతటి ప్రాధాన్యమున్నదో పైదాని వలన తెలియుచున్నది.

## 5. బంధు మిత్రులు :

చుట్టరికమువలన ఏర్పడినవారు బంధువులు. సఖ్యముతో కలసినవారు స్నేహితులులేదా మిత్రులు. ఎవరికైనను బంధువులకంటె మిత్రులేగొప్ప.మంచి మిత్రుడున్నట్లయితేప్రపంచమునైనా జయింపగలరనుటలో సందేహము ఇసుమంతయులేదు. కాని కొంతమంది శత్రువులు మిత్రుని రూపంలో అపకారము చేయుటకై ప్రయత్నిస్తారు. అటువంటివారినుండి దూరముగా ఉండవలెనని భావము.

"రత్నకాంచనసాంగత్యంబునుంబోలె"
(శాంతి పర్వము. ఆంధ్రమహాభారతము— ప్ర. ఆ. 72వ.)

చింతాక్రాంతుడైన దర్మరాజుతో అర్జునుడు బ్రాహ్మణుల విధులను ప్రస్తావించుచు విప్రుడు గృహస్థాశ్రమ ధర్మములతోబాటు విహితకర్మములను ఆచరించుట రత్నకాంచన సాంగత్యమువలె నుండుననీ, అట్లు కానిచో వ్యర్థమనీ పలికెను.

బంధు మిత్రులనాదరించుట గృహస్థాశ్రమధర్మములలో ప్రముఖమైనది.

"మిత్రద్రోహము దారుణమగు పాతకము."
(శాంతిపర్వము-ఆంధ్రమహాభారతము—తృ.ఆ - 525 ప.)

భీష్ముడు ధర్మరాజునకు మిత్రధర్మములను తెలుపుచు మిత్రద్రోహము మిక్కిలి పాతకమైనచర్య అని పేర్కొనెను.

మిత్రునికి అపకారము చేయకూడదని పై వాక్యము తెలుపుచున్నది.

"విప్రులకును, ధారుణీశులకున్ బోలగనఖ్యము సంభవించునే"
(ఆదిపర్వము-ఆంధ్ర మహాభారతం - సం.ఆ. 203 ప)

నెయ్యము భిన్న అభిప్రాయము కలవారికి కుదరదని పై వాక్యమువలన తెలియుచున్నది.

ద్రోణుడు, ద్రుపదుడు మిత్రులు. ద్రోణాచార్యుడు తన బాల్య మిత్రృత్వాన్ని రాజునకు తెలుపగా అతడు అవమానించుచు, పై విధముగా పలికెను. నిజమైన మిత్రృత్వానికి రాజు, పేద అను భేదములేదు. కాని కొంతమంది మిత్రృత్వంలో సైతము తరతమ భేదములను పాటించెదరనుటకు పై వాక్యాన్ని ఉదాహరణంగా తీసుకొనవచ్చును.

"రాజులకు గార్యవశంబునంజేసి మిత్రామిత్ర సంబంధంబు సంభవించు"
(ఆదిపర్వము-ఆంధ్రమహా భారతము - ప.. ఆ. 206 వ.)

ద్రుపదుడు ద్రోణాచార్యుని అవహేళనచేస్తూ పైవిధంగా పలికెను. అధికారంలో ఉన్నవారు సర్వసామాన్యంగా వారి అవసరమునను సరించే స్నేహము చేస్తారనుటకు పై వాక్యాన్ని ఉదాహరణంగా తీసుకొనవచ్చును. కావున వివేకి ఎల్లప్పుడును తనకన్న అధికులతో అతిసన్నిహితంగా ప్రవర్తించకూడదు అను నిత్యసత్యాన్ని ఆ వాక్యం తెలుపుచున్నది.

"సాధులకు నసాధు సహవాసమున బాప సంప్రయోగమగుట సందియంబె"
(అరణ్య పర్వము-ఆంధ్ర మహాభారతము-ప్ర.ఆ. 5 ప)

ఉత్తములకు నీచసాంగత్యంతో బాధలుకలుగునను నిత్యసత్యమును పైవాక్యం తెలుపుచున్నది.

"సుజనుల సవాసంబున గుజనులు దర్మమతులగుట నిక్కము.
(అరణ్యపర్వము - ఆంధ్ర మహాభారతము - ప్ర.ఆ. 88 ప)

నీచసాంగత్యంచే ఉత్తములు నష్టపోవగా, ఉత్తముల సాహచర్యంచే నీచులు సైతము లాభించెదరని పైవాక్యము తెలుపును. కావున ఎల్లవేళల ఉత్తముల సాంగత్యమే శ్రేష్టమనే సత్యాన్ని పై వాక్యం తెలుపుచున్నది.

దృతరాష్ట్రునితో వ్యాసుడు పై విధంగా పలికెను. దుర్మార్గుడైనప్పటికి సుజనుల సహవాసముతో ధర్మనిరతుడగును కావున దుర్మార్గుడైన దృతరాష్ట్రతనయుని పాండవుల సాంగత్యంచే సన్మార్గునిగా చేయుమని వ్యాసుడు దృతరాష్ట్రునితో పలికెను.

"భంగపెట్టి పిదప సంగతుడుగ జేసికొనుటమేలె"
(శాంతిపర్వము- ఆంధ్ర మహాభారతము- తృ.ఆ. - 78 ప)

ఎవరినైనను మొదట అవమానపరచి, తరువాత మిత్రునిగా చేసికొనుట సమంజసము కాదని వ్యాఘ్ర-గోమాయు సంవాద కథవలన తెలుస్తుంది. ఎవ్వరిని అవమానించకూడదను నిత్యసత్యమును ఆ వాక్యం తెలుపుచున్నది.

"సత్పురుషులతోడి మైత్రిసాప్తపదీనంబని చెప్పంబడు"
(అరణ్య పర్వము-ఆంధ్ర మహాభారతము - ష.ఆ. - 128 ప)

సజ్జనులతో మైత్రి శుభములను సమకూర్చును. దుర్జనులతో మైత్రివలన ఇబ్బందులపాలు కావలసివచ్చును.

"సత్సంగముననగుసద్గుణముల్"
(అరణ్యపర్వము- ఆంధ్ర మహాభారతము- ప్ర.ఆ. 6 ప)

పాండవులతో ప్రజలు పై విధముగా పలికిరి. ఏవిధంగానైతే పలుధాన్యములు సుగంధ ద్రవ్యముల కలయికచే సువాసనను పొందకలుగునో అట్లే మంచివారి

సహవాసం వలన సద్గుణములు అబ్బునని భావం. ఎల్లప్పుడు సజ్జనమైత్రియే తగినదను భావాన్ని ఆ వాక్యము తెలుపుచున్నది.

"మిత్రజనమోదంబును శత్రుజన ఖేదంబునుంగదా సంపదలకుండగియెడిఫలం"
(అరణ్యపర్వము - ఆంధ్ర మహాభారతము- పం.ఆ. 347 ప)

కర్ణ, శకుని, దుర్యోధనాదులు మంతనములు చేయుచుండగా పై అభిప్రాయములను కర్ణ, శకునులు వెలిబుచ్చిరి. శత్రుజనఖేదం, మిత్రజనామోదం ఎవరికైనా సంతోషాన్ని కలిగింపచేస్తుందని భావం.

'బంధువులు' అనగా కేవలం రక్తసంబంధీకులే కానవసరం లేదు. సహృదయులెవ్వరైనను ఆర్యజనులకు బంధుసమానులే అను అభిప్రాయాన్ని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"ఏడుమాటలాడినంత నెట్టివారును నార్యజనులకు జుట్టంబులగుదురు"
(అరణ్యపర్వం—ఆంధ్ర మహాభారతం- స.ఆ- 246 ప)

సావిత్రి యమధర్మరాజుతో పై విధంగా పలికెను. వాక్చాతుర్యంచే ఆమె యమధర్మరాజును సైతం మెప్పించెను. బంధు, మిత్రులతో ఎట్లు ప్రవర్తించవలెనో పై వాక్యం తెలుపుచున్నది.

"తనకు మేలొనరించు నాతడు మిత్రుడు"
(శాంతిపర్వం- ఆంధ్ర మహాభారతం- ద్వి. ఆ. 325 ప)

భీష్ముడు ధర్మరాజుతో మిత్రధర్మములను గురించి తెలుపుచు పై విధంగా పలికెను. మేలొనరించువాడు మిత్రుడనీ, కీడొనరించువాడు శత్రువనీ తెలిపెను. కావున ఆపదలో ఆదుకొనినవాడే నిజమైన మిత్రుడు.

నమ్మినవారిని ఎన్నడును మోసం చేయకూడదు. కృతఘ్నునకు గౌరవముండదు అను భావమును ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"కుక్కలు దినగారోయుంగృతఘ్నుదేహము మాంసంబు"
(శాంతిపర్వము-ఆంధ్ర మహాభారతం - తృ ఆ. 510 ప.)

భీష్ముడు ధర్మరాజుతో పై విధంగా పలికెను. కృతఘ్నుని శవమును కుక్కలు సైతము ముట్టవనియు, కృతఘ్నుని మించిన దుర్మార్గుడు మరొకరుండరనీ భావం.

"బ్రహ్మఘ్నునకును నిష్కృతిగలుగునువినుము- కృతఘ్నునకులేదు"
(శాంతిపర్వము-ఆంధ్రమహాభారతము—తృ.ఆ. - 524 ప)

భీష్ముడు ధర్మరాజునకు రాజనీతిని తెలుపుచు బ్రహ్మహత్యా పాతకముకంటె కృతఘ్నతయే మిక్కిలి పాపకార్యమని తెలిపెను. ఎవరైనను తనకు ఉపకారము చేసినయెడల ప్రత్యుపకారము చేయవలయుననీ, కృతజ్ఞుడుగా ఉండవలెననీ పైవాక్యం తెలుపుచున్నది.

అసలు చేసినమేలును ఎన్నటికిని మరచిపోకూడదు.

అట్లే

"మైత్రింబోలెడు దర్మము ధాత్రీదివిజులకు లేదు"
(శాంతిపర్వము- ఆంధ్రమహాభారతము—సం.అ. - 102 ప)

శుకునితో వ్యాసుడు పైవిధంగా పలికెను. ప్రపంచంలో అన్నింటికంటె మైత్రీధర్మము గొప్పదని అతడు పలికెను. అది నిత్యసత్యము. మరియు మిత్రద్రోహమును మించిన పాతకములేదనుటకు ఈ క్రింది వాక్యమును ఉదాహరణముగా గైకొనవచ్చును.

"మిత్రద్రోహము దారుణమగు పాతకము"
(శాంతిపర్వము-ఆంధ్ర మహాభారతం - తృ.ఆ. 525 ప)

అదీగాక సత్సంగతి సజ్జనులకు సంతోషమును కలిగించునని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"సత్సంగతి సజ్జనులకు నుత్సవమొనరించు"
(అనుశాసనిక పర్వము-ఆంధ్ర మహాభారతం - ద్వి.ఆ. 442 ప.)

సజ్జనుల స్నేహము ముక్తిదాయకమని భీష్ముడు ధర్మరాజునకు తెలిపెను.

నృగుడు అను రాజు పరమకిరాతకుడు- అతడు బ్రాహ్మణులను బాధించేవాడు. గోవులను దొంగిలించేవాడు. కృష్ణుని సాంగత్యంవలన అట్టివాడు సైతం స్వర్గానికి పోయెననిన సత్సాంగత్యమెంతగొప్పదో, అది సజ్జనులకు ఎంత సంతోషమును కలిగింపచేస్తుందో ఊహించుకొనుమని భీష్ముడు ధర్మరాజుతో పలికెను. ఎల్లప్పుడును సజ్జన సాంగత్యమే అభిలషణీయమను నిత్యసత్యము నావాక్యము తెలుపుచున్నది.

"స్నేహమూలములురాగాదుల్"

(అరణ్యపర్వం-ఆం. మహాభారతం - ప్ర.ఆ. 23 ప)

శౌనకుడు దర్మరాజుతో పైవిధంగా పలికెను. ప్రేమ మొదలగు భావాలన్నియు స్నేహాన్ననుసరించే ఏర్పడును. అందులకేకాబోలు.

"తమతమ నెలవులు తప్పిన తమమిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ" అని సుమతీశతకకారుడు పేర్కొనెను.

కృతఘ్నునకు ఎప్పుడును ఉపకారము చేయకూడదు అను సత్యమును ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"కృతఘ్నునకు గావించిన యుపకారంబుబోలె"

(ఆంధ్ర మహాభాగవతం - తృ. స్కం. ఆ. 91 ప)

హిరణ్యాక్షుడు ప్రయోగించిన మాయాబాణములు అన్నియు హరియందు నిష్ఫలములయ్యెను. ఏవిధంగానైతే కృతఘ్నునకెంత సహాయం చేసినప్పటికి వ్యర్థమగునో, అట్లే హిరణ్యాక్షుడు హరిపై ప్రయోగించిన బాణాలన్నియు వ్యర్థములయ్యెనని భావం. కృతఘ్నునకు ఎన్నడును ఉపకారం చేయకూడదను నిత్యసత్యాన్ని ఈ వాక్యం తెలుపుచున్నది.

"తను నమ్మినవారివిడువదగునే హరికిన్"

(ఆంధ్ర మహాభాగవతము-దశ. స్కం. 487 ప)

బలభద్రుడు బంధు జనులను దర్శించుటకై రేపల్లెకు వెడలుచు పై విధంగా పలికెను. తాను నమ్మిన వారిని ఎన్నడును వదలకూడెదను భావాన్ని ఆ వాక్యం తెలుపుచున్నది.

"పదివేలు వచ్చె నీ సఖ్యమునను"

(ఆంధ్ర మహాభాగవతం-దశ. స్కం. 86 ప)

శతధన్వుడు అక్రూరునితో హరితో వైరం చేయుటకై రాయబారానికి పంపెను. అక్రూరుడు శతధన్వుని మిత్రుడు ఐనను అతని మాటలకు గౌరవమివ్వక హరి గుణాలను పొగడుచు పై విధంగా పలికెను. "పదివేలు వచ్చె" అనగా గొప్ప సంపద కలిగెను అను భావం. "పదివేలు వచ్చె" అనునది ఒక తెలుగు పలుకుబడి.

అన్నింటికంటె ముఖ్యమైనది ఒకటి ఉన్నది. ఏదైనను కర్మ బంధాన్ని అను సరించే జరుగును. ఆ నిత్య సత్యాన్ని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"పగ చెలుములు కీలు కర్మ బంధం నుండీ"
(ఆంధ్ర మహాభాగవతము - దశ. స్కం. 159 ప)

కంసుడు దేవకీ, వసుదేవుల ఆరుగురి కుమారులను సంహరించును. ఏడవ సంతానం కుమార్తె ఐనప్పటికి దయతలచక సంహరించుటకై నిశ్చయించి కత్తి ఎత్తగా, ఆమె అతని కందక కంసుని జంపువాడు వసుదేవున కెనిమిదవ సంతానంగా జన్మించునని తెలిపెను. అప్పుడు అతడు కపట ప్రేమతో తన్ను క్షమించవలసినదిగా అక్కా బావలను ప్రార్థించుచు పై విధంగా పలికెను. పగ, స్నేహాలు అనునవి కర్మ బంధంవలననే ఏర్పడునని మిథ్యా వాక్కులు పలుకును. కర్మబంధంవలననే ఏర్పడుననునవి నిజమే ఐనప్పటికిని కంసుని మాటలలో మాత్రం మోసం కానవచ్చుచున్నది.

ఈ విధంగా బంధు-మిత్రుల గూర్చి తెలుపబడిన సామెతలను పరిశీలించు టైనవి.

## 6) అతిథులు అభ్యాగతులు :

సంపన్నుడైన వ్యక్తి ఎవ్వరినీ గౌరవించడనీ, అతిథులను అభ్యాగతులను అవహేళనం చేయుసను సత్యాన్ని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"సంపన్నుండొరు గానలేడు"
(ఆంధ్రమహాభాగవతము-దశమ స్కం. - 392 ప)

కుబేరుని కుమారులైన శంకర, కింకరులను నారదుడు శపించును. కుబేరుడు సంపన్నుడైనందున తన కుమారులను సక్రమముగా పెంచలేదనీ, సంపన్నుడైన వాడు సంపదయందేగాని మరి దేనిపైనా శ్రద్ధవహించడనీ కోపముతో నారదుడు పలికెను. అది నిత్యసత్యము.

"తనువిచ్చునట్టి దాతగలడె"
(ఆంధ్రమహాభాగవతము - ష.స్కం. - 353 ప)

శరణుజొచ్చిన వ్యక్తికొరకు ప్రాణాలర్పించుటకు వెనుదీయనివాడే మహాను భావులనుటకు శిబి చక్రవర్తి, దధీచి మొదలగు వారిని పేర్కొనవచ్చును. ఎవరు

కైనను తమదేహము తీపిగనే ఉండును. కాని దేవకార్యమునకై తన శరీరమును కోసియిచ్చిన దధీచి ధన్యుడని దేవతలందరును కొనియాడిరి. సత్కార్యమునకై శరీరత్యాగము చేసినవారే ధన్యులని దధీచి వృత్తాంతము తెలుపుచున్నది.

అతిథులను, అభ్యాగతులను రక్షించవలసిన బాధ్యత గృహమేధిపై ఉన్నది. గృహస్థుడు ఇంటికి వచ్చినవారిని మర్యాదతో వారికి కావలసినవి సమకూర్చవలెనను సత్యమును ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"గృహమేధి సర్వాశ్రమవాసుల నరసిరక్షించు"
(ఆంధ్రమహాభాగవతము - తృ. స్కం. - 458 ప)

శరణుజొచ్చిన వారిని కాపాడిన పుణ్యము కలుగునని ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"శరణాగతులగు పురుషుల రక్షించునంత పుణ్యము గలదే"
(ఆంధ్రమహాభారతము - ఆదిపర్వము - అష్ట. ఆ. 291 ప)

ఖాండవవన దహన సమయాన యముడు అర్జునుని శరణుచొచ్చి తనను కాపాడవలసిందిగా ప్రార్థించును. అర్జునుడు అతనిని కాపాడును. శరణుచొచ్చిన వారిని కాపాడుట గొప్పవారి లక్షణమని పైవాక్యము తెలుపుచున్నది.

అతిథులను, అభ్యాగతులను మర్యాద చేయవలసిన ధర్మము గృహస్థుపై ఉన్నను శక్తికిమించి ఏపనికూడ చేయకూడదను నిత్యసత్యమును ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"శక్త్యనురూపత జేయవలయునాతిథ్యంబుల్"
(శాంతిపర్వము-ఆం. మహాభారతము- పం.ఆ. 454 ప)

భీష్ముడు ధర్మరాజునకు శాస్త్రతత్త్వములను గూర్చి తెలుపుచు, ఎవ్వరైనను తమశక్తిని అనుసరించియే ఆతిథ్యము ఈయవలెనని తెలిపెను. శక్తికిమించిన ఆతిధ్యము పనికిరాదను విషయము పై వాక్యమువలన తెలియుచున్నది.

"శరణుజొచ్చిన రక్షింపజాలియుండి, కడపిపుచ్చిన నూర్ధ్వలోకముకలుదప్పు"
(ఉద్యోగపర్వము- ఆం. మహాభారతము- ప్ర.ఆ. 161 ప)

నహుషుడు పౌలోమిని కోరుకొనును. ఆమె తనను రక్షించవలసిందిగా దేవతలను ప్రార్థిస్తూ పైవిధంగా పలికెను. రక్షింపజాలియుండియు రక్షింపనియెడల ఉర్ధ్వలోకములు తప్పునని పలుకును.

ఈ విధంగా కుటుంబానికి సంబంధించిన సామెతలను పేర్కొనుటైనది.

# చతుర్వర్ణములకు సంబంధించిన సామెతలు

ప్రాచీన సమాజము చతుర్వర్ణ సముదాయములుగా విభజింపబడింది. ఒకప్పుడు సౌలభ్యముకొరకు చేసిన కట్టుబాట్లు తరువాత తరువాత బంధములుగా మారుట దుర దృష్టకరం. ప్రాచీన సాహిత్యం ముఖ్యంగా భారత, భాగవత, రామాయణాది గ్రంధా లలో చతుర్వర్ణ్య ప్రశస్తికనిపించును. మనుస్మృతిప్రకారం పేర్కొనబడిన చతుర్వర్ణములివి.

1. బ్రాహ్మణులు.
2. క్షత్రియులు.
3. వైశ్యులు.
4 శూద్రులు.

## 1. బ్రాహ్మణ వర్ణమునకు సంబంధించిన సామెతలు :

బ్రహ్మజ్ఞానం కలిగినవారిని బ్రాహ్మణులని పిలిచెదరు. భారత, భాగవతాదులు బ్రాహ్మణప్రాధాన్యాన్ని తెలుపుచున్నవి.

"విప్రుడు దైవంబు మానవులకు"

(ఆంధ్ర మహాభాగవతము- ప్ర.ఆ- పం.స్కం. 74 ప)

ఋషభుడు పుత్రులకు నీతిని ఉపదేశించుచు ప్రజలకు బ్రాహ్మణుడు భగవంతు నితో సమానమనినుడివెను. బ్రాహ్మణులకు భూసురులను పేరుకూడకలదు.

"బ్రహ్మక్షత్రంబులు పరస్పర సంశ్రయంబులు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము- చ.ఆ. 204 ప)

సనత్కుమారుడు కశ్యపునితో పైవిధముగా పలికెను. బ్రాహ్మణ, క్షత్రియులు పరస్పరము ఒకరిపై మరొకరు ఆధారపడినవారు. సమాజములో బ్రాహ్మణ, క్షత్రియ ప్రాధాన్యాన్ని ఈ సామెత తెలుపుచున్నది.

"ధారుణీదివిజులకంటె దైవమొకడు గలడెభువిని"

(ఆం. మహాభాగవతము- దశ. స్కం. - 1028 ప)

బ్రాహ్మణాధిక్యాన్ని, బ్రాహ్మణవర్ణ ప్రాధాన్యాన్ని ఆ వాక్యం తెలుపుచున్నది.

"జాతిమాత్రంబున పురుషుని వర్ణంబు నిర్దేశింపలేరు."

(మహా భాగవతము—స.స్కం. 419 వ)

వర్ణాశ్రమ ధర్మాలనుగూర్చి నారదుడు ధర్మజునకు తెలుపుఘట్టములోనిది. జన్మతోగాక, కర్మవలననే వర్ణవిభజనము చేయవలెనని పై వాక్యముయొక్క భావము. అనగా భాగవత కాలమునాటికి వర్ణములు కర్మనుబట్టిగాక జన్మనుబట్టి నిర్ణయింప వలెనను వాదానికి కొంత వ్యతిరేకత ఉండెననుటకు నిదర్శనముగా పైవాక్యాన్ని చెప్పవచ్చును.

"బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబుగాదు"

(ఆం. మహాభాగవతము— స.స్కం. 411 వ)

నారదుడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మములను తెలుపుచు పైవిధంగా పలికెను. బ్రాహ్మణ. క్షత్రియులు నీచసేవనంబు చేయకూడదు అనుటవలన భారత కాలమునాటికే వర్ణవిభజన సంపూర్తిగా జరిగిందని చెప్పవచ్చును.

"బ్రాహ్మణాకృతివిగాక యథార్థపు బ్రాహ్మణుండవే"

(ఆంధ్ర మహాభాగవతము— స.స్కం. 173 వ)

బ్రహ్మజ్ఞానం కలిగినవాడే నిజమైన బ్రాహ్మణుడనీ, బ్రాహ్మణవేషము ధరించినంత మాత్రంచేత ఎవ్వరును బ్రాహ్మణుడు కాలేడనీ, పైవాక్యము తెలుపు చున్నది. హిరణ్యకశ్యపుడు రాక్షసుడు ఐనప్పటికి, అతని గురువు బ్రాహ్మణుడే. ప్రహ్లాదునకు విద్యనేర్పిన గురువు సైతం బ్రాహ్మణుడే. హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదుని భక్తితత్త్వమునుచూచి, అతనికి చదువునేర్పిన గురువును నిందించు ఘట్టములోనిది.

బ్రాహ్మణులకు భోజనవసన దానంబులు స్వకీయంబులైయుండు"

(ఆంధ్ర మహాభాగవతము- చ.స్కం. 638 వ)

హితబోధచేసిన సనత్కుమారునితో పృథుచక్రవర్తి పైవిధంగా పలికెను. బాహ్మణులకు భోజనవసనదానంబులు స్వకీయంబులైనందున వారికోరికను అనుస రించే దానంచేయవలెను. క్షత్రియులకు బ్రాహ్మణుల అనుగ్రహమున, అన్నం మాత్రమే దక్కును. తక్కిన వస్తువులను పొందవలెనన్నవారికి స్వాతంత్ర్యంలేదు. పై వాక్యం బ్రాహ్మణుల ప్రాధాన్యాన్ని తెలుపుచున్నది.

"పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజము శూద్రుకంటె నీచతముడు"

(ఆంధ్ర మహాభారతము—అరణ్యపర్వము—పం.ఆ. 137 వ)

బ్రాహ్మణుడు ఎట్టి పరిస్థితులలోను పాపములు చేయకూడదనీ, ప్రాపవర్తనుడైన బ్రాహ్మణుడు శూద్రునికంటే నీచుడనీ పైవాక్యం తెలుపుచున్నది.

"అహింస విప్రజనులకు నెల్ల భంగుల నువలయు"

[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము పం.అ. 299 ప]

1 అహింస, సత్యము, అస్తేయము [దొంగతనము చేయకుండుట], శౌచము శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము సర్వవర్ణములకు సంబంధించిన ధర్మములని మనువునుడివెను. ముఖ్యముగా అహింస అన్నది విప్రజనులు ఎల్లప్పుడును అనుసరింపదగినవి అనే సత్యాన్ని పైవాక్యం తెలుపుచున్నది.

ధర్మరాజుతో భీష్ముడు పైవిధంగా పలికెను. విప్రజనులకు ఏరీతిగా చూచి నప్పటికి అహింసయే పరమ ధర్మమనునది పైవాక్యంవలన తెలియుచున్నది. అహింసా పరమోధర్మః — అనునది ఆర్యోక్తి.

పరిశుద్ధిలేని కుత్సితపు పురోహితులు నీచదశల పొందుదురు."

[ఆం. మహాభారతము - శాంతిపర్వం- ద్వి.అ. 310 ప]

ధర్మరాజుతో భీష్ముడు శుక్రరాజనీతిని దెలుపుతు, పైవిధంగా పలికెను. పరిశుద్ధిలేని పురోహితులు నీచదశలను పొందెదరనీ, అటువంటివారు దేశానికి నష్టాన్ని కలిగించెదరనీ భావం.

"వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపగన్"

[ఆం. మహాభారతము-ఉద్యోగ పర్వము తృ.అ- 103 ప)

ద్రౌపది కృష్ణునితో పై విధంగా పలికెను. బ్రాహ్మణుడు చేసిన ఏ తప్పును ఐనను క్షమింపవలెనని ఆనాటి సంఘంలోని ఆచారం. కౌరవులు క్షత్రియులు. క్షత్రియులు తప్పు చేసిన యెడల యుద్ధ రంగంలోనే సమాధానం చెప్పవలయుననునది రాజనీతి. బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని తెలుపు వాక్యంగా పైదానిని పేర్కొనవచ్చును.

"ఉత్తమ ద్విజలోహిత పాతం బెట్లు నంగీడు"

[ఆంధ్ర మహాభారతం-విరాట పర్వం పం.అ. 262వ]

---

1. అహింసా సత్యమస్తేయం! శౌచమింద్రియనిగ్రహః!
ఏతం సామాజిక ధర్మం! చాతుర్వర్ణ్యేబ్రవీన్మనుః!!
మనుస్మృతి - యథార్థ మానవత్వం - కె. కృష్ణమాచార్య. విజ్ఞప్తి [8వ పే.]

ధర్మరాజు కంకుని రూపములో విరటుని గొల్చెను. వారిద్దరు పాచికలాడే సమయములో విరటుడు తన కుమారుని గొప్పదనమువలననే విజయము లభించెనని పలుకును. ప్రతిగా ధర్మరాజు బృహన్నల సారధ్యమువలననే ఉత్తరగోగ్రహణ యుద్ధంలో కౌరవులనుండి గోవులను గైకొనగలిగిరని విన్నవించును. అప్పుడు విరటుడు కోపంతో సారెను ధర్మజుని ముఖంపై విసరివేయగా రక్తము ప్రవహింప కొడగెను. అట్టి రక్తబిందువులు ఎన్ని భూమిపైబడిన అన్ని సంవత్సరములు వర్షములు పడవు కావున ధర్మరాజు తన ఉత్తరీయముతో రక్తమును కారకుండ అదిమి పట్టుకొనును. రాజైనవాడు ఉత్తములను ఎన్నడును బాధించకూడదు. అదీగాక బ్రాహ్మణులను ఎన్నడును బాధించకూడదు. సమాజములో బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని తెలిపే వాక్యంగా పైదానిని పేర్కొనవచ్చును.

"సత్యశౌచధర్మశాలి శూద్రుండయ్యును అతడు సద్విజుండు"
(ఆంధ్ర మహాభారతము—అరణ్యపర్వము—పం.ఆ. 137 ప)

ధర్మవ్యాధుడు కౌశికునకు తన పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలుపుచు పైవిధంగా పలికెను. బ్రాహ్మణుడు పాపవర్తనుడైనచో అతడు శూద్రునికంటెకూడ నీచుడు. అట్లే శూద్రుడైనప్పటికి నీతివర్తనుడైనచో బ్రాహ్మణునికంటె గొప్పవాడు. జన్మను బట్టిగాక గుణమునుబట్టి వర్ణవిభజనము చేయవలెనను సిద్ధాంతానికి దగ్గరగా ఉన్న వాక్యంగా పేర్కొనవచ్చును.

"బ్రాహ్మణులహింసాపరులు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము—ప్ర.ఆ. 158 వ)

సూర్యుడు భృగువుతో పైవిధంగా పలికెను. సద్బ్రాహ్మణులు అహింసాపరులు. బ్రాహ్మణ ధర్మమును గూర్చి ఆ వాక్యము తెలుపుచున్నది.

"ఉత్తమద్విజులు పూజ్యులు"
(ఆం. మహాభారతము- ఆదిపర్వము—ప్ర.ఆ. 138 ప)

భృగుమహర్షితో సూర్యదేవుడు పైవిధంగా పలికెను. భృగుమహర్షి సూర్యుని సర్వభక్షకుడవగుదువని శాపమిచ్చెను. ప్రతిశాపమును ఇవ్వకలిగిన శక్తి ఉన్నప్పటికి సూర్యుడు భృగువునకు శాపము ఇవ్వలేదు. ఆనాటి సమాజములో ద్విజులపై ప్రజలకు ఎంత గౌరవము ఉండెడిదో పైవాక్యము తెలుపుచున్నది.

"ఇంద్రుడైన బ్రాహ్మణులకవజ్ఞసేసి యవమానము వొందుప్రతాపవిహీనుడై"
(ఆంధ్ర మహాభారతము—ఆదిపర్వము—స.ఆ. 129 ప)

వశిష్ఠుదు కల్మాషపాదునితో పైవిదంగా పలికెను. ఎంతగొప్పవారైనను బ్రాహ్మణులకు అవమానము చేయకూడదని భావం బ్రాహ్మణుల ఆధిక్యతను తెలుపు వాక్యంగా పేర్కొనవచ్చును.

"చరాచరాఖిల జగంబుల నెద్దలకారెసద్విజుల్"
(ఆంధ్ర మహాభారతము—ఆదిపర్వము—స.ఆ. 154 ప)

ప్రపంచంలో అంగరికంటే బ్రాహ్మణులే గొప్పవారు అనే భావాన్ని పైవాక్యం తెలుపుచున్నది.

"ఏమిదోషంబుసేసియు బ్రాహ్మణుండువధ్యుండుగాడు"
(ఆంధ్ర మహాభారతము—ఆదిపర్వము—ప ఆ. 184 ప)

అర్జునుడు బ్రాహ్మణవేషములో మత్స్యయంత్రమును ఛేదించిన సందర్భములో సభాసదులు పలికిన మాటలు. ఏపని చేసినప్పటికిని, బ్రాహ్మణుడు వధ్యుడుగాదు, అనుటవలన బ్రాహ్మణవర్ణ ప్రాధాన్యాన్ని సంఘములో వారికి గల పలుకుబడిని, ఆ వాక్యం తెలుపుచున్నది.

"పాతకములలో బ్రహ్మహత్యయుపెద్ద"
(ఆంధ్ర మహాభారతము—ఆదిపర్వము—ప.ఆ. 273 ప)

కుంతి బ్రాహ్మణునితో పైవిధంగా పలికెను. అన్ని పాపములలోకెల్ల బ్రహ్మ హత్య మహాపాపము. కావున బకునకు ఆహారంగా తన ఐదుగురు పుత్రులలో ఒకరిని పంపుటకు సిద్ధంగా ఉన్నాననియు కుంతి, బ్రాహ్మణునితో పలికెను. బ్రాహ్మణ ప్రాధాన్యమును తెలుపు వాక్యంగా పైదానిని పేర్కొనవచ్చును.

"పరమ సాధులైన బ్రాహ్మణులకు బాధయగుడు మహికి బాధయగు"
(ఆంధ్ర మహాభారతం - అరణ్య పర్వము - ద్వి.ఆ. - 14 ప)

దేవతలు వైకుంఠమునకు పోయి రాక్షసులు పెట్టే బాధలను భగవంతునితో నివేదించుకొనిరి. బ్రాహ్మణుని భూమిసురుడని పలికెదరు. భారతీయ సాహిత్యములో బ్రాహ్మణ ప్రాధాన్యాన్ని తెలుపు వాక్యంగా పేర్కొన వచ్చును.

"వనితలకు విప్రులకు నవమానము సేయకుమీ"
(ఆంధ్ర మహాభారతం-శల్యపర్వము-ద్వి.అ. 153 ప)

చంద్రుడు ఇరవైయేడు మంది స్త్రీలను వివాహము చేసికొనెను. వారిలో రోహిణి గొప్ప అందగత్తె కావున ఆమెతోడనే కాలము గడుపుచు, తక్కిన వారిని నిర్లక్ష్యము చేయగా వారు తండ్రితో చంద్రుని దుండగమును తెలిపిరి. అతడు చెప్పినప్పటికి చంద్రుడు వినక పూర్వంవలెనే ప్రవర్తించగా, వారి తండ్రి ఆతనిని శపించెను. చంద్రుడు శాపగ్రస్తుడై ప్రకాశాన్ని కోల్పోవగా ధరణిపై ఓషధులు నశించినవి. అసురులు ఈవిషయమును కనిపెట్టి ఆ మహానుభావుని, చంద్రుని క్షమించ వలసిందిగా ప్రార్థించగా, అతడు చంద్రుని ప్రధాన తీర్థమున స్నానమాడెనేని పూర్వ వైభవం పొందుననీ కాని అతడు ఎన్నడైనను స్త్రీలను, బ్రాహ్మణులను అవమానం చేయకూడదనీ తెలిపెను. ఎవ్వరైనను బ్రాహ్మణులనుగాని స్త్రీలనుగాని అవమానము చేయకూడదని భావము.

"శ్రుతం వలన శ్రోత్రియుడగు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-స.ఆ. 428 ప)

యక్షుడు అడిగిన ప్రశ్నకు ధర్మజుని సమాధానం. వేదాధ్యయనం చేసినవానినే ఉత్తమ బ్రాహ్మణునిగా లెక్కిస్తారని ధర్మజుడు యక్షునితో పలికెను. వేదాధ్యయనం బ్రాహ్మణుని

"విప్రుల బొందియున్నయపవిత్రులు పూజ్యులుకారె"
(ఆంధ్ర మహాభారతం - ఆదిపర్వము-ద్వి.అ. 63 ప)

గరుత్మంతుడు మాతృదాస్య విమోచనకై అమృతాన్ని తెచ్చుటకై వెడలును. వినత గరుత్మంతుని బలవృద్ధికై దేనినైనను భక్షింపవచ్చును గాని విప్రులను పరిహరింపుమని తెలిపెను. ఆ విషయమును గుర్తు తెచ్చుకొని తన కంఠంలో నున్న విప్రుని బయటకు రావలసినదిగా గరుత్మంతుడు ప్రార్థించును. అపుడా బ్రాహ్మణుడు విధివశాత్తు తానొక నిషాదిని పెళ్లి చేసుకొంటినని, దానివలన తాను బ్రహ్మత్వాన్ని కోల్పోయితినని తెలుపును. సమాధానంగా గరుత్మంతుడు విప్రులతో కూడియున్న వారే విప్రులుకాగా, మీరెలా విప్రత్వమును కోల్పోయితిరనీ అతనితోబాటు అతని భార్య (నిషాది)ను సైతము భక్షింపక వదలివేయును. పవిత్రునితో సాంగత్యం ఉన్నయెడల అపవిత్రుడు సైతం పవిత్రతను పొందగలడని భావం. సదా సజ్జనుల స్నేహమే మేలని భావం.

ఇట్లు బ్రాహ్మణ వర్ణ ప్రాధాన్యాన్ని కర్తవ్యాలను తెలుపు సామెతలను, సామెతల వంటి వాక్యాలను, పలుకుబడులను పరిశీలించుటైనది.

## 2) క్షత్రియులకు సంబంధించిన సామెతలు:

ప్రాచీన సాహిత్యంలో క్షత్రియులకు సంబంధించిన సామెతల గురించి పరిశీలిద్దాం. రాజ్యమును ఏలువారు క్షత్రియులు. రాజ్యము వీరభోజనం కావున క్షత్రియులు వీరులుగా ఉండవలెననియే భావం.

"అతుల మానదనాఢ్యుడైన భూపతి సహియింప నోపునె
సపత్నుల వృద్ధియునాత్మ హానియున్"
(ఆంధ్ర మహాభారతం-సభాపర్వం-ద్వి.ఆ. 98 ప)

దుర్యోధనుని దురాలోచనమునకు ప్రతిరూపంగా చెప్పవచ్చును. చెడ్డ వాడెప్పుడు ఇతరుల వృద్ధిని సహించడు.

"సమరంబున జయంబు దైవాధీనంబు"
(ఆంధ్ర మహాభారతం-భీష్మ పర్వం- ప్ర.ఆ.-14 ప)

రాజు జయాపజయాల గూర్చి తీవ్రంగా ఆలోచింపక, ధర్మయుద్ధంలో పాల్గొన వలెను- సమరంలో జయాపజయాలు దైవాధీనాలని వేదవ్యాసుడు ధృతరాష్ట్రునితో పలికెను. దైవబలం లేకుంటే ఎంత గొప్ప బలవంతులైనా సరే ఓటమి పాలయ్యే దరని భావం.

"వజ్ర సన్నిభముగాదె నృపులనెమ్మనంబు"
(ఆంధ్ర మహాభారతం-శాంతి పర్వం-ప్ర.ఆ-152 ప)

దేవస్థానుడను ముని ధర్మరాజునకు హితోపదేశం సేయుచు పై విధంగా పలికెను. రాజైనవాడు శోకాన్ని వదలివేయవలయుననీ, అతని హృదయం వజ్రం వలె కఠినంగా ఉండవలెననీ అభిప్రాయం. రాజు మనస్సు సున్నితమైనదిగా ఉండ కూడదని భావం.

"శోకశీలురం జూచిన పగతురు సంతసింతురు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-ష.ఆ-27 ప)

రాజులకు దుఃఖం కలిగినను దానిని బయటపడనీయకూడదు. శోకించే రాజును చూచిన పగవారు సంతోషపడెదరు. కావున శోకాన్ని ఎప్పుడు కూడ ప్రకటింప గూడదని కర్ణుడు దుర్యోధనునితో పలికెను.

"కులములందెల్లనీ రాచకులము చాలచెట్టిదంబు"
(ఆంధ్ర మహాభారతం-భీష్మపర్వం-ప్ర.ఆ. 60 ప)

సంజయుని ద్వారా భీష్ముని మరణాన్ని విని ధృతరాష్ట్రుడు విచారించుచు పై విధంగా పలికెను. అన్ని కులాలలో రాచకులం బహు బెట్టిదమని ఏడ్చెను.రాజెప్పుడును తన విచారాన్ని ప్రకటింపకూడదనుటవలన, క్షత్రియులు ఎంత కఠిన హృదయం గలవారై ఉండెదరో అని ధృతరాష్ట్రుడు విలపించెను.

"దుర్గాధిపతియైన రాజు శత్రు సంఘముల జయించు చందమున"
(ఆంధ్ర మహాభాగవతం-తృ.స్కం.-458 వ)

దితి తన పతిని పరిపరి విధాల తన్ను ప్రేమించవలసినదని వేడుకొనే ఘట్టంలోనిది.

ఏ విధంగానైతే శత్రువుల బారినుండి దుర్గాధిపతియైన రాజు రక్షణనుపొంది, శత్రువులను జయించుటకు వీలుకలుగునో అట్లే గృహస్థాశ్రమంలో ఉన్న వ్యక్తి సంతానవంతుడై ఇతర ఆశ్రమవాసులను రక్షించునని తెలిపెను.

"జనములు నేర్చిన విద్యలు జననాథుని కొరకు గాదె"
(ఆంధ్ర మహాభాగవతం-దశ. స్కం. 1332 ప)

ప్రజలు ఏ విద్య నేర్చినప్పటికిని జననాథుని కొరకే. చాణూరుడు ముష్టి యుద్ధంలో ప్రసిద్ధుడు. చాణూరుని విద్య ఆజననాథుని కొరకే వినియోగించెను. అట్టి చాణూరుని సైతం కృష్ణుడు వధించెననగా, నిజమైన జననాథుడు భగవంతుడైన కృష్ణుడే అని భావం.

"మాట దిరుగలేరు మానధనులు"
(ఆంధ్ర మహాభాగవతం-అ.స్కం. 597 ప)

ఎన్నో విధాల శుక్రాచార్యుడు వద్దని నివారించినను బలిచక్రవర్తి అందుకు అంగీకరింపక, మానధనులెన్నడును తామిచ్చిన మాటను తప్పకూడదని పలికెను.

రాజు మానధనుడై ఉండవలెనని భావం. ప్రాణం కంటె మానం (గౌరవం) ప్రఖ్యముగావున్న మానధనుడైన తాను ఆచార్యుని సలహాను పాటింపలేక పోయాననీ వామనునకు దానమిచ్చుటకే నిశ్చయించుకొంటిననీ పలికెను. రాజులు మానధనులు.

"నిత్య క్షమాన్వితుండయిన వానికి భృత్యులు వెఱవక
యవమానంబు సేయుదురు"
(ఆంధ్ర మహాభారతం అరణ్యపర్వం-ప్ర.ఆ. 218 ప)

రాజులు నిత్య క్షమాన్వితులుగా ఉండకూడదని భావం. క్షమా గుణం ఉండవలసినదేకాని ప్రతి తప్పును క్షమించినయెడల భృత్యులు అతనికి వెఱవక అవమానించెదరని భావం.

"క్షమయును దేజంబును నయ్యయి కాలంబుల ప్రయోగింపనేరని
రాజునకుంబ్రజాను రాగ ప్రతాపంబులు లేవు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-ప్ర.ఆ. 216 ప)

రాజ ధర్మాలను తెలుపు వాక్యంగా పేర్కొన వచ్చును. క్షమ, తేజం రెండును రాజునకు అవసరమే. వానిని అవసరానికి తగిన రీతిగా ఉపయోగించాలి.

"ప్రతి వీరుని చంపుచేల పాపంబయ్యేన్"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వం-పం.ఆ. 363 ప)

ధృష్టద్యుమ్నుడు ద్రోణుని చంపుటజూచి అర్జునుడు విచారించగా, భీష్ముని అర్జునుడు చంపుట మాత్రము ఏమిన్యాయమని ఎదురు ప్రశ్న వేయును. యుద్ధములో శత్రువును చంపుటవలన పాపము కలగదని అతడు పలికెను. శత్రువును శత్రువుగా చూడవలె కాని బాంధవ్యమును ఆలోచించకూడదని భావము.

"సంతతక్షముండు సంతతతేజుండునగుట దోషమందు రనఘమతులు"
(ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము - ప్ర.ఆ. 217 ప)

ఈ వాక్యం రాజధర్మమేమిటో మనకు తెలియచేయును. రాజెప్పుడు సతత క్షముడో లేక మిక్కిలి కోపమును ప్రదర్శించువాడో కాకూడదని భావము.

"అల్పోపాయంబైన కార్యము సాహసార్థ బైనను దోషంబు లేదు"
(ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము - ప్ర.ఆ. 268 ప)

చిరు ఉపాయముచే గొప్పకార్యమును నెరవేర్చుట తగినదనీ అది సాహసార్థ మైనను తగినదేఅని భావము. రాజులు ఎప్పుడును అనుసరించవలసిన పద్ధతి అదేఅని భావము.

"శరణాగత రక్షణంబు రాజమాత్రుండగు వానికెల్ల ధర్మంబు"
(ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము - పం.ఆ. 409 ప)

ధర్మరాజు భీమునితో పై విదంగా పలికెను. శరణాగతుని రక్షించుట రాజ దర్మం.

"సమరంబురాజులకు నుత్తమకర్మంబు"
(ఆంధ్రమహాభారతము - భీష్మపర్వము - ప్ర ఆ. 201 ప)

రాజులకు ఉత్తమమైన కర్తవ్యము యుద్ధము చేయుటే. కావున రాజులు ఎల్లప్పటికిని యుద్ధమునకు సన్నద్ధులుగా ఉండవలెనని కృష్ణుడర్జునితో పలికెను.

"పోటులాడి పురము గొంద్రు"
(ఆంధ్రమహాభారతము - భీష్మపర్వము - ప్ర.ఆ. 42 ప)

సంజయుడు ధృతరాష్ట్రునితో పైవిధంగా పలికెను. రాజులు ఎల్లప్పుడు యుద్ధము చేసియే రాజ్యములను పొందెదరని తెలిపెను. రాజ్యం వీరభోజ్యమని భావం

"ఏవిధమున దుర్దశలకు భూవర ధైర్యంబందు".
(ఆంధ్రమహాభారతము - శాంతిపర్వము - 420 ప)

దర్మరాజుతో భీష్ముడు మాట్లాడిన సన్నివేశములోనిది. ఎట్టి కష్టములైనను ధైర్యవంతుడు ఎదుర్కొనగలడనియు, భీరువు మాత్రము కష్టములపాలగునని తెపెలిను. కావున కష్టాలలో ఉన్నపుడు రాజైనవాడు ధైర్యాన్ని ప్రదర్శింపవలెనని తెలిపెను.

"రాజునకు ప్రజ శరీరము రాజు ప్రజకునాత్మ"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-ద్వి.ఆ-274 ప.)

బృహస్పతి వసుమనుండను రాజునకు చెప్పిన రాజ ధర్మాలను భీష్ముడు ధర్మరాజునకు తెలిపెను. రాజునకు ప్రజలు శరీరంవంటి వారుకాగా రాజు ప్రజలకు ఆత్మవంటివాడు. ప్రజలకు, రాజునకు గల సంబంధాన్ని పై వా[illegible] తెలుపుచున్నది.

"రాజులకు జయాపజయంబులనుభావ్యంబులు"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-తృ.ఆ. 37 ప)

భీష్ముడు ధర్మరాజునకు రాజ దర్మముల గూర్చి తెలుపుచు పై విదంగా పలికెను. రాజులకు జయాపజయాలు సర్వసామాన్యం - కావున రాజైనవాడు యుద్ధం చేయుటకు ఎల్లపుడును సిద్ధంగా ఉండవలెనని భావం.

"తన్నునొరులు నమ్మెడునట్లు యుండి యొరుల నమ్మకునికి నీతి"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-తృ.ఆ. 239 ప.)

తాను ఇతరులకు నమ్మకస్తుడై, ఇతరులను తానుమాత్రం నమ్మకూడదనునది శుక్రనీతి. రాజ ధర్మాల గూర్చి తెలుపుచు షుడు దర్మరాజుతో పై విధంగా పలికెను.

"భూపాలకుడెద కత్తెరయు నాలుక బెల్లమునై మనంబులంగన వలయున్"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-తృ.ఆ. 268 ప)

భీష్ముడు ధర్మరాజునకు రాజధర్మముల గూర్చి తెలుపుచు, శత్రుంజయునకు కణికుడనుముని ఉపదేశించిన రాజనీతి వాక్యాలను తెలిపెను. కోపమెంత ఉన్నప్ప టికిని, శాంతంగానే మాట్లాడవలెను అనే భావాన్ని ఈ వాక్యం తెలుపుచున్నది.

"అన్నిటన్ ధరణిపాలుడు కన్నిడియున్న పెంపగున్"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వము-ద్వి.ఆ, 283 ప)

బృహస్పతి వసుమనుండను రాజునకు రాజధర్మాలను తెలుపుచు, రాజైన వాడు అన్నింటిని 'కనిపెట్టి చూడవలెననీ అన్నింటిపై దృష్టి నుంచగలవాడే అభివృద్ధి సాధించేవాడనీ తెలిపెను. రాజధర్మాలను తెలుపు వాక్యం.

"ఎల్ల విధంబుల గలసియుండవలయునృపుడు పురోధము"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-ద్వి.ఆ. 316 ప)

భీష్ముడు ధర్మరాజుతో 'రాజనీతిని వివరిస్తూ, రాజు, పురోహితుడు ఎప్పుడును కలసే వుండవలెనని తెలిపెను. రాజుకు, పురోహితునకు వైరముండకూడదని భావం.

"నమ్మి నమ్మక పనిగొనునది నిత్యం"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-ద్వి.ఆ. 351 ప)

రాజు ఎప్పుడును ఎవ్వరిని పూర్తిగా నమ్మకూడదు. అట్లని నమ్మకమే లేని యెడల పనులు నెరవేరవు. కావున నమ్మీనమ్మక కాకార్యాన్ని నెరవేర్చువాడే తగిన రాజని భావం. రాజధర్మాలను గూర్చి పై వాక్యం తెలుపుచున్నది.

"రాజు దర్మంబుకంటె పాప కర్మంబులేదు"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం ద్వి.ఆ. 426 ప)

రాజ ధర్మాని కంటె మరొక పాప కర్మముండదని భీష్మునితో ధర్మరాజు పలికెను. అది నిత్యసత్యం.

"శూరులు పుణ్యతమ పురుషులు"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-తృ.ఆ. 2 వ)

వైశంపాయనుడు జనమేజయునితో శూరుల గూర్చితెలుపుచు పైవిధంగా పలికెను. వారి జీవితయే ధన్యమనీ వారు పుణ్యపురుషులనియు తెలిపెను.

"దూతుని జంపిన నరకమగుట ధృవమనిరార్యుల్"
(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-ద్వి.ఆ 378 ప)

భీష్ముడు రాజదర్మాలను తెలుపుచు, ధర్మరాజుతో పైవిధంగా పలికెను. ఎట్టి పరిస్థితులలోను రాయబారిని చంపగూడదనీ, అట్లు చేసినట్లయితే నరకం ప్రాప్తించునని తెలిపెను. దూతను చంపకుండదనునది రాజధర్మం.

"మహియేలనశక్తుడు కాంక్షసేయునే"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 57 ప)

రాజు ఎప్పటికిని ఇతరుల దృష్టిలో అశక్తుడుగా కనిపించకూడదని కృష్ణుడ ర్జునకు హితవు చెప్పెను. కర్ణునితో తాను యుద్ధము చేయలేనని అర్జునుడు పలుకగా కృష్ణుడు ఆవిధంగా అతనికి హితవు చెప్పెను. యుద్ధము చేయలేని వారు ముక్కు-మూసుకొని ఎచటో తపస్సు చేయవలెను. కాని ఒకసారి యుద్ధానికి సిద్ధమైనవారు వెనుదిరిగిపోవుట సమంజసము కాదని తెలిపెను. రాజ్యము వీరభోజ్యము కావున అశక్తుడు కాంక్షచేయగూడదని పలికెను.

"క్షత్రియ కన్యకల బ్రాహ్మణులు వివాహంబగుదురుగాక"
(ఆంధ్ర మహాభారతము—ఆదిపర్వము—తృ. ఆ. 162 వ)

బ్రాహ్మణులు క్షత్రియ కన్యలను వివాహ మాడవచ్చునుగాని క్షత్రియులు బ్రాహ్మణ కన్యలను వివాహమాడరాదని యయాతిదేవయానితో తెలిపెను. ఇది మహాభారత కాలమునాటి వివాహ సంప్రదాయాన్ని తెలుపుచున్నది.

"తప్పుకలిగిన దరణీపతులు దండింపవలయు"

(ఆంధ్ర మహాభారతమ —శాంతిపర్వము-ద్వి.ఆ. 183 వ)

నగరచక్రవర్తి తన కుమారుడు తప్పుచేయగా, కుమారుడని చూడక దండించెను. తప్పుచేసినవారు ఎవరైనప్పటికి స్వపరభేదములేక రాజు దండించవలెనని భీష్ముడు ధర్మరాజుతో పలికెను.

"కడునమ్మియు నెక్కుడు నమ్మమియును సుశీలకుశలతగాదు"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 187 వ)

రాజు ఎల్లప్పుడును ఒకరిపై సంపూర్ణ విశ్వాసాన్నిగాని, పూర్తిగా అవిశ్వాసాన్ని గాని కలిగి ఉండకూడదని భీష్ముడు ధర్మరాజుతో రాజధర్మములగూర్చి తెలుపుచు పలికెను. ఉచితానుచితములను ఎరిగి, సమయానుకూలముగ ప్రవర్తించుటయే నిజమైన రాజధర్మమని పలికెను.

"అత్యల్పుడైన పగతుడగ్ని విషంబులవగిది"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 194 వ)

ధర్మరాజుకు రాజధర్మములను తెలుపుచు భీష్ముడు పైవిధంగా పలికెను. చిన్న శత్రువునైనను వదలకూడదనియు, అత్యల్పుడైన శత్రువు సైతం అగ్ని విషములతో సమానముకావున, శత్రువును సంహరించుటయే రాజలక్షణమని పలికెను.

"మీలయట్టుల బలవంతులల్పుల దమకు నాహారంబుగా గొంద్రు"

(ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వం-ద్వి.ఆ. 255 వ)

బలమైన చేపలు, బలహీనమైన చేపలను ఆహారంగా తీసుకున్నట్లు, బలవంతుడు బలహీనుని నాశనం చేయును. కావున రాజైనవాడు అందరిని సమదృష్టితో చూచి న్యాయాన్ని చేకూర్చవలెనని భీష్ముడు ధర్మరాజుతో రాజధర్మాల గూర్చి తెలుపుచు పలికెను.

"అని మొనశత్రులం బొగడుటారయ మూర్ఖతగాదె"

(ఆంధ్ర మహాభారతం-కర్ణపర్వం-ద్వి.ఆ. 100 వ.)

కర్ణుని బలహీనుని చేయువలయునను ఉద్దేశ్యంతో అదేపనిగా అతనిని పొగడు చున్న శల్యుని చూచి కర్ణుడు పై విధంగా పలికెను. ఎంత బలవంతుడైనప్పటికి సారధి శత్రువును యుద్ధ రంగంలో తనముందే పొగడుట ఉచితం కాదని శల్యునితో కర్ణుడు పలికెను. శత్రువు పరాక్రమము వినుటవలన యుద్ధంలో యోద్ధకు నిర్వీర్యత్వం కలుగునని పలికెను. శత్రువును తక్కువగా అంచనావేయుట ఎంత తప్పో, అతనిని ఎక్కువగా అంచనావేయుట కూడ అంతే అపరాదమని కర్ణుడు పలికెను.

"గెలుపును నోటమియునునని గలుగదె"

[ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వం-చ.ఆ.259 ప]

గెలుపు, ఓటమి అనునవి యుద్ధంలో సర్వసామాన్యాలు. తాత్కాలికంగా గెలిచినంత మాత్రాననే గర్వపడరాదని సాత్యకి రాధేయుని తూలనాడెను. గెలుపును, ఓటమిని సమానంగా గైకొనువాడే నిజమైన రాజు.

"నెవ్వగఁగుందిన మానవుండు వైరులచేతందెగు"

(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వం-ద్వి.ఆ. 457)

బాధలతో క్రుంగిపోయిన వ్యక్తి శత్రువులచే అవమానం పొందును. వారివలన ఓడిపోవును. కావున వీరుడు దుఃఖముతో బాధపడకూడదనియు, సమస్యలను ధైర్యంగా ఎదిరించవలెనని అర్జునునకు కృష్ణుడు సలహాను ఇచ్చెను. ఇది నిత్యసత్యము.

"రాజులు చేసిన పని సాధులచేతం జక్కంబడునే"

[ఆంధ్ర మహాభారతం - ఉద్యోగపర్వము-చ.ఆ. 286 ప]

అంబో పాఖ్యానమును కూర్చి వివరిస్తూ భీష్ముడు పై విధంగా పలికెను. అంబను గైకొని తాను సాళ్వని వద్దకు వెడలి అతనిని గ్రహింపుమని కోరగా, అతడు నిరాకరించును. కొంతదూరము వెడలి, అచ్చటనున్న సాధువులను కాంచి అంబ తన బాధను వివరించుకొనును. ప్రజల శ్రేయస్సు తలంచే రాజే ప్రతికూలంగా ఉన్నయెడల ఎవరు మాత్రం సహాయం చేస్తారని ఆమె పై విధంగా పలికెను. కావున రాజే అనుకూలంగా లేనప్పుడు ఎవ్వరుకూడ సహాయం చేయలేరని భావము.

"కయ్యంబు కర్జంబుగాదు"

[ఆంధ్ర మహాభారతం - ఉద్యోగపర్వము-తృ.ఆ. 99 ప]

కయ్యము ఎవరికైనను విసర్జనీయమే. కాని శత్రువులు కయ్యానికి కాలు దువ్విన యెడల వారిని ఎదిరించుటే సమంజసమని సహాదేవుడు కృష్ణునితో తన అభిప్రాయాన్ని తెలిపెను.

"ఆత్మ సంస్తుతి పౌరుషంబగునె చెప్పమ"
(ఆంధ్ర మహాభారతం - ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 264 ప.)

దుర్యోధనుడు తండ్రితో తన బల పరాక్రమాలను గొప్పగా చెప్పగా, ధృతరాష్ట్రుడు అతనితో పై విధంగా పలికెను. బలవంతుడు ఎప్పుడు కూడా తన బలాన్ని గూర్చి ఇతరులతో డంబములు పలుకడు. ఆత్మస్తుతి పరాక్రమానికి చిహ్నము కాదు. నీవెప్పుడును ఆత్మను స్తుతి చేసుకొనగూడదనియు ధృతరాష్ట్రుడు అతనితో పలికెను.

"ఏమి గతి దలంచినంబగకు మేలిమిలేమి ధ్రువంబు"
[ఆంధ్ర మహాభారతం - ఉద్యోగపర్వము-తృ.ఆ. 20 ప]

పగ ఎట్టివారికైనను శ్రేయస్కరముకాదు. కావున కౌరవులతో సంధి చేసి కొనుటే సమంజసమనీ, ఆసంధికి కృష్ణుని రాయబారిగా ఉండవలసిందిగా ధర్మరాజు విన్నవించుకొనును. పగకలిగిన వారితో స్నేహం, పాముతో ఇంటిలో ఉన్నట్లుండునని, పగ యెవ్వరికైనను క్షేమకరము కాదని ధర్మరాజు కృష్ణునకు తెలిపెను. పగ ఎవ్వరికిని శ్రేయస్కరము కాదను అభిప్రాయమును ధర్మజుడు వెలిబుచ్చెను.

"అక్కటలాతునైన పగవైనను జంపనకోరననేల"
(ఆంధ్ర మహాభారతం - ఉద్యోగ పర్వము తృ.ఆ. 13 ప)

ధర్మరాజు కృష్ణునితో రాయబారము చేయవలసిందిగా ప్రార్థించుచు పైవిధంగా పలికెను. శత్రువే ఐనప్పటికి అతనిని చంపాలని కోరుకోవడమెందుకని ధర్మజుడు కృష్ణునితో పలికెను. "అహింసా పరమోధర్మః" అని శాస్త్రాలు తెలుపుచున్నవి. అహింసయే భారతీయ జీవన విధానమని చెప్పవచ్చును.

"పతియగునంతకున్ రిపునుదగ్రతనైచుటనీతి"
[ఆంధ్ర మహాభారతం - ఉద్యోగపర్వము - ప్ర.ఆ. 176 ప]

శచీదేవి, నహుషుడు చేసే అకృత్యాలను దేవేంద్రునితో తెలుపుకొనును. ఇంద్రుడు తన అశక్తతను తెలిపి, శత్రువుల నెదిరించే అవకాశం కొరకు వేచియున్నానని తెలుపును.అవకాశము వచ్చేంతవరకు శత్రువును సహించుటే రాజనీతి.

"నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుగాక"
(ఆంధ్రమహాభారతము-విరాటపర్వం-చ.ఆ. 6౽)

ఉత్తర కుమారుడు ప్రగల్భాలు పలికెను. కాని యుద్ధ రంగంలో కౌరవ సైన్యాన్ని చూచిపారిపోవుచుండెను. ప్రాణరక్షణము చేయవలసిలదిగా బృహన్నలను ప్రార్థించును. తాను యుద్ధ రంగంనుండి పారిపోవుటకే నిశ్చయించుకొన్నానని అనగా, బృహన్నల అతనితో శత్రువులను ఎదిరించి నిలిచి గెలిచిన సత్కీర్తి లభిస్తుంది కాని, పారిపోయినందువలన ప్రయోజనంలేదని హితబోధ చేయును.

"కారణజన్మమైతను వికారము వచ్చిన బెంపుదప్పునే"
(ఆంధ్ర మహాభారతం-విరాటపర్వం-చ.ఆ. 22 ప.)

కౌరవులు విరాటరాజుపై దండెత్తి గోగ్రహణంచేసెదరు. అంతకుముందే ఉత్తరగోగ్రహణ యుద్ధానికై ఆ రాజ్యంలోని విరాటరాజు మరియు సైన్యంవెడలును. కేవలం బృహన్నల, ఉత్తరకుమారుడు మాత్రమే విరాట నగరంలోనుండిరి. తనకు తగిన సారథిలేడని ఉత్తరుడు విచారిస్తున్న సమయంలో సైరంధ్రి బృహన్నల పేరు సూచిస్తుంది. నపుంసకుడు ఎట్లు సారథికాగలడని ఉత్తరుడు విచారించుచుండగా సైరంధ్రి అతనితో బృహన్నల గొప్పతనాన్ని, పరాక్రమాన్ని తెలుపుతుంది. అతని సాటి ఎవరూ రాలేరని తెలుపుతుంది. అట్టివాడు సారథిగా ఉన్నయెడల ఉత్తర కుమారుడు కౌరవ సైన్యాన్ని అవలీలగా గెలవగలడని హితవు చెప్పెను. తను వికారంచేత తాత్కాలికంగా తేజస్సు తగ్గినప్పటికి అతని గొప్పదనం తగ్గదు గదా. చక్కని లోకోక్తిగా చెప్పవచ్చును.

"వసుమతీశుపాల వసియించునేనుంగు తోడనైన
దోమతోనైన వైరమగు లెఱుంగు వలవదు"
(ఆంధ్ర మహాభారతం-విరాటపర్వం-ప్ర.ఆ. 139 ప)

ధౌమ్యుడు పాండవులకు హితబోధచేయుచు, రాజువద్ద జాగ్రత్తగాప్రవర్తించ వలెనని తెలిపెను. రాజువద్ద కొలువులో ఉన్నప్పుడు వారి సన్నిహితులు, మిత్రుల తోడనేకాక, రాజు వద్దనున్న జంతువులతో సైతం వైరం పనికిరాదని ధౌమ్యుడు సలహాను ఇచ్చెను. అధికారివద్ద ఎట్లు ప్రవర్తించవలెనో పై వాక్యం మనకు తెలుపు చున్నది.

"జనులకెల్లను పూజ్యుండు జనపాలుండు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-చ.ఆ. 203 ప)

కద్రువ తన సంతానానికి ఎందుకు శాపమిచ్చినదని అడుగగా శౌనకాది మునులు తెలిపిన కథా సందర్భములోనిది. ఓటమికాని, ఎగ్గనుకాని పరులవలెనే కలుగునని భావం. ఇది నిత్య సత్యమని చెప్పవచ్చును. ఏదైనా అపకారము జరుగుటకు ఇతరుల ప్రమేయము, జోక్యం కారణము.

"శూరుల జన్మంబు సురల జన్మంబునేఱుల జన్మంబు నెఱుఁగనగునె"
(ఆంధ్ర మహాభారతం-ఆదిపర్వము—ష.ఆ. 60 ప)

భీమునితో దుర్యోధనుడు పై విధంగా పలికెను. అంగ రాజ్యానికి రాజైన కర్ణుని గూర్చి భీముడు అవమానకరంగా మాట్లాడగా, దుర్యోధనుడట్లు సమాధానం ఇచ్చెను.

జాతి న పూఛియే సాధు కీ
పూఛ్ లీజియే జ్ఞాన్
మోల్ కరో తల్‌వార్ కీ
పడే రహన్ దో మ్యాన్ "

అను హిందీ పద్యం అదే అర్థాన్ని సూచిస్తుంది. జ్ఞానికి, వీరునకు కులంతో పనిలేదు. వీరుల జన్మ రహస్యాల తెలుసుకొనుట అనవసరమని భావం.

"మహాత్ములయిన పురోహితులంబడసిన రాజుల
కభీష్టంబులయిన శుభంబులగుట నిశ్చయంబు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వం-స.ఆ. 88 వ)

రాజునకు ఎల్లప్పుడును మంచి సలహాలనిచ్చుటకు మంచి పురోహితులు అవసరము. వసిష్ఠుని సలహాను అనుసరించి సూర్యుడు తన కుమార్తె అగు తపతిని సంవరణునకిచ్చి వివాహం సేయును. పురోహితులు గొప్పవారయినచో రాజులు సుఖపడెదరని భావం. రాజులు ఎల్లప్పుడును వివేకులైన పురోహితుల నియమించు కొనుట అవసరమని కూడ పై వాక్యం తెలుపుచున్నది.

"బలవంతులతోడి విగ్రహంబు పరిహరించుటలగ్గు"
(ఆంధ్ర మహాభారతం-సభాపర్వం-ద్వి.ఆ. 148 వ)

దుర్యోధనుని జూదమునుండి మాన్పించుటకై ధృతరాష్ట్రుడు పరిపరివిధాల అతనికి నీతిని బోధించుచు బలవంతులతో పోరు తగదని హితవుచెప్పను. ఇది నాటికీ, నేటికి నిత్యసత్యమే.

"రిపుపక్షమునెమ్మెయినైన జెఱుపగావలయునిలన్"
(ఆంధ్ర మహాభారతం-సభాపర్వము-ద్వి. అ. 143 ప)

మయసభలో తనకు జరిగిన అవమానాన్ని, ద్రౌపది తనను చూచి నవ్విన విధానాన్ని దుర్యోధనుడు మిక్కిలి బాధతో ధృతరాష్ట్రునకు వివరించును. ఎట్లయినను శత్రువులను సంహరించుటే తన లక్ష్యమని తెలిపెను.

"ఉపేక్షింపరపారపరాక్రములు బోర ప్రాకృతునైనన్"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-ప్ర.అ-196 ప)

దారుకుడు సాళ్వునిపై యుద్ధంచేయు సమయమున పలికిన మాటలు. అపార పరాక్రమవంతుడైనను, బలహీనుడైనవాడైనను శత్రువు శత్రువే. చిన్నశత్రువని ఉపేక్షింపకూడదని భావం. చిన్నపామునైనను పెద్దకర్రతో చంపవలయునను భావానికి ఈవాక్యం సమీపంగా ఉన్నది. రాజుఎన్నడును శత్రువులను ఉపేక్షింప కూడదని భావం.

రథిసారథులు పరస్పర శరీరరక్షకులగుటన్"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-ప్ర.అ. 173 ప)

మూర్ఛపోయిన ప్రద్యుమ్నుని రణరంగం నుండి సారథి రక్షితప్రదేశానికి తీసుకొని పోవును. ప్రద్యుమ్నుడు మూర్ఛనుండి లేరుకొని తాను యుద్ధరంగంనుండి అట్లు వెడలిపోగూడదని, సారథి తనను ఆవిధంగా తీసుకొని పోగూడదని పలుకగా సారథి పైవిధంగా పలికెను. సారథియైనవాడు కేవలం యుద్ధములో రథానికి సారథే కాక యోద్ధశరీరాన్నికూడ రక్షింపవలెననీ, రథిసారథులు పరస్పరం శరీర రక్షకులుగా ఉండవలెనని తెలిపెను. సారథిని ఎన్నుకొనుటలో యోద్ధ చాతుర్యమును చూపించ వలెనని భావం.

"ప్రజానురాగంబు లేనివారికి రాజ్యంబు సుస్థిరంబుగానేరదు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం-ప్ర.అ. 207 ప)

బకదాల్భ్యుండను మహాముని ధర్మరాజుతో పైవిధంగా పలికెను. ఏ విధంగా నైతే వాయువు సహాయుడై అగ్ని అరణ్యాన్ని దహించునో అట్లే బ్రాహ్మణ సహాయుడైన రాజునకు ఎన్నడును తిరుగులేదని భావం.

రాజైనవాడు ప్రజారంజకుడు కావలెను. ప్రజలచే ద్వేషింపబడే రాజు సుస్థిర ముగా ఉండలేడు. రాజునకు ఎప్పుడును జనరంజకిత్వము ముఖ్యమని భావం.

"పలుకులనొప్పదుబీరము"

(ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము - ప్ర.ఆ. 309 వ)

అర్జుననితో శివుడు పైవిధంగా పలుకుచు, యుద్ధానికి తలపడెను. వీరుడు ఎప్పుడును ఎక్కువగా మాట్లాడడు. మాటలలోకాక చేతలలో శౌర్యమును ప్రకటింప వలెనని భావం.

"సమర భీతుభుజబలహీనున్ జనపతిగాసేయుటయొప్పునెతు"

(ఆంధ్ర మహాభారతం-కర్ణ పర్వం-తృ.ఆ-98 వ)

సమరంలో జరిగిన నష్టానికి, ప్రత్యేకించి తనవంశ పెద్దల మరణాన్నిచూచి అర్జునుడు మిగులదుఃఖించును. యుద్ధంపై వైరాగ్యాన్ని ప్రదర్శించును. అతనిని ఎట్లయిన యుద్ధోన్ముఖుని చేయాల్సిందిగా, సూటిపోటి మాటలతోడనైనా అతనిని యుద్ధోన్ముఖునిగా చేయాల్సిందిగా కృష్ణుడు ధర్మరాజును కోరును. ధర్మరాజు వ్యంగ్యంగా పైవిధంగా అతనితో మాట్లాడును. అర్జునుడు తన తప్పులను తెలిసికొని మరల యుద్ధోన్ముఖుడగును. సమరభీతుడు జనపతిగా ఉండుటకు తగడని పైదాని భావం.

"క్షత్రియులకు గాంధర్వ వివాహంబు విధిచోదితంబు"

(ఆంధ్ర మహాభారతం-ఆదిపర్వం-చ.ఆ. 61 వ)

శకుంతలను కణ్వాశ్రమంలో చూచి దుష్యంతుడు ఆమెను మోహించును. గాంధర్వ పద్ధతిలో వివాహం చేసికొనును. ఆమె సంశయాన్ని వెలిబుచ్చగా క్షత్రియులు గాంధర్వ పద్దతిలో పరిణయమాడుట తగినదేనని తెలుపును.

"దీర్ఘక్రోధుడైన పతికీడొందున్"

(ఆంధ్ర మహాభారతం-శల్యపర్వము-ప్ర.ఆ. 55 వ)

కృపాచార్యుడు దుర్యోధనునకు హితవు చెప్పుచు అనవసరవైరము వలన సర్వస్వము కోల్పోయితివని తెలుపును. ఇప్పుడు బాధపడి లాభంలేదనియు, ఎల్లప్పుడు కోపంతో ఉండే రాజుకు సౌఖ్యం దక్కదని తెలుపును. రాజునకు కోపముండ కూడదని, దీర్ఘకోపం అసలేవనికిరాదనీ అతడు తెలిపెను.

"తనవారు తానుగూడగ సుఖముండదేని యదిరాజ్యమె"

(ఆంధ్రమహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 70 ప)

మడుగులో దాగిన దుర్యోధనునెన్ని సూటిపోటి మాటలు పలికినను అతడు అచ్చటనుండి బయటకు రాకుండానే సమాధానమిచ్చుచుండును. తమ్ములందరును నశించిరి. ప్రియమిత్రుడు కర్ణుడు నశించెను. భీష్మాది మహావీరులులేరు. రాజ్యమున్నప్పటికి అనుభవింపలేనని దర్మరాజుతో అతడు నీటిలోనుండే సమాధానము చెప్పును. రాజ్యసుఖము అనుభవింపవలెనన్న తాను తనవారితోగూడి అనుభవించాలి కాని ఒంటరిగా తాను ఎట్లు సుఖాన్ని పొందగలనని జవాబిచ్చును. రాజ్య సుఖాలు కలసి అనుభవించినచో ప్రయోజనముండును గాని, ఎవ్వరులేకుండా ఒంటరిగా సుఖాన్ని పొందిన చోవ్యర్థమేనని భావం.

"పలువురొకనితో బోరబాడియగునే"

(ఆంధ్ర మహాభారతం - శల్యపర్వము - ద్వి.ఆ. 84 ప.)

పాండవులు, ద్రుపదుడు, ద్రుపదకుమారులు అందరుకూడ మడుగులో దాగి వున్నదుర్యోధనుని బయటకు రావలసిందిగా సూటిపోటి మాటలతో కవ్వించిరి. కాని దుర్యోధనుడు మడుగునుండే పైవిధంగా సమాధానం ఇచ్చెను. పలువురు ఒక్కనితో పోరాడుట సమంజసం కాదుగదా.

"ఉదగ్రుడు కార్యముగనునె"

(ఆంధ్ర మహాభారతం-స్త్రీ పర్వము-ద్వి.ఆ. 60 ప)

గాంధారి దుశ్శాసనుని కళేబరాన్ని పట్టుకొని, అతనిరక్తాన్ని భీముడు త్రాగినాడనివిని మిక్కిలి దుఃఖించుచు పైవిధంగా పలికెను. కోపోద్రిక్తుడైనవాడు విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయెననుటకు పైసన్నివేశాన్ని ఉదాహరణంగా గైకొనవచ్చును. ఉదగ్రుడైనవాడు తగిన కార్యమేమిటో తెలిసికొనలేడని మిక్కిలి విలపించెను.

"దేవకృతంబులు ధీరులకైనన్ మాన్పంగబోలునె"
(ఆంధ్ర మహాభారతం-స్త్రీ పర్వము-ప్ర.ఆ. 71 ప)

వ్యాసుడు ధృతరాష్ట్రున్ని అనునయించుచు పైవిదంగా పలికెను. ఎంతగొప్ప వారికైనప్పటికి విధిబలీయమైనదనీ, విధికి ఎవ్వరును ఎదురుచెప్పలేరనీ సాంత్వన పరచెను. దైవకృతాలు ఎవ్వరికి అర్థంకావని భావం.

"ప్రతిననెరపుట నృపులకు పరమదర్మము"
(ఆంధ్ర మహాభారతం-శల్యపర్వము-ద్వి.ఆ. 300 ప)

భీముడు దుర్యోధనుని తొడలు విరుచుట బలరామునకు కోపాన్ని కలిగిస్తుంది. అప్పుడు కృష్ణుడు పాంచాలి వస్త్రాపహరణ సమయమున భీముడు చేసిన ప్రతినను గుర్తుచేస్తూ, ఇప్పుడు తొడలు విరుచుట కేవలం ప్రతినను నెరవేర్చుటేనని తెలిపెను. రాజులు తాముచేసిన ప్రతినను నెరవేర్చుకోనట్లయితే శత్రువులచే అవమానించ బడతారు. రాజులు తాముచేసిన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుటే వారి పరమ దర్మమని భావం.

"ఎట్టిదుదైవవిధి తప్పజూచినన్"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వం-ద్వి.ఆ. 409 ప)

తొడలువిరిగి దీనంగా నేలపై బడియున్న దుర్యోధనువద్దకు కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ వచ్చి మిక్కిలి దీనంగా విలపించిరి. ఎంతో మంది వీరులతో కూడిన సైన్యమున్నప్పటికి, దుర్యోధనుడు జయాన్ని పొందకపోవుట కేవలం విధి విలాసమేననీ, విధితోడుగా లేనివానికి ఎంతసహాయము లభించినను వ్యర్థమేనని విచారించిరి. మానవశక్తికంటె దైవశక్తి గొప్పదని భావం.

"పౌరుషంబునకు దైవంబుతోడుపాటువలయు"
(ఆంధ్ర మహాభారతము—సౌప్తికపర్వము-ప్ర.ఆ.-31 ప)

కృపాచార్యుడు అశ్వత్థామకు నీతివిశేషాలను తెలుపుచు పౌరుషంతో పాటు దైవం తోడయినప్పుడే ఫలసిద్ధి అవుతుందని తెలుపును. దైవం పాండవుల పక్షమున ఉన్నది కావున వారికి జయం కలుగునని తాత్పర్యం. ఏవిధంగానైతే వర్షం లేనట్లయితే పంటలు పండవో అదేవిధంగా దైవసహాయంలేని పౌరుషం సైతం వ్యర్థమని భావం.

"అస్త్రిమస్త్రిముతో శాంతమగుట"
(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ద్వి.ఆ. 69 ప)

అశ్వత్థామ బ్రిహ్మశిరోనామము అనే అస్త్రాన్ని ప్రయోగించగా, అర్జునుడు బదులుగా అదే అస్త్రాన్ని ప్రయోగించెను. అర్జునుడు తాను ప్రయోగించిన అస్త్రాన్ని నివారింపశక్తికలవాడాయెను కాని, అశ్వత్థామకు అదిసాధ్యం కాలేదు. "అస్త్రిమస్త్రిముతో శాంతమగుట" అనేది సమానబలులు మాత్రమే యుద్ధంలో శాంతిని ప్రతిపాదించగలుగుదురు అనుటకు నిదర్శనంగా పేర్కొనవచ్చను.

"లేడికడుపున పులిబుట్టునె"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ప.ఆ. 59 ప)

భీముడు కర్ణుని పుట్టుకను గూర్చి అవమానకరంగా మాట్లాడును. అపుడు దుర్యోధనుడు భీమునితో లేడికడుపున పులిపుట్టుటకు వీలులేదు. కావున కర్ణుడు సైతము గొప్పవంశములో పుట్టినవాడేనని తెలిపెను. ధుర్యోధనుని అభిప్రాయం ప్రకారం కర్ణుడు కూడా గొప్పవంశములో పుట్టినవాడే.

"ఏనుంగేనుగు దాకునట్లు సమరంబేసారగా"
(ఆంధ్ర మహాభారతం-విరాటపర్వము-పం.ఆ. 191 ప)

సమాన స్కంధులమధ్య యుద్ధం ఏనుగును మరోఏనుగు తాకినట్లుండును. అర్జునునితో దుర్యోధనుడు ఢీకొనుట ఏనుగు మరొక ఏనుగుతో తాకినట్లున్నదని కవివర్ణించెను.

"చెఱబడిన సింహశిశువులభంగిన్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 211 ప.)

అడవులలో ఉన్నప్పటికి పాండవులు చెఱలోఉన్న సింహశిశువులవలె ఉన్నారని ద్రౌపది ధర్మరాజుతో పలికెను. సింహము ఎచ్చట ఉన్నను సింహమే. కాబట్టి చెఱలోఉన్నంతమాత్రాన రాజలక్షణములు నశించిపోవని భావం.

"రాజునకగు పుణ్యపాపంబులగ్గములు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 275 ప)

వ్యాసుడు ధర్మరాజుకు క్షత్రియ రీతిని తెలుపుచు పైవిధంగా పలికెను. ప్రజా సంరక్షణ సమయమున రాజు ఎవరిని చంపినను అతనికి పాపమంటదు. పుణ్యం కలుగదు. పాప, పుణ్యాలకు అతీతుడై ప్రజారక్షణచేయువాడే నిజమైన రాజని అతడు తెలిపెను. రాజధర్మాన్ని గూర్చి తెలిపే వాక్యం.

"దండాహతంబైన మహాహివోలె"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.అ. 331 ప)

అర్జునుడు వేసిన బాణాలకు మిక్కిలి ఉద్రగుడై కర్ణుడు దెబ్బతిన్న పామువలె అతనిపై విజృంభించుతాడు. ఎంతవిజృంభించి బాణములను వేసినప్పటికిని అర్జునునికి ఏమికాదు. అర్జునుడు ధర్మసహాయుడు కావున అతనికి నష్టం కలుగలేదు. "దెబ్బ-తిన్న పామువలె" అనేది తెలుగు పలుకుబడి. దానిరూపాంతరమే పైవాక్యమని చెప్పవచ్చును.

"పసులనడుమ సొచ్చుపులివోలె"
(ఆంధ్రమహాభారతము-ద్రోణపర్వము-పం.అ. 126 ప)

అశ్వత్థామ కృతవర్మ మొదలగు వీరులతో తాను కూడి పసులలో ప్రవేశించే పులివలె చేరి, వారిని అందరిని నశింప చేస్తానని పలికెను. పసులనడుమ పులి సొచ్చినచో పశువులకు నష్టమగును. కాని పులికెన్నటికినిగాదు.

"గిరివెన్కొని నిల్చిన వజ్రికైవడిన్"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-ప్ర.అ. 159 ప)

కృపుడు భీముని వెంటాడినరీతి కొండను వెంటాడిన ఇంద్రునివలె ఉన్నదని సంజయుడు పలికెను. వజ్రాయుధంతో కొండల రెక్కలను ఇంద్రుడు భేదించెను.

"గంధకరిందెగటార్చు సింహముంబోలు"
(ఆంధ్రమహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.అ. 158 ప)

నిద్రలో ఉన్న ధృష్టద్యుమ్నుని అశ్వత్థామ కత్తితో నరికి చంపివైచెను. ఆ దృశ్యం ఏనుగును సంహరించే సింహమువలెనుందెను. "గందకరిందెగటార్చు సింహము" జక తెలుగు పలుకుబడి.

"జితేంద్రియత్వంబుగల రాజురిపుల జెలుపజాలు నృపవరేణ్య"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-ద్వి.అ. 277 ప)

జితేంద్రియుడైన రాజే శత్రువులపై జయాన్ని పొందగలడనీ భీష్ముడు పలికెను. ఏకార్యాన్ని సాధించవలెనన్నను జితేంద్రియత్వము అవసరము.

"వనజవనంబును సొచ్చువారణంబును బోలె"
(ఆంధ్రమహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 110 ప)

దుర్యోధనుడు పద్మాలతోటలో చొరబడిన ఏనుగువలె పాండవ సైన్యంలో చొరబడి వారిని అందరిని వాడియైన బాణములచే నొప్పించెను. వనజాలు సుకుమారమైనవి గనుక వారణము ప్రవేశించినంతనే నశించిపోవును. అట్లే దుర్యోధనుని బాణములచే పాండవ సైన్యం నష్టమయ్యెనని భావము.

"బలియురతో పగగొనినంగలుగునె మేలు"
(ఆంధ్ర మహాభారతం - ద్రోణపర్వము-చ.ఆ. 247 ప.)

బలవంతులతో వైరము ఎన్నటికిని పనికిరాదనే నీతిని పైవాక్యం తెలుపుచున్నది. దుర్యోదనునికి ఎన్నిమార్లు చెప్పినప్పటికి ప్రయోజనం శూన్యము అయ్యెనని ధృతరాష్ట్రుడు సంజయునితో విచారంగా పలికెను. బలవంతులతో వైరం పనికిరాదు. అనునది నిత్యసత్యము.

"ఘోటకంబునకువాగెయు, దంతికినంకుశంబు"
[ఆంధ్ర మహాభారతం - శాంతిపర్వము-ద్వి.ఆ. 158 ప]

భీష్ముడు ధర్మరాజునకు రాజధర్మాన్ని గూర్చి తెలుపుచు, ధర్మం మానవునకు గుఱ్ఱానికి కళ్లెంవలె, ఏనుగునకు అంకుశమువలె ఉపయోగపడుతుందని తెలిపెను. రాజైనవాడు ఉచితము, అనుచితములు ఏమిటో తెలుసుకొని ప్రవర్తించవలెనని భావం.

"మడువుసొచ్చుట శౌర్యముచొప్పె"
(ఆంధ్ర మహాభారతం - శల్య పర్వము ద్వి.ఆ. 55 ప)

కౌరవవీరులంతా నశించిరి. దుర్యోధనుడు దగ్గరలోనున్న మడువుసొచ్చి జలస్తంభనంచేసి ఉండసాగెను. దుర్యోధనుడు లేకపోవుటచూచి కృష్ణుడు శత్రుశేషాన్ని ఉంచుటకు వీలులేదనియు, మాయోపాయముచేతనైనను శత్రునాశనంపూర్తిగా చేయవలెనని ధర్మరాజునకు హితవుచెప్పెను. దుర్యోధనుడు దాగియున్న మడుగు దగ్గరకు కృష్ణుడు ధర్మరాజును తీసుకొనివెడలెను. కృష్ణప్రేరితుడై ధర్మరాజు దుర్యోధనుని సూటిపోటి మాటలతో నొప్పించుచు మడువునుండి బయటకు రావల

సిందిగా కోరును. ఎంతోమంది వీరులమరణానికి కారణమైన దుర్యోధనుడు మడుపునొచ్చి తన ప్రాణమును కాపాడుకొనుట ఎంతవరకు సమంజసమని హేళనగా పలికెను. మడుగుసొచ్చుట శౌర్యముకాదుకదా.

"రాజును విప్రులకలగి జెఱుపబోయితాననయంబుచెడున్"
[ఆంధ్ర మహాభారతము - శాంతిపర్వము - ద్వి.ఆ. 172 ప]

భీష్ముడు ధర్మరాజునకు రాజధర్మాన్ని గూర్చి తెలుపుచు, రాజైనవాడు విప్రుల శుభాన్నే కోరవలెను కాని విప్రులపై అలక చెందరాదని తెలిపెను. విప్రులపై అలక రాజుకు వినాశ హేతువగునని తెలిపెను. సమాజంలో బ్రాహ్మణ వర్ణ ప్రాధాన్యాన్ని, రాజుల కర్తవ్యాన్ని తెలుపుచున్నది.

"వీఱిడిమాటలు వేయునేటికిన్"
[ఆంధ్ర మహాభారతం - కర్ణపర్వము-ద్వి.ఆ. 84 ప]

ఘోషయాత్రనాటి అనుభవాలను, ఉత్తరగోగ్రహణంనాటి విషయాలను ఎట్లు మరచిపోయితివని శల్యుడు కర్ణుని అవహేళనచేయును. మూర్ఖమైన మాటలు వీరులకు శోభను ఇవ్వవని అతడు తెలిపెను. ఎవ్వరికైనను మూర్ఖపు మాటలు పనికిరావు.

ఇట్లు కావ్యాలలో పలు సామెతలవలె ఉన్న వాక్యాలు పలుకుబళ్లు క్షత్రియ వర్ణానికి సంబంధించిన వానిని గురించి చర్చించుట జరిగింది.

### 3 వైశ్యవర్ణమునకు సంబంధిచిన సామెతలు :

బ్రాహ్మణ, క్షత్రియ వర్ణముల తర్వాతిస్థానం వైశ్యవర్ణమునకు ఇవ్వబడింది.

"దనమెట్టివారికింగడుకొని జేయకుండునే జగన్నుతగర్వము దుర్విమోహమున్"
[ఆంధ్ర మహాభారతం-సభాపర్వము-ప్ర.ఆ. 32 ప)

ధర్మరాజు నారదునితో రాజనీతి విషయాలను తెలుపుచు పైవిధంగా పలికెను. వ్యాపారం చేయువారు వైశ్యులు.

"వైశ్య సతికి నొక్కవరము, సక్షత్రియ సతికి రెండు,
శూద్రసతికి మూడు విప్రసతికి నూఱు"
(ఆంధ్ర మహాభారతం-సభాపర్వము-ద్వి.ఆ. 263 ప.)

ద్రౌపదికి జరిగిన అవమానానికి బాధపడి, దుర్యోధనుని ధృతరాష్ట్రుడు మందలించును. ద్రౌపదిని ప్రేమతో పిలిచి, ఆమెను వరాలు కోరుకొమ్మని తెలుపగా, ఆమె పైవిధంగా జవాబిచ్చెను.

వైశ్యవర్ణానికి సంబంధించిన సామెతలు ప్రాచీన సాహిత్యంలో ఎక్కువగా కనుపింపవు.

శూద్ర వర్ణమునకు సంబంధించిన సామెతలు :

మనువు చేసిన చతుర్వర్ణ విభజనంలో శూద్రవర్ణం చివరిది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యవర్ణాలకు చెందని వారినందరిని శూద్రవర్ణములో చేర్చిరి. వివిధ వృత్తులకు సంబంధించిన సామెతలతోబాటు శూద్రవర్ణానికి సంబంధించిన సామెతలను పరిశీలింతము.

శూద్ర వర్ణానికి సంబంధించినవారు వేదాలు చదవకూడదను నియమము ఆనాడుండెడిది.

"శూద్రులు వేద శ్రుతిం బ్రార్థించునట్లు"
(ఆంధ్ర మహాభారతము - ఆదిపర్వము - ష.ఆ. 259 వ.)

శూద్రులు వేదాలు చదవకూడదను అభిప్రాయమును ఆ వాక్యము తెలుపుచున్నది. ఏదైనా కాని పని చేసినవారిని గూర్చి ఆ విధంగా మాట్లాడుట సర్వసామాన్యము.

"ఎఱిగి యెఱిగి వేదంబు శూద్రునకిచ్చినటులు"
(ఆంధ్ర మహాభాగవతము- చ.స్కం. 43 వ.)

ఈశ్వరునకు దక్ష ప్రజాపతికి విరోధం సంభవించిన ఘట్టములోనిది. "శూద్రులు వేదములు చదువుటకనర్హులు" అను అభిప్రాయమున్న కాలములోనిది. దక్ష ప్రజాపతి ఈశ్వరుని దూషించుచు, ఈశ్వరుని రాకచే యజ్ఞభూమి అపవిత్రమైందనియు, శివునకు గౌరవమిచ్చుట శూద్రునకు వేదాలు చదువుటకు అనుజ్ఞ యిచ్చినంత మహా పాతకమని తూలనాడెను.

"అధముడెక్కువ జాతి వృత్తినున్న దోషవిధముగాదు"
(ఆంధ్ర మహాభాగవతము - స.స్కం. 410 వ.)

కుల విభజనం వృత్తినిబట్టి ఏర్పడిందనుటకు నిదర్శనంగా పై వాక్యాన్ని పేర్కొననత్చును. ఉచ్చనీచములు, మొదట వారు చేసే కర్మలను బట్టి ఏర్పడి తర్వాత కొంతమంది స్వార్థపరులచే జన్మను బట్టి స్థిరీకరింపబడినవి. నీచుడైనవాడు ఎక్కువజాతి వారి వృత్తి చేసిన తప్పులేదన్నీ, కాని ఎక్కువజాతికి చెందినవారు మాత్రమే నీచ జాతి వారు చేసే కార్యాలను చేయకూడదనే నియమమున్నట్లుగా పై వాక్యం వలన తెలియుచున్నది. నారదుడు దర్మజునకు వర్ణాశ్రమ దర్మాలను గూర్చి తెలుపే ఘట్టములోనిది.

"అధమజాతి యున్నతస్థితి యెఱుగునే"
(ఆంధ్ర మహాభారతం - శాంతిపర్వము-తృ.ఆ. 96 వ.)

ఒక మునీశ్వరుడు ఒక కుక్కను ప్రేమగా పెంచుకొనెను. ఆ ముని కేవలం కుక్కనే గాక ఇతర జంతువులను సైతం ప్రేమతో గౌరవించెను. కుక్క మునీశ్వరుని చూచి దుర్బుద్ధిగలదై, తననితడు కేవలము కుక్కగానే చూచుచున్నాడు గాని, విశేషమైన గౌరవమిచ్చుట లేదని కోపించి, ఎట్లయిన మనీశ్వరుని వధించుటే తగిన దని మనస్సులో తలంచును. ఆ విషయాన్ని తెలిసికొని మునీశ్వరుడు మిక్కిలి బాధతో పై విధంగా పలికెను. నీచ జాతిలో జన్మించిన వారికి, ఉన్నత జాతి జనుల లక్షణాలు అలవడవని పై కథ తెలుపుచున్నది. శూద్రజాతి అనిన ఎంతటి చులకన భావముండెనో పై వాక్యము తెలుపుచున్నది.

"మహత్ములు హీన కులజాతుల నాదరింతురే"
(ఆంధ్ర మహభారతం-కర్ణపర్వము-ప్ర.ఆ. 307 వ.)

భార్గవరాముడెన్నియో దివ్యాస్త్రములను కర్ణునకొసంగెను. కర్ణుని రూపు చూచిన అతని జన్మ గొప్పదను భావము కలిగెను. గావున అట్లు యిచ్చెను కాని హీనకులజుడైనచో అతడివ్వడని సంజయుడు తెలిపెను. కులము, జాతివివక్షణ మహాభారత కాలములో మిక్కుటముగానున్నదనుటకు, ఆ భావము హిందూ సమాజములో వేళ్లూనుకొనిపోయినదనుటకు నిదర్శనముగా పై వాక్యమును పేర్కొనవచ్చును.

"కులహీనులు మాననీయులు గారు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 97 వ.)

తాను పెంచిన కుక్క తనకే ఎంత నష్టం చెయ్యాలని తలచిందో తెలిసికొని విచారించుచు మునీశ్వరుడు పై విధంగా పలికెను. కులహీన్నునకు గుణహీనత్వము

అబ్బునుగాని, గౌరవనీయుడు ఎన్నడును కాలేడని భావం. కులహీనుడైన వానిని గూర్చి ఎంతటి నీచమైన అభిప్రాయముండెడిదో పై వాక్యము తెలుపుచున్నది.

"ఎందేవి హీనబుద్ధులు విమోహింతురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 347 వ.)

హనుమంతుడు భీమునితో పైవిధంగా పలికెను. ఏ కార్యానికైనను గొప్ప వారు చేయుటకు తలపెట్టినపుడు, హీనబుద్ధులు వారిని అనవసరంగా అవహేళన చేసెదరు. కార్యాన్ని నెరవేర్చదలచినవారు విమర్శలను లెక్కించక పట్టుదలతో కార్యాన్ని నెరవేర్చుటకై ప్రయత్నించెదరు.

ఇప్పుడు వివిధ వృత్తులలో ఉన్నవారికి సంబంధించిన సామెతలను పరిశీలించెదము.

*2. వృత్తులను తెలుపు సామెతలు ప్రత్యేకంగా లేకపోయినప్పటికి ఆయా వృత్తులకు సంబంధించిన సామెతలు సంప్రదాయ సాహిత్యములో కొన్ని కనిపించును. వానిలో ముఖ్యమైన వృత్తులకు సంబంధించిన సామెతలను పరిశీలించెదము.*

## 1. వ్యవసాయ వృత్తికి సంబంధించిన సామెతలు :

వ్యవసాయ వృత్తి చేసేవారికి సారవంతమైన భూమితోపాటు వ్యవసాయం చేయడానికి తగిన పనిముట్లు కావలెను. వారికి గోవు ప్రధానమైన జంతువు. భారతీయ జీవన విధానములోనే గోవునకు ఒక పవిత్రమైన, ప్రత్యేకమైన స్థానం కలదు. ఆవు ఇచ్చే పాలుమానవునికి ఎంత అవసరమో, వ్యవసాయం చేయడానికి ఎద్దులు కూడా అంతే అవసరం.

"వర్షంబు లేకున్న ధాన్యంబులగునె"
(ఆంధ్ర మహాభారతం-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 31 వ.)

వర్షం లేకున్న యెడల విత్తినను పంట పండదు. ఏ కార్యానికైనను పురుష ప్రయత్నంతోపాటు దైవసహాయం కావలెనని భావం.

"పావ వ్యవసాయముల చెయ్యుల్వర్థవంతములగునె"
(ఆంధ్రమహాభారతము-ఆదిపర్వము-పం.ఆ. 176 వ.)

ఇచ్చట వ్యవసాయమనగా 'పని' అని అర్థము. దుర్యోధనుడు భీముని చంపు టకు ఎన్నిమార్లు ప్రయత్నించినప్పటికిని వ్యర్థమగును. చెడుపని చేయువాఉ ఎన్నడు కూడా సత్ఫలితములను పొందలేరనీ, విజయాన్ని సాధించలేరనీ పై వాక్యము తెలుపుచున్నది.

"కొమ్మలు దున్మ మోడ్పడు భూరుహముబోలె"
(ఆంధ్ర మహాభారతము-స్త్రీ పర్వము-ప్ర.ఆ. 4 ప.)

కొమ్మలు నరికివేయబడిన వృక్షము వ్యర్థమైంది. శత పుత్రులను కోల్పోయిన దృతరాష్ట్రుడు కొమ్మలు నరికివేయబడ్డ వృక్షంవలె కన్పించెను. అనగా సంతానమంతా నశించిపోగా దృతరాష్ట్రుదు బ్రతుకు వ్యర్థమని విచారించెనని భావం.

"ఆబోతు బులిగొని నంబసులు వాఱుపోలికి"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 371 ప)

అర్జునుడు బలవంతుడైన కర్ణుని నొప్పింపగనే కౌరవసైన్యం కకావికలై పారిపోయింది. పులి ఆబోతును చంపగానే, పసులు వాటంతటవే పారిపోవును. అట్లె అచట ఉన్న కౌరవ సైన్యముకూడా పారిపోయెనని భావం.

"పెనురొంపిలోపలను బ్రుంగినధేనువు నెత్తిపోలికిని"
(ఆంధ్ర మహాభారతం-శల్యపర్వము-ప్ర.ఆ. 153 ప.)

సైన్యాన్ని, బంధువులను ఎందరినో కోల్పోయిన దుర్యోధనుని గౌరవాన్ని నిలుపువాడన్నట్లుగా శల్యుడు కౌరవ సేనాధిపతిగా ఉండుటకు ఒప్పుకొనెను.బురదలో చిక్కుకున్న ఆవును పైకి ఎత్తినట్లుగా, శల్యుడు సేనాధిపతిగా ఉండుటకు అంగీక రించి దుర్యోధనుని గౌరవాన్ని కాపాడెను. గో, బ్రాహ్మణులను కాపాడుట సర్వ శ్రేష్ఠమని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి.

"సర్వజన రుచికరంబైన యాహారంబు రోగాతురునకు నరుచికరంబైనయట్లు"
(ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వము-ప్ర.ఆ. 58 వ.)

విదురుడు దృతరాష్ట్రుని గూర్చి ధర్మరాజాదులతో పై విధంగా పలికెను. అందరకు రుచికరమైన ఆహారము ఏ విధంగానైతే రోగికి సహింపదో, అట్లే మంచి సలహాలు కూడా ధృతరాష్ట్రుని చెవి సోకలేవని భావం.

"ప్రమాని మొదలి వల్మీకము ప్రమానిజెఱచునట్లు"
(ఆంధ్ర మహాభారతం-సభాపర్వము-ద్వి.ఆ. 144 ప.)

చెట్టు మొదటనున్న వల్మీకం (పుట్ట) చెట్టునే చెఱచునట్లు అల్ప మానవుని వలన అధికునకు అవమానం సంభవించును. అల్పమానవులైన పాండవులచేతను అవమానాల పాలయితినని దుర్యోధనుడు ధృతరాష్ట్రునితో మిక్కిలి బాధతో చెప్పెను.

"చవుటబెట్టిన విత్తుల చందమొంది యంకురింపక చెడిపోయె"
(ఆంధ్ర మహాభారతం-ఉద్యోగపర్వము-తృ.ఆ. 76 ప.)

అర్జునుడు శ్రీకృష్ణునితో రాయబార సమయమున తన అభిప్రాయాలను తెలుపుచు పై విధంగా పలికెను. విత్తనాలు సారవంతమైన భూమిలోనే మొలకెత్తుతాయి. ఇప్పటికైనను అతడు మాతో సఖ్యముగా ఉన్నయెడల దుర్యోధనుని తప్పిదాలను సహించెదమని అర్జునుడు శ్రీకృష్ణునితో పలికెను. చవుట పెట్టిన విత్తులు అంకురింపనేరవనునది నిత్యసత్యము.

"అబోతు బెబ్బులికగ్గమైన పగిది"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 7 ప.)

మహావీరుడైన కర్ణుడు పాండవ సైన్యంతో పోరాడుచు వ్యాకుల పరచుచుండెను. అయినప్పటికిని అర్జునుని చేతిలో అతడు చనిపోవలసి వచ్చెనని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను. ఏ విధంగానైతే అబోతు బెబ్బులి చేతికి చిక్కి నశించునో, అట్లే కర్ణుడును అర్జునుని చేతిలో సమసెనని సంజయుడు ధృతరాష్ట్రునితో తెలిపెను.

"ఆలలోని యాబోతును బోలె"
(ఆంధ్ర మహాభారతం-కర్ణపర్వము-ప్ర.ఆ. 18 ప.)

సంజయుని ద్వారా కర్ణుని మరణాన్ని విని ఇంద్రునైనను జయింపగలిగిన కర్ణుడెట్లు చనిపోయెనని ధృతరాష్ట్రుడు విలపించెను. కర్ణుడు కురుసైన్యములో ఆవులలోనున్న అబోతు వంటివాడనీ, అట్టివాని మరణమేవిధంగా యుద్ధంలో జరిగెనని మిక్కిలి విచారించెను.

"గోవులలో జొచ్చు సింగంబొక్కొనానట్లు"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-ద్వి.ఆ. 138 ప.)

అభిమన్యుని మరణమునకు ధర్మరాజు దుఃఖించుచు, అతని పరాక్రమాన్ని

స్మరించుకొనెను. గోవుల మందలో చొరబడే సింహమువలె మిక్కిలి బలవంతుడైన అభిమన్యుడు ఎట్లు నశించెనోయని బాదపడెను. సింహము శౌర్యానికి ప్రతీక.

"బలుగాలింగూలు తరువు పోలిక"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-తృ ఆ. 147 వ.)

విందానువిందులు ఒకే రథంపై వచ్చి అర్జునుని ఎదిరించగా అర్జునుడు విందుని సంహరించెను. బలమైన గాలిచే పడిపోయే తరువువలె అతని తలను చూచి అనువిందుడు మిక్కిలి కోపమునకు వచ్చెనని సంజయుడు ధృతరాష్ట్రునితో తెలిపెను. బలమైన గాలికి ఎంతటి పెద్ద వృక్షమైనప్పటికిని పడిపోవును. అట్లే అర్జునుని ఎవ్వరును ఎదిరించలేరని, యుద్ధములో అతని శత్రువులెవరైనను అపజయము పాలవుతారని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను.

"పంకనిర్మగ్నమైన గోవునుంబోలె"
[ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-తృ.ఆ. 272 వ.)

భీష్మునిచే బాధింపబడిన సైన్యం బురదలో చిక్కుపడిన గోవువలె ఉన్నదని ధర్మరాజు భావించెను. బురదలో చిక్కుపడ్డ గోవు బయటకు రాలేక ఎట్లయితే బాద పడునో అట్లే పాండవ సైన్యం సయితము బాధ పడుచున్నదని ధర్మరాజు విచారించెను.

"గోపక హీనమైన గోప్రతతి విధంబు"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-ప్ర.ఆ. 17 వ.)

సతికి పతి బ్రతికి ఉన్నంతవరకే గౌరవము ఉంటుంది. పతిని కోల్పోయిన స్త్రీ ఎట్లు గౌరవాన్ని కోల్పోయి కళావిహీనం అవునో అట్లే భీష్ముని కోల్పోయిన కౌరవ సైన్యమంతయు కళావిహీనమయ్యెను. 'అనాథ' అనునది పై అర్థాన్నే సూచించును. కాపంలేని గోవులవలె సైన్యమున్నదని తెలుపుట వలన సైన్యానికి కూడా రక్షణ లేకుండాపోయెనని భావం.

"సస్య విధురస్థితియైన ధరిత్రి చాడ్పు"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-ప్ర.ఆ. 16 వ.)

పంటలు లేని భూములు బీడులుగా ఉండును. కౌరవ సైన్యముయొక్క దీన స్థితిని తెలిపే సన్నివేశం లోనిది. భూములు బీడులుగా ఉన్నట్లయితే వ్యవసాయ దారునకు నష్టం కలుగును.

"వృషభము పజ్జనడచు గోవుల పగిదిన్"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-ప్ర.ఆ. 66 ప.)

భీష్ముని తర్వాత కౌరవసైన్యానికి అధిపతిగా ఉండవలసిందిగా దుర్యోధనుడు ద్రోణుని ప్రార్థించును. తాము, అతనివెంట వృషభము వెంటవుండే గోవులవలె ఉండెద మని తెలిపెను. వృషభము వెంట గోవులుండుట చాలా సహజం.

"బెడిదంపు గాలితూలు తరువుల కరణి"
[ఆంధ్ర మహాభారతం-కర్ణపర్వము-ద్వి.ఆ. 216వ.]

భీముని బాణాలచే కర్ణుడు మిక్కిలి గాయపడెను. దుర్యోధనుని అనుజచే కృతవర్మాది వీరులు భీముని ఎదిరించి నసిరి. వారందరును గాలిచే తూలు చెట్లవలె నశించిరని సంజయుడు దృతరాష్ట్రునితో తెలిపెను. గాలిచే చెట్లు పడిపోవుట సహజం.

"విత్తు సహకారిగాకున్న రిత్తనేల
వంధ్యమగుగాక తా ఫలవంతమగునె"
(ఆంధ్ర మహాభారతము-ఆనుశాసనిక పర్వము-ప్ర.ఆ. 136 ప.)

అట్లే

"పౌరుషంబు దైవంబుతోడ్పాటులేక
ఫలము బొందగనేరదు"
(ఆంధ్ర మహాభారతము-ఆనుశాసనికపర్వము-ప్ర.ఆ. 136 ప)

భీష్ముడు ధర్మరాజునకు దైవ,పౌరుషంబుల తెరంగు ఎరిగించు ఘట్టంలోనిది.

సరియైన విత్తనము లేకున్న యెడల ఎంత సారవంతమైన భూమియైనప్పటికి వ్యర్థమగును. అట్లే పౌరుషానికితోడు దైవబలమున్న యెడల వ్యక్తి విజయాన్ని పొందగలడు

"గోవుతో పెరిగెడు కొమ్ములట్లు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 375 ప)

జనకునికడకు మాండవ్యుడు వచ్చి ధర్మసూక్ష్మలను గూర్చి తెలుపుమని ప్రశ్నింపగా జనకుడు సంపదలలో, కష్టములలో ఒకేరీతిగానుండి దేనిపై మమత్వాన్ని పెంచుకొనకపోవుటే నిజమైన ధర్మమని పేర్కొనెను. ఏవిధంగానైతే గోవునకు కొమ్ములు పెరుగుట సహజమో, అట్లే మానవునకు సుఖదుఃఖాలు, కష్టనష్టాలు సహజమని పేర్కొనెను.

"పొటనిడినవిత్తునుబోలనై వెడు"
(ఆంధ్రమహాభారతము-అనుశాసనికపర్వము-తృ.ఆ. 181 ప)

భీష్ముడు ధర్మరాజునకు పితృపూజా విధానము తెలుపు సట్టంలోనిది.

మంచిగుణాలేమిటో తెలిసినను, దుర్మార్గుడు వానిచే ఏమాత్రం లాభాన్ని పొందలేడు. ఏవిధంగానైతే చవిటినేలలో విత్తనాలు మొలకెత్తవో, అట్లే సద్గుణాలు దుర్మార్గునికంటలేవని భీష్ముడు ధర్మజునకు తెలిపెను. చవిటినేలలో పంట పండదని అందరికి తెలిసిందే.

"దారువుల సగ్నియున్న చందంబున"
(ఆంధ్ర మహాభారతం-అశ్వమేధపర్వము-ద్వి.ఆ. 96 వ)

రెండు ఎండుపుల్లలను గట్టిగా రాపిడిచేయగా దానిలోనుండి నిప్పువచ్చినదని మొదట నిప్పును కనిపెట్టినవారు తెలిసికొనిరి. కావున అగ్ని అనేది దారువులలో ఉన్నదన్నది నిజం. ఎట్లయితే దారువులలో అగ్నినిక్షిప్తమై ఉండునో అట్లే అభిమానము గొప్పవారిలో నిగూఢంగా ఉండునని భావం.

"కొమ్ములుడునిసిన వృషభముచందము"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 162 ప)

"దృష్టద్యుమ్నుడు కృపాచార్యునితో పోరాడి అతని ధనువును విరిచెను. ఆదృశ్యం కొమ్ములుడునిసిన వృషభమువలె ఉండెను. వృషభంయొక్క పౌరుషం కొమ్ములలోనే వుండునని భావం".

"చండపవనపతితంబగు పాదపంబు చందంబు"
(ఆంధ్ర మహాభారతం-స్త్రీ పర్వము-ప్ర.ఆ. 8 ప)

సుడిగాలిచే పడిపోయిన మహావృక్షంవలె ధృతరాష్ట్రుడు కుమారుల మరణవార్త సంజయునిచేవిని కుప్పకూలెను. తనకు ఉన్న సర్వస్వము నశించెనని బాధపడుచు సుడిగాలిచే పడిపోయిన వృక్షమువలె ఆయెను.

"జనుడజ్ఞానమునన్ భుజించినజుగుప్సంబైనయన్నంబు
సయ్యనవెళ్లించి పవిత్రుడైనగరి"
(ఆంధ్ర మహాభాగవత ౧-ప.స్కం. 93 ప)

శివుడెంత వద్దన్నను సతీదేవి యజ్ఞానికి వెడలును. అచ్చట తన తండ్రియైన దక్షునిచే అవమానింపబడును. ఎప్పుడు తనకూతురునేగాక శివునిసైతం అవమానించెను. భర్తకు జరిగిన అవమానాన్ని భరించలేక, సతీదేవి తన శరీరాన్ని త్యజించుటకై నిశ్చయించుకొనును. ఏవిధంగానైతే జనుడు అజ్ఞానంచే అసహ్యకరమైన అన్న మును భుజించి, తనతప్పును తెలిసికొన్న పిదప తానుతిన్న భోజనాన్ని కక్కిన విధంగా, తన శరీరాన్ని త్యజించుటకే సతీదేవి నిశ్చయించుకొనెను. ఎందుకనగా ఆ శరీరధారియైన తాను శివనిందను వినుటయే.

"కారుకారునదున్నెడు క్షేత్రంబులావుచెడు"
(ఆంధ్ర మహాభాగవతము—స.స్కం. 419 వ)

క్షేత్రము ఎంత సారవంతమైనను, దానిని దున్నకుండా కొంతనైనా విశ్రాంతిని ఇచ్చుట అవసరం. అట్లు కానిచో సారవంతమైన క్షేత్రం నయితము చెడిపోవును. నారదుడు ధర్మజునకు వర్ణాశ్రమ ధర్మాలగూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. నిరంతర విషయానురక్తుడు ఏ ఫలాన్ని పొందలేడని వివరించెను. కాలాన్ననుసరించి ప్రవర్తించువాడే సత్ఫలితాలను పొందునని తెలిపెను.

## 2. వైద్యవృత్తికి సంబంధించిన సామెతలు :

గొప్పవైద్యుడు భగవంతునితో సమానమని చెప్పవచ్చును. వైద్యోనారాయణో హరిః అనునది ఆర్యవాక్యం. వ్యవసాయవృత్తి తర్వాత ప్రధానమైనది వైద్యవృత్తి.

"రోషహృదయముచేతను ననయములోకమునశియించు
నౌషధములచే ఘనరోగములు నశించిన యనువున"
(ఆంధ్ర మహాభాగవతం - చ.స్కం. 361 వ.)

ధృవునిచే నిరపరాధులైన గుహ్యకులు చావపడిరి. ఆ సమయాన అతని పితామహుడైన స్వాయంభువువచ్చి రోషము సజ్జనునకు పనికిరాదని తెలుపును. రోషహృదయంచే లోకములు నశియించును. ఔషధములచే రోగములు నశించునట్లు, రోషముచే వ్యక్తిలోని గొప్పదనమును నశించును. కావున సజ్జనునకు కోపమెన్న డును పనికిరాదని తెలిపెను. ఇది నిత్యసత్యము.

"రోగిపధ్యాశనమునకుంజారనిధింగి"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 33 ప)

కర్ణుని మరణవార్త విని, మిక్కిలి దుఃఖపడుచు ధృతరాష్ట్రుడు సంజయునితో పైవిధంగా పలికెను. తనకుమారునకు జయము లభించుటకు వీలులేదనీ, దర్మరాజు ఎన్నిసార్లు శాంతిసందేశాన్ని పంపినప్పటికి దుర్యోదనుడు తిరస్కరించుట వినాశ హేతువేనని ధృతరాష్ట్రుడు బాధతో పలికెను. రోగికి పథ్యమిష్టములెనట్లే, శాంతివచనాలు దుర్యోధనుని చెవిసోకవని బాదపడెను.

"దుర్మాంసముగోయు వైద్యునిక్రమమున"
(ఆంధ్రమహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 379 వ)

కౌరవులలో ప్రత్యేకించి దుర్యోధనుడు, అతని మిత్రులుచేసిన పరాభవాన్ని రాయబారసమయంలో కృష్ణుడు వారికి కంసవధ ఘట్టాన్ని వివరించెను. చెడ్డవారిని సంహరించుటలో దోషములేదనియు, చెడుమాంసాన్ని కోసివేసే వైద్యుని వలె పవిత్రమైన చర్య అనియు పలికెను. బహుశః అప్పటికే సర్జరీ విషయము వారికి తెలిసి ఉంటుంది.

"రోగికి పథ్యాహారంబు లలకంటగించునట్లు"
(ఆంధ్ర మహాభారతము—ఉద్యోగ పర్వము-ద్వి.ఆ. 89 వ)

విదురుడు ధృతరాష్ట్రునితో పైవిదంగా పలికెను. రోగికి పథ్యాహరము ఎట్లు సహించదో అట్లే సద్వాక్యము దుర్యోధనుని తలకెక్కదని పలికెను.

"ఆహార దోషము విజ్ఞాన నాశనమునకు మూలము"
(ఆముక్తమాల్యద-చ.ఆ-194 వ)

శరీరం ఆరోగ్యంగా ఉన్నప్పుడే మనసు సైతం ఆరోగ్యంగా ఉంటుంది. ఆరోగ్యకరమైన శరీరానికి సరియైన ఆహారం అవసరం-సరియైన ఆహారం లేకున్న యెడల శరీరమే కాక మనస్సుకూడ లోపభూయిష్టమగునని భావం-కాబట్టి ఆహార దోషం విజ్ఞాన నాశనానికి మూలమగును. ఒక మంచి పనిని సజ్జనుడే చేయగలడు కాబట్టి అతడు ఆరోగ్యవంతుడు కావలెనని దానికి తగిన భోజనాన్ని కూడ చేయవలెను. "అన్నంపర బ్రహ్మ స్వరూపమ్" అనునది ఆర్యవాక్యము.

### 3) బోయ(వేటాడు) వృత్తికి సంబంధించిన సామెతలు :

వేటాడే వృత్తి కలవారిని సామాన్యంగా బోయలు అనెదరు. ఏ వ్యక్తికైనను ధర్మప్రవృత్తి ఉన్న యెడల సాయుజ్యం లభించునని ధర్మశాస్త్రాలు తెలుపుచున్నవి.

"జీవహింస జీవనంబుగ నడచుట శిష్టపథమె"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ-31 వ)

ధర్మవ్యాధునితో కౌశికుడు పై విధంగా ప్రశ్నించెను. కాని ధర్మవ్యాధుని వృత్తి లక్షణం, ప్రవృత్తి లక్షణం వేరు వృత్తికన్న, ప్రవృత్తియే ముఖ్యమైనదని ధర్మవ్యాధుడు తెలిపెను.

"వేటాడుట" అనునది ప్రకృతిలోనే ఉన్నది. బలమైన ప్రాణులు బలహీనమైన ప్రాణులను వేటాడుట ప్రకృతి సహజం.

"నాలుకలు గ్రోయు భూరిపన్నగము పాతబడిన యెలుకను భక్షించుపగిది"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం-729 వ)

సర్గాదిని బ్రహ్మనిజనందనులకు తెలిపిన శ్రీహరి స్తోత్ర విధానాన్ని "రుద్రగీత"లో తెలుపుచు, బ్రహ్మ శ్రీహరి మహాత్మ్యాన్ని వర్ణిస్తూ పై విధంగా పలికెను.

ఏ విధంగానైతే పాముచే నోటబడిన ఎలుక ప్రాణాన్ని పోగొట్టుకొనుట ఎంత సహజమో, అట్లే సమస్త జీవరాసులు సైతం తమ ప్రాణాలను కోల్పోవుట అంతే సహజం.

"గుహకుండగు లుబ్ధకుగని, గహనంబున బాలుకైవడి"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం-474 వ)

ప్రజల బాధలను చూచి వేనుడుకోపోద్రిక్తుడై బాణధారియై గోరూపంలో ఉన్న భూదేవిని పట్టుటకై వెంటాడెను. అప్పుడామె లుబ్ధకుని చూచి పారిపోయే హరిణమువలె కనబడెను-వేటగాని చూచినంతనే హరిణము పారిపోవుట సహజం. అదే విధంగా బలవంతుడైనవాని చూచి బలహీనులు పారిపోవుట సహజం.

"సర్పభీతి చేదలంగు మూషికములకైవడి"
(ఆంధ్రమహాభాగవతము-చ.స్కం—410 వ)

వేనుని పట్టాభిషేక వార్తను విని సమస్త తపస్కులు మిక్కిలి భయంతో పారిపోయిరి. పాము భీతిచే తొలగిపోయే ఎలుకలవలె వారందరును దేశము నుండి పారిపోయిరని తెలుపుటవలన వేనుడు ఎంతటి దక్షుడో తెలియుచున్నది.

"తార్క్ష్యుడహీంద్రుని పట్టుగైవడిన్"
(ఆంధ్ర మహాభాగవతము—తృ.సం. 677 ప)

తనపైకి వచ్చే హిరణ్యాక్షుని, హరి "గరుత్మంతుడు పామునుపట్టుకొనినట్లుగా" పట్టుకొనెనని కవివర్ణించెను. గరుడునిచే చిక్కినపాము బ్రతకనట్లే, అతడును విగతజీవుడగునని భావం.

"బెబ్బులికొదమలేడి పొదవినమాడ్కిన్"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-చ.ఆ. 121 ప)

సాత్యకి విల్లునుద్రుంచి, అతనిని పట్టిన విధానం బెబ్బులి లేడినిపట్టిన విధంగా ఉన్నదని సంజయుడు ధృతరాష్ట్రునితో తెలిపెను. బెబ్బులి పిడికిలిలోనున్న లేడి తన ప్రాణాలకై విలపించునట్లు సాత్యకికూడ విలవిలలాడెనని భావం.

"పులికి పసులు వాఱినక్రియ"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 80 ప)

"పసులు పులికిం దాఱు లెఱంగున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 156 వ.)

సాత్యకిని చూచి కౌరవ కుమారులు పులినిజూచి పారిపోయే పశువులవలె పరుగిడిరని సంజయుడు ధృతరాష్ట్రునితో తెలిపెను.

"ఎరకు బెనంగుదేగల చందంబున"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-తృ.ఆ. 268 ప.)

అలంబుస, ఘటోత్కచుల పోరాటము డేగల పోరాటమువలె ఉండెను. ఇద్దరును సమబలులై చాలా భయంకరముగా పోరాడిరని భావము.

"సుపర్ణుగనిన భుజగములక్రియన్"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనికపర్వము-ద్వి.ఆ. 108 ప)

సుపర్ణుడనిన గరుత్మంతుడు. గరుత్మంతుని చూచి పాములు భయపడి పారిపోవు విధంగా తలపై గంగాజలాన్ని చల్లుకొంటే పాపాలు తొలగిపోవునని భీష్ముడు ధర్మజునకు గంగా ప్రభావాన్ని వివరించే సందర్భములో పలికెను.

"అచలతటంబునకు లంఘించు సింగంబుచందంబున"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 317 వ)

కర్ణునికోరికపై శల్యుడు సారధిగా అతని రథంపై అధిరోహించిన విధానం కొండపైకి లంఘించు సింహామువలె నుండెను. శల్యునకు కర్ణునిపై సదభిప్రాయం లేదనే భావాన్ని తెలుపుచున్నది.

"కుంభనిక్షిప్తభు జగంబు చందంబున"
(ఆంధ్ర మహాభారతం-కర్ణపర్వము-ప్ర.ఆ. 139 వ)

కుంతికిచ్చిన మాటననుసరించి కర్ణుడు, నకులుడు తనచేతచిక్కినను సంహ రింపకు డెను. అతని రథాన్ని మాత్రమే కూల్చివేసెను. నకులుడు మిక్కిలి అవ మానింపబడ్డట్టుగా బాదపడెను. కుండలోదాగుకొనిన పాముపలె అతని శరీరంలో అవమానం అణిగిఉండెను. అవకాశం వచ్చినపుడు ఎదురుదెబ్బ తీయుటకే నిశ్చయించు కొనెననే భావాన్ని తెలుపుచున్నది. పాము కుండలో ఉండుట క్షేమకరముకాదుకదా.

"మృగేంద్రుబారిజొచ్చిన కరివోలె"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-వ.ఆ. 263 వ)

సాత్యకి సోమదత్తుని కుమారునకు చిక్కువడెను. ఆచిక్కుపడిన విధానం సింహముచేచిక్కిన ఏనుగువలె నుండెనని బాధపడుచు, అతనిని కాపాడవలసినదిగా కృష్ణుడు అర్జునుని కోరెను.

"లేళ్లగమింజూచి పొంగుసింగంబుచందంబున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 142 వ)

సైంధవున్ని చంపుటకై అర్జునుడు వెడలునప్పుడు అతనికి అడ్డుగా దృత రాష్ట్రుని కొడుకులు అందరును నిలిచిరి. లేళ్లను చూచి గర్వంతో పొంగిపోయే సింహంవలె, అర్జునుడు వారిని అందరిని కకావికలు చేసెనని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను.

"పసులు పులికింబాలు తెలుంగున్"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-చ.ఆ. 155 వ.)

ద్రోణుడు భోజ, కాంభోజ సైన్యములను ఎదిరించుచు, కౌరవ యోధులతో

పోరాడే అర్జునుని చూసి సింహనాదం చేయగా అచటనున్న సైన్యాలు పులిని జూచి పారిపోయే జంతువులవలె చెల్లాచెదురై పోయెను. 'పసులు పులికింవాఱు తెఱగున'అను దానిని సామెతగా ప్రయోగించవచ్చును.

"తాతికి బైకొనియడరి తగరు దెరలిన మాడ్కిన్"
(ఆంధ్రమహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 255 వ.)

వికర్ణుడు నకులునితో యుద్ధం చేయుట కొండతో పొట్టేలు ఢీకొన్నట్లు ఉండె ననీ, వికర్ణుడు అతనిని ఎదిరించలేకపోయెనని సంజయుడు దృతరాష్ట్రునితో పలికెను. 'కొండతో పొట్టేలు ఢీకొన్నట్లు'నునది సామెత.

"పెక్కుబోతులు ఒక్క పులింజుట్టుముట్టిన చందంబున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ద్వి.ఆ. 94 వ.)

పద్మవ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుని పెక్కుమంది రాజులు, పెక్కు ఆబోతులు పులిని చుట్టుముట్టినట్లు చుట్టుముట్టిరి. ఎన్ని ఆబోతులు పులిని చుట్టుముట్టి నను అవి పులితో సమానము కావు. అట్లే రాజులు ఎందరున్నను, అతనిని ఎదిరించినప్పటికిని, అభిమన్యుని బలానికి సరిరారని భావం.

"అంబోధిసొచ్చు కరటి (ఏనుగు) పోల్కి"
(ఆంధ్రమహాభారతము-ద్రోణపర్వము-ద్వి.అ. 270 వ.)

అభిమన్యుని మరణాన్ని విని అర్జునుడు మిక్కిలి దుఃఖించును. ధర్మరాజు అతనిని సాంత్వనపరచుచు, అతడు పద్మవ్యూహంలో చొరబడిన విధానాన్ని వివరించుచు, సముద్రంలో ప్రవేశించే ఏనుగువలె అతడు సైన్య సముద్రంలో ప్రవేశించెనని వర్ణించెను.

"సింగంబు వొదివిన కురంగంబు కాచుచందంబున"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-తృ.ఆ. 126 వ.)

ధృష్టద్యుమ్నుని సాత్యకి రక్షించిన విధానం సింగముచేత పొదగబడిన లేడిని బ్రతికించిన విధానమువలె నున్నదని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను. ద్రోణాచార్యుడు భీకర యుద్ధంచేసి, పాండవ సైన్యాలను, వీరులను నొప్పించు సమయమున సాత్యకి ధృష్టద్యుమ్నుని రక్షించుట పై విధంగా ఉన్నదని సంజయుడు నుడివెను.

"పాము బొదివి పడదిగిచిన చీమలగములట్లు"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-ప్ర.ఆ. 85 వ.)

ద్రోణున్ని బహుదేశ సైన్యాలు పరివేష్టించుట, చీమలు అన్నియు కలిసి పామును పొడిచి బాధించినట్లుగా ఉండెనని కవి వర్ణించెను. 'బలవంతమైన సర్పము చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ' అని సుమతీ శతకకారుడు నుడివెను.

"సింగములబట్టి వేటాడు భంగిగాదె"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 175 ప.)

దృతరాష్ట్రునితో భీష్ముడు కర్ణుని దుర్ణయమును గూర్చి పలుకుచు, పాండవుల పరాక్రమ మెట్టిదో తెలిపెను. ఎవ్వరైనను సింహములను వేటాడరు. వేటాడుటకై ప్రయత్నించినచో వేటాడిన వారికే నష్టమగును కాని సింహములకు నష్టము వాటిల్లదు. అట్లే పాండవులతో వైరం పనికిరాదను భావం. బలవంతులతో వైరం ఎవ్వరికిని పనికిరాదు.

"బెబ్బులియున్న పొదఁ జొచ్చు లేడిచందంన"
(ఆంధ్రమహాభారతము-విరాటపర్వము-ద్వి.ఆ. 112 ప.)

సుధేష్ణచే నియోగింపబడినదై వెడలు ద్రౌపది పులి పొదలో ప్రవేశించే లేడి చందాన ఉన్నదని కవి వర్ణించెను. పులివద్దకు లేడికూన వెడలినచో ఏ విధంగానైతే ప్రాణాన్ని కోల్పోవునో, అదేవిదంగా కీచకుని మందిరంలో ప్రవేశించే అందమైన స్త్రీ సహితము శీలమును కోల్పోవునని భావం.

"వాలుపై నడచునట్లు"
(ఆంధ్ర మహాభారతము- ఆదిపర్వము-ద్వి.ఆ. 154 ప.)

వాసుకి సోదరిని జరత్కారుడు వివాహం చేసికొనును. అతన్ని మెప్పించుటకై ఆమె వాలుపై నడచిన విధంగా ప్రవర్తించెననగా ఆమె ఎంతో జాగ్రత్తగా మసలెనని భావం. కత్తి అంచుపై ఎవరును నడువలేరు. అంటే అతన్ని మెప్పించుట సులభం కాదని భావం. "కత్తిపై సాము" అనే సామెతకు రూపాంతరమై ఉంటుంది.

"అక్షణను యేసిన యమ్ము నుంబోలె"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 304 ప.)

ఈశ్వరుడు కిరాతుని వేషంలో అర్జునుని తపోభూమి వద్దకు వచ్చిన సంధర్భం లోనిది. ఏ విధంగా అప్పుడే వేసిన బాణం వేగంగాను, వాడిగాను ఉండునో అట్లే సూకరమర్జునుని సమీపించెనని బాణము.

"హరిణమేలంబు గనిన సింగంబు విధమున"
(ఆంధ్ర మహాభారతం-కర్ణపర్వము-తృ.ఆ. 179 వ.)

శల్య సారధ్యంలో కృప, కృతవర్మాది వీరుల సహాయంతో కర్ణుడు అర్జునుని ఎదిరించును. అప్పుడు అర్జునుడు జింకల సమూహంపై పరుగెత్తే సింహమువలె తోచెను. అనగా సింహం చేతిలో హరిణములు ఎట్లు నశించునో, అట్లే అర్జునుని వలన కౌరవ సైన్యం నశించెనని భావం.

"ఉరగ నికరంబునకు గవియుగరుడునికైవడి"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 155 వ.)

కర్ణుడు ససైన్యుడై అర్జునునిపై యుద్ధానికి వెడలెను. అప్పుడు అర్జునుడు పాముల సమూహాల చెండాడుటకై సిద్దపడిన గరుడునివలె అచటనున్నవారికి తోచెనని కవి వర్ణించెను. పాములు ఎన్ని ఉన్నప్పటికిని గరుడునివలన నశించునవే. అట్లే కౌరవసైన్యము ఎంత పెద్దదైనప్పటికి అర్జునుని చేత సమసిపోవలసిందేనని భావం.

"బెబ్బులిలేడి కొడమంబొడువు పోలిక"
[ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 205 వ.)
భీముడు దుశ్శాసనునిపై గదాయుద్ధమొనరించిన రీతి పై విధంగా ఉండెను.

"జలచరమామిషంబుగొను పోలుపు"
(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 102 వ.)

రాత్రి పాండవులను చంపుటకు బయలుదేరే అశ్వత్థామకు శివుడు భూతాకృతితో దోచెను. అశ్వత్థామ ఎన్ని విధములైన ఆయుధాలను ప్రయోగించినప్పటికి అవి వ్యర్థమయ్యెను. జలచరములు ఏవిధంగానైతే తనకు వేసిన ఎరలను మ్రింగునో అట్లే అశ్వత్థామ ప్రయోగించిన బాణాలన్నియు శివుని మహిమచే వ్యర్థములయ్యెను.

"తుంగమడుగుదుజొచ్చిన మాతంగంబు పగిది"
(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 197 వ.)

రాత్రి పాండవ సైన్యంలో ఉన్న వీరులను, వాహనములను అశ్వాలను, ఏనుగులను అశ్వత్థామ పరిమార్చెను. అతడావిధంగా చేయుట తుంగ మడుగులో చొచ్చిన ఏనుగు మడుగును చిందరవందర చేసినట్లుగా ఉండెను. అతడు పాండవ పక్ష బలాన్ని అంతయు సంహరించెను.

"సతమె శోకించిన వచ్చునె సచ్చిన జంతువు"
[ఆంధ్ర మహాభారతం-శాంతిపర్వము-ప్ర.ఆ. 220 ప.)

'జన్'అనగా పుట్టుట. ఇచ్చట జంతువనగా ప్రాణి అని అర్థము. జనకున కశ్మకుడు సెప్పిన నీతిని వ్యాసుడు ధర్మరాజునకు తెలిపే సన్నివేశంలోనిది. చని పోయినవారెన్నటికిని తిరిగిరారని భావం.

"వజ్రాహతిగూలు పర్వతమునాకృతి"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 100 ప.)

ప్రతివింధ్యుడు చిత్రుడను రాజును చంపిన విధానాన్ని కవి పైవిధంగా వర్ణించెను. 'వజ్రాహతిగూలు పర్వతము' అను వాక్యము ఇంద్రుడు పర్వతముల రెక్కలను నరికివేసిన కథను తెలుపుచున్నది.

"ఆమిషంబునకు వేచుడేగ చందంబున'
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ 257 ప.)

ధర్మరాజు ద్రోణునితో యుద్ధం చేయుటకు ఎందుకు వెడలెనని అర్జునుడు మిగుల చింతించెను. ఆ మిషానికై ఎదురుచూచే డేగవలె ధర్మరాజు కొరకు ద్రోణుడు వలపన్నెననిన సంగతి ధర్మజునకు తెలియదని బాధపడెను.

"సింగంబు గనిన లేడిగమియుబోలె"
(ఆంధ్రమహాభారతము- కర్ణపర్వము-ద్వి.ఆ. 278 ప.)

సింహమును జూచి లేడిపిల్లలు ఎట్లు పారిపోవునో అర్జునుని రథమును చూడ గనే కౌరవ సైన్యము ఆ విధంగా పారిపోయెను.

"డేగ పులుగును గతిగొనుక్రియ"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.అ. 319 ప.)

అర్జునుని బాణం జయద్రథుని శిరమును నరికివేసెను. ఆ దృశ్యము డేగ ఒక పులుగును గైకొన్నట్లుగా ఉండెను. అనగా అంత అవలీలగా అర్జునుడు జయద్రథుని తలను నరికివేసెనని భావం.

"పులిగనిన హరిణకులమునట్లు"
(ఆంధ్ర మహాభారతం-ద్రోణపర్వము-పం.ఆ. 279 ప.)

ద్రోణుని చూచిన పాండవ సైనికులు పులిని చూచిన జింకలవలె పారిపో దొడగిరి. వారిని అందరిని ధృష్టద్యుమ్నాదులు కోపించి ఎదురు నిలిచి పోరాడవల సిందిగా ఆజ్ఞాపించిరి.'పులిగనిన హరిణకులము' పాండవ సైనికులు వారినిగని ఎంత భీతిల్లిరో తెలుపుచున్నది.

"హింససేయనివాడు లేడిజ్జగమున"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-పం.ఆ. 60 వ.)

ధర్మవ్యాధుడు కౌశికునకు అహింసా స్వరూపాన్ని తెలుపుచు పై విధంగా పలికెను. ఏ వ్యక్తియైనను హింస సేయకుండా బ్రతకలేదు. కాని సదాసద్వివేచనా శక్తి గలవాడే గొప్పవాడని భావం.

4. నావికులకు సంబంధించిన సామెతలు :

ప్రాచీన సాహిత్యంలో నావికులకు సంబంధించిన సామెతలు తక్కువగా ఉన్నవని చెప్పవచ్చును.

"కర్ణధారుండు నావచేతంబయోధిగడచు"
[ఆంధ్రమహాభాగవతము-తృ.స్కం. 458 వ.]

సముద్రాన్ని దాటవలెననిన నావ అవసరమని పైవాక్యం తెలుపుచున్నది.

"వరుణుడు నీళ్లచే చెడునె"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 123 వ.)

కర్ణుడు సంశప్తకులవలన అర్జునుడు పడే బాధలను శల్యునకు వివరించగా, శల్యుడు పై విధంగా పలికెను, వరుణుడు వర్షమునకు అధినేత. వరుణుడు నీళ్లచే ఎన్నటికిని చెడిపోడు. అట్లే సంశప్తకులవల్లన అర్జునునకు నష్టమేమియు లేదని భావం. గొప్పవారు తాత్కాలికంగా బాధపడినను, తర్వాత వారి తేజమునకెంత మాత్రము భంగము కలుగదని భావం.

"ఓడతో గట్టిన ఓడవోలె"
[ఆంధ్రమహాభారతము-సభాపర్వం-ద్వి.ఆ. 40 వ.)

శిశుపాలుడు భీష్ముని తూలనాడుచు పల్కికిన మాటలివి. ధర్మరాజు భీష్మునితో సాహచర్యం చేసి చెడిపోయెనని పలుకును. ఓడతో కట్టబడిన మరొక ఓడకు

ప్రత్యేకమైన దారి తెప్పు ఉండదు. అవి మొదటి ఓడనే అనుసరించును. అట్లే ధర్మరాజు సైతం ధర్మవిదూరుడయ్యేనని భావం.

"ఓడలు బండ్లవచ్చు, బండ్లోడలవచ్చు"
[(సారంగధరచరిత్ర) చేమకూర వేంకటకవి-తృ.ఆ. 106 వ.]

కష్టములు వచ్చిన సమయములో ఎంత పెద్దవారైనను తమకంటె చిన్న వారిని ఆశ్రయించెదరనీ, అట్లు ఆశ్రయించుటలో తప్పేమిలేదని భావం.

"సుడిగాడ్పునందొదరి తిడుగుడువడు మొగిళ్లిచాడ్పున"
[ఆంధ్రమహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 268 వ.]

అలంబసుడు, ఘటోత్కచుడు మాయా యుద్ధమున ఆకాశంలో యుద్ధం చేయసాగిరి. వారు సుడిగాలిలో తిరిగే మొగిళ్లవలె ఉండిరని కవి వర్ణించెను. సుడిగాలిలో తిరిగే మేఘాలు నావికులకు ఇబ్బంది కలుగచేయును.

## 5. జాలరివృత్తికి సంబంధించిన సామెతలు:

జాలరివృత్తిని చేయువారు మంచి ఈతగాళ్లు కావలెను.

"ఈతగాడు తీరంబుకనినచందంబు"
(ఆంధ్ర మహాభారతము-అశ్వమేధపర్వము-చ.ఆ. 167 వ)

ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీ మరియు తన అన్నదమ్ములందరిని చూచిన అర్జునుడు మిక్కిలి సంతసించెను. ఈతగాడు ఏవిధంగానైతే తీరాన్నిచూసి సంతసించునో అట్లు అతడు సంతసించెను.

"పటికెదురీవినచాడ్పున"
(మౌసలపర్వము — ఏకాశ్వాసము—98 వ)

సకలయాదవక్షయంతోని స్తేజమై ఉన్నద్వారకను దారుకునితోడుగొని అర్జునుడు చూచి ఏటికెదురీవిన చాడ్పున ఉన్నదని తెలిపెను. ఏటికెదురీదడం వ్యర్థం అదేవిధంగా ద్వారకకూడ మొత్తాన్ని నష్టపోయెనని భావం.

"సరిత్తులు సాగరంబున తెఱంగున"
(ఆంధ్ర మహాభారతము-అశ్వమేధపర్వము-ద్వి.ఆ. 96 వ)

జనకునకు విప్రరూపధరుండైన యమునితో సంవాదము జరుగును. యమధర్మ రాజు జనకుని గుణాలను పరీక్షచేయును. జనకుడు సకలపృథ్వీరాజ్యం, నాకాలోకాధిపత్యంకంటె, గో, బ్రాహ్మణరక్షణమే ముఖ్యమనీ యమునితో పలికెను.

ఏవిధంగానైతే సరిత్తులు సాగరములో సంగమించునో అట్లే సజ్జనులు పరతత్త్వంబును పొందెదరని భావం.

"ఏఱులకు సముద్రమునుబోలె"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-పం.ఆ-623 వ)

ఏఱులకు ఏవిధంగానైతే సముద్రమాధారమో, అట్లే అన్ని శాస్త్రాలకు సాంఖ్య శాస్త్రం మూలమైనదని భీష్ముడు ధర్మజునకు వివరించెను. "నదీనాంసాగరోగతిః" అను ఆర్యోక్తికివి ఆంధ్రానువాదమని పేర్కొనవచ్చును.

"నీళ్ళలోన మీనంబులుపోయెడు త్రోవలెఱుగబోలునె"
(ఆంధ్ర మహాభారతము—శాంతిపర్వము - చ.ఆ. 78 వ)

భీష్ముడు ధర్మరాజునకు అజగరచరితాన్నిగూర్చి తెలుపు ఘట్టంలోనిది. ఏవిధంగానైతే నీళ్ళలోని చేపలు ఏదారిలో ప్రయాణంచేయుట తెలియదో, అట్లే ఆర్యులవిధానాలు ఇతరులు తెలుసుకొనలేరని భావం.

"పొంగిన సముద్రంబు పోలిక"
(ఆంధ్ర మహాభారతము -ద్రోణపర్వము - తృ.ఆ. 157 వ)

పొంగిన సముద్రంవలె ఉన్నకౌరవ సైన్యం తనను ఎదిరించినను చలింపక, అర్జునుడు వారిపై బాణములవేసి నొప్పింపచేసెను. కౌరవసైన్యం అతని తీవ్రబాణాహుతికి నొచ్చుకొన్నదని సంజయుడు ధృతరాష్ట్రునితో తెలిపెను. కౌరవసైన్యంతో ఒక్కుమ్మడిగా అర్జునునిపై భరింపశక్యముకానివిధంగా యుద్ధానికి సన్నద్ధమయ్యెనని భావాన్ని పై వాక్యం తెలుపుచున్నది.

"జలధరంబులం శైలంబులు గప్పుకరణి"
(ఆంధ్ర మహాభారతము—ద్రోణపర్వము-ప్ర.ఆ. 308 వ)

పాండవసైన్యం ద్రోణుని పరివేష్టించిన విధానం. మేఘాలు కొండను కప్పినట్లున్నవిగా ఉన్నదని కవి వర్ణించెను. మేఘములచేత కప్పబడిన శైలము తాత్కా-

లికంగా తనవైశిష్ట్యాన్ని కోల్పోయినట్లుగా, ద్రోణుడు తన తేజాన్ని తాత్కాలికంగా కోల్పోయెనని భావం.

"పెనుజోఱమొగంబునంబడిన చిఱుచేపతండంబులచందంబున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ద్వి.ఆ. 78 వ.)

అభిమన్యుదు పద్మవ్యూహమును ఛేదించుకొని కౌరవవీరులతో పోరాడును. పెద్దచేపనోటిలో పడిన చిరుచేపలు ఏవిధంగా నశించునో కౌరవులందరును అట్లే అభిమన్యుని చేతిలో నశించిరి. పెద్దచేపలు చిన్నచేపలను మ్రింగుట సహజంకదా.

"చేపతనజెనను తానే త్రాగును"
(ఆముక్తమాల్యద-4వఆ. 177 ప)

చేపతనజెననుతానే ఎట్లు త్రాగునో, అట్లే ఎవరికంపువారికింపుగానె వుండునని భావం. తాముచేసే తప్పులను తానే తెలుసుకోలేరని భావం. అవివారికి తప్పులుగా కనిపించకపోవుటే కారణం.

## 6. వ్యభిచార (దేవదాసి) వృత్తికి సంబంధించిన సామెతలు:

ఆలయంలో నృత్యముచేయువారిని దేవదాసీలని పిలిచెడివారు. వారు భగవంతుని గుణగణములను నాట్యరూపంలో ప్రదర్శించెడివారు కాని రానురాను జమిందారులు, ధనవంతులు వారిని తమ ఉంపుడుగత్తెలుగా మార్చుకొనిరి, కాలక్రమమున ఆపరిస్థితే వ్యభిచారానికి దారితీసింది. వ్యభిచారవృత్తి సమాజమునకు ఒక మాయనిమచ్చవంటిది.

"షండునకుబిడ్డనిచ్చిన చందంబు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 332 వ)

నపుంసకునకు కూతురునిచ్చి వివాహము చేయుట మూర్ఖత్వమేకాదు వ్యర్థంకూడ.

"కామినుల విశ్వసింపరు పెద్దల్"
(ఆంధ్ర మహాభాగవతము—అ.స్కం. 308 ప)

విష్ణువు జగన్మోహినిరూపముధరించి, అమృతాన్ని దేవతలకు, విషాన్ని రాక్షసులకు పంచిఇచ్చెను, పెద్దలు ఎవరును కామినులను విశ్వసింపజాలరు. రాక్షసులు కాబట్టే మోహినిని నమ్మిరి. కేవలము మూర్ఖులేకామినుల మాయలో పడెదరని భావం.

"వదుగుకింతిపొత్తువలదువలదు"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం-422 వ)

మోక్షగామియైన వడుగుస్త్రీ సాంగత్యమును కోరకూడదనీ, బ్రహ్మ అంతటి వాడే తనకూతురును మోహించెననగా మోహమెంతటిచెడును చేయునో తెలియు చున్నదని నారదుడు ధర్మరాజునకు తెలిపెను. ఇంతిపొందు బ్రహ్మజ్ఞానానికైతపించే వడుగునకు ఎట్టి పరిస్థితులలోను పనికిరాదని భావం.

"వెలయాండ్రెక్కడవారివేడబములా వేదాంతసూక్తంబులే"
(ఆంధ్ర మహాభాగవతము-నవ.స్కం-416 వ)

ఊర్వశిపై మరులుకొన్నపురూరవుని, ఎన్నోవిధాల ఆమె తిరస్కరించును. వెలయాండ్రపైన ప్రేమ ఉండకూడదని నిరసించును. అది నిత్యసత్యం.

"పేదముదుకదు వేశ్యాజనముంగోరుట"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 32 వ.)

పేదముదుసలివేశ్యను కోరినప్రయోజనం లేదని భావం. వేశ్యలు ఎప్పటికైనను డబ్బునకై ఆశపడెదరని భావం.

"తేనియప్రమదంబుననాదుభంగి"
(ఆంధ్ర మహాభారతము- శాంతిపర్వము- పం.ఆ. 181 వ)

ఏవిధంగానైతే పద్మములో తేనె ఉంటుందో, అట్లే జితేంద్రియుడై వాని మనసులో తృప్తి ఉంటుందని భావం. అందరికంటె కూడ జితేంద్రియుడే గొప్పవాడు.

"క్రొవ్వినజేటుదప్పునే"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-తృ.ఆ. 7 వ)

భీమునిచేత కీచకుడు మరణించును. ద్రౌపది అందరి సమక్షమున తన గంధర్వ పతులవలననే అతడు మరణించెనని తెలిపెను. అచ్చట ఉన్న ప్రజలందరును అతని దుర్మార్గ మనస్తత్త్వమును తెలిసినవారు కావున తగినశాస్తి జరిగినదని సంతోషించిరి ఎవ్వరైనను గర్వంగా ప్రవర్తించినయెడల చేటు తప్పదని భావం.

"పరసతీసంగమమున వచ్చుపాపము"

(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ద్వి.ఆ. 53 ప)

కీచకుడు కామాతురుడై ద్రౌపదిపొందు కోరుకొన్నవాడై, పరసతీ సంగమ మువలన వచ్చే పాపానికైనను సిద్ధపడియుంటినని తెలిపెను. "కామాతురాణాం నభయంనలజ్జా" అనునది ఆర్యోక్తి. కామాతురుడైన వానికి వావివరసల ఆలోచన ఉండదు. ధర్మాధర్మములననో ఏమిటో తెలియవు.

"ఆయురైశ్వర్యకీర్తులనపహరించు పరసతీసంగమము"

(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ద్వి.ఆ. 69 ప.)

కీచకుడు ఎట్లయిన ద్రౌపదిని తనవద్దకు పంపవలసినదిగా సుదేష్ణను రెండవ సారి ప్రార్థించును. ఆమె ఎన్నోరకాలుగా నీతిబోధచేసినను, పెడచెవిన పెట్టును. పరసతిపొందు అనర్థదాయకమని ఆమె అతనికి చెప్పును.

"ఇంతులనిమిత్తమున ధృతిమంతులు బొందుదురు భేదమతి"

(ఆంధ్రమహాభారతము-ఆదిపర్వము-అ.ఆ. 114 ప.)

సుందోపసుందులు బ్రహ్మవరాలచే గొప్పశక్తివంతులై, ఇతరులచే చావు లేకుండునట్లుగా వరాలను పొంది, లోకములను బాధించుచుండగా, బ్రహ్మదేవుడు మునులమొరవిని విశ్వకర్మను రప్పించి ఒక అప్సరసను సృష్టించవలసిందిగా కోరును. విశ్వకర్మ తననేర్పును అంతయు ఉపయోగించి తిలోత్తమను సృష్టించును. తిలోత్తమ పొందుకొరకై సుందోపసుందులు పరస్పరం కలహించుకొని మరణింతురు. "ఎంతవారలైనా కాంతాదాసులే" అనుసామెత ప్రచారములో ఉన్నదే.

"కామంబుతో హానిబొందునర్థధర్మంబులు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 245 ప.)

ధర్మరాజు భీమునితో పైవిధంగా పలికెను "కామార్తాహిప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు" అని కాళిదాసు మేఘదూతములో పేర్కొనెను. కామంవలన అర్థ, ధర్మములకు హానికలుగును. ధర్మార్థకామములను సరియైన పాళ్లలో అనుభవించిన వాడే మోక్షమునకు అర్హుడగునని ఆర్యధర్మాలు తెలుపుచున్నవి.

"పరకాంతల్ పురుషగని మోహాంధకారమగ్నలుకారే"

(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 43 ప)

ప్రద్యుమ్నునిచూచిన కాంతల స్థితిని పైవాక్యంలో వర్ణించబడినది. ఎంత అందగత్తెలైనను మన్మధుని కనినంతనే మోహపరవశలయ్యేదరని భావం.

"కామికినయంబున నొందుదలంప బోలునే"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 215 ప)

అంబిక, అంబాలికలను విచిత్రవీర్యునికిచ్చి భీష్ముడు వివాహం చేయును. 'కామికిమనంబున' నొందు దలంపుబోలునే అను పాఠాంతరమునుగలదు. కామమెంత గొప్పవానినైనను కృంగదీయునని భావం. జితేంద్రియుడైనవాడే కార్యసిద్ధిని బొంద గలడు.

"పరానురక్తచిత్తయగు మగువనిల్లాలిం జేయువారుగలరే"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-చ.ఆ. 308 ప)

అంబతనకు జరిగిన అవమానాన్ని పరశురామునకు దెలుపును. పరశురాముడు అంబను భీష్మునివద్దకు తెచ్చి తమ్మునికిచ్చి వివాహం చేయుమనికోరగా భీష్ముడు పైవిధంగా పలికెను. ఇతరులపై అనురాగమున్న స్త్రీని ఎవరును భార్యగా స్వీకరించరనీ అది ధర్మవిరుద్ధమనీ తెలిపెను.

"కామోపభోగనిరతుడోటువడడె"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-స.ఆ. 63 ప)

అంగారపర్ణుడు పాండుపుత్రునితో పైవిధంగా పలికెను. కామోపభోగములను అనుభవించినవాడు ఓడిపోవుటకు అవకాశము కలదు. జితేంద్రియుడే విజేతకాగలడని భావం.

"మగవారిచిత్తమున్గొంతల కనుసన్ననె మెలంగుగదా"
(విజయవిలాసము-ద్వి.ఆ. 11 ప)

ఎంతగొప్పవారలైనను కాంతాదాసులే అని భావం. పరస్త్రీలను గౌరవంగా చూదవలెననుటకు ఈక్రింది వాక్యాన్ని పేర్కొనవచ్చును.

"పరభామలు దోడబుట్టువుల్"
(విజయవిలాసము-ద్వి.ఆ. 102 ప)

వారకాంతలకు వావివరుసలుండవనియు, వారికినీతి అనునదియే లేదను భావాన్ని ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"వారకాంతల కెందైన వావికలదె"
(సారంగధర చరిత్రము-ద్వి.ఆ. 25 ప)

అట్లే కాముకుడైన పురుషునికి సిగ్గు నెగ్గు ఉండవని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"కాముకులకు నెగ్గు సిగ్గు కలదేయెందున్"
(సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 115 ప)

ఇప్పటివరకు కొన్ని ముఖ్యమైనవృత్తులకు సంబంధించిన సామెతల పరిశీలించుటైనది.

3. చదువు - సంస్కారమునకు సంబంధించిన సామెతలు:-

మానవునకు అన్నిధనములకంటె విద్యాదనం గొప్పది విద్యలేనివాడు వింత పశువు అను సామెతయే చదువు యొక్క ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది. చదువువలన సంస్కారము అభివృద్ధి చెందును. సంస్కారయుతమైన చదువే శ్రేష్ఠమైనది.

శ్లో॥ విద్యాధనం శ్రేష్ఠధనం, తమ్మూలమితరం ధనం!
దానేనవర్ధతేనిత్యం, నభారాయననీయతే!!1

(సంపదలన్నింటిలోకి విద్యాసంపద గొప్పది ఇతర సంపదలన్నింటినీ విద్య వలన సాధించవచ్చును. అది ఇచ్చిన కొలది వృద్ధిపొందుతుందిగాని తరగదు. వహించేవానికి విద్యబరువుగాదు. దొంగలపాలు అసలేకాదు.)

చదువువలన సంస్కారం అభివృద్ధి చెందవలెను. అట్లు సంస్కారం అబ్బకున్న చదువు వ్యర్థమైనది.

"చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ"
(ఆంధ్రమహాభాగవతము-స.స్కం. 166 ప)

హిరణ్యకశ్యపుడు కుమారునితో నీవేమిచదివితివని అడుగగా, భక్తి పరాయణు డైన ప్రహ్లాదుడు 'చదువులలోని మర్మమెల్లను చదివితినని తెలిపెను. విష్ణుభక్తుని ప్రదర్శించెను. చదువులలోని మర్మము భగవంతుని తెలిసికొనుటే గావున భగవద్భక్తి

1 ఆర్యధర్మములు - సూక్తిముక్తావళి [107వ పేజి]

ఉన్నవారికి ఇతర చదువులతో ప్రమేయం లేదని భావం. నేడు దీనిప్రయోగం మరొకవిధంగా ఉన్నది. చదువురానివారిని గూర్చి పైవిధంగా మాట్లాడుటలో, అతడు చదువులో దిట్ట కాకున్నను, వ్యవహారంలో దిట్టఅను అర్థాన్నిస్తుంది.

చదువురానివాడు మూఢుడు. ఆమూఢుడు పశువుతో సమానమని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"మూఢుండు పశుమార్గుడనగబరగు"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. - 1117 వ)

కృష్ణుడు ముసీళ్ట్రుల గొప్పదనాన్ని పొగడుచు, మూఢుడు పశుమార్గములో పయనించేవాడని తెలిపెను.

"విద్వాంసులను పాసించి శుభాచారుండవు గావలయు"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ 347 వ)

హనుమంతుడు భీమునితో పైవిధంగా పలికెను. ఏకార్యము చేయునప్పుడైనను విద్వాంసుల సలహాను గైకొనవలయును. అనగా ఆచార్యులకు, పండితులకు ఎంతటి గౌరవమున్నదో తెలియుచున్నది.

వయస్సులో చిన్నవాడైనను గొప్పపండితుడయినచో గౌరవింపవలెనని ఈక్రింది వాక్యం తెలుపుచున్నది. వయోవృద్ధుడైనవానికంటె జ్ఞానవృద్ధుడే గొప్పవాడనిభావం.

"జ్ఞానవృద్ధుడైనవాని మాటలుగదా సభలజెల్లు నార్యజనులకెక్క-"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-చ.ఆ. 200 వ)

అత్రిగౌతముల సంవాదములో అత్రితోగౌతముడు పైవిధంగా పలికెను. వయోవృద్ధునికంటె జ్ఞానవృద్ధుడు గొప్పవాడు.జ్ఞానియే గౌరవనీయుడు,పూజనీయుడని భావం.

"గురుడుండ శిష్యుడు సెప్పినవిధంబు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 120 వ)

కృష్ణుడు ధర్మజునకు ధర్మాన్ని ఉపదేశింపవలసినదిగా భీష్ముని నియమించెను, భీష్ముడు కృష్ణునివైపుచూచి, కృష్ణుడుండగా తాను హితబోధ చేయుట గురువుండగా శిష్యుడు నీతిబోధ చేసినట్లుండునని పలికెను. ప్రపంచమునకే గురువనదగిన కృష్ణుడు ఎదురుగానుండగా ధర్మాన్ని గూర్చి ధర్మజునకు తానుపదేశించుట ఎంతవరకు సమంజసమని ప్రశ్నించెను. గురుశిష్యుల సంబంధమును పైవాక్యం తెలుపుచున్నది. గురువు శిష్యునకందరి కంటె పూజనీయుడని భావం.

"విద్యలెల్ల అభ్యాసవశంబునంబడయ భారములేదు"
(ఆంధ్ర మహాభారతం-ఆదిపర్వము-పం.ఆ. 228 ప.)

'అభ్యాసముకూసువిద్య' అను సామెతకు దగ్గరగానున్న ప్రయోగము. "Practice makes man perfect"అను ఆంగ్ల సామెతయు పై భావమునే తెలుపు చున్నది. "సాధనమున పనులు సమకూరు ధరలోన"1 అని వేమన తెలిపెను.

"గురులకు శిష్యులు పుత్రులు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 131 ప.)

గురు, శిష్యుల సంబంధాన్ని గూర్చి తెలుపు సామెతగా పేర్కొనవచ్చును. దేవయాని కచునిపై మరులుగొనును. కచునకది ఇష్టముండదు. దేవయాని తన కోరికను అతనికి తెలుపగా, కచుడు తాను శుక్రాచార్యుని శిష్యుడు, కావున ఆమెకది తగదని తెలుపును. నేటికిని కొంతమంది గురువులు తమ శిష్యులను కన్న కొడుకుల కంటె ఎక్కువ ప్రేమతో చూచేవారున్నారు. అంతే గౌరవముతో ప్రవర్తించే శిష్యులును ఉన్నారని చెప్పవచ్చును.

"జ్ఞానము గలదేనిన్ బాలుడయిన గడువృద్ధు మహిన్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 248 ప.)

అష్టావక్రుడు, శ్వేతకేతుడు జనకరాజు చేయు యజ్ఞమునకు వెడలగా వారిని దౌవారికుడు నివారించి, ప్రవేశము కేవలము వృద్ధులకు, జ్ఞానులకు మాత్రమే పరిమితమని తెలిపెను. జ్ఞానియే నిజమైన పెద్దవాడని, అష్టావక్రుడు తెలిపెను. అది నిత్య సత్యము. జ్ఞానమునకు వయస్సుతో సంబంధము లేదు.

"వివేకము గలవాడు బుద్ధి వికలుడగునే"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 20 ప.)

---

అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తీయనగును
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ. [వేమన శతకము]

[వేమన పద్యములు-149 పే.] పబ్లిషర్స్: గొల్లపూడి వీరాస్వామి, సన్స్

దర్మరాజాదులు అరణ్యవాసానికై బయలుదేరగా హస్తినాపురంలో ప్రజలు, విప్రులు మొదలగువారందరును అతనిపై గౌరవంతో అరణ్యానికి బయలుదేరెదరు. అట్టివారి గౌరవాన్ని, ప్రేమను గని వారినుండి తాను విడిపోవలసి వచ్చినది కదా యని మూర్ఛిల్లును. అట్లు కడుదుఃఖముచే మూర్ఛిల్లిన ధర్మరాజును గని శౌనికుడను ముని వివేకము గలవాడెప్పుడును బుద్ధినిగోల్పోరాదని సలహా ను ఇచ్చెను.ధైర్యమును కోల్పోవక, సంయమనముతో ప్రవర్తించెడివాడే వివేకియని భావం.

"గురుల, ధర్మల గోపించి ధీరులతిక్రమింతురే"
[ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 224 ప.]

శకుని మాయా ద్యూతము నెరగియు, దర్మరాజు ద్రౌపదిని సభలో ఓడెను. అది జూచి భీముడు ధర్మరాజును కోపముతో తూలనాడును. ఆ సమయములో అర్జునుడు భీముని ఓదార్చుచు, ధీరుడైన వాడెన్నడును గురువులను నిందించరాదని తెలుపును. ఇచట గురువు లనగా పెద్దవారని అర్థం. అవివేకి ఎన్ని సూక్తులను వినినను ప్రయోజనము లేదనుటకు నిదర్శనంగా ఈ క్రింది వాక్యాన్ని పేర్కొన వచ్చును. మూర్ఖుని ఎవరును మార్చలేరని భావం.

"అవివేకియందు ప్రయుక్తంబులయిన సుభాషితంబులు బోలె"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 313 ప.)

అర్జునుడు ప్రయోగించిన బాణాలన్నియు శివునిపై ఏమాత్రము ప్రభావాన్ని చూపలేక పోయినవి. మూర్ఖునకెన్ని మంచిమాటలు, ఎన్ని చెప్పినను ఎట్లు వృథా అగునో అట్లే బాణములన్నియు వ్యర్థమయ్యెనని భావం.

"ఉత్తమ జ్ఞానవృద్ధునానుండెనేని బాలుడయ్యును బూజ్యుండు"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 25 ప.)

తనను నిందించే శిశుపాలునితో భీష్ముడు పై విధంగా పలుకును. కృష్ణుడు వయస్సులో చిన్నవాడైనను జ్ఞానవృద్ధుడు. కావున పూజనీయుడయ్యెనని తెలిపెను. గొప్ప జ్ఞానము కలిగిన బాలుడు వయో వృద్ధునికంటె పూజనీయుడని భావం.

"అహితుల నెల్లవిధంబుల విహితులుగా జేయునది వివేకము"
(ఆంధ్రమహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 271 ప.)

దుర్యోధనుడు దృతరాష్ట్రునితో పైవిధంగా పలికెను. అహితులయిన వారిని

సైతం విహితులుగా మార్చేది వివేకం. 'ఉపాయమున్న వాని కపాయమే లేద'నునది సామెత. వివేకవంతుడెచ్చటనైనను, ఏ పరిస్థితుల్లో నైనను సుఖముగానే ఉంటాడని భావం.

"గురువచన మొండుదెఱగేలయగున్'
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ప.అ.-215 ప)

అర్జునుడు ద్రౌపదితో కుంతీదేవి వద్దకు వచ్చెను. తల్లి కావిషయాన్ని, గోప్యంగా ఉంచవలెననే భావంతో భీమార్జునులు ద్రౌపదితో వచ్చినామని చెప్పక, తామొక భిక్షనుగైకొని వచ్చితిమనియు, తామిప్పుడేమి చేయువలయునని అడిగెదరు. సమాధానంగా ఆమె మీరైదుగురును సమానంగా పంచుకొనుడని సలహా ఇచ్చెను. తరువాత అర్జునుడు తెచ్చినది భిక్షకాదని, ద్రౌపదిని గైకొని వచ్చెనని తెలిసికొని మిక్కిలి చింతించును. అప్పుడు ధర్మరాజు వేదవ్యాస వచనాన్ని గుర్తుచేసి, దీనిలో ఆమె తప్పేమిలేదని, ఇదంతయు గురువైన వేదవ్యాసముని వచనము వలననే జరిగిందని తెలుపును. గురువచనమునకు తిరుగులేదని భావం.

"అధ్యయనంబున దేవభావముంగను"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 431 ప)

యక్షుని రెండవ ప్రశ్నకు ధర్మజుని సమాధానం భూదేవుడే విధంగా దేవ భావమును పొందుననగా, ధర్మరాజిట్లు సమాధానమిచ్చెను. చదువెంత గొప్పదో పై వాక్యంమనకు తెలుపుచున్నది. అధ్యయనం చేయుటవలననే దేవభావమును, బ్రాహ్మణుడు పొందెనని ధర్మరాజు యక్షునకు తెలిపెను.

"ఆచార్యులైనవారలు పూజా వాక్యంబుల కర్హులుగాక గర్హించుటకు విషయంబె"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-చ.ఆ. 224 ప)

"ఆచార్యులైనవారలు పూజా వాక్యంబుల కర్హులు"-అనుదానిని సామెతగా గైకొనవచ్చును. భీష్ముడట్లు దుర్యోధనునితో పలికెను. ఆచార్యులెన్నటికైనను పూజింపదగినవారే కావున వారి నవమానించకూడదని భావం.

చదువనునది మాతృ భాషతో జరిగిన బాగుండునను భావము పూర్వమందే ఉన్నట్లు ఈ వాక్యము తెలుపుచున్నది. అదీగాక ఎవ్వరికైనను వారి మాతృ భాషయే గొప్పదను సత్యాన్ని కూడ తెలుపుచున్నది.

"దేశ భాషలందు తెలుగు లెస్స"
(ఆముక్తమాల్యద–ప్ర.ఆ.-15 ప)

"Telugu is the Italian of East" అను ఆంగ్ల సామెత కలదు. అన్ని భాషలలోను ప్రశస్తమైనది తెలుగని శ్రీకృష్ణదేవరాయలు వెలవిచ్చెను.

విద్యతోపాటు వినయముండవలెనుగాని, అది అతివినయం కాకూడదు. అతి వినయం చెడులక్షణమని మనకీ క్రిందివాక్యము తెలుపుచున్నది.

"అతివినయము ధూర్తలక్షణము"
(సారంగధర చరిత్రము-ద్వి.ఆ-53 ప)

అన్ని చదువులకన్నను సత్యమే గొప్పచదువని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"సత్యవాణీ సరస్వతీ"
(సారంగధర చరిత్రము-ద్వి.ఆ. 93 ప)

కావ్యమెంతటిగొప్పదో ఈ క్రింది వాక్యం మనకు తెలుపుచున్నది. కావ్యమును పఠించుటవలన పుణ్యం కలుగునని భావం.

"సప్తసంతానములలో ప్రశస్తిగాంచి
ఖిలముగాకుండ నుండునది ధాత్రికృతియ"
(మనుచరిత్రము-ప్ర.ఆ. - 14 ప)

పై వాక్యంలన్నియు చదువు–సంస్కారాలకు సంబంధించినవని చెప్పవచ్చును.



# చతుర్విధ పురుషార్థములగూర్చి తెలుపు సామెతలు

ప్రాణులన్నిటిలోను మానవజన్మ ఉత్తమమైనది.

శ్లో॥ జంతూనాం నరజన్మ దుర్లభమతఃపుంస్త్వతో
తస్మాద్వైదిక ధర్మమార్గ పరతా విద్వత్వమస్మాత్పరమ్
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవోముక్తి
ర్నో శతకోటిజన్మైః సుకృతైఃపుణ్యైర్వినాలభ్యతే1

"జన్" అనగా పుట్టుట. ఇచ్చట జంతువనగా ప్రాణి అని అర్థం. ప్రాణుల న్నింటిలోనికి మానవప్రాణి ఉత్తమమైనదనీ, ముక్తిలభించుట ఎన్నో కోటిజన్మల పుణ్యమువలన మాత్రమే సాధ్యమనీ పైశ్లోకమువలన స్పష్టం.

మానవజన్మకు చతుర్విధ పురుషార్థములు ముఖ్యం.

1. ధర్మము.
2. అర్థము.
3. కామము.
4. మోక్షము.

ఏవ్యక్తియైనను శాస్త్రప్రకారము ప్రవర్తించవలెనని ఆర్యులు వంచించిరి. తన ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తించేవాడు వానరుడు అగునేమోకాని నరుడు మాత్రం కాదని తెలిపిరి.

శ్లో॥ మతమోయత్రగచ్ఛంతి తత్రగచ్ఛంతివానరాః!
శాస్త్రాణియత్రగచ్ఛంతి తత్రగచ్ఛంతితేనరాః!!2

ప్రాచీన సాహిత్యములో చతుర్విధ పురుషార్థములగూర్చి ఎట్లు తెలుపబడెనో పరిశీలించెదము.

1. ఆర్యధర్మములు-యధార్థ మానవత్వము-(8వ పే.) -కె. కృష్ణమాచార్య
2. యధార్థమానవత్వము - విజ్ఞప్తి- 9వ పే -- కె. కృష్ణమాచార్య - (1960)

## 1. "ధర్మము"నకు సంబంధించిన సామెతలు.

శ్లో॥ ఆహార నిద్రాభయమైధునాని
సామాన్యమేతత్ప శుభిర్నరాణాం!
దర్మోహితేషా మధికోవిశేషో
దర్మేనహీనః పశుభిస్సమానః!!1 (హితోపదేశము)

మానవునకు, పశువులకు, ఆహారము, నిద్ర, భయము, దాంపత్యజీవనము సర్వసామాన్యమైనవి. జంతువులతో పోల్చిచూచినపుడు, మానవుని గొప్పవానిగా చేయునది ధర్మము మాత్రమే. చతుర్విధ పురుషార్థములలో దర్మము మొదటిది. ధర్మములేవి అర్థము, కామములు నిష్ప్రయోజనాలు. దర్మార్థకామముల సహాయముతో మోక్షమునసుభవింపవలెను.

దర్మమనగా మతమను అభిప్రాయంకలదు. కాని చతుర్వర్ణవిభజనచేసిన మనువుసైతము మానవ సామాన్య దర్మాలను ఇట్లు పేర్కొనెను.

శ్లో॥ అహింసాసత్యమస్తేయం
శౌచమింద్రియనిగ్రహః!
ఏతంసామాజిక ధర్మం
చాతుర్వర్ణ్యేబ్రవీన్మనుః!!2

అహింస, సత్యమును పలుకుట, శుచిగా ఉండుట, దొంగతనము చేయకుండుట అనునవి నాలుగు వర్ణములకు సామాన్య సామాజిక ధర్మాలుగా పేర్కొనబడినవి.

కావున ధర్మపరుడనగా పైగుణములు కలిగిన వ్యక్తిగా పేర్కొనవచ్చును. చతుర్విద పురుషార్థములలో దర్మమునకు ప్రముఖస్థానమున్నదని తెలియుచున్నదే.

"రాజ్యంబులు పుత్రులును ధనంబును యశంబును సత్యంబునకు సమంబులుగావు"
(ఆంద్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ 260 వ)

ధర్మరాజు భీమునకు ధర్మరహస్యాలను తెలుపుచు పైవిధంగా పలికెను. రాజ్యము, పుత్రులు, ధనము, కీర్తి, వీనిని మానవుడు సాధింపవచ్చును. సత్యము వానికంటె

1. సూక్తిముక్తావళి - 84వ పే.
2. "మనుస్మృతి" యథార్థమానవత్వము - కె. కృష్ణమాచార్య - 8వ పే. (1960)

గొప్పది. సత్యవాక్పరి పాలనయే ధర్మమని భావం. మనుష్యులలో ధర్మపరుడనగా సత్యమును పలుకువాడనీ, అహింస, మొదలగు గొప్పగుణాలు గలవ్యక్తి అనియు పేర్కొనబడినది.

"గుణములుగైకొని దోషంబులు విడుచుటయును ఉత్తముడయిన పురుషునుత్తమ గుణముల్"

(ఆంధ్ర మహాభాగవతము—సభాపర్వము-ద్వి.ఆ. 266 ప)

దృతరాష్ట్రుడు ధర్మరాజుతో ఉత్తపురుషుని లక్షణాలను తెలుపుచు పైవిధంగా పలికెను. ఉత్తముడెన్నడును గుణాలనుగైకొని, దోషములను వదలివేయును. కాబట్టి ఇతరుల దోషాలగూర్చి చర్చింపకపోవుటే ఉత్తమమైన మార్గమనిభావం.

"దైవముచెయిదిన్ నిర్మితమయిన శుభాశుభ కర్మఫలంబె దేహిగడవగనేర్చున్"

(ఆంధ్రమహాభారతము-సభాపర్వము-279 ప)

ధర్మరాజు శకుని చేతిలో రెండవమారుకూడ ఓడిపోయెను. "శివునాజ్ఞలేనిది చీమైనాకుట్టదు" అను సామెతకలదు. అంతా దైవనిర్ణయమేనని భావం.

క్రూర కర్మములందుద్యతులైనవారికి సధర్మప్రాప్తిగాకుండు"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-స.ఆ. 136 ప)

కృతవీర్యాది రాజులు భార్గవులయిళ్లలో చొరబడి వారిభార్యా పిల్లలను సంహరించెదరు. అచ్చట ఒక భృగుపత్ని గర్భవతిగానుండెను. వారామెను హైతము చంపుటకు సిద్ధపడగా ఆశ్చర్యంగా వారందరును అంధులైరి. చెడుపని చేయువారికి ఎప్పుడును నష్టమే జరుగునని భావం.

"దైవానుకూలంబులేక మానుషంబెంతయయ్యు యేమిసేయు"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-అ.ఆ. 12 ప)

దుర్యోధనుడు పాండవులను లక్కయింటిలో పెట్టి కాల్చిచంప ప్రయత్నించును. కాని చాయలవలన వారు సజీవంగానే ఉన్నారనీ, ద్రుపదుని కొలువులో సుఖంగా ఉన్నారని తెలిసికొని, చాలదుఃఖించుచుపైవిధంగా పలికెను. ధర్మపరులను దైవం కాపాడును. దైవానుకూలము లేనివారే పనిచేసినను ప్రయోజనముండదు.

"తన కులధర్మము విడువకమనుట పరమధర్మ మంద్రుమాన్యులు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము పం.ఆ-37 ప)

కౌశికునకు ధర్మరహస్యములను తెలుపుచు, ధర్మవ్యాధుడు పైవిధంగా పలికెను. కులధర్మానికి మించిన ధర్మంలేదనీ, కావున ఎవ్వరైనను తమ కులధర్మాన్ని విడువకూడదని తెలిపెను. నాటిసమాజపు విశ్వాసములకు ప్రతీకగా పైవాక్యాన్ని ఉదహరించవచ్చును.

"మూఢుడు తనకాపదయైనచోట దైవముదూఱున్"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 65 ప.)

కేవలం మూర్ఖుడే తన అసమర్థతకు భగవంతుని నిందించును. గొప్పవాడెవ్వడును అట్లు పలుకడు. కర్మసిద్ధాంతము కేవలము సోమరుల వేదాంతము కాకూడదను అభిప్రాయాన్ని పైవాక్యం తెలుపుచున్నది. ఎవరికష్టములకు వారే బాధ్యులను సత్యాన్ని పైవాక్యం తెలుపుచున్నది.

"నీచేయుధర్మంబు నీకుతోడయ్యెడు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 115 ప)

ధర్మవ్యాధుడు కౌశికుని తన జననీజనకులవద్దకు కొంపోవును. అచ్చటవారు తాము ధర్మవ్యాధుని సేవలచే సంతుష్టులుగా ఉన్నామని పలికిరి. తల్లిదండ్రులకు సేవచేయుటయే పుత్రునకు నిజమైనసేవయని పైకథ తెలుపుచున్నది.

"కర్మవశతజూపె కలుగుదేహము"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 70 ప)

ధర్మవ్యాధుడు కౌశికునితో ధర్మసూక్ష్మలను వివరించుచు పైవిధంగా పలికెను. పూర్వజన్మననుసరించే దేహికి దేహము లభించునని తెలిపెను. హిందువుల కర్మసిద్ధాంతభావనను తెలుపువాక్యంగా పేర్కొనవచ్చును.

"సజ్జనులు దిక్కుసూవెయీసర్వమునకు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 450 ప)

ప్రపంచమునకు సజ్జనులే ఆధారమని యక్షునితో ధర్మరాజు సమాధానంగా పలికెను. అన్నిటికన్నను మంచితనమే గొప్పదను సత్యాన్ని పై వాక్యం తెలుపుచున్నది.

" ధర్మో జయతి "
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 90 వ.)
( ,, - భీష్మపర్వము-ప్ర.ఆ. 8 వ.)

"ధర్మోజయతి" అనునది సంస్కృత న్యాయము. విదురుడు చెప్పిన మాట లన్నింటిని వినియు పుత్ర వ్యామోహంచే ధృతరాష్ట్రుడు దుర్యోధనున్నే బలపరుచును. ధర్మమెట్లయినను జయించుననియు, కాని తాను మాత్రము అతని సలహాను పాటింప లేకున్నానని విదురునితో ధృతరాష్ట్రుడు పలికెను. 'దర్మోజయతి'అనునది ఆర్యోక్తి.

"అహింసయే యుత్తమ ధర్మంబగు"
[ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ప్ర.ఆ. 335 వ.)

అహింసయే అన్ని దర్మాలలోకెల్ల ఉత్తమమైనదని సంజయుడు పాండవులతో పలికెను. మనుస్మృతి1లో సైతం అహింసయే గొప్ప ధర్మంగా పేర్కొనబడింది. కాని రాజైనవాడు అవసరమైన యెడల యుద్ధానికి వెనుదీయరాదని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"సంగ్రామంబు రాజులకు ధర్మంబు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ప్ర.ఆ. 338 వ.)

సంజయుడు పాండవులకు రాజధర్మాలను గూర్చి తెలుపు సన్నివేశం లోనిది. అహింస పరమ ధర్మమైనప్పటికిని, రాజులకు సమరం చేయుటయే ధర్మమని పేర్కొనెను.

"దైవాధీనంబగుదాని మానుషంబున మానిపింపగ వశముగాదు"
[ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-చ.ఆ. 362 వ.)

నారదుడు భీష్మున కంబ వృత్తాంతమును తెలిపి, ఆమె భీష్ముని మరణానికై ఘోర తపస్సు చేయుచున్నదని తెలిపెను. దైవకార్యాన్ని ఎవ్వరును నిరోధింపలేరని భీష్మునితో నారదుడు పలికెను. "తానొకటి తలచిన దైవమొకటి తలచు" అనునది ప్రసిద్ధమైన తెలుగు సామెత.

---

1. శ్లో॥ అహింసా సత్యమస్తేయంశౌచమింద్రియనిగ్రహః
ఏతం సామాజిక ధర్మం చాతుర్వర్ణ్యే బ్రవీన్మనుః
[మనుస్మృతి - యదార్థ మానవత్వం - కె. కృష్ణమాచార్య 8వ పే.]

"దైవకృతము గాదె"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-ద్వి.ఆ. 352 ప.)

ధృతరాష్ట్రుడు సంజయునితో పై విధంగా పలికెను. ఎంతోమంది గొప్ప యోధులున్నప్పటికిని కౌరవులు పాండవులపై జయాన్ని పొందలేకపోవుట కేవలం దైవకృతమే. అధర్మపరులను దైవం అపజయంపాలు చేయును. దైవపనుకూల-ముగా లేకున్నయెడల ఎంత గొప్పవారైనను జయాన్ని పొందలేరనుటకు పై వృత్తాంతాన్నే పేర్కొనవచ్చును.

" దైవమధికంబు "
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 204 ప.)

కర్ణుడు భీమునికంటె గొప్పవిలు కాడు. కాని భీముని బాణాలచే భయభ్రాంతుడై పారిపోయెను. మనుష్య శక్తి కంటె దైవశక్తి గొప్పదనుటకు పై సన్నివేశాన్ని ఉదాహరణంగా గైకొనవచ్చునని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను.

"తామరపాకు నీటిభంగి"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 309 ప.)

జయద్రథుని విజయుడెదిరించి, అతని ధ్వజాన్ని, అతని సారథిని ఒక్క బాణముచే సంహరింపగా, అచటనున్న సైనికులు తామరాకుపై నీటి బిందువులవలె ఎచ్చటివారచ్చట వెడలదొడంగిరి. ప్రాపంచిక సుఖాలపై మక్కువ ఉండకూడదనియు, మనుష్యుడు తామరాకుపై నీటి బిందువువలె ఉండవలెనని వేదాంత సారము. అదియే గొప్ప ధర్మము, అది గొప్ప లోకోక్తి.

"అసత్యవచన దోషము లేదు ప్రాణరక్షణ సమయంబున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 310 ప.)

ప్రాణరక్షణ సమయంలో అబద్ధమాడినను తప్పులేదని కృష్ణుడు ధర్మరాజుతో పలికెను. మానవ ధర్మాలన్నింటిలో సత్యాన్ని పలుకుట మిన్నగా పేర్కొనబడినప్పటికిని ప్రాణరక్షణ సమయములో మాత్రం అబద్ధాన్ని పలుకుట తప్పుకాదని వాసుదేవుడు ధర్మరాజుతో పలికెను. అశ్వత్థామ మరణించెనను వార్త వినిన ద్రోణుడు మరణించును. ద్రోణుడు చేయు భీషణ యుద్ధానికి తాళలేక వాసుదేవుడు ధర్మరాజుని అబద్ధమాడవలసిందిగా చెప్పెను. ద్రోణుని చంపుటకు ఎవ్వరికి శక్తి లేనందున అబద్ధమాడి తన సైన్యాన్ని, ప్రజలను, బంధు మిత్రులను కాపాడుకోవల

సించిగా ధర్మరాజునకు వాసుదేవుడు విన్నవించుకొనెను. ప్రాణాపాయ సమయంలో అబద్ధమాడుట తప్పుగాదని పై వాక్యం వలన తెలియుచున్నది.

"సత్యధర్మరతుడగు మనుజునకుంగార్య సిద్ధియగు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 58 వ.)

ద్రోణాచార్యుడు యుద్ధంలో మరణించగా, కర్ణుడు సర్వ సైన్యాధిపతిగా నియమించబడెను. తాను అర్జునుని గెలిచి సమస్త సామ్రాజ్యాన్ని దుర్యోధనునకు ఇచ్చెదనని కర్ణుడు దుర్యోధనునితో పలికెను. సత్యధర్మ నిరతుడైన మానిసికి కార్యసిద్ధి కలుగుననియు కర్ణుడు పలికెను. సత్యధర్మనిరతుడైనవాడు సజ్జనుడని భావం

" దైవంబు బలవంతంబు "
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 226 వ.)

ఎందరో కౌరవ వీరులు మరణించినప్పటికీ, పాండవులలో ఒక్కరైనను మరణించలేదు. దైవమన్నిటికంటె శక్తివంతమైనదనీ, దైవ నిర్ణయాన్ని ఎవ్వరును అతిక్రమించలేరని విచారించుచు దృతరాష్ట్రుడు సంజయునితో పై విధంగా పలికెను. అన్నిటికంటె దైవం గొప్పదనీ, విధి బలీయనమైనదనీ భావం.

"సదాచార దురాచారంబులు దైవంబెఱింగెడు"
[ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 115 వ]

సదాచారాలను, దురాచారాలను నిర్ణయించునది భగవానుడేనని శల్యుడు కర్ణునితో పలికెను. సామాన్యుని దృష్టిలో సదాచారంగా గోచరించునది భగవంతుని దృష్టిలో దురాచారంగా కన్పించుటకు అవకాశమున్నది. అట్లే సామాన్యుని దృష్టిలో దురాచారంగా గోచరించునది, భగవంతుని దృష్టిలో సదాచారముకావచ్చును. కావున సదాచార, దురాచారములను నిర్ణయించునది భగవానుడే కాని మానవుడుకాడని భావం.

"ప్రాణరక్షణంబపరమధర్మంబు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 285 వ.)

భీష్ముడు దర్మజునకు రాజనీతిని తెలుపుచు, చండాల, విశ్వామిత్ర సంవాదాన్ని వివరించెను. విశ్వామిత్రుడాకలితో అలమటించుచుండగా ఏదియును దొరుకక, తుదకు

చండాలుడిచ్చిన కుక్కమాంసమును భుజించి కడుపునింపుకొనెను. అన్నింటికన్నను ప్రాణరక్షణయే ముఖ్యమని పైసన్నివేశమువలన తెలియుచున్నది. 'శరీరమాద్యం ఖలుధర్మ సాధనమ్' అనునది ఆర్యోక్తి. ప్రాణమున్నచో ఏధర్మాన్నైనను పాటింప వచ్చును. కావున ప్రాణరక్షణయే పరమధర్మమని భావం.

"పౌరుషముకంటె దైవంబు ముఖ్యము"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 41 ప.)

భీష్ముడు, ధర్మజునకు "మకి" అనే బ్రాహ్మణుని వృత్తాంతాన్ని తెలుపుచు దైవమనుకూలించని పురుషకార్యమునకు ప్రయోజనంలేదని వివరించెను.

"మోక్షావలంబియైన ధర్మముత్తమంబ్రుతత్త్వజ్ఞులు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 5ప.)

భీష్ముడు ధర్మజునకు ధర్మాన్ని గూర్చి తెలుపుచు, ఏ ధర్మాచరణము వలన మోక్షము లభించునో, అదే నిజమైన, ఉత్తమమైనధర్మమని పేర్కొనెను.

"ఇచ్చుటయునుగొనుటయునునివిదైవాచరితంబులు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 159 వ.)

కౌశికునకు, ఇక్ష్వాకు మహారాజునకు విప్రునివలన వివాదమేర్పడును. ఆ వివాదములో కౌశికుడు తానుచేసిన పుణ్యాన్నంతయు రాజుకు ఇచ్చుటకు నిశ్చయించుకొనెను. కౌశికునివలన తపఃఫలమును పొందినచో, తనకేమి నష్టము వాటిల్లునో అని బాధపడును. అప్పుడు విప్రుడడ్డుపడి ఇచ్చుటయు, పుచ్చుకొనుటయు దైవాధీనాలు కావున చింతింపవలసిన అవసరములేదని రాజునకు తెలుపును. సర్వము దైవాధీనమను గొప్పసత్యాన్ని ఆ వాక్యం తెలుపుచున్నది.

"దైవవశమున నెట్టిపాటివారునెట్లుగారె"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 426 ప)

ఎంతగొప్పవారైనను దైవవశమున బాధలను పొందెదరని బలిచక్రవర్తి ఇంద్రునితో పలికెను. విధిబలీయమని భావం.

"మానుషజన్మముమేలు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 522 ప)

అన్నిజన్మలలోకి మానవజన్మం ఉత్తమమైనది కావున మానవుడు ధర్మ-యుతుడై ప్రవర్తించవలెనని భావం.

"సమ్యగాచారంబు ధర్మకారంబు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 221 ప)

ఆచారప్రకారం ప్రవర్తించుటయే నిజమైన ధర్మమన్ని, భీష్ముడు ధర్మజునకు ధర్మసూక్ష్మములను తెలుపుసన్నివేశములో పలికెను.

"సత్కార్మాచరణంబున దైవమునానుకూల్యము"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనికపర్వము-ప్ర.ఆ. 138 ప)

భీష్ముడు ధర్మరాజుతో దైవ పౌరుషములలో, దైవానుకూలములేని పౌరుషము పనికిరాదని తెలిపెను. కావున సత్కార్మలనుచేసి మొదట దైవమును అనుకూలంగా ఒనరించుకొనవలెనని భావం.

"దైవమది పలసిద్ధిజేయు"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనికపర్వము-ప్ర.ఆ. 137 ప)

పురుషత్వంతోపాటు, దైవమనుకూలంగా ఉన్నయెడల ఫలసిద్ధియగునని భీష్ముడు ధర్మరాజుతో పలికెను. కావున దైవమేఫలసిద్ధికి మూలకారణమని తెలియు చున్నది.

"విధాత జేతకడ్డము గలదే"
(ఆంధ్ర మహాభారతము-మౌసలపర్వము-ఏకాశ్వాసము-158 ప.)

గాంధారి శాపముచే దీనత్వాన్ని పొంది, ద్వారకా పట్టణవాసులైన రామ-కృష్ణులు అరణ్యాలపాలగుట విని అర్జునుడు మిగుల వగచెను. విధాత చేతలను ఎవ్వరును అర్థం చేసుకొనలేరనీ, విధాత చేతలకు అడ్డమే లేదని భావం.

"సకల మార్గంబులయందును ధర్మమార్గంబు ప్రధానంబు.
అట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనులు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 223 ప.)

ధర్మమార్గ ప్రాధాన్యాన్ని, సజ్జనుల ప్రాధాన్యాన్ని పైవాక్యం తెలుపుచున్నది.

"వశంబగునె దైవగతి దప్పింపన్"
(ఆంధ్ర మహాభారతము-స్త్రీ పర్వము-ద్వి.ఆ. 60 ప.)

గాంధారి తన కుమారులకు హితబోధ చేయుటయు, వారామె మాటలను పెడ చెవిని పెట్టుటను తలంచుకొని పరిపరి విధాల విలపించును. దైవశక్తిని ఎదిరించుటకు ఎవ్వరికిని వీలుకాదని ఆమె మిక్కిలి బాధపడెను. దైవశక్తి ప్రాధాన్యాన్ని పై వాక్యం తెలుపుచున్నది.

"విచార పూర్వార్థ కార్యంబునకు దైవమునను కూలంబగు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 268 ప.)

దర్మరాజు భీమునితో పై విధంగా పలికెను. ఏ కార్యము చేయవలయునో, ఎట్టి కార్యమును చేయకూడదో, పై వాక్యం తెలుపుచున్నది.

"ధర్మంబువలన వేదప్రతిష్ఠయగు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 347 ప.)

ధర్మము హిందూ జీవన స్రవంతిలో ఎంతటి ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నదో పై వాక్యం తెలుపుచున్నది.

"కృతాధ్యయనశీలుండై యాచార పరుండైనవాడు బాలుండయ్యును
సర్వజన సంభావనీయుండగు"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 249 వ.)

అష్టావక్రుడు దౌవారికునితో పై విధంగా పలికెను. జ్ఞానియైనవాడు బాలుడయ్యును పూజనీయుడేనని భావం.

"కార్యఫలంబులెల్ల సద్భావమునన్ విచార సులభంబులయంద్రు విచార పారగుల్"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 257 ప )

సద్విచారము వలన ఎట్టి పనిఐనను నెరవేరగలదని ధర్మరాజు భీమునితో పలికెను.

"తేజస్విమూర్తుల నెలవులందు ధర్మపరులుందురు"
(ఆంధ్ర మహాభారతము-అశ్వమేధ పర్వము-ప్ర.ఆ. 185 వ.)

ధర్మపరులు తేజస్వి మూర్తుల దగ్గరే ఉండెదరు. కావున ఏ కార్యాన్ని ఐనను ధైర్యవంతుడు, తేజోవంతుడు మాత్రమే చేయగలడని భావం.

"ఎఱుక గలవారికింగర్మంబు కర్తవ్యంబు"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 233 వ.)

తన తండ్రితో నిష్ఠాగరిష్ఠులైన బ్రాహ్మణులు పై విధంగా మాట్లాడుచుండగా తాను వింటినని ద్రౌపది ధర్మరాజుతో పలికెను. జ్ఞాని ఎల్లప్పుడును తాను చేయవలసిన కర్మ నుండి తప్పుకొనడని భావం.

"ధర్మమయంబులు ధర్మంబునకు మిక్కిలి యొండెద్దియులేదు"
(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 246 వ.)

ధర్మరాజు భీమునకు ధర్మ సూక్ష్మలను తెలుపుచు పై విధంగా పలికెను. ధర్మమే అన్నింటికన్నా శ్రేష్ఠమైనదని భావం.

"సకల జన్మములందును ధర్మార్థాచరణ కారణంబైన
మానుష జన్మంబు దుర్లభంబు"
[ఆంధ్రమహాభాగవతము-స.స్కం. 213 వ.]

మానవ జన్మ ప్రాధాన్యాన్ని ప్రహ్లాదుడు తోటి బాలకులకు తెలుపు ఘట్టంలోనిది. జన్మను చరితార్థం చేసుకొనవలెననిన భగవద్భక్తి అవసరమని ప్రహ్లాదుడు తెలుపును.

"కడపవచ్చునె దైవసంకల్పమెందు"
(ఆంధ్ర మహాభాగవతము-చ-స్కం. 941వ.)

దైవ సంకల్పాన్ని ఎట్టి పరిస్థితులలోనూ మీరరాదను సత్యాన్ని నారదుడు పురంజనునకు తెలిపెను. దైవ సంకల్పమును ఎవరును అతిక్రమించలేరని భావం.

"దేహంబు జయించి దేహి కుశలుండగుచు నుండవలయు"
[ఆంధ్రమహాభాగవతము-పం.స్కం. 69 వ.]

ఋశభుడు పుత్రులకు నీతిని ఉపదేశించుచు పై విధంగా పలికెను. దేహమును జయించినవాడే కైవల్యాన్ని పొందగలడనీ, నిజమైన సంతోషాన్ని జితేంద్రియుడే పొందగలడని పై వాక్యం తెలుపుచున్నది. అదియే నిజమైన దర్మం.

"జనక గురు సుహృజ్జన నాయక గేహములను జనుచుండుదు
పిలువకున్న సజ్జనులభవా"
(ఆంధ్ర మహాభాగవతము—చ.స్కం. 68 ప.)

దాక్షాయణీ, దక్షుడు తనను పిలవకున్నను, అతడు చేసే యజ్ఞ స్థలానికి పోవును. దక్షుడు ఏవగించుకున్నను వినక పై విధంగా పలికెను. ఏ వ్యక్తైనను జనకుని వద్దకు, గురువు వద్దకు, నాయకుల వద్దకు పిలువకున్నను వెడలవలెనని పార్వతి శివునితో పలికెను. దక్షుడు చేసే యజ్ఞానికి వెళ్లుటకే నిశ్చయించుకొనెను. సజ్జనుడు ఎప్పుడును పెద్దలను గౌరవించునని భావం.

" అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు "
[ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 49 ప.]

ఉశీనరదేశానికి రాజైన సుయజ్ఞుడను రాజు చనిపోగా అతని బంధువులందరును కూడి మిగుల దుఃఖింపదొడగిరి. బాలవేషమున యముడచ్చటకువచ్చి, వారి అవివేకానికి మిగుల చింతించుచు, ప్రాణములను రక్షించువాడు, భక్షించువాడు భగవంతుడని తెలియక వీరురోదించుచున్నారనుకొనెను. భగవంతుని దయఉన్నచో అడవిలో రక్షణలేని ఒక అబలుడైనను బ్రతుకును. దయలేకున్నచో రక్షితుడైనవ్యక్తి కూడ మందిరంలో ఉన్నప్పటికి చనిపోవచ్చును. కావున ప్రాణరక్షణం ప్రాణభక్షణం సర్వం భగవంతునిచేతిలో మాత్రమే ఉన్నవని భావం.

"దైవములావుకలవాడు బ్రతుకుగాక చెడునె"
(ఆంధ్రమహాభాగవతము-న.స్కం- 167 ప)

తల్లికడుపు చీల్చుకొని జన్మించిన మాంధాతకు, ఆకలి తీర్చుటకై స్వయంగా ఇంద్రుడేవచ్చి తన బొటనవ్రేలును అందించెను. దైవబలం కలవానిని ఎవ్వరును చెరుపలేరనుటకు పైకథ నిదర్శనమని చెప్పవచ్చును. దైవబలం అన్నింటికన్నను గొప్పదని భావం.

"శోక మోహభయక్రోధరాగశ్రమాదులువాంఛామూలంబులు"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 435 వ.)

అజగరుడను ముని ప్రహ్లాదునకు పైవిధంగా హితబోధచేసెను. శోకమోహాదులన్నింటికి వాంఛయే కారణము. కావున, వాంఛలుడిగినవాడు పరమాత్మలో ఐక్యం కాగలడని భావం.

"సాధురక్షణంబు సజ్జనునకు నెన్నభూషణంబు"
(ఆంధ్రమహాభాగవతము-అ.స్కం. 247 వ.)

దేవదానవులు పాలసముద్రాన్ని తరచగా, అందుండిహాలహాలము ఉద్భవించెను. అట్టి హాలాహలాన్ని శివుడు దేవప్రార్థితుడై మ్రింగెను. సాధురక్షణమే సజ్జనుల కర్తవ్యమని పై కథ మనకు తెలుపుచున్నది.

"తన్నుమాలినచేత తగవుగాదు"
(ఆంధ్ర మహాభాగవతము-అ.స్కం. 579 వ.)

వామనుని వింతకోరికనువినిన శుక్రాచార్యుడు బలినిజాగ్రత్తగా ఉండవలసిందిగా హెచ్చరించెను. దానమిచ్చెదనని వాగ్దానము చేయకూడదని తెలుపును. ఇతడు దేవకార్యర్థియై బ్రాహ్మణవేషములో వచ్చిన విష్ణువే అయివుండునని పలుకును. తన్నుమాలిన దర్మము ఎవ్వరికిని పనికిరాదనీ, అతని కోరికను నెరవేర్చవలసిన అవసరం లేదనీ పలుకును. 'తన్నుమాలిన దర్మము మొదట చెడ్డ బేరమ'నునది తెలుగు సామెత.

"పాపాత్ముని పాపమునకు భారముగలదే"
(ఆంధ్ర మహాభాగవతము—దశ.స్కం. 77 వ.)

సర్వరక్షకుడైన, సర్వ పాపములను నశింపచేయగలిగిన కృష్ణ భగవానుని పైననే కక్షగట్టిరనిన పాపాత్ముని పాపాలకు హద్దే లేదని భావము. ఇతరులకు అపకారం చేయువాడే పాపాత్ముడనియు భావం. ఉపకారాన్ని చేయువాడు సన్మార్గుడు.

"సత్యంబు పలుకుట సర్వ ధర్మంబులకు మిక్కిలి"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము—తృ.ఆ. 45 వ.)

అన్ని ధర్మములలోకి పరమధర్మం సత్యాన్ని పలుకుటే అని భావం.

"సత్యంబున వృత్తంబుసొప్పడు"

(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 146 వ.)

సత్య ప్రాధాన్యాన్ని తెలిపే వాక్యం.

"ధర్మంబున సత్యంబు దొరకొను"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ 146 వ.)

ధర్మానికి, సత్యానికి ఉన్న అవినాభావ సంబంధాన్ని తెలిపే వాక్యం.

"ధర్మంబులకెల్ల పెద్దయండ్రు సత్యంబు"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 96 వ.)

సత్యాన్ని మించిన దర్మమే లేదని భావం.

"శీలంబున ధర్మము వెలయు"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము—తృ.ఆ. 146 వ.)

శీలము కలిగి ఉండుటే ధర్మపరుని లక్షణమనీ, శీలము వలన ధర్మము అభివృద్ధి చెందుననీ భావం.

"తమయంత గుడిచి క్రొవ్వి మీ దెఱుంగరు"

(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-చ.ఆ. 12 వ.)

గాంధారితో కృష్ణుడు కౌరవులు చేస్తున్న దుష్కృత్యాల గూర్చి తెలుపుచు పై విధంగా పలికెను. అనవసరంగా ఒకరికి అపకారము చేసేవారిని గూర్చి 'బాగా తిని బలిసినాడనుట' పరిపాటి. అది ఒక పలుకుబడి.

"దైవము తోడ్పడంగ ఫలసిద్ధులు సేకుఱున్"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము—ద్వి.ఆ. 167 వ.)

ఏ పని చేయుటకైనను దైవము తోడయిన యెడలనే ఫలసిద్ధి కలుగునని భీష్ముడు ధర్మరాజుతో పలికెను. ధర్మపరునకు మాత్రమే దైవబలముండును.

"దైవకృతము దప్పింపరాకున్కి"

(ఆంధ్ర మహాభారతము-స్త్రీ పర్వము-ప్ర.ఆ. 95 వ.)

దైవకృతాన్ని తప్పింప వీలుకాదని గాంధారి సైంధవుని కళేబరాన్ని చూచి విలపించును. దుస్సల దురదృష్టాన్ని తలచుకొని రోదించుచు పై విధంగా పలికెను.

"దైవమెవ్వరినెట్లు చేయజాలదేమి"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 5 వ.]

ఏకాదశాక్షౌహిణీ సైన్యసమేతుడై ప్రకాశించు దుర్యోధనుడు తుదకు ఏకాకియై విదురుని నీతి బోధలను తలంచుకొని తాను వానిని వినకపోయితినే అని విచారిం-చుచు, దగ్గరలోనున్న మడువులో ప్రవేశించెను. భగవంతుని చేతిలో ఎంతటివారైన ను కీలుబొమ్మలే అనుటకు పై సన్నివేశాన్నే ఉదాహరణంగా గైకొనవచ్చునని మిక్కిలి బాధతో సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను. దైవాన్నెవ్వరును ఎదిరించ లేరని భావం.

"దైవంబనేర్చుగాక"
(ఆంధ్ర మహాభారతము—శల్యపర్వము-ద్వి.ఆ. 237 వ.)

పదకొండు అక్షౌహిణుల సైన్యాన్ని కోల్పోయి, ఏకాకియై మడుగులోనొచ్చి, దర్మరాజాది పాండవుల సూటిపోటి మాటలను భరించలేక గదచేతబట్టి ఒంటిగా భీమునితో తలపడిన దుర్యోధనుని దురవస్థనువిని ధృతరాష్ట్రుడు సంజయునితో పై విధంగా పలికెను. ఏదైనను దైవాధీనమని పలికెను.

"కాలసంప్రాప్తియేరికి గడపవచ్చు"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 382 వ)

భీముడు ఎడమకాలితో తన్నగా దుర్యోధనుడు ధూళిధూసరితమైన ముఖాన్ని సవరింపచేసికొనుచు దర్మరాజును నిందించును. భీష్మద్రోణాది కురువీరులు కొలుచు చుండగా నేలనాలుగు చెరగులనున్న సామ్రాజ్యాన్ని పాలించు తనకీ దురవస్థ కాలమహిమ వలననే కలిగెననీ, కాలసంప్రాప్తిని ఎవ్వరును తప్పింపలేరనీ విచారిం చెను. కాలమహిమ గొప్పదని భావం.

"కాలోపహతమనస్కుడు మేలు తెరువువట్టునెట్లు"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 368 వ)

"ఉడుపంజాలుదురే దైవసంపాదితముల్"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 368 వ)

కృష్ణుడు గాంధారి, ధృతరాష్ట్రులను ఊరడించుచు, దుర్యోధనుడు అంతకు ముందు చేసిన దురాగతముల ఫలితమునే అనుభవించుచున్నాడని ఓదార్చెను. కాలోప

హతుడైనవ్యక్తికి సదసద్వివేకముండదు. అన్నింటిని కాలమే పరిష్కరిస్తుంది. కాలోపహతుడైన వ్యక్తికి మేలేదో, కీడేదో తెలియదని ఊరడించెను.

అదీకాక దైవకార్యాన్ని ఆపుట ఎవరితరం కాదనీ, సమస్త ప్రాణికోటి దైవాజ్ఞచే చరించుచున్నదని తెలుపుచు, కృష్ణుడు వానినూరడించెను.

"ఎట్టిపనియుభరమె దైవమునకు"
(ఆంధ్ర మహాభారతము-స్త్రీపర్వము-ద్వి.ఆ. 155 ప.)

గాంధారి చనిపోయిన కౌరవవీరుల శవాలను ఒక్కొక్కటినే స్పృశించుచు, వారిని తలచుకొని మిగులవిలపించెను. దైవకృతాన్ని ఎవ్వరును అధిగమించలేరనుచు మిక్కిలి దుఃఖించెను. 'విధిబలీయమైనది' అనునది నిత్యసత్యము.

"నీతిమంతులు ధర్మనిరతులు దక్షులునగువారు సేయుగార్యములు గొన్ని సిద్ధింపవు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 68 ప.)

దైవబలం లేనివారెంతటి గొప్పవారైనను కార్యసిద్ధి పొందలేరని భావం.

"లెస్సయెగ్గుసేసినవారికి సేత, యార్యజనములుగీర్తింతురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 39 ప.)

అపకారం చేయకుండుటే గొప్పకార్యమని ఆర్యజనులు చెప్పెదరు.

"కాలమునేమనవచ్చును"
[ఆంధ్ర మహాభారతము-మహాప్రస్థానిక పర్వము-ఏకాశ్వాసము 16 వ.]

అన్నిటికన్నను కాలమే గొప్పదను సత్యాన్ని తెలుపుచున్నది.

"హింసాకరంబగు సత్యంబు ధర్మంబుగాదు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణ పర్వము-తృ.ఆ. 78 ప.)

ధర్మరాజు చెప్పిన అబద్ధంచే ద్రోణుడు మరణించెను. ఆసన్నివేశం ధర్మరాజుపై అర్జునునకు దురభిప్రాయము కలుగుటకు దారతీసింది. అప్పుడు కృష్ణుడు అతనికి కౌశికుడను ముని కథను వివరించెను. బందిపోటు దొంగలు కొంతమంది వర్తకులను తరుముచు ధనాన్ని దోచుకొనుటకు ప్రయత్నించిరి. అప్పుడు వర్తకులు కౌశికముని

సమీపముననున్న చెట్ల పొదలో దాగుకొనిరి. వారిని తరుముచువచ్చిన దొంగలు వర్తకులెచ్చటకు వెడలిరని కౌశికునడగగా, అతడు తనకు అసత్య వచనమున పాపము కలుగునేమోయని, వచ్చినవారు దొంగలని తెలిసీ, వారు అమాయకులైన వర్తకుల ప్రాణముల తీయుటకే సిద్ధపడిరని తెలిసీ, వర్తకులు పొదలచాటున ఉన్నారని తెలిపెను. బందిపోటుదొంగలు వర్తకులను చంపి, ధనమును గొంపోయిరి. కౌశికునకు నరకప్రాప్తి జరిగెను. కావున హింసాకరమైన సత్యము చెప్పకూడదనీ ధర్మరాజు చెప్పిన అబద్ధములో తప్పేమి లేదనీ కృష్ణుడర్జునునకు తెలిపెను. అది నిత్యసత్యము.

"పురుషకారంబునంజేసి దైవంబు నివర్తింప నెవ్వరోపుదురు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-చ.ఆ. 114 వ.)

అజగరబంధితుడైన భీముడజగరముతో పైవిధంగా పలికెను. ఎంత గొప్ప వ్యక్తి ఐనను దైవశాసనము ఉల్లంఘింపలేడని భావం.

"తప్పపలుకనగునె ధార్మికులకు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 79 వ.)

తనను గుర్తించలేకపోయిన దుష్యంతునితో కోపంగా శకుంతల ఆ విధంగా పలికెను. ధార్మికుడెప్పుడును తప్పుగా మాట్లాడకూడదు.

"తిర్యగ్జాతులు దర్మ మెరుంగవు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 322 వ.)

భీముడు సౌగంధికహరణార్థం వెడలుసందర్భాన హనుమంతుడతనికి ఎదురై అతనిదారికెదురుగా పడుకొనును. అచర్యకు భీముడు కోపమునకురాగా, హనుమంతుడు వ్యంగ్యంగా పైవిధంగా పలికెను. జంతువులకు ధర్మము తెలియక పోవచ్చును గాని మనుష్యులకెట్లు, తెలియదని ఎద్దేవాచేయును. జ్ఞానమొక్కటే. మానవులను పశువులనుండి వేరుచేయునని ఆరోక్తి..

"జ్ఞానోహి తేషాం అధికో విశేషా
జ్ఞానేనహీనా పశుభిస్సమానః"1

1. సూక్తి ముక్తావళి — 84వ పే.

"భూరిగుణులనిర్జితారివర్గులై వెలుంగువారి దైవంబరక్షించు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 14 వ.)

అసూయతో ధృతరాష్ట్ర కుమారుడైన దుర్యోధనుడు పాండవులకు చేసే అపకారాలెల్లను వ్యర్థమవుచుండెడివి. సన్మార్గులను భగవంతుడు రక్షించుననుటకు పాండవులే నిదర్శనమని చెప్పవచ్చును. సత్కర్మలు చేసిన పుణ్యమును, దుష్కర్మలు చేసిన పాపమును కలుగును. సజ్జనులను భగవంతుడే రక్షించును.

"సజ్జన సందర్శనంబెప్పుడు వృథగాదు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 223 వ.)

యమధర్మరాజుతో సావిత్రి పైవిధంగా పలికెను. సజ్జనుల దర్శనమెప్పటికిని వృధాకాదనీ అతనితో తెలుపుచు, ఆమె తన పతిప్రాణములను కాపాడుటకు ప్రయత్నించి, సఫలీకృతయగును. సజ్జనుని ఆశ్రయించిన వానికెన్నటికిని నష్టముకలుగదని పై కథవలన మనకు తెలియుచున్నది.

"అజ్ఞానంబాపదలకును దుర్గతికిని మూలము"
[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 400 వ.]

భీష్ముడు ధర్మరాజునకు విషయ వివరణ చేయు సన్నివేశము లోనిది. ఆపదలన్నింటికిని అజ్ఞానమే మూలము.

"ఆచారంబున ధర్మంబుపుట్టు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 347 వ.)

ధర్మమునకు మూలము ఆచారము. ఆచారమును పాటించువాడు ధర్మమును పాటించువాడని అర్థము.

"నిస్సారపు సంసారమునకు కారణముమమత్వము"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 98 వ)

వ్యాసుడు శుకునకు హితబోధచేయుచు పైవిధంగా పలికెను. నిస్సారమైన సంసారమునకు మూలము మమత్వం. కావున మమత్వమును సజ్జనుడు వదలిపెట్టవలెనని భావం.

"దుష్టబుద్ధులు క్రూరుల్లై చేయగొన్న విశేషసిద్ధిబొందు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 68 ప.)

ధర్మవ్యాధుడు కౌశికునితో ధర్మసూక్ష్మలను వివరిస్తూ పైవిధంగా పలికెను. కొన్ని కార్యాలు ఎంతనీతిమంతుడు చేసినను సిద్ధిని ప్రాప్తదవు. అదే కార్యాన్ని దుర్మార్గుడు చేసినయెడల ఒక్కొక్కమార్గు ఫలసిద్ధి కల్గుతుంది. కాబట్టి కేవలం ఫలితాన్ని బట్టి మాత్రమే మంచిచెడులను, నిర్ణయించగూడదని భావం.

"దుష్కృతంబులయందనారంభులయ్యును జనులు దుర్జన దర్శన స్పర్శన సంభాషణ హసనంబులంజేసి ధర్మహీనులగుదురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 7 వ.)

ప్రజలు పాండవులతో పైవిధంగా పలికిరి. చెడ్డపన్ని చేయనివారు సైతం దుర్జనుల సహవాసముచే, స్పర్శచే, సంభాషణముచే ధర్మవిహీనులయ్యెదరని పలికిరి. చెడుస్నేహం మంచివారికి పనికిరాదని భావం.

"అరాతులు సాధుల మెత్తురే"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ప్ర.ఆ. 26 ప.)

యుధిష్ఠిరాదులు దుర్యోధను వద్దకు రాయబారిని పంపుటకు నిశ్చయించుకొనిరి. అజ్ఞాతవాస సమయంకూడ సమాప్తమైనది. కావున రాయబారం ద్వారా విషయాన్ని తెలిపి, రాజ్యాన్ని తిరిగి పొందవలెనని ధర్మరాజాదులు ఆలోచించిరి. దానికి సాత్యకి అడ్డుపడి పై విధంగా సమాధానమిచ్చెను. "శత్రువులెప్పుడును సాధువులను గౌరవించరు. కావున రాయబారం వ్యర్థమని తెలిపెను.

"ఎవ్వలన ధర్మంబుగలుగు నవ్వలనికి జయంబుగలుగుట దప్పదు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 126 వ)

"సత్యమేవ జయతే", "ధర్మమేవ జయతే" అనునవి ఆర్యోక్తులు-పాండవులు ధర్మపరులు కావున వారికే జయం గలుగునని శల్యుడు కర్ణునితో పలికెను.

"స్వధర్మే నిష్ఠుండగు వాని నిందింపజనదు"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం. 94 వ)

సతీదేవి తండ్రితో శివుని మహాత్మ్యాన్ని గూర్చి తెలుపుచు, యోగి జనులను అవమానము చేయకూడదనీ, వారు స్వధర్మాన్ని మాత్రమే పరిపాలిస్తున్నారనీ తెలిపెను. కర్మలన్నింటికి సదాశివుడు అతీతుడు కావున, అతనిని క్రియాశూన్యుడని నిందించుట సమంజసముగాదని సతీదేవి తండ్రిని నివారింప ప్రయత్నించెను.

"కులంబునకై యొకనిందొఱంగుటయ నీతి"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ.89 వ)

"నీతి", "ధర్మము" ఒకే అర్థమున ప్రయోగింపబడినవి. కుల హాని చేయు కొడుకున్న యెడల, అతనిని వదలించుకొని కులం రక్షించుటయే మేలని విదురుడు ధృతరాష్ట్రునితో పలికెను. కులహానిని చేసే వారిని క్షమింపకూడదని భావము.

"రాజ్యంబును త్రివర్గంబును ధర్మ మూలంబులు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 48వ)

విదురుడు ధృతరాష్ట్రునితో పై విధంగా పలికెను. రాజ్యానికి కాని త్రివర్గానికి కాని మూలం ధర్మం. ప్రపంచమునకు ధర్మం మూలమని భావం.

"కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 50వ)

కులదూషకుడైన దుర్యోధనుని దూషించి, కులాన్ని రక్షించుకోవలసిందిగా ధృతరాష్ట్రునకు విదురుడు సలహాను ఇచ్చెను. కులములో ఒకడు దుర్మార్గుడుండిన, అతనిని సంహరించి ఐనను కులాన్ని రక్షించుకోవలసినదని ఆర్య ధర్మములు తెలుపుచున్నవి. అట్లు రక్షించుకొనుట ధర్మమని పలికెను.

"ఎల్లయందును ధర్మసద్భావ మొక్కని కేర్పరింపగ బ్రహ్మకైనను బోలునే"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 236 వ)

వికర్ణుని విజ్ఞతతో కూడిన పలుకులను విని, విదురుడు పై విధంగా పలికెను. పాంచాలి ఏకవస్త్రగా ఉన్నదని తెలిసీ, ఆమెను సభలోనికితెచ్చుట తప్పని తెలిసియు అచ్చటనున్న పెద్దలెవరును పలుకకుండిరి. వికర్ణుడు చిన్నవాడైనను నిజాన్ని ధైర్యంగా పలికెను. కావున ధర్మము చెప్పిన చిన్నవారైనను గౌరవనీయులేనని భావం.

"వృత్తంబున బలంబువాటిల్లు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 147 వ.)

"సత్యంబున వృత్తంబు నొప్పడు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 146వ)

"ధర్మంబున సత్యంబు దొరకును"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 146 వ)

ధర్మరాజునకు భీష్ముడు ధర్మార్థ కామముల గూర్చి తెలుపుచు పై విధంగా పలికెను. శీలమువలన ధర్మమును, ధర్మంవలన సత్యమును, సత్యమువలన చరిత్రయు, చరిత్రచే బలమును కలుగుననీ భీష్ముడు పలికెను. కావున అన్నింటికి మూలం ధర్మమని భావం. ధర్మం శీలం వలన ఏర్పడునని భావం.

"ఏక రూపంబైన యర్థంబనేక విధంబులగునట్లు
ఏక బ్రహ్మంబు అనేకంబుగ దోచు"
[ఆంధ్రమహాభాగవతము-తృ.స్కం. 1016 వ]

ఒకే విధంగా కనిపించు అర్థము అనేక రీతుల ఎట్లు గోచరించునో, అట్లే ఒక బ్రహ్మ పదార్థం పలు రూపములలో కనిపించునని భావం. బ్రహ్మ పదార్థం ఒక్క-టేనని దాని భావం.

"పాపనిరూఢుండు శాంతింగాంచునే"
(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 107 వ.)

అశ్వత్థామకు శివుడు భూతాకృతిలో కనుపించి, అతడు చేయబోవు చెడు పనులను ఎన్నోవిధాల ఆపుటకు ప్రయత్నించును. కాని అతడు చేసిన ప్రయత్నా లన్నీ వ్యర్థమైనవి. ఏవిధంగానైతే పాపాత్ముడు శాంతిని కోరుకొనడో, అట్లే అశ్వ త్థామ తాను చేయాలనే దుష్టమైన పనిని వదలివేయకుండెను.

"శతాపరాధమును సహస్ర దండమునులేవు"
(ఆముక్తమాల్యద - చ.ఆ. 257 ప)

ఎంత తప్పుచేస్తే అంతే శిక్షవేయుట ధర్మం కాని, అపరాధాన్ని మించిన శిక్ష వేయుట అధర్మమని పైవాక్యం తెలుపుచున్నది.

"విధాతకృత్యమేలాదప్పు"
(ఆముక్తమాల్యద - పం.ఆ. 101 ప)

విధాతకృత్యములను విమర్శించు హక్కెవరికీ లేదనీ, ధర్మాదర్మములను భగవంతుడే నిర్ణయించుననీ భావం.

"దైవికమునెదుట యుక్తులు ఫలింపవు"
(ఆముక్తమాల్యద - పం.ఆ. 147 ప)

అన్నిటికి మూలం దైవమే అని, దర్మాదర్మములకు మూలం భగవంతుడే అని భావం. భగవంతుని నిర్ణయాన్ని ఎవ్వరును తప్పింపలేరని భావం.

"అమృతమైనను చవులజాత్యన్నసమమె"
(ఆముక్తమాల్యద - ష.ఆ. 34 ప)

ఏజాతివారికి ఆజాతి భోజనం ఎట్లు రుచికరంగా ఉంటుందో, అట్లే వారిజాతి ధర్మముకూడ అనుసరణీయమని భావం.

"పుణ్యమమ్ముట కప్పురంబువెట్టి యుప్పుగొనుట"
(ఆముక్తమాల్యద - ష.ఆ. 62 ప)

ఒకసత్కార్యంచే పుణ్యము కలుగును. చెడుపని చేసిన ఎడల పాపం కలుగును. తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశించి పాపం చేసినయెడల మానవుడు వ్యర్థజీవుడవునని భావం. విలువైన కర్పూరాన్ని వదలి, ఉప్పును తీసుకొన్నట్లుగా వుంటుందని భావం.

"దప్పిగొన్నవారు పాలుత్రాగరు"
(ఆముక్తమాల్యద - చ.ఆ. 165 ప)

ఎప్పటికి ఏదితగిందో, దానిని ఆచరించుటే తగిందనీ, అదే ధర్మమనీ భావం. ఏవిధంగానైతే దప్పితో ఉన్నవారు పాలు తాగక నీళ్లేతాగుతారో, అట్లే ఉచితం, అనుచితములను అనుసరించి ప్రవర్తించుటే తగిందని భావం.

"కారణగుణంబు కలుగదే కార్యమునను"
(ఆముక్తమాల్యద - చ.ఆ. 174 ప)

ఏకార్యము చేయుటకైనను కారణముండుట ధర్మమని భావం.

"శరీరమాద్యంఖలు ధర్మసాధనం"
(సారంగధర చరిత్రము - ద్వి.ఆ. 184 ప)

అన్నిధర్మాలకు మూలం మానవుడు. అట్టి మానవుని ఆరోగ్యం, శరీరారోగ్యం పైన ఆధారపడి వుంటుంది. కావున శరీరం, అన్ని ధర్మాలకు మూలమవుతుంది. కావున ఎప్పుడును శరీరం ఆరోగ్యంగా ఉండవలెనని భావం. ఆరోగ్యకరమైన శరీరములో ఆరోగ్యవంతమైన ఆలోచనలుండునని బుద్ధుడు తెలిపెను. కావున ధర్మమును సాధించుటకై శరీరమును ఉపయోగించవలెను.

"ఇంట గెలిచి రచ్చ గెల్వుము"
(సారంగధర చరిత్రము - ద్వి.ఆ. 261 ప)

ఇంటగెలిచి రచ్చగెలుచుటయే నిజమైన ధర్మం.

"రాజానుమతంబు ధర్మము."
(సారంగధర చరిత్రము - ద్వి.ఆ. 278 ప)

పూర్వకాలములో రాజులచే పరిపాలింపబడు రాజ్యాలుండేవి. ఏ కార్యమైనను రాజును అనుసరించి వుండెననునది నిజము. ధర్మం సైతము రాజును అనుసరించియే ఉండును.

"చనునెదుర్జను సంగతి సాధులకును"
(సారంగధర చరిత్రము - తృ.ఆ. 68 ప)

సజ్జనులకు దుర్జనులతో స్నేహము పనికిరాదను భావాన్ని తెలుపుచున్నది.

"తానొకటి దలప దైవము తానొకటిదలచు"
(సారంగధర చరిత్రము - తృ.ఆ. 91 ప)

సామాన్యమానవుని అనుభవానికి దర్పణమవి చెప్పదగిన వాక్యం.

"దైవకృతమునకిలనసాధ్యంబుగలదె"
(మను చరిత్రము - ద్వి.ఆ. 13 ప)

అన్నిటికంటె దైవశక్తి గొప్పదని భావం. దైవసహాయము లేకుండా ఎంత గొప్పవారైనను విజయాన్ని పొందలేరని భావం.

"ఆనందో బ్రహ్మ"
(మను చరిత్రము - ద్వి.ఆ. 62 ప)

ఆనందము బ్రహ్మ పదార్థమనీ, ఆనందంగా ఉండుటే సమంజసమైనదనీ భావం.

"కలంచునే సతులమాయల్ ధీర చిత్తంబులన్"
(మను చరిత్రము - ద్వి.ఆ. 68 ప)

ధర్మపరుడైన, ధీరుడైన వ్యక్తిని ఎవ్వరును వంచించలేరని భావం.

"దైవము దోసకారులకె తోడై వచ్చునెప్పట్టునన్"
(మను చరిత్రము - తృ.ఆ. 47 ప)

చెడువారికి తాత్కాలికంగా దైవసహాయం లభిస్తుంది. కాని ధర్మపరుడే చివరకు విజయాన్ని పొందగలడు.

"దుర్బలస్య బలం రాజా"
(మనుచరిత్రము - తృ.ఆ. 74 ప)

రాజునకు బలహీనులను కాపాడుటే నిజమైన ధర్మమని భావం. బలవంతునకు సహాయము అక్కరలేదు. కావున దీనులను, బలహీనులను కాపాడుటే రాజధర్మం.

"దైవంబుసేతకు దావంబికనేలవంగ"
(మనుచరిత్రము - పం.ఆ. 32 ప)

భగవంతుని చేతలను ఎవ్వరును అర్థము చేసుకొనిలేరని భావం.

ధర్మార్థకామమోక్షములలో ధర్మం మొదటిది. ఏకార్యముచేయడానికైనను, ధర్మం ముఖ్యం. కౌరవ, పాండవులయుద్ధమును ధర్మయుద్ధంగా పేర్కొనిరి. మానవ పురుషార్థములలో ధర్మానికి మిక్కిలి ప్రాముఖ్యమున్నదనుటకు పైవాక్యము లన్నింటిని పేర్కొనవచ్చును. భారత, భాగవతాదులు ధర్మాన్ని గూర్చి విపులంగా తెలుపుచున్నవి. భరతభూమిని ధర్మభూమిగా పెద్దలు పేర్కొనిరి. కావున మానవుడు ఏ పనిచేయవలెనన్నను ధర్మాధర్మములను విచారించే చేయవలెనని భావం.

ఇంతవరకు ధర్మమునకు సంబంధించిన సామెతలగూర్చి పరిశీలించుట్టైనది.

## 2. అర్థమునకు సంబంధించిన సామెతలు :-

చతుర్విధ పురుషార్థాలలో అర్థానికి రెండవ స్థానమివ్వబడింది. ధర్మయుతమైన అర్థాన్ని మాత్రమే సంపాదించవలెనని పెద్దలనిరి. కావున ధనవంతుడు అదేపనిగా డబ్బును కూడబెట్టు కొనకూడదనీ, డబ్బు ఉన్నంత మాత్రముననే గర్వమును పొంద కూడదని తెలియుచున్నది.

"సంపదనాపదల నొక్క చందమగుట"
(ఆంధ్ర మహాభారతము-ఆశ్రమవాస పర్వము-ప్ర.ఆ.-74వ.)

ధృతరాష్ట్రుడు ధర్మజునకు శత్రురాజుల జయించు విధానాన్ని తెలుపుచు, సజ్జనులెప్పుడును సంపదలలోను, ఆపదలలోను ఒకే మాదిరిగా ఉండెదరని తెలిపెను. కావున సన్మార్గుడెప్పుడును అధైర్యపడకూడదనీ, అట్లని గర్వపడకూడదనీ మనకు దానివలన తెలియుచున్నది.

"అర్థాసక్తుండైనవాడు శుభంబులవడయనోపడు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ.-26వ)

అర్థాసక్తుడైనవాడు ఎప్పుడు శుభముల పొందలేడని శౌనకుడు ధర్మజునకు తెలిపెను. కావున ధర్మయుతమైన అర్థాన్ని మాత్రమే సంపాదించవలెనని భావం.

"పురుషుండు మనంబున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునం
గృతోత్సాహుండు గావలయు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ.-233 వ)

ధర్మరాజుతో ద్రౌపది పై విధంగా పలికెను. అర్థ ప్రాధాన్యాన్ని తెలుపువాక్యం.

"అర్థమయనర్థ మూలము"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ-28 వ)

అన్ని అనర్థాలకు మూలం సంపదనియే అని శౌనకుడు ధర్మరాజునకు తెలిపెను.

"అర్థోపార్జన చింత సేయవలదు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 29వ)

జీవితములో డబ్బు అవసరం ఎంతో కలదు. కాని ఆర్జన కొరకై ఎక్కువ ఆలోచింపకూడదనీ, న్యాయ సమ్మతంగా మాత్రమే ఆర్జింపవలెనని భావం. శౌనకుడు ధర్మరాజునకు హితవు చెప్పు ఘట్టంలోనిది.

"పాడిదప్పియు బొంకియు ధనము గూర్చు పెల్ల పాపములకు నెక్కుడు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ.-218 ప)

భీష్ముడు ధర్మరాజునకు జీవిత ప్రాధాన్యాన్ని తెలుపుచు పై విధంగా పలికెను జీవితములో అర్థ ప్రాధాన్యమెంత ఉన్నప్పటికి అబద్ధమాడి, అన్యాయంగా మాత్రం సంపాదించకూడదని భావం.

"శ్రీమదమున మానవులు చెనకుదు రౌరులన్"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1774 ప)

ధనమదంచే కొంతమంది ఎవ్వరికిని గౌరవమివ్వరు. ఇది నిత్యసత్యం. అన్నింటికంటె ధనమదం నీచమైనది. శ్రీమదంచే ఎవ్వరిని అగౌరవపరచరాదని భావం.

"ఒరుల ధనము వికృతియై గొనుటది ధర్మువగునె (కాదు)"
(ఆంధ్ర మహాభారతము—సభాపర్వము-ద్వి.ఆ. 204 ప)

పరధనాన్ని ఆశించుట పరమ పాతకమని విదురుడు దుర్యోధనునకు హితవు చెప్పెను. కావున పాండవులకు న్యాయముగా ఇవ్వవలసిన రాజ్యాన్ని, గౌరవాన్ని ఇవ్వవలెనని విదురుడభిప్రాయపడెను.

"పరధనహరణము దురితము"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-చ ఆ. 347 ప)

వామదేవుడనే ముని శలుడను రాజుతో పై విధంగా పలికెను. పరుల ధనాన్ని అపహరించుట సమంజసమైనది కాదనీ, ఇతరుల సొమ్మును ఆశించకూడదనీ భావం.

"దారిద్ర్యంబు కంటె కష్టంబు ఒండెద్దియును లేదు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-షం.ఆ.-217 ప)

ద్రోణుడు ద్రుపదునిచే అవమానితుడై పై విధంగా చింతించును. ఆంగ్లములో సమానార్థము ఇచ్చు "Poverty is Crime" అను సామెత కలదు. అన్నిటికంటె దారిద్ర్యమే మిక్కిలి అవమానకరమనునది నిత్య సత్యం.

"నిధిగన్న పేదయుబోలెన్"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 169 ప.)

దేవవ్రతుని సకలవిద్యాపారంగతున్నిచేసి గంగాదేవి అతనితండ్రి అగు శంతనునకు ఇచ్చెను. అప్పుడతను నిధిని కనిన పేదవలె సంతోషపడెను. పేదవానికి ధనమే మిక్కిల సంతోషాన్ని కలిగింపచేయుననునది నిత్యసత్యము.

"నిత్యమయిన ధనము నిర్మల కీర్తియ"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-అ.ఆ. 31 ప)

భీష్మద్రోణులు దుర్యోధనునకు హితవు చెప్పుచు, పాండవులకు అర్ధ రాజ్యమివ్వవలసిందిగా పలికిన సందర్భములోనిది. నిజమైన ధనం కీర్తియే. కావున ఎవ్వరైనను ధనార్జనయందుగాక సత్కార్యములు చేయుటయందు ఆసక్తిని చూపవలెనని భావం.

"చవుటనిడిన విత్తు చాడ్పు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 218 ప)

భీష్ముడు ధర్మరాజుకు ధర్మసూక్ష్మాలను తెలుపు సన్నివేశంలోనిది. అన్యాయముగా, అబద్ధములాడి డబ్బును సంపాదించుట పాపమనీ, చవిటి నేలలో పడిన విత్తనములవలె వ్యర్థమగుననీ భీష్ముడు తెలిపెను. ధర్మయుక్తమైన అర్థమునకే గౌరవముండునని భావం.

"శ్రీ రామోకాలొడ్డినట్లు"
(ఆంధ్రమహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ.- 343 ప)

నారదాదిమునులు దుర్యోధనునితో పాండవులతో వైరం క్షేమకరం కాదనీ, వారి పొత్తును నిరాకరించుట "శ్రీరామోకాలొడ్డినట్ల"గునని పలికిరి. "సిరి రామో కాలడ్డుట"-అనునది తెలుగు సామెత. పై వాక్యం ఆ తెలుగు సామెతకు రూపాంతరమై యుండును.

"పాపకారులకు బాయునవశ్యము నర్థ ధర్మముల్"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము—ద్వి.ఆ.136 ప)

పాపాత్ములకు అర్థమ్ము, ధర్మములు నశించును. కావున పాపములు చేయ కూడదని ధృతరాష్ట్రుడు దుర్యోధనునకు హితవు చెప్పను. అది నిత్య సత్యం.

"పాసెంబడిగిన వారే పేదలె"
(ఆముక్తమాల్యద-పం.ఆ.-58 ప)

పేదవారైనచో దానంగా పాసెం అడగలేరు. పాసెమడిగేవారు ధనవంతులే. కావున ఎవ్వరైనను పాత్రోచిత దానమునే చేయవలయుననీ, వారివారి ఆర్థిక పరిస్థితి నిబట్టియే ప్రవర్తించవలెనని భావం.

"పట్టినదియెల్ల బంగారుగట్టుగాగ"
(విజయవిలాసము-తృ.ఆ. 260 ప)

డబ్బుపై, బంగారంపై ఎవ్వరికైనను మక్కువ ఎక్కువ. చేపట్టిన ఏ పనైనను విజయవంతమైన యెడల పై విధంగా పలుకుట సర్వసామాన్యము - బంగారపు ప్రాధాన్యాన్ని పై సామెత వివరించుచున్నది.

పై సామెతలన్నియు పురుషార్థములలో అర్థ ప్రాధాన్యాన్ని తెలుపునవి. అర్థమును సంపాదించవలెనుగాని అధర్మయుతంగా కాదని పై వాక్యములు తెలుపుచున్నవి.

## 3. కామమునకు సంబంధించిన సామెతలు:

చతుర్విధ పురుషార్థములలో కామము తృతీయమైనది. ధర్మార్థయుతమైన కామాన్ని మాత్రమే మానవుడు అనుభవింపవలెనని ధర్మశాస్త్రాలు తెలుపుచున్నవి. ధర్మార్థములతో కూడిన కామమనగా వివాహ సుఖమని అర్థము. భార్యను తప్ప ఇతర స్త్రీలను తల్లితో సమానంగా చూడవలెనని హిందూ ధర్మశాస్త్రాలు తెలుపుచున్నవి.

కామాతురులైనవారు దేవిని జయించలేరనియు, ఏ కార్యాన్ని సాధించలేరనీ ఈ క్రింది వాక్యము తెలుపుచున్నది.

"పరవశాత్మల్ గారె కామాతురుల్"
(సారంగధర చరిత్రము—తృ.ఆ. 63 ప)

అట్లాగే కామాంధుడైనవాడు ఎంతటి నీచ కార్యాన్నైనా చేయుటకు వెనుదీయ డనీ, అందువలననే అధర్మ కామము విసర్జనీయమని ఈ క్రింది వాక్యం తెలుపు చున్నది. అధర్మకామాన్ని పెద్దలు నిషేధించిరి.

"కామాంధు చిత్తుడెవ్వరి వధింపడెటు సేయడేమిగాడు"
(మనుచరిత్రము-ష.ఆ.-48 ప)

స్త్రీ బుద్ధి చంచలమైనదనీ, అందువలన పురుషుడు స్త్రీలతో కడు జాగ్రత్తతో ప్రవర్తించవలెనని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"ఎఱుకగలరెమగువలెందు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ద్వి.ఆ.-33 ప)

ఇది భారత కాలంనాటి అభిప్రాయమై ఉండును.

అదే అభిప్రాయం మహాభాగవత కాలం నాటికిని ఉన్నదనుటకు ఈ క్రింది వాక్యమును ఉదాహరణంగా గైకొనవచును.

"చెలువల నమ్మంగ వేద సిద్ధాంతములే"
(ఆంధ్ర మహాభాగవతము-ఆ.స్కం. 309 ప)

కేవలము వేద సిద్ధాంతాలను నమ్మవలయును. స్త్రీల వాక్యాలు నమ్ముటకు వీలులేదని భావము.

"స్నేహంబున రాగంబును రాగంబున కామంబును,
కామంబున క్రోధంబును దృష్ణయువర్తిల్లు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ.-24 వ.)

శౌనకుడు ధర్మరాజుతో పై విధంగా పలికెను. స్నేహమువలన ప్రేమయు, ప్రేమ వలన కామమును, కామం వలన క్రోధము మరియు తృష్ణ ఏర్పడును. కావున, స్త్రీలతో స్నేహం పనికిరాదను భావాన్ని వెలిబుచ్చెను. స్నేహం అనగా కలయిక అను అర్థము కూడ కలదు. పరస్త్రీలతో కలయిక పనికిరాదని అభిప్రాయం.

"అంగనా సంగమము దోషమండ్రు"
(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 997 వ)

గర్భస్థుడగు జీవి భగవంతుని స్తుతించుచు, అంగనా సంగమము దోషమనియు, సంగమమువలననే సంసారమాయలో జీవి కూరుకుని పోవుననీ నుడివెను. స్త్రీ సంగమము దోషమని సర్వమతములు తెలుపుచున్నవి.

"కామంబు భక్తి యోగంబునకు నంతరాయంబు"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం -371 వ)

హిరణ్యకశ్యపుని వధించిన నరసింహమూర్తిని శాంతింపజేయుట ఎవ్వరి తరము కాదు. అప్పుడు ప్రహ్లాదుడే భక్తితో అతనిని శాంతింపచేయును. శాంతించిన నరసింహమూర్తి ప్రేమగా నీవేమి కోరుకొనెదవని ప్రహ్లాదుని అనగా అతడు పై విధంగా సమాధానమిచ్చెను. సర్వానర్థములకు మూలం కామము. కావున,కామమును త్యజించగలుగు శక్తిని ప్రసాదింపుమని భగవంతుని వేడెను. నిష్కామక్రియయే ఉన్నతమైనదని భావం. కామం భక్తియోగమునకు అంతరాయాన్ని కలిగించును. కావున దైవభక్తుడు ఎప్పుడును కామాన్ని త్యజించవలెను.

"ఇంద్రియంబులు విషయరతి పరిగ్రహించినట్టులు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ.-107 వ)

జితేంద్రియుడు ప్రపంచములో ఏ కార్యాన్నైనను సాధించును. జితేంద్రియుడే భగవంతుని కరుణకు పాత్రుడు. కాని ఇంద్రియములపై ఆధారపడినవాడు చెడును. ఎందుకనగా ఇంద్రియాలు విషయరతిని మాత్రమే పరిగ్రహించును.

"బంధనంబులలో నెల్లబరమ బంధనంబుగామంబు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 190 వ)

శకునితో వ్యాసుడు పై విధంగా పలికెను. బంధనములన్నిటిలోనికి కామము పెద్ద బంధనమవి, కామమును జయించినవాడు ప్రపంచములో దేన్నైనను జయించగలుగునని భావం.

"ఆవగాఢపు పొత్తుమనంగ వచ్చునే"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-తృ.ఆ.-33 వ)

సోదరుని మరణమునకు సుధేష్ణ మిక్కిలి విలపించెను. విరాట మహారాజు ఆమెను అనయించుచు, ద్రౌపదిని ఏ పురుషుని సమక్షములోనికి తీసుకొనిరాకపోవుటే ఉత్తమమని పలుకును. ద్రౌపది మిక్కిలి అందగత్తె. ఆమె అందం అందరిని ఇక్కట్ల పాలుచేయునని భావం. సుధేష్ణ సైతం తాను చేసిన తప్పును తెలిసికొని, తాను సైరంధ్రితో జాగ్రత్తగా ఉండుటకే నిశ్చయించు కొనును. అధర్మ కామం పనికిరాదని భావం.

"మనుజవిభులకు ప్రమదాజనులయెడ వావివెదుకజనదు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ష.ఆ. 171 ప)

సైంధవుడు ద్రౌపదితో పైవిధంగా పలికెను. ఇది అతని దుష్టబుద్ధిని తెలుపు చున్నది. "కామార్తాహిప్రకృతి కృపణాశ్చేతనాచేతనేషు" యని కాళిదాసు మేఘ దూతములో పేర్కొనెను. కామాతురుడైనవానికి వావివరుసలు కనబడవు. ఉచితాను చితములు తెలియవు. కావున కామం సర్వదా విసర్జనీయము.

"మనోజరాగంబువనితల కసహ్యంబయు విశేషంబయియుండు"
[ఆంధ్ర మహాభారతము-అదిపర్వము-ష.ఆ. 222 ప.)

పురుషులకంటె స్త్రీలకే కామమెక్కువ అనే విషయాన్ని పైవాక్యం తెలుపు చున్నది. పురుషులు తమకామాన్ని గూఢంగా తెలిపెదరు. స్త్రీలకు అది సాధ్యం కాదని హిడింబి కుంతీదేవితో పలికెను. తనసోదరుని మరణానికి కారణమైన భీమునే ఆమెవరించెననగా కామమునకు ఎంతటి శక్తి ఉన్నదో తెలియుచున్నది.

"కామశక్తినోర్వగలరెజనులు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 38 ప)

పరాశర ముని దాసరాజు కూతురైన మత్స్యగంధిపై మరులుకొనెను. సాక్షాత్తు మునీశ్వరుడే కామశక్తినోర్వలేక మత్స్యగంధిని కోరుకొనెననగా, కామము ఎంతటి బలీయమైనదో తెలియుచున్నది. సామాన్యజనులు కామశక్తిని భరింపలేరని భావం.

"కామాతురాణాంనభయంనలజ్జా" అనునది సంస్కృతన్యాయము. "ఎంతవార లైనను కాంతాదాసులే"నని త్యాగరాజు పేర్కొనెను.

వివాహం ధర్మకామాన్ని అనుమతించినప్పటికి మనుష్యుడు కామాతురుడై ఉండకూడదని తెలుపుచున్నదీ వాక్యం.

"శిశువునకు దంతములుదయించిన తన్మాతాపితరులకు సంగమము కలుగును"
(ఆముక్తమాల్యద - పం.ఆ. 116 ప)

పుట్టిన శిశువునకు దంతములుదయించువరకు తల్లిదండ్రులు వేరువేరుగానే ఉండవలెనని పైవాక్యంవలన తెలియుచున్నది. ధర్మ కామమునకు సహితము హద్దులున్నవనే సత్యాన్ని ఆవాక్యం తెలుపుచున్నది.

"పరభామలు దోడబుట్టువుల్"
(విజయవిలాసము - ద్వి.ఆ. 102 ప)

పరస్త్రీలను తోడబుట్టువులతో సమానంగా చూడవలెననీ, వారిపై గౌరవాన్ని ప్రదర్శింపవలెనని భావం.

"భామినీ రాజుల చిత్తముల్ దెలియరాదెటుపోయెటువచ్చునోకదా"
(సారంగధర చరిత్రము - ద్వి.ఆ. 7 ప)

సంస్కృతములోనున్న "విశ్వాసోనైవ కర్తవ్యః స్త్రీషురాజకు లేషుచ" అను సామెతకు అనురూపమని చెప్పవచ్చును. స్త్రీమనస్సును తెలిసికొనుట ఎవ్వరితరము కాదని భావం.

"అనృతోదరియనుట సార్థమతివలకెల్లన్"
(సారంగధర చరిత్రము - ద్వి.ఆ. 246 ప)

స్త్రీలను ఎప్పుడును నమ్మరాదనీ కావున పరస్త్రీ స్నేహము పనికిరాదని పై వాక్యం తెలుపుచున్నది. "అబద్ధమునకు మారుపేరు ఆడది" అనే భావాన్ని ఆవాక్యం తెలుపుచున్నది.

విప్రజనులు కామాతీతులనీ, కావున స్త్రీలు ఎప్పుడును విప్రులను కామించగూడదనే భావాన్ని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"విప్రుల జనునే కామింప? మది విచారము వలదే"
(మనుచరిత్రము-ద్వి.ఆ. 52 ప.)

ప్రవరుడు తన అభిప్రాయాన్ని వరూధినికి తెలిపెను.

"వనిత తనంతతావలచి వచ్చిన చుల్కన కాదెయేరికిన్"
(మనుచరిత్రము—ద్వి.ఆ. 66 ప.)

ఏ స్త్రీ యైనను మొదటగా తాను ప్రేమించకూడదనీ, అట్లు ప్రేమించిన స్త్రీని పురుషుడు చులకనగా చూచునని, మిక్కిలి విచారంతో వరూధుని ప్రవరునితో పలికెను. మోక్షాన్ని కోరే మునులు సైతం స్త్రీలోలురే అని వరూధిని ప్రవరునితో పలుకును. స్వర్గములో ఉన్న రంభాది అప్సరసల పొందు కోరి, భూమిపైనున్న అందమైన స్త్రీలను కాదనుట తప్పని ఆమె వితండవాదాన్ని చేయును.

"ఇనుప కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల
దామరసనే త్రుళింద్ల బంధాలు గారె"
(మనుచరిత్రము-ద్వి.ఆ. 73 ప.)

ఎంతవారలైనా కాంతా దాసులేనని భావం. జితేంద్రియుడైనవాడు స్త్రీల మాయకో పడడని, ధీరుడు కామాన్ని జయించునని ఈ క్రింది వాక్యం తెలుపు చున్నది.

"కలంచునే సతుల మాటల్ ధీరచిత్తంబులన్"
(మనుచరిత్రము-ద్వి.ఆ. 68 ప.)

స్త్రీల మనస్సు చంచలమనుటకు మనుచరిత్రలోని క్రింది వాక్యమును ఉదాహరణంగా పేర్కొనవచ్చును. కావున స్త్రీల మనస్సును నమ్మకూడదని భావం.

"క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్"
(మనుచరిత్రము-తృ.ఆ. 69 ప.)

అన్య స్త్రీలతో పొత్తు కూడదని ధర్మశాస్త్రములతో పాటు ఇతర కావ్యాలు కూడా తెలుపుచున్నవి. పర స్త్రీ కామం పనికిరాదని భావం.

"అన్య సతులయందు నాసక్తుడగువాని
దమక మొదలి కూడదలచు కంటె
మరణమైన మేలు మది వితర్కింపగ"
(మనుచరిత్రము-ష.ఆ. 92 ప.)

పై వాక్యాలు అన్య సతీసంగమము కంటె మరణమే మేలను అభిప్రాయాన్ని తెలుపుచున్నది.

అసలు పెక్కు వనితలపై ప్రేమ ఉన్నదని ఎవ్వరైనా చెప్పినచో, అది అబద్ధమేనని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది. ప్రేమ అనేది ఎప్పుడైనను ఒక్క వ్యక్తికే పరిమితమగుననీ, పెక్కు స్త్రీలను ప్రేమించుటనునది అబద్ధమని ఈ క్రింది వాక్యం తెలుపుచున్నది.

"పెక్కు వనితలపై గూర్మిగలుగుననుట బొంకుగాదె తరుణి"
[మనుచరిత్రము-ష.ఆ 74 ప.]

ధర్మయుతమైన కామం మాత్రమే అభిలషణీయమనీ, అదర్మ కామము పనికి రాదని మనకు పై సామెతల వలన తెలియుచున్నది.

## 4. మోక్షమునకు సంబంధించిన సామెతలు :—

మానవుడు ధర్మార్థ కామముల సహాయముతో మోక్షాన్ని పొందవలెను. చతుర్విధ పురుషార్థములలో మోక్షం ముఖ్యమైనది.

"తమకు ముక్తి తంగేటి జున్నొకో"
[ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 190 ప.]

"తంగేటి జున్ను" అనునది తెలుగు పలుకుబడి. పరమ దుర్మార్గుడైన అజామిళుడు సైతం భగవన్నామస్మరణచే అంత్య కాలమున ముక్తిని పొందెనని అజామిళోపాఖ్యానము మనకు తెలుపుచున్నది. భగవన్నామస్మరణమే ముక్తిదాయక మని భావం.

"హరి భజనంబున మోక్షంబు సిద్ధించు"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 213 ప.)

ప్రహ్లాదుడు తన తోటి బాలకులతో మనుష్య జన్మ ప్రభావాన్ని గూర్చి తెలుపును. హరి భజనచే మోక్షము లభించును. కావున హరికీర్తనము అన్ని చదువుల కంటె కూడ ముఖ్యమైనదని ప్రహ్లాదుడు తెలిపెను. హరి భజనము ముక్తి దాయకమనునది నిత్యసత్యం.

"సార విహీనంబులయిన సంసారముల్"
(ఆంధ్ర మహాభాగవతము-ఏకాదశ స్కం. 39 ప.)

విష్ణుమూర్తిని చూచిన వారికి ప్రపంచము గాని, సంసారము గాని సారహీన ములుగా గోచరించును. సత్పురుషుడెప్పుడును సంసారముపై మమత్వమును పెంచుకొనడు.

"త్రివర్గమెరిగి సామ్యమున సేవించువాడు సర్వచిత్తముండు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 245 ప.]

త్రివర్గములనగా ధర్మార్థ కామాలని అర్థం. ధర్మార్థ కామాలద్వారా మోక్షాన్ని సాధించువాడు ఉత్తముడు. కాని ధర్మార్థ కామాలలో ఒకదానికి గాని లేక మూడింటి పైగాని మమత్వమున్నవాడు వ్యర్థుడని భావం. అన్నిటికన్నను మోక్షమే గొప్పదని దర్మరాజు భీమునితో పలికెను.

"ఆత్మబంధంబు గోరునేయార్యుడెందు"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1660 ప.)

ఆర్యుడెప్పుడును ఆత్మబంధాన్ని కోరడు. ఆత్మబంధం నుండి విముక్తియే మోక్షం. కావున ఆర్యుడు ఎప్పుడును మోక్షమునే కోరునని భావం. సత్పురుషుడెప్పు డును భగవంతునిలో లీనమగుటకే ప్రయత్నించును కాని అన్య సుఖాలను కోరడని భావం.

"వాడుదరియించు సంసారవార్ధి"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 46 ప)

భాగవతమును చదివినవాడు పుణ్యాన్ని పొందునన్నీ, భగవంతుడు వారిని సంసార సాగరంనుండి తరింపజేయు మార్గాన్ని తెలుపునని భావం. భగవంతుడే ముక్తి మార్గమని భావం.

"వేదంబులం జేసి యజ్ఞంబులు వర్తిల్లునట్టి యజ్ఞంబువలన దేవతలు తృప్తులగుదురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 347 వ)

"హనుమ-భీము"ని సంవాదము లోనిది. భీమునకు హనుమంతుడు ధర్మాన్ని గూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. "ధర్మోరక్షతిరక్షితః" అనునది ఆర్యోక్తి.

ప్రపంచమే మాయ అని, జగత్తు మిధ్య అనీ ఆర్యులు చెప్పిరి.

"జగత్తు సత్యంబగు"
(ఆంధ్ర మహాభాగవతము-పం.స్కం-ష.ఆ. 161 వ)

జగత్తునిత్యము కాదని భావం.

"సంసారమందు కాంక్షవలదు"
(ఆంధ్ర మహాభాగవతము-పం.స్కం-ప్ర.ఆ. 164 వ)

జగత్తే మిధ్యయైనప్పుడు, సంసారంపై మోహము ఉండుట పనికిరాదని వృద్ధ బ్రాహ్మణుడు రాజునకు తెలిపెను. అనిత్యమైన సంసారంపై కోరిక పెంచుకొనక, మోక్షార్థియై పాటుపడవలసిందని అతడు పేర్కొనెను.

"దర్మార్థకామంబు లొకటినొకటి నాశమొందకుండ నడపవలయు"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 302 వ)

మైత్రేయ మహాముని శాపమున దుర్యోధను తొడలు భీమ గదాఘాతముచే విరిగెనగా సంతుష్టి చెందక బలరాముడు కృష్ణునితో పైవిధంగా పలికెను. ధర్మార్థ కామాలు వరుసగా పాటించిన సమంజసము గాని, దీనిలో ఏది లోపించినను వ్యక్తి సంపూర్ణుడు కానేరడనియు అతడు పలికెను. ధర్మార్థ కామాలు వరుస క్రమముతో అనుభవిస్తూ, మానవుడు మోక్షార్థి కావలెనని భావం. సంసార సుఖాల—నిత్యములనీ, వానిపై మమత్వం పనికిరాదనీ భావం.

"మీసాలపై దేనియల్"
[మనుచరిత్రము-ద్వి.ఆ. 62 వ.]

మీసాలపై తేనియలు ఎంత తాత్కాలికమైనవో అట్లే సంసార సుఖములు కూడా అంతే తాత్కాలికమైనవని భావం.

ఈ విధంగా ధర్మార్థ కామ మోక్షాలను తెలుపు సామెతలను ప్రాచీన సాహిత్యములో పరిశీలించుటైనది.

## 5. నీతి-సందేశములకు సంబంధించిన సామెతలు -

సామెతల ప్రధానోద్దేశ్యం సమాజమునకు నీతి సందేశములను అందించుటే. సమాజములో ఉన్న మంచినీ, చెడును విభజించి మానవునకు హితబోధ చేయునవి సామెతలని చెప్పవచ్చును. ఒక గొప్ప అనుభవపు సారాన్ని సామెతలలో చూడనగును.

"పరమేశ్వరారాధనంబు సర్వార్థ సాధనంబు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 419 వ.)

అశ్వత్థామ ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం వ్యర్థం కాగా, కారణమేమిటని అశ్వత్థామ, వ్యాసునడగగా కృష్ణార్జునులు దైవస్వరూపులని వారి చరిత్రాన్నంతయు అతడు వివరించెను. పరమేశ్వరుని ఆరాధించి సర్వార్థములను పొందుమని అతనికి సలహాను ఇచ్చెను. పరమేశ్వరుని ఆరాధించిన వారికి సర్వలబ్ధి కలుగుననునది సత్యం.

తనువు అశాశ్వతమని, కేవలం తాను చేసిన కర్మ మాత్రమే తనతోడ నిలుచునని ఈ క్రింది వాక్యం వలన తెలియుచున్నది.

"తనువు సెడుంగాని కర్మతతి సెడదనఘా"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-చ.ఆ. 171 వ.)

ధర్మరాజు మార్కండేయునితో పై విధంగా పలికెను. అది నిత్యసత్యం.

"గర్వంబు కొఱగాదు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 302 వ)

గర్వముచే గొప్పదనం నశించును. కావున ఎవ్వరికైనను గర్వం పనికి రాదనునది నిత్యసత్యం. కేశవుడు గరుడునితో గర్వము పనికిరాదని తెలిపే ఘట్టం లోనిది.

"శరీరంబు కర్మమూలంబగుట వలన గర్మంబులు సేయజనదు"
(ఆంధ్ర మహాభాగవతము-పం.స్కం. - ప్ర.ఆ. - 60 వ)

ఋషభుడు పుత్రులకు నీతిని ఉపదేశించుచు కర్మ మూలమైన శరీరంకంటె భగవదారాధనము ముఖ్యమని తెలిపెను. ముక్తి కోరెడివారు, శరీరబంధం నుండి ముక్తి లభించవలెననిన భగవంతునిపై మనస్సును లగ్నము చేయవలెనని తెలిపెను. భగవద్భక్తి అన్ని కర్మలకంటెను గొప్పదని భావం.

"ఆత్మా నస్తుకా మాయ సర్వం ప్రియ భవతి"

(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం. 626 వ)

వేదవాక్యం. సనత్కుమారుడు పృథు చక్రవర్తికి మోక్ష సాధనంయొక్క ఉద్దేశ్యమును తెలుపుచు, స్వార్థమును త్యజించుటే గొప్ప త్యాగమని పై వేద వాక్యాన్ని ఉదహరించెను. వేదాలు భగవత్స్వరూపములని హిందువుల నమ్మకం.

"అతని యాజ్ఞదప్పనలవిగాదు"

(ఆంధ్ర మహాభాగవతము-పం.స్కం. ప్ర.ఆ. 10 వ)

భగవదాజ్ఞను తప్పుట ఎవరి తరం కాదని భావం. కాని వ్యవహారంలో ఎవరి గురించియైన గొప్పగా వర్ణించి చెప్పినపుడు సర్వసామాన్యంగా ప్రయోగించు వాక్యంగా పేర్కొనవచ్చును.

మను పుత్రుడైన ప్రియవ్రతుడు ఈశ్వరాజ్ఞతో కర్తవ్య నిర్వహణం చేయు వాడు గావున, ఆతని ఆజ్ఞను ఉల్లంఘించకూడదని వివరించి పలికిన ఘట్టంలోనిది. ఈశ్వరాజ్ఞను ఎవ్వరును ఉల్లంఘింపనేరరనునది సత్యం.

"దూషణ, భూషణ తిరస్కారంబులు శరీరంబునకుంగాని పరమాత్మకులేవు"

(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం.-13 వ]

శిశుపాలుడు ఏవిధంగా హరిలో ఐక్యమయ్యెనని ధర్మజుడు మిక్కిలి ఆశ్చర్యంతో ప్రశ్నింపగా, నారదుడు పైవిధంగా సమాధానమిచ్చెను. పరమాత్మ దూషణ, భూషణా దులకతీతుడు కావున సామాన్య మానవునకు ధర్మసూక్ష్మములు తెలియవని భావం.

"ఈశునినుబొందిమతిపుట్టరిల"

(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం-121 వ)

శ్రుతిగీతలలోనిది. భగవంతుని పొందినవారికి పునర్జన్మములేదు. భగవంతుని సాన్నిధ్యమే జన్మను తరింపచేయునని భావం.

"విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడిపశువుగాక"

(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 170 ప)

తానేమిచదివెనని ప్రహ్లాదుని హిరణ్యకశ్యపుడు అడుగగా ప్రహ్లాదుడు పైవిధంగా సమాధానాన్ని ఇచ్చెను. విష్ణుభక్తిలేని పాండిత్యం వ్యర్థమని, విష్ణుభక్తిలేని పండితుడు పశువుతో సమానమని భావం. భగవద్భక్తి అన్నిటికన్నను మిన్నయని భావం.

"పాలలోబడిన బల్లివిధంబున"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.అ. 135 ప)

ద్రౌపదిని ఓదార్చుచు కృష్ణుడు పైవిధంగా పలికెను. పాండవులు పాలవంటి స్వచ్ఛమైనవారని భావం. కౌరవులవలన పాండవులు అవమానము పొందిరనీ, బల్లి పడనిపాలు ఎట్లు త్రాగదగినవో, అట్లే పాండవులు కౌరవులనుండి వైదొలిగి సుఖాన్ని పొందగలరనే అర్థాన్ని తెలుపుచున్నది. "పాలలోబడిన బల్లి విధంబనునది తెలుగు పలుకుబడి".

"మనుజమాత్రుడె తలపోయ మాధవుండు"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1328 ప)

కంసుని వద్దకు వెడలిన రామకృష్ణుల పరాక్రమాన్ని పురజనులు కొనియాడిరి. మాధవుడు భగవంతుడే అనివారి నమ్మకం. అదినిజం. మాధవుని నమ్మినవారికి కాంక్షితార్థములు ఈడేరునని భావం.

"పాపకర్మునియందు ప్రయుక్తంబులైన సత్కారంబులుబోలె"
(ఆంధ్ర మహాభాగవతము—స,స్కం-195 వ)

సత్కారములు పాపకర్మునకు ప్రయోజనాన్ని ఇవ్వలేవు. ప్రహ్లాదుడు పరమ విష్ణుభక్తుడు. అతనిని విష్ణునామస్మరణనుండి తప్పించుటకై హిరణ్యకశ్యపుడు ఎన్ని ప్రయత్నాలు చేసినను వ్యర్థమయ్యెను.

"కీర్తి యిచ్చు పుణ్యగతి కీర్తియ తల్లియంబోలె
బ్రోచు సత్కీర్తి యయాయువుల్ సిరియు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 294 ప.)

ఇంద్రుని వలన రాబోవు ఆపదను సూర్యుడు కర్ణునకు ముందే సూచించును. బ్రాహ్మణ వేషంలో ఇంద్రుడు కర్ణుని కవచకుండలాలను దానంగా అడుగుననీ, కవచ కుండలాలను కోల్పోయిన కర్ణుని అర్జునుడు చంపగలుగునని తెలుపగా, కర్ణుడు పై విధంగా సమాధానమిచ్చెను. సజ్జనునకు కీర్తిని మించినది ఏదిలేదని, ప్రాణములకంటె కీర్తే గొప్పదని భావం.

"తోక ద్రొక్కిన కృష్ణోరగము మాడ్కి"

(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 657 ప.)

"తోక తొక్కిన తాచువలె" అను సామెతకు గ్రాంధిక రూపం.

వరాహ రూపంలో ఉన్న విష్ణువు హిరణ్యాక్షుని గూర్చి పరిహాసోక్తులు పలుకుచు, అతనిని కవ్వించగా అతడు "తోక త్రొక్కిన కృష్ణోరగము మాడ్కి" ఉండెనని కలవర్ణించెను.

"కొరవిగొని వెఱ్ఱినే తలగోకికొనగ"

[ఆంధ్ర మహాభాగవతము-అరణ్యపర్వము-పం.ఆ. 19 ప.]

"కొరవితో తల గోక్కొన్నట్లు" అనునది తెలుగుసామెత. కొరవితో తల గోక్కొనుట మూర్ఖత్వానికి చిహ్నం.

కౌశికుడు భిక్షాటనకు బయలుదేరును. ఒక ఇంటిముందాగి "భవతీభిక్షాందేహి" అని ఎన్నిమార్లు అడిగినను ఆమె వేచివుండుమని పలుకునుగాని ఎంతకును రాలేదు. ఆలస్యంగావచ్చి తాను భర్తకుపరిచర్యలు చేయుచున్నందున రాలేకపోయితినని తెలుపును. కౌశికుడు కోపమునకురాగ, వచ్చినవారు కౌశికులని తనకింతకుముందే పాతివ్రత్యమహాత్మ్యము వలన తెలియునని తెలుపును. తపోమహిమకంటె పాతివ్రత్య మహిమ గొప్పదని తెలిసికొనిన కౌశికుని కోపమునకర్థము లేదని భావం. కౌశికుని కోపం కొరవితో తలగోక్కొన్నట్లుగానున్నదని భావం. భారత స్త్రీకి పతియే ప్రత్యక్ష దైవం.

"మానినిజంపుట రాచపడిగాదు"

(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 149 వ.)

దేవకీదేవకికి జనించిన ఆర్గురు కుమారులను కంసుదు వధించును. ఏడవ సంతానంగా ఆమెకు ఒక కుమార్తె కలుగును. ఆడపిల్లయని చూడక చంపుటకై సిద్ధపడిన కంసునితో, దేవకీదేవి పైవిధంగా పలికెను. రాజధర్మం ప్రకారం స్త్రీని చంపకూడదు.

"సతులచరితలతిదుష్కరముల్"

(ఆంధ్రమహాభాగవతము-అరణ్యపర్వము-పం.ఆ. 320 వ.)

ద్రౌపది సత్యభామతో తానుపడిన కష్టాలను వివరించుచు పైవిధంగా పలికెను. జీవితం కష్టాలమయమనునది నాటికిని, నేటికిని నిత్యసత్యం.

"సతీజనులు కృతాపరాధలైనం దీనవత్సలతంచేసి వధియింపరు"

(ఆంధ్ర మహాభారతము-చ.స్కం. 475 వ.)

ధర్మతత్త్వాన్ని తెలిసినవారు సతులు తప్పుచేసినను వారి దీనత్వమును దృష్టిలో ఉంచుకొని వారిని వధింపరు. కావున తానుచేసిన తప్పును సైరించి తన్ను రక్షింప వలసిందిగా గోరూపములోనున్న భూదేవి పేనుని ప్రార్థించెను. స్త్రీలు చేసిన తప్పును క్షమించవలెనను ధర్మము ఆనాటి రాజులకుండెడిదని తెలియుచున్నది.

"జాతుడుమృతుడగుట ధ్రువము"

(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 519 వ.)

"జాతస్యహిమరణంధ్రువమ్" అను సంస్కృతసామెతకు తెలుగురూపం. జనకునకు పరాశరముని ప్రాణోత్క్రమణాలను తెలుపు సన్నివేశములోనిది.

"బూదిలో నేయివేల్చుట"

[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 332 వ.]

"బూడిదలో పోసిన పన్నీర"నునది తెలుగుసామెత. ఆసామెతకు మరొక రూపమే పైవాక్యం.

"మునుతనుజేసిన కర్మంబున జూవెనశించు భూతములు"

(ఆంధ్రమహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 52 వ)

ధర్మవ్యాధుడు కౌశికునకు అహింసా స్వరూపమును తెలుపుచు పైవిధంగా పలికెను. హిందువులకర్మసిద్ధాంతానికి దర్పణంగా పైవాక్యాన్ని చెప్పవచ్చును.

"అతినిందితమత మోగుణము"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 96 వ)

తమోగుణము వర్జనీయము. ఎవరినైనను ఎక్కువగా నిందించకూడదని భావం.

"సకలదేశములను సన్మార్గవర్తనులుగలరు, దుష్టతతియు గలిగియుండు"

[ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 114 వ]

శల్యుడు కర్ణునితో పైవిధంగా పలికెను. ప్రపంచంలో మంచి, చెడుకలిసే ఉండునని భావం.

"తొలగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 27 వ.)

హింసచేయువాడెన్నడును సుఖపడడని భావం.

"పాపములకెల్ల నెక్కుడు పాతకములుసువ్వె క్రోధలోభంబులు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 42 వ.)

ధర్మవ్యాధుడు కౌశికునకు హితబోధచేయుఘట్టములోనిది. అన్ని పాపముల కంటె క్రోధ, లోభములు మిక్కిలి పాపకరములు కావున వానిని వదలివేయుటే ఉత్తముల లక్షణమని తెలిపెను.

"క్రోధంబుకొనియాడుట లగ్గుకాదు"

(ఆంధ్ర మహాభారతము—అరణ్యపర్వము-పం.ఆ. 22 వ.)

"కోపమునను ఘనత కొంచమైపోవు" నని వేమన తెలిపెను. తనకోపమే తనకు శత్రువ"ని సుమతీశతక కారుడునుడివెను.

కోపమెన్నటికిని కొనియాడతగినదికాదని పతివ్రత కౌశికునితో పలికెను.

"దైవోపహతంబులగు కార్యంబులు సిద్ధిబొందునె"

(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 44 వ)

కృతవర్మ అశ్వత్థామతో పైవిదంగా పలికెను. దైవోపహతుడైన వానికి జయముకలుగదు. పౌరుషముతోపాటు దైవముతోడైననే జయముకలుగునని భావం.

"యథాకాలకల్పిత క్షమ తేజుండైనవానికి నుభయలోకసిద్ధియగు"
(అరణ్యపర్వము-ఆంధ్ర మహాభారతము-ప్ర.ఆ. 218 వ.)

సంతతక్షమయు, సంతతతేజమును రాజు ప్రకటింపగూడదని భావం. సందర్భాన్నిబట్టి క్షమను, తేజాన్ని ప్రదర్శించగలుగు రాజునకుభయలోకాలు సిద్ధించును. బలీంద్రప్రహ్లాద సంవాదములోని రాజలక్షణముల ప్రస్తావనను ద్రౌపది ధర్మజునకు తెలిపెను. సంతతక్షమ, సంతతతేజమెవ్వరికిని కూడదని భావం.

"కర్మవిపాకంబుగడవంగలావె"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-పం.ఆ. 250 వ.)

బకునకు ఆహారంగా వెడలు తనయుని గూర్చి బాధతో బ్రాహ్మణదంపతులు పలికినమాటలు. ఎవ్వరైనను కర్మ ఫలాన్ని అనుభవింపవలసిందేనని భావం.

"ఆపద్విషయంబున సంతాపింపగజనదు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ష.ఆ. 254 వ.)

బకునకు కుమారుని ఆహారంగా పంపవలసి వచ్చెనేయని కడువిచారంతో ఆత్మత్యాగానికి సిద్ధపడిన బ్రాహ్మణునితో అతని భార్య పలికినమాటలు.

ఆపదలో బాధపడుటకంటె ధైర్యంగా ఉన్నవారికి ఆపదలు వాటంతటఅవే తొలగిపోవునని భావం.

"ఆత్మఘాతంబు మహాపాతకంబు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ష.ఆ. 275 వ.)

కుంతి బ్రాహ్మణునితో ఆత్మహత్యనేరమని వలుకుచు బకునిచంపుటకై భీమునిపంపును. ఆత్మహత్య పాతకమనునది నిత్యసత్యం.

"అన్యులసంపదలన్ మిగిలిచేకొననిల్లుసేసిన మెత్తురేమదిమత్తముల్"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 815 వ.)

ధర్మరాజు రెండవసారి జూదంలో ఓడిపోయి పన్నెండేండ్ల అరణ్యవాసాన్ని ఒకయేడు అజ్ఞాతవాసాన్ని అనుభవింపవలసివచ్చును. ఆవిషయం తెలిసి ధృతరాష్ట్రుడు మిక్కిలి విచారించును. ఇతరులసంపదను అన్యాయంగా పొందగోరువారిని ఉత్తములు ఎన్నడును మెచ్చరనే తన అభిప్రాయాన్ని విదురుడు ధృతరాష్ట్రునకు తెలిపెను. పాండవులకు అన్యాయంగా చెందవలసిన రాజ్యం. సంపద లభించవలెనని భావం. అన్యులసంపదను ఆశించుట సమంజసముకాదనునది నిత్యసత్యం.

"అనృతదోషఫలముననుభవించు"

(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 238 ప.)

విదురుడు సభను ఉద్దేశించి పైవిదంగా పలికెను. నిజముతెలిసీ మిన్నకుండినవాడు అనృత దోషఫలాన్ననుభవించుననీ, సత్యము తెలియఁచేకాదు, నిర్భయంగా తెలుపగలవాడే గొప్పవాడని భావం.

"దేవతలకు నెట్లునడచిననెగ్గులేదు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 365 ప.)

ఊర్వశి తనపై మరులుగొనగా, ఆమెను తిరస్కరించుచు అర్జునుడు పైవిధంగా పలికెను. మానవసమాజానికి కొన్ని కట్టుబాట్లున్నవనియు, దేవతలకు అట్టి కట్టుబాట్లు లేవనీ తెలుస్తున్నది. హిందూధర్మరహస్యాన్ని ఆవాక్యము దెలుపుచున్నది.

"మహాంబు వృష్టిపర్వతము గ్రహించునట్లు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 311 ప.)

అర్జునుడు ప్రయోగించిన బాణాలన్నియు శివుని శరీరములో లీనమయ్యెను. పెద్దవర్షమేవిధంగానైతే పర్వతములపై ప్రభావాన్ని చూపలేదో అట్లే అర్జునుని బాణవృష్టియు నిష్ప్రయోజనమయ్యెనని భావం. పెద్దవారిపై కోపం పనికిరాదను సత్యాన్ని ఆవాక్యం తెలుపుచున్నది.

"యుగాంతకాలరిక్తంబులైన శరధులంబోలె"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 315 ప.)

ప్రళయకాలంలో సముద్రములన్నియును హరించుకొనిపోవునను ఆరోక్తిని పైవాక్యం తెలుపుచున్నది. శివునిపై అర్జునుడు ప్రయోగించిన బాణాలన్నియు వ్యర్థమయ్యెననిభావం.

"ఒక్కచోటనపెద్దకాలంబునికి యెవ్వరికిం బ్రీతిజననంబుగాదు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 276 వ.)

వ్యాసుడు ధర్మరాజుతో పైవిధంగా పలికెను. 'Proximity breeds contempt' అను ఆంగ్లసామెతయు, "అతిపరిచయము అవజ్ఞకుమూలము"అనే తెలుగు సామెతయు పైభావాన్నే తెలుపుచున్నవి. ఒకేచోట చాలాకాలముండుట ఎవ్వరికిని క్షేమకరము కాదు. మరియు ప్రీతిపాత్రంకాదు.

"గర్వితునకు బుద్ధిగాననగునె"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 273 వ.)

భరద్వాజుని కుమారుడు రైభ్యునివలన మరణించును. రైభ్యుని కోడలుపై భరద్వాజకుమారుడు మోహితుడగును. ఆసమాచారమును కోడలుద్వారా రైభ్యుడెరిగి అతనిని చంపును. ఆవిషయాన్ని తెలిసికొని భరద్వాజుడు విచారించుచు పైవిధంగా పలికెను. గర్వమున్నవారికి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం శూన్యం.

"మహాపురుషులు దైవనియుక్తులై ప్రచ్ఛన్నవృత్తినుండుదురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ద్వి.ఆ. 173 వ.)

వార్ష్ణేయుడు తనవద్దనే రథ సారథిగా ఉన్న నలుని గుర్తింపనేరడు. బాహుకుని రూపంలో నలుడు అతని వద్ద సారధిగా నుండెను. దైవనియుక్తులైన మహాపురుషులు రహస్యముగా నుండెదరని భావం.

"అవినీతు సిరియుబోలె నడగివిరిసి చనియె"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ద్వి.ఆ. 111 వ.)

నలుని పాసి దమయంతి అడవిలో ఎన్నో కష్టాలపాలైన సంధర్భం లోనిది. అవినీతిపరునకు సిరి సంపదలు నిలువవనే అభిప్రాయాన్ని పై వాక్యం తెలుపుచున్నది. ఇప్పటికిని ప్రజలలో అదే విశ్వాసముంది.

"క్రతు సహస్రంబులు సేసిన వారికంటె నక్రోధనుడగరంబధికుడండ్రు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 146 వ.)

"బుద్ధి గలవారికి క్రోధంబు కొనియాడందగదు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 148 వ.)

క్రోధం ఎవ్వరికిని పనికిరాదనే సత్యాన్ని ఆ వాక్యాలు తెలుపుచున్నవి. శర్మిష్ఠచే అవమానితురాలైన దేవయానితో శుక్రాచార్యుడు పై విధంగా పలికెను. "కోపమునను ఘనత కొంచెమైపోవు"ననునది నిత్యసత్యము.

"ఆత్మ ప్రశంససేయు మది మరణము"
(ఆంధ్రమహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 90 ప.)

ధర్మరాజును అనవసరంగా సంశయించితినని మిక్కిలి పశ్చాత్తాపపడి, కత్తిని తీసుకొని అర్జునుడు ఆత్మహత్యకై పాల్పడును. ఆత్మహత్య పనికిరాదని కృష్ణుడతనికి తెలుపును. దానికన్నను ఆత్మస్తుతి నీచమైనది. కావున, అర్జునుడు ఆత్మప్రశంస చేసికొనిన అతనికది మరణంతో సమానమని తెలుపును. ఆత్మప్రశంస పనికిరాదని భావం.

"చనుబొంకగ ప్రాణాత్యయమున"1
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 178 ప.)

"చనుబొంకగ వివాహ సమయమున" అనునది నేటికిని ప్రచారంలోనున్న సామెత. శుక్రాచార్య నీతిని తెలుపు ఘట్టం లోనిది. ప్రాణం పోయే సమయంలో, వివాహ సమయంలో అబద్ధమాడినను తప్పులేదనీ భావం. "వెయ్యి అబద్ధాలాడైనా పెళ్లి చేయవలె"ననునది తెలుగు సామెత.

"అరణి నగ్నిఁబొడమఁజేయు కరణి"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 23 ప.)

భీష్ముడు కృష్ణుని స్తుతించుచు ఏ విధంగానైతే అరణియందు అగ్ని జనించి, వేద విధుల కార్యమును నెరవేర్చెనో, అట్లే దేవకి గర్భమందు జనించిన కృష్ణుని కీర్తించి తరించెదనని పలికెను. అరణియందు అగ్ని జనించుననునది అందరికు తెలిసిందే.

---

1. 'చనుబొంకగ ప్రాణాత్యయ
మున సర్వధనాపహరణమున వధగా వ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహ సమయములందున్'
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 178 ప.)

"నోటికడవ నీళ్లు బెట్టిన కరణి"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 332 వ.)

వ్యాసుడు ధర్మరాజునకు నీతి బోధ సేయుచు, అపాత్రదానం ఎప్పుడును పనికిరాదనును. దప్పిగొనిన వారికి ఏ విధంగానైతే నోటివగ్గర నీటికడవలుంచినను ప్రయోజనముండదో అట్లే అపాత్రదానమును పనికిరాదని భావం.

"కొఱవియు కొఱవియు దాకిన తెఱగున"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-ప్ర.ఆ. 228 వ.)

భీష్మార్జునుల యుద్ధం పై విధంగా నున్నదని కవి వర్ణించెను. ఇద్దరును సమాన తేజస్సును కలిగియున్నవారని భావం.

"శరీరికి మరణంబు నియతంబగు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 262 వ.)

భీముడు ధర్మరాజుతో పై విధంగా పలికెను. "అనిత్యాని శరీరాణి" అనునది గీతా వాక్యము. కావున శరీరమునకు మరణము తప్పదు, కాని ఆత్మకు మరణ ముండదని భావం.

"బ్రదికిన నెల్ల శుభములు గలుగు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 272 వ.)

అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశం చేయుచు భీష్మాది గొప్పవీరులను చంపిన అర్జునుని ఎదిరించుట కర్ణునకు సాధ్యంకాదు కావున, దుర్యోధనుడు పాండవులతో సంధికి ఒప్పుకొనుటయే సమంజసమని పలికెను. "బతికియున్న బలుసాకు తినవచ్చు" అనునది తెలుగుసామెత.

"ఈనుమానము చచ్చినసేమిగలదు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 272 వ.)

కౌరవ సైన్యంలోని గొప్పవీరులందరు చనిపోయిరి. కావున ఇప్పటికైనను సంధిచేసుకొనవలసిందని దుర్యోధనునితో అశ్వత్థామ పలికెను. చచ్చినవారికి ఏమీ లభించదు కావున దుర్యోధనుడు చేసేపని తగిందికాదనే భావాన్ని తెలుపును.

"ఎల్లశక్తులకంటె దపశ్శక్తి మెండు"

(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 165వ.)

విశ్వామిత్రుడు వశిష్టుని శక్తిని ఎరుగక అతనిని అవమానించగా, అతడు తన తపశ్శక్తి ప్రభావాన్ని చూపెను. అన్నింటికంటె తపశ్శక్తి గొప్పది. అది నిత్య సత్యము.

"మాయలుగలవగల మాయప్రకారంబులంబరమార్చుటయతగు"

(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 271వ.)

కృష్ణుడు అర్జుననితో భీముడు దుర్యోధనున్ని మాయా యుద్ధరీతిచేమాత్రమే జయింపగలడని నుడివెను. శత్రువు మాయావియైనయెడల అతన్నావిధంగానే చంపుట ఉచితమని ఎన్నో ఉదాహరణాలను పేర్కొనెను. యుద్ధనీతిని తెలుపు సామెత అని చెప్పవచ్చును.

"ఆసదోసమెఱుగగనిచ్చున్"

(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ద్వి.ఆ. 141 వ.)

ఆశ దోషమెరుగదు. పేరాశ ఎచ్చటైనను పనికి రాదని భావం. వీరులందరిని చంపగలను అను ధీమాతో అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించి మరణించెనని ధర్మరాజు విచారించెను. అత్యాశ పనికి రాదు. 'దురాశ దుఃఖమునకు చేటు' అనునది తెలుగు సామెత.

"ఎందును అల్పమయ్యు దర్పము బహుకాలసంచిత తపఃఫలహానియొనర్పకుండునే"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 217 వ.)

యయాతి గర్వముతో దేవలోకములో ఉన్న మహర్షులను అవమానించగా, ఇంద్రుడు కోపించి అతనిని శపించును. ఎంత గొప్పవారికైనను గర్వం పనికిరాదని భావం.

"సంతత వ్రత నియమప్రభావులగువారల బొందునె దేహ దుఃఖముల్"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-స.ఆ. 121 వ.)

పుత్రశోకంచే వశిష్ఠుడు మొదట ఆత్మహత్యకు పాల్పడును. కాని సంయమనంతో దుఃఖాన్నణచుకొని ఆ ప్రయత్నము నుండి విరమించుకొనును. వ్రత నియమాలను పాటించు వారికి దేహ దుఃఖములుండవని భావం.

"పెద్దల చరితంబల్పులకు నెరుగ శక్యమె యెందున్"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము—ద్వి.ఆ. 19 వ.)

భీష్ముని నిందించు శిశుపాలుని వద్దకు ధర్మరాజు వెడలి పెద్దల గుణములు అల్పులు తెలియగలేరని తెలిపెను. అల్పుడే పెద్దలను అవమానపరుచును గాని పెద్దలెన్నడును ఇతరులను అవమానం చేయరని భావం.

"దవాగ్నితజ్జనిత కీలముగెల్చి వెలుంగ నేర్చునే"
[ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 554 వ.]

బ్రహ్మ కృష్ణుని మహిమను పొగడుచు పై విధంగా ప్రార్థించెను. ఎట్లయితే దావాగ్ని తనకీలలను ఎదిరించి నిలువలేదో, అట్లే కృష్ణుని ఎదిరించి తాను బ్రతుక లేనని బ్రహ్మ పేర్కొనెను. త్రిమూర్తులలో బ్రహ్మ కంటె విష్ణువే శక్తివంతుడని భావం.

"సర్వేశ్వరుండెప్పుడు భక్తులకు ప్రసన్నుడకాడే"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-అ.ఆ. 167 వ.)

అర్జునుని రాక వలన పంచతీర్థములలో శాపగ్రస్తులయిన అయిదుగురు అప్సర సల శాప విముక్తి కలుగుతుంది. అర్జునుని రాకను ఎరిగి కృష్ణుడు అక్కడకు ఏతెంచును. భక్తులకు ఎప్పుడును భగవంతుడు దర్శనమీయుననుటకు పై వాక్యాన్ని ఉదాహరణంగా పేర్కొనవచ్చును.

"సత్యము సెప్పనివాడును ఘోర నరకపంకమునబడున్"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ప్ర.ఆ. 136 వ.)

భృగుడు అగ్నిదేవునకు సర్వభక్షకుడవు కమ్మని శాపమిచ్చెను. ఆ సందర్భ మున అగ్నిదేవుడు పై విధంగా పలికెను. మానవ సమాజం సత్యనిష్ఠా పరిపాలనతో కూడి యుండవలెననే భావాన్ని తెలుపుచున్నది.

"సురాపానము మహాపాతకము"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-తృ.ఆ. 122 వ.)

దేవయాని కచున్ని ఎచ్చటను కానక శుక్రాచార్యునితో తన బాధను వివరించు కొనెను. బృహస్పతి కుమారుడైన కచుడు శుక్రాచార్యునకు శిష్యుడు. కాని

రాక్షసులు మాయచే శుక్రాచార్యుడు సురాపానం చేసే సమయంలో కచున్ని చంపి, బూడిదగా చేసి శుక్రాచార్యుడు త్రాగే సురలో కలిపిరి. ఆ విషయాన్ని తర్వాత తెలిసికొన్న శుక్రాచార్యుడు పై విధంగా పలికెను. సురాపానం మహా పాతకమనునది నిత్య సత్యం.

"సర్వ కార్యంబులు మంత్రమూలంబులు"

(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 349 వ.)

అన్ని కార్యాలు మంత్ర మూలముననే జరుగునని హనుమంతుడు భీమునితో పలికెను. మంత్రమనగా ఆలోచన అనే అర్థమున్నది. ఏ కార్యమైనను ఆలోచించి చేయవలయునను అభిప్రాయం పై దానివలన తెలియుచున్నది.

"క్రోధమత పముం జెఱచున్"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ద్వి.ఆ. 172 వ.)

పరీక్షిత్తు తన తండ్రి తపస్సు చేయు సమయాన చేసిన తప్పిదానికి కోపము వచ్చి శృంగి శాపమును ఇచ్చెను. అప్పుడు శమీకుండు శృంగితో పై విధంగా పలికెను.

తన కోపమే తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ"

*(సుమతీ శతకము)*

కావున కోపమెవ్వరికిని పనికి రాదనే విషయాన్ని పై పద్యం తెలుపుచున్నది కోపమెవ్వరకును పనికిరాదు.

"పరనిందయు ఆత్మగుణోత్కర్ష కీర్తనముజేయగా నుచితమె సత్పురుషులకు"

(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ద్వి.ఆ. 112 వ.)

గరుడుడు అమృతాన్ని గొనుటకై దేవలోకానికి వెడలును. అచ్చట ఇంద్రుడు ప్రత్యక్షమై, గురుడుని ఉద్దేశ్యాన్ని తెలుసుకొని, అతనితో తన బల పరాక్రమాదులను వివరింపవలసిందిగా కోరగా గురుడుడు పై విధంగా మాట్లాడెను. సత్పురుషనకు పరనిందయు, ఆత్మస్తుతియు పనికిరాదని తెలిపెను.

"పురాకృత కర్మ ఫావ్య మెవ్వాడును నేర్పునే తొలగప్తైవగ"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ప్ర.ఆ. 238 వ.)

విరటుని ఆస్థానములో ఉన్న బృహన్నలను చూచి, ఆ రూపము ఎట్లు సిద్ధించెనని ప్రశ్నించగా, అతడు పైవిదంగా సమాధానమిచ్చెను.

"ఎవ్వారులు నాత్మ నమ్మదురె వక్ర విచారుల బాపకర్ములన్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 410 వ.)

యక్షుని నిరాకరించి నకుల, సహాదేవ, భీమార్జునులు మూర్ఛనొందిరి. ధర్మరాజు కొలను వద్దకు వచ్చి, మూర్ఛావస్థలోనున్న సోదరులను చూచి, సమీపమున యుద్ధం జరిగిన ఛాయలేమియు కనబడకపోగా, కౌరవులు పాండవులను ఏమి చేసిరోయని మిక్కిలి విచారించును. ఎవరైనను దురాలోచనా పరులను నమ్మరనడానికి పై ఉదంతమే నిదర్శనం.

"సుఖమునకు దుఃఖమునకుంగారణంబు దనదు
పూర్వకృతంబైచను కర్మమ కారణము"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 354 వ)

దర్మరాజు నకులునితో పై విధంగా పలికెను. పూర్వకర్మాను రూపంగా సుఖ సంపదలు ఏర్పడునని తెలిపెను. పూర్వజన్మకలదని హిందువుల నమ్మకం.

"వేల్పులు చెట్టపై తురే"
(ఆంధ్ర మహాభారతము—అరణ్యపర్వము-స.ఆ. 162 వ.)

సీతాదేవి రామునితో పైవిధంగా పలికెను. తాను పవిత్రురాలైనయెడల వేల్పులే దహించెడివారనీ, శ్రీరాముడు కోరినయెడల తాను అన్ని పరీక్షలకుకూడా సిద్ధమేనని పలికెను. వేల్పులు చెడును సహించరని భావం.

"ఆత్మమాతకునకు లోకంబున నిందయు హీనతయు దుర్గతియుంబ్రాపించు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ష. ఆ. 42 వ)

ప్రాయోపవిష్టుడైన దుర్యోధనున్ని కృత్యపాతాళానికి కొనిపోవును. అచ్చట దైత్యులు అతనిని సమీపించిరి. అతన్నిచూచి సంతోషించి పైవిధంగా వారు పలికిరి.

ఆత్మహత్యాప్రయత్నంనుండి విరమించుకోవలసిందిగా వారుకోరిరి. ఆత్మహత్యకు పాల్పడినవానికి లోకనింద, హీనత్వము, దుర్గతి ప్రాప్తించునని తెలిపిరి. ఆత్మహత్య మహాపాతకము.

"విషయవిజ్ఞానమునకు ననయంబును మనసు మూలము"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 80 ప)

ధర్మవ్యాధుడు కౌశికునకు జీవలక్షణాలను తెలుపుచు మనస్సే విషయజ్ఞానానికి మూలమని తెలిపెను. మనస్సును జయించినవాడు సద్గతిని పొందునని భావం.

"కొందఱాయాసపడియు నిష్ఫలారంభులై నిలుతురు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-పం.ఆ. 39 ప)

ధర్మవ్యాధుడు కౌశికునితో ధర్మరహస్యాలను తెలుపు సందర్భంలోనిది. సత్పురుషుల కార్యములను ఆర్యులు కీర్తించెదరనీ, ఇతరులకు అపకారము చేయువాడు తన పాపమున తానే నశించుననీ తెలిపెను.

"ఎఱిగియెఱుగనొల్లనికఱటిందెలుపగ కమలగర్భునివశమే"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము—చ.ఆ. 72 ప)

"మొప్పెదెలుపగలేము ముప్పదేళ్లకునైన" అని వేమన శతకారుడు తెలిపెను. నిండుకొలువులో తనను గుర్తించని దుష్యంతునిచూచి శకుంతల తనమనస్సులో అట్లు భావించెను. "తెలిసికూడ తెలియనట్లుగా" ఉండేవారిని భగవంతుడుకూడ ఒప్పించలేడని భావం.

"అందని మ్రాకులపండ్లుగోయదలచుటహితమే"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ద్వి.ఆ. 58 ప)

"అందని మ్రాకుపండ్లు గోయదలచుట" అనునది తెలుగు జాతీయము.

తనపతులు మిక్కిలి బలవంతులనీ తనను మోహించి కష్టాలపాలు కారాదని ఎన్నోమార్లు ద్రౌపది నచ్చచెప్పినను, కీచకుడు పెడచెవిన పెట్టును. ఆమెవిసిగిపోయి రావణాదుల ఉదాహరణాల చూపుచు, అందని మ్రాకుపండ్లు గోయదలచుట ఎవ్వరికినికూడ క్షేమంకాదని పలుకును.

"నివుఱుగవిసిన మెరయని నిప్పుబోలె"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-చ.ఆ. 75 ప)

"నివురుగప్పిన నిప్పు" అనునది తెలుగు సామెత. బృహన్నల ఆడురూపంలో ఉన్నను మిక్కిలి బలశీలి అనీ, అతడు "నివుఱుగవిసిన మెఱయని నిప్పువలె" ఉన్నాడని కవివర్ణించెను.

"మాన్యులనథఃకరింపనగునే"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-చ.ఆ. 220 ప)

పెద్దలమాట జవకూడదనునది సామెత.

కర్ణుడు కృపాచార్య, ద్రోణాచార్యాదియోధులను అందరిని అధిక్షేపించుట చూచి భీష్ముడు దుర్యోధనునితో పైవిధంగా పలికెను. గొప్పవారిని ఎన్నడును అవమానము చేయకూడదనీ, అట్లు చేసినయెడల అనర్థములుగలుగుననీ పలికెను. పెద్దలను గౌరవింపవలెననునది నిత్యసత్యం.

"పలుకవచ్చుగాక పలికినయట్టుల చేయుటెట్లు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-పం.ఆ. 90 ప)

"మాటలుకాదు, చేతలుకావాలి" అనునది సామెత. ఎన్నోమారులు కర్ణుడు అర్జునుని యుద్ధరంగంలో ఓడించెదనని బీరములు పలుకును. కాని యుద్ధరంగంలో అర్జునుని బాణాలను ఓర్వలేకుండెను. అతనిస్థితిని చూచి వ్యంగ్యంగా అర్జునుడట్లు పలికెను.

"నీఱుపైగవిసిన నిప్పులట్లు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-పం.ఆ. 351 ప)

"నీఱు" అనగా బూడిద."నివురుగప్పిన నిప్పువలె" అనునది తెలుగు జాతీయము.

బృహన్నలే అర్జునుడని భీముడు విరాట మహారాజునకు తెలుపుచు, అతని పరాక్రమము "నీఱుపైగవిసిన నిప్పులట్లు" ఉన్నదని పలికెను.

"విధికృతంబెవ్వరికినుడువవచ్చు"
(ఆంధ్ర మహాభారతము—భీష్మపర్వము-ద్వి.ఆ. 354 ప)

"ఎట్లుగానున్నది యట్లయయ్యెడు"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-ద్వి.ఆ. 334 ప)

"ఎట్లయ్యేది అట్లవుతది" అనేది తెలుగు జాతీయం.

అనవసర పుత్రవ్యామోహం వలన యుద్ధం సంభవించెనని విచారింపక, ధృత రాష్ట్రుడు సంజయునితో పైవిధంగా పలికెను. దైవవాక్కులను ఎదిరించుటకు వీలులేకున్నను, మానవుడు తానుచేసే కార్యంలో లోపాన్ని రానివ్వకూడదని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెను.

"అసత్యముగల్లనేప్పనే"

(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ప్ర.ఆ. 391 ప)

"సత్యమేవజయతే" అనునది ఆర్యోక్తి.

దుర్యోధనుడు ద్రోణున్ని పాండవ పక్షపాతియని అవహేళనచేయగా అర్జునుని పరాక్రమమును తెలిసినవారెవ్వరును అట్లు పలుకరని దుర్యోదనునకు ఆచార్యుడు సమాధానము ఇచ్చెను. అసత్యము నిలువదనీ, సత్యమే గెలుచుననీ తెలిపెను. అది నిత్యసత్యము.

పెనుమంటనుఱుకు శలభంబునుబోలె''

(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 116 ప)

"మంటలలో పడే మిడితలవలె" అనునది తెలుగు జాతీయం. మంటలలో పడేమిడతలు బ్రతకవు.

శిశుపాలతనయుడు, ధృష్టకేతుడు మొదలగు కౌరవవీరులు అర్జునునిపై మంటలలోపడే మిడతలవలె దండెత్తిరని కవి వర్ణించెను.

"శలభము వహ్ని మీదజనుచందము"

(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 118 ప)

కౌరవ సైన్యం అర్జునున్ని కలియుట పైవిధంగా ఉన్నదని కవి వర్ణించెను. సైన్యము చెల్లాచెదరయ్యెను. కర్ణుడు అగ్నిలోపడే మిడుతవలె అర్జునునిపైకి వెడలుచున్నాడని కృపాచార్యుడు ఆచార్య నందనునితో పలికెను.

"పేరడవిసొచ్చిపౌనుంగువడిన కార్చిచ్చుకైవడి"

(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 321 వ)

పాండవవీరులు ఎన్నిబాణాలను వేసినను నొవ్వక, అడవిలో వ్యాపించిన దావానలమువలె ద్రోణుడు వారినందరిని దునుమసాగెను. అడవిలో వ్యాపించిన దావానలము" అనునది జాతీయం.

"ఉరిసినపుండుపులనుప్పుబెట్టెదు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 359 ప)

"పుండుమీద కారము జల్లినట్లు" మనది తెలుగు జాతీయం.

అర్జునుడు అశ్వత్థామ గతించెనని అబద్ధమాడి ఆచార్యుని మరణానికి కారణ మగుటవిని మిక్కిలి బాధపడును. అప్పుడు భీముడు కౌరవులు చేసిన తప్పులెన్నిటినో ఎత్తిచూపుచు, ద్రౌపదికి సభలో అవమానముచేయుట, లక్కయింటిలో పెట్టి నిప్పంటించుట మొదలగునవి న్యాయమేనా అని ప్రశ్నించును. అప్పుడు అర్జునుడు అతనితో వైవిదంగా మాట్లాడును. అసలే బాధలో ఉన్నవారికి, మరిన్నిబాధలను పెట్టే విషయాల వివరించుట సమంజసముకాదని భావం.

"అనృతభయమునాజ జయము గొనెడు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 314 ప)

భీమసేనుడు ఇంద్రవర్మ ఏనుగును చంపును. ఇంద్రవర్మ ఏనుగుపేరు అశ్వత్థామ. అదినెపంగా పెట్టుకొని అశ్వత్థామ చనిపోయెనని ఎలుగెత్తి చెప్పవలసిందిగా కృష్ణుడు, భీముడు ధర్మరాజును కోరిరి. యుద్ధములో జయాన్ని పొందుట ఈవిరు అబద్ధంకంటె గొప్పదనియు, ఇది ఒకవిధంగా అబద్ధమేకాదనీ వాదించిరి.

"తగువారలొరులదెగడుట, పొగడుటయగు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 313 ప)

"వియ్యానికైనా, కయ్యానికైనా సమతుల్యులు కావాలి" అనునది తెలుగుసామెత.

సమానులైనవారు పరస్పరం దూషించుటకు, భూషించుటకు సరిపోదురనియు, సూతపుత్రుడైన కర్ణుడు ఎవరైనా దూషించినప్పటికిని మిన్నకుండవలెనని శల్యుడు కర్ణునితో పలికెను. మహాభారతకాలంలో ప్రచలితంగా ఉన్న జాత్యహంకారానికి నిదర్శనం. ఆది నిత్యసత్యం.

"చెఱుతుమనుటనోరిచేటుగాదె"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 24 ప)

"నోటితీట" అనునది తెలుగుపలుకుబడి. అదియె "నోరిచేటు"నకు సమానార్థకమని చెప్పవచ్చును.

ఎట్లయినను అర్జునుని ఓడించి దుర్యోధనునకు విజయము సమకూర్చెదనని పలికే కర్ణునిచూచి శల్యుడు పైవిధంగా పలికెను. అర్జునుడు గొప్పవీరుడనీ, నీవతనిని గెలుతుననుట నోరిచేటేనని శల్యుడు కర్ణునితో పలికెను.

"పొదుగుగోయుచొప్పగు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 299 ప)

"పాలుతాగి పొదుగు కోయువాడు" అనునది సామెత.

రాజు ప్రజలనుండి పన్నులు తగుమాత్రంగానే రాబట్టవలెనుగాని, వారిని బాధించి, హింసించి పన్నులువసూలు చేసినచో పాలు ఎక్కువ కావాలనే దుర్బుద్ధితో పొదుగు కోసినట్టులగునని రాజధర్మాలను తెలుపుచు బృహస్పతి వసుమనుండు అను రాజుతో పలికెను.

"ప్రమానుపక్షులను బ్రోచువిధంబున"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ.329 ప)

కుబేర ముచికుందసంభాషణంలోనిది. చెట్టు ఏవిధంగానైతే పక్షులను కాపాడునో అట్లే రాజు బంధువులను, సజ్జనులను కాపాడవలెను.

"బ్రదికియుండిన శుభములు బడయవచ్చు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 18 ప)

"బతికుంటే బలుసాకు తినవచ్చు" అనునది తెలుగు సామెత.

భీకరపోరాటం చేసే కర్ణునిచూచి, అతనిని ఎదుర్కొనుటకు తన అశక్తతను అర్జునుడు కృష్ణునకు వివేవించుకొనెను. చాలా ప్రచారములోనున్న సామెత.

"మంటసొరగదలచుమిడతలు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 342 ప)

"మంటలోపడే మిడుతవలె" అనునది ప్రసిద్ధమైన పలుకుబడి.

పాంచాల సైన్యమును నశింపచేసి, అర్జునునితో యుద్ధంచేయుటకు సిద్ధపడు కర్ణుడు మంటలో ప్రవేశించు మిడతవలె ఉండెను. అర్జునుడు అతివీరభయంకరుడని భావం.

"క్షమమేలగునైననతిక్షమ దైన్యముదెచ్చు"
[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 18 వ)

ధర్మరాజునకు భీష్ముడు రాజధర్మాలగూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. క్షమాగుణం గొప్పదే ఐనప్పటికి అతిక్షమ మాత్రము రాజునకు పనికిరాదని తెలిపెను.

"తప్పించుకొను తెలుగెఱింగించుకొనుటమేలు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 282 వ)

"తప్పించుకుతిరుగువాడు ధన్యుడు సుమతీ" అని సుమతిశతకారుడు తెలిపెను విశేషప్రచారంలో ఉన్న సామెతగా చెప్పవచ్చును.

బృహస్పతి వసుమనుండను రాజునకు రాజధర్మాలగూర్చి తెలుప్పచు, రాజు వీలైనంతవరకు యుద్ధమునకు ముందుండగూడదనియు, శాంతికాముకుడై, హింసాత్మక పద్ధతులలోను తప్పించుకొనే మార్గాన్ని తెలిసికొని ఉండవలెనని తెలిపెను.

"ఆసపజ్జంబోవమి సుఖకరంబు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ. ఆ. 168 వ)

"ఆశదోసమెరుగదు
పూటకూళ్లమ్మ పుణ్యమెరుగదు" అన్నది తెలుగుసామెత.

భీష్ముడు ధర్మరాజునకు సుమిత్రుడను రాజచరిత్రాన్ని వివరించుచున్న సన్నివేశంలోనిది. సర్వ అనర్థాలకు మూలం ఆశకావున ఎవ్వరును ఆశాపరుడు కాకూడదని భావం.

హీనప్రజ్ఞుడకార్యములైనవి సేసితుదివగచు"
[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 352 వ]

జనమేజయమహారాజు బ్రహ్మహత్యాపాతకముచే బాదపడి శౌనకుడను మునీంద్రుని వద్దకు వెడలి తన బాధలను చెప్పుకొనెను. అప్పుడు కేవలం హీన

ప్రజ్ఞలే అకార్యాలచేసి బాధపడెదరని జనమేజయునితో శౌనకుడు పలికెను. అకార్యములు చేయకూడదని భావం.

"విధికృతంబునకు వగవంబనిలేదు"
(ఆంధ్రమహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 312 వ)

భీష్ముడు ధర్మజునకు రాజనీతిని తెలుపు సందర్భములోనిది. కరఫలమెవరైనను అనుభవించవలసిందేనని భావం.

"మార్దవమున చెల్లనియదిలేదు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 277 వ)

ప్రేమతో విషమునైనను తినిపించవచ్చు"నను సామెతగలదు.

కణికుడు శత్రుంజంమునకు తెలిపిన నీతిని భీష్ముడు ధర్మరాజునకు తెలిపెను. వీలైనంతవరకు రాజు ఏకార్యాన్నైనను ప్రేమతోడనే నెరవేర్చుకొనవలెనని భీష్ముడు ధర్మరాజునకు తెలిపెను.

"ప్రజ్ఞాకార్యంబులైనవి యనుష్ఠింపవలయు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-తృ.ఆ. 353 వ)

ఏవ్యక్తియైనను తమప్రజ్ఞను మించిన కార్యాలను తలబెట్టకూడదనీ, తలకు మించిన భారం పనికిరాదనీ శౌనకుడు జనమేజయునకు తెలిపెను.

"మృత్యువుదుర్వారం బైయపహరించు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 24 వ.)

"జాతస్యమరణంధృవమ్" అనునది సంస్కృత ఆర్యోక్తి.

"మేధావి"యను బ్రాహ్మణకుమారుడు బలవంతులకైనను దుర్బలులకైనను మృత్యువు తప్పదని తన తండ్రితో తెలిపెను. మానవుడు ఎప్పుడును కర్తవ్యపరాయణుడు కావలెనని భావం.

"పామెరుగుపాముకాళులు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 182 వ)

"సీతబాధలు సీతవైతే
పీతబాధలు పీతవి" అనుతెలుగు సామెతకు దగ్గరగానున్న భావాన్ని తెలుపును.

ఏవిధంగానైతే పాముకాళ్లు పాముకు తెలియునో అట్లే విజ్ఞాని తనకర్తవ్యాన్ని ఇతరుల సహాయము లేకుండనే గ్రహింపగలుగునని తెలిపెను.

"వెలుగుచుండెడి దీపంబు వేఱవస్తువుల ప్రకాశింపజేయునట్లు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 176 ప)

దీపముచేమరో దీపము వెలుగునట్లు" అనునది సామెత.

భీష్ముడు ధర్మజునకుమను బృహస్పతి సంవాదాన్ని తెలుపుచు ఏవిధంగానైతే ప్రకాశించే దీపం వేరువస్తువులకు వెలుగును ప్రసాదించునో అట్లే జ్ఞానజ్యోతి ఇంద్రియాలను, మనస్సును ప్రకాశింపచేయునని తెలిపెను.

"నీళ్లలుపల్లమునకు వచ్చిన క్రియ"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 413 ప)

"నీరుపల్లమెరుగు.
నిజముదేవుడెరుగు" అనేవి తెలుగుసామెత.

ఏవిధంగానైతే నీరుపల్లానికి ప్రవహించిన విధంగా భగవంతునిచే శాసింప బడినవిమాత్రమే లభ్యమగునని "నముచి" అను దానవశ్రేష్ఠుడు ఇంద్రునితో పలికెను.

"అశుభమునకును శుభమునకును గాలమునూవెకర్త"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 430 ప)

ఇంద్రునిపై బలిగెలుచుటయు, బలిపై ఇంద్రుడు గెలుచుటయు కాలమహిమేనవి బలిచక్రవర్తి ఇంద్రునకు తెలిపెను. కాలమహిమచే ఎట్టికార్యమైనను సాధింపబడు ననిభావం.

"అభ్యాసమున మెలగెడునంధు చందంబున"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 532 ప)

"అభ్యాసముకూసువిద్య" అనునది సామెత. అభ్యాసంవలన తనఇంటిలో ఎవరిసహాయంలేకనే తిరుగు అంధునివలె మూర్ఖుడు సంసార సాగరంలో పడి మోక్షాన్ని పొందలేడని జనకునకు పరాశరముని తెలిపెను.

"పలుకక యుండుటకంటె దగపల్కుటమేలు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 555 ప)

భీష్ముడు ధర్మరాజుతో కొన్ని పరిస్థితులలో మౌనంగా ఉండడంకటె సత్యాన్ని తగినరీతిలో పలుకుటయే శ్రేష్టమని పలికెను.

"సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియమ్" అనునది ఆర్యోక్తి.

"వలయువస్తువు వగచిన వచ్చునయ్య"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 412 ప)

"నముచి" అను దానవశ్రేష్ఠుడు సర్వాన్ని కోల్పోయి, ఒక ఏకాంతస్థలంలో తపంచేసికొనుచుండెను. ఆప్రదేశానికి ఇంద్రుడువచ్చి నీవు బాధపడుచున్నావా యని అడుగగా, అతడు వగచినంతమాత్రాన కావలసినవస్తువు లభించదుకదా అని పలికెను. "Time and Tide wait for none" అను ఆంగ్లసామెతకు సమానార్థకంగా ఉన్నది.

"పరు నిందించుటదనువర్ణించుకొనుటను చితంబులు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 453 ప)

పరనింద, ఆత్మస్తుతి పనికిరావనునది ఆర్యోక్తి.
భీష్ముడు ధర్మరాజుతో శాస్త్రతత్త్వాన్ని గూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను.

"తానెరుగండు ఒరులు చెప్పిననైనను వినగనేరడు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 249 ప.)

"తనకు తోచదు, చెబితే వినడు" అనేది తెలుగు సామెత. ధృతరాష్ట్రుడు సంజయునితో తన కుమారుని మనస్తత్త్వాన్ని గూర్చి తెలిపెను. తనకు తెలియకున్న యెడల, ఇతరుల సలహాను పాటించిన మేలని భావం.

"జ్ఞానంబు పురుషుండు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ష.ఆ. 43 వ.)

వశిష్ఠుడు జనకునకు సాంఖ్యతత్త్వాన్ని తెలుపుచు ప్రకృతి జ్ఞేయమనియు, పురుషుడు జ్ఞానమనియు పేర్కొనెను.

"నివాత దీపమువోలె వెలుగు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ష.ఆ. 33 ప.)

వశిష్ఠుడు జనకునకు అక్షర, క్షరతత్త్వాలను తెలుపు ఘట్టం లోనిది. గాలి వీచినచో దీపముండదు. ఆత్మానందాన్ని పొందిన యోగి మాత్రమే నిజమైన ఆనందాన్ని పొందునని భావం.

"అసద్భావము సద్భావమగునె"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము—ష.ఆ. 33 ప.)

'ఎన్ని చెప్పినా అబద్ధము నిజమవుతుందా' 'ఉల్లి ఉల్లే, మల్లి మల్లే' అనేది తెలుగు సామెతలు. వశిష్ఠుడు జనకునకు అక్షర, క్షరతత్త్వాల గూర్చి తెలుపుచూ, గుణాలు ప్రకృతి సిద్ధంగా ఏర్పడుననీ, ఒకరి ప్రభావం వలన ఏర్పడవని పేర్కొనెను.

"మాంస భక్షణంబు మానుటకంటెను మేలులేదు"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనిక పర్వము-చ.ఆ. 306 ప.)

"జీవహింస చేయరాదు" అనేది ఆర్యోక్తి. భీష్ముడు ధర్మజునితో మాంస భక్షణం పనికిరాదనీ, శాకాహారమే మేలని తెలిపెను.

"చేరువ తీర్థంబు కంటెను దూరపు తీర్థంబు మేలు"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనిక పర్వము-పం ఆ. 186 ప.)

శివుడు పార్వతికి మానస, వాచిక, కాయికములను త్రివిధ పాపాలను తెల్పు ఘట్టం లోనిది. దగ్గరగానున్న క్షేత్రము కంటె దూరపు తీర్థమే మేలని వేదవాక్కు తెలుపుచున్నదని శివుడు పలికెను.

"ప్రియంబులు కావొకో మీకు ప్రాణముల్"
(ఆంధ్ర మహాభారతము-అశ్వమేధ పర్వము-చ.ఆ. 7 ప.)

ప్రాణమెవ్వరికైనను తీపియే కదా. త్రిగర్త దేశాధిపతులతో అర్జునుడు యుద్ధం చేయు సన్నివేశం లోనిది.

"కాలమూలంబు సర్వంబు"
(ఆంధ్ర మహాభారతము-మౌసలపర్వము-ఏకాశ్వాసము-222 ప.)

బలరామకృష్ణుల దీనావస్థ, యాదవ కులక్షయం కాల మహిమను తెలుపుచున్న వని వేదవ్యాసుడు అర్జునునకు ఉపదేశించెను.

"ప్రాప్తికాలంబగు పనికి నడ్డుపడనేల"
[ఆంధ్ర మహాభారతము-మౌసలపర్వము-ఏకాశ్వాసము-217 ప.)

వేదవ్యాసుడు అర్జునునకు హితోపదేశం చేయు సన్నివేశం లోనిది. మహా మహులచే పూజ్యుడైన కృష్ణుడు సైతం ద్వారకను వదలిపోవుట, యాదవ కుల క్షయాన్ని ఆపలేకపోవుట కేవలం విధి లీలయేనని వేదవ్యాసుడు తెలిపెను. ప్రాప్తి కాలమయ్యే పనికి ఎవ్వరును అడ్డుపడలేరని భావం.

"నిప్పును చెదలంటునొక్కొ"
(ఆంధ్ర మహాభారతము-మౌసలపర్వము-ఏకాశ్వాసము-157 ప.)

అర్జునుడు బలరామకృష్ణుల వెదకుచు వనానికి వెడలును. అచ్చట ఒంటరియై తపస్సు చేయుచున్న కృష్ణుని చూచి మిక్కిలి బాధపడును. గాంధారి శాపాన్ని తలచుకొని నిప్పుకు చెదలంటినట్లయ్యెగదా యని బాధపడెను. కాలమహిమచే ఎంతటి వారైనను ఆపదలపాలయ్యెదరని భావం.

"కాలము కాలంబుపోలుగా కొంటిని నీ లీలలు గలవే"
(ఆంధ్ర మహాభారతము-మహాప్రస్థానపర్వము-ఏకాశ్వాసము-6 ప.)

కృష్ణుడు పరమ పదప్రాప్తి పొందిన రీతిని, బలభద్రుడు ద్వారకా నగరాన్ని వదలివేసిన రీతిని, యాదవ కుల క్షయ వివరాలను వైశంపాయనుడు జనమేజయునకు తెలుపుచు పై విధంగా పలికెను. కాలమహిమను ఎవ్వరును తెలియజాలరని భావం.

"అనలునకు గాడ్పులు తోడైనయట్టులు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 396 ప.)

మంటకు గాలి తోడనునది ప్రసిద్ధమైన ఉపమానం. భీమార్జునుల కలయిక పై విధంగా ఉన్నదని ధర్మరాజు భీమునితో పలికెను. ఎదురులేని జంటయని భావం.

"అహింస మేటియైన ఋష్యధర్మంబు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప.ఆ. 448 ప.)

"అహింసా పరమో ధర్మః" అనునది ఆర్యోక్తి. యక్షుని ప్రశ్నకు సమాధానంగా ధర్మరాజు అన్ని ధర్మములలోకెల్ల అహింసయే ప్రధానమైన ధర్మమని పేర్కొనెను.

"అనలంబుం జీరబంధింపగా మది నూహించినయట్లు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 396 ప.)

'నిప్పును ఒడిన గట్టినట్లు' అనునది తెలుగు జాతీయం. కౌరవుల వ్యూహాన్ని తెలిసికొని, సాత్యకి కృష్ణునకు ఎరిగించెను. కృష్ణుని బంధించ తలపెట్టుట అగ్నిని గుడ్డలో బంధింప నెంచినట్లుగా నుండునని అతడు భీష్మ ద్రోణులతో పలికెను.

"యజ్ఞశేషంబు నమృతంబు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 31 ప.)

ధర్మరాజు శౌనకునితో పై విధంగా పలికెను. యజ్ఞశేషము అమృత తుల్యమని భావం.

"అల్పులయెదురరజ్జులు పల్కుచేటిపెంపు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-చ.ఆ. 392 ప.)

బలి చక్రవర్తి ఇంద్రునితో తన వైభవాన్ని గూర్చి తెలుపుచు పై విధంగా పలికెను. ఇంద్రుడు కూడా తన వలె గొప్పవాడు గావున పలికితినని భావం. బలి చక్రవర్తి గర్వాన్ని దెలుపుచున్నది.

"క్రుద్ధుడైనవాడు అవధ్యులనైన వధియించు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 222 ప.)

'తన కోపమె తనకు శత్రువు' సుమతీ శతకకారుడు తెలిపెను. క్రోధ మెల్ల వేళలను విసర్జనీయమే.

"క్రోధంబు పాపంబు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 222 ప.)

పై అభిప్రాయాన్నే తెలుపు మరొక సామెత.

"అనృతంబు మేటి పాతకము"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము—తృ.ఆ. 45 ప.)

"అబద్ధమాడరాదు — సత్యమునే పలుకవలెను" అనునవి హితవాక్కులు. రాజు సత్యాన్నే పలుకవలెను. రాజు సత్యవచనుడైనచో ప్రజలు అతనిపై విశ్వాసముంచెదరు.

"నివురుగప్పిన నొప్పుఉనిప్పువోలె"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 368 ప.)

కృష్ణుడర్జునునితో సుయోధను గూర్చి పై విధంగా పలికెను. తన వారందరను కోల్పోయినను సుయోధనుడు గుండె నిబ్బరాన్ని కలిగియుండెను. 'నివురు గప్పిన నిప్పువలె' అనునది తెలుగు సామెత. దుర్యోధనుడు గొప్ప వీరుడని కృష్ణుని అభిప్రాయం. ఇది నిజము.

దుఃఖంబు పొందె దైవఘటన జేసి"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ద్వి.ఆ. 77 ప.)

సుఖ దుఃఖాలకు దైవమే కారణమనునది హిందూ మత విశ్వాసము. నలునకు దైవం ప్రతికూలించగా కష్టములు కలిగెనని భావం.

"కాలోచితంబులగు క్షమా తేజంబులు గల్పించునది"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 218 వ.)

క్షమతో పాటు ధర్మ కోపము కూడా అవసరమేనని భావం.

క్షమ గలవానికి బృధ్వీసమునకు నిత్యంబు విజయసిద్ధి యగున్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 228 వ.)

"సబుర్ కా ఫల్ మీఠా హోతా హై" అనునది హిందీ సూక్తి. 'ఓపిక ఉంటే ఓరుగల్లును జయించవచ్చు అనే తెలుగు సూక్తి కలదు. క్షమా గుణము గొప్పదని భావం.

"కడుక్రోధి శర్జంబుగానడు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 222 వ.)

కోపము ఎవ్వరికినీ శ్రేయస్కరము కాదని భావం.

"నూతికప్ప విధంబున"

(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-చ.ఆ. 196 ప.)

ఉలూకుడనువాడు భీమసేనునితో గర్వము పనికిరాదని తెలుపుచు, నూతిలో కప్ప ఏ విధంగానైతే బయటి ప్రపంచాన్ని ఎరుగదో, అట్లే ఏమియు తెలియకుండ గానే నీకు నీవే బలవంతుడవని భావించుచున్నావని పలికెను. వారి సంవాదాన్ని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెను.

"నీతియుతులు సమరమధమ సాధనముగనాడుదురు"

(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-చ.ఆ. 207 ప.)

కర్ణుడు అర్జునునెట్లయినను ఓడించి దుర్యోధనునకు జయము చేకూర్చెదనని పలుకు మాటలను విని కృపాచార్యుడు పై విధంగా పలికెను. యుద్ధం తుది సాధనము గాని, మొదటిది కాకూడదని భావం. సామ, దాన, భేద, దండోపాయములలో దండము చివరిది

"క్షీరోదకగతి"

(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 258 ప)

సంస్కృతన్యాయం. పాలునీళ్లవలె కలసి ఉండుటమనది స్నేహమునకు చిహ్నం.

ధృతరాష్ట్రునిలో శ్రీకృష్ణుడు నిండుసభలో ఇట్లుపలికెను. క్షీరోదకములవలె వారిరువురును కలసి ఉండవలెనని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చెను.

"పాలునీరునుంబోలె"

(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 47 ప)

"క్షీరోదకగతి" అను సంస్కృత న్యాయానికి తెలుగు అనువాదం.
శ్రీకృష్ణుడు ధర్మరాజుతో కౌరవుల కుటిలనీతిని దెలుపు ఘట్టంలోనిది.

భక్షించు క్రియన్"

(ఆంధ్ర మహాభాగవతము-ప్ర.స్కం. 276 ప.)

"చిన్న చేపను పెద్ద చేపను మింగినట్లు" అను తెలుగు సామెతకు సమీపము గా ఉన్నది. అర్జునుడు ద్వారకలో జరిగిన యదు వంశక్షయాన్ని గూర్చి తెలుపుచు,

బలవంతులైన యదువంశ రాజులు తమలో తామే బలమైన చేపలు, బలహీనమైన చేపలనాహారముగా గొనినట్లు చంపికొనిరని బాధపడెను.

"కానకపోయి నూతబడు కైవడి నీ పదభక్తిహీనుడై"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1653 ప.)

ముచికుందుడు శ్రీకృష్ణుని స్తుతించుచు, మూర్ఖుడు నిన్ను కనలేక గ్రుడ్డివాడు నూతిలో బడునట్లు పడిపోవునని, ఎరిగినవాడే నీ తత్త్వాన్ని తెలియగలవాడని పలికెను. జ్ఞానియే భగవత్తత్త్వాన్ని తెలిసికొనును.

"పద్మజుని యాజ్ఞ గ్రోవగా చనునే"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 471 ప.)

"శివునాజ్ఞ లేనిదే చీమైనా కుట్ట"దని సామెత. పై వాక్యం వైష్ణవ మత సాంప్రదాయ రూపంగా కనిపించును. నృగుడను మహారాజు వద్దకు బ్రాహ్మణులిద్దరు గోదానమునకై వచ్చిరి. ఎన్నిరకాల ప్రార్థించినను వినక, శ్రేష్ఠమైన పదివేల ఆవులను ఇవ్వవలసిందిగా అతనిని ప్రార్థించిరి. హరిమాట జవదాట శక్యము కాదు గదా యని రాజు తలంచెను. బ్రాహ్మణులు భూసురులని భావం.

"వేఱ తీర్థంబులవనిపై వెదకనేల"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1115 ప.)

మునీశ్వరుల దర్శనం తీర్థ ప్రయాణములతో సమానమనియు, మునీశ్వరులే గొప్పవారనీ కృష్ణుడు పలికెను.

"ధరణింగలుగవి చోద్యములు నీకు గానంబడెనే"
(ఆంధ్ర మహాభాగవతము-దశ. స్కం. 1235 ప)

నీటినుండి బయటకు వచ్చిన అక్రూరునితో కృష్ణుడు పైవిధంగా పలికెను. తనమహిమలు తనముందే గొప్పగా వర్ణించు అక్రూరునితో కృష్ణుడు పైవిధంగా పలికెను. ఎవ్వరైనను తమకులేని గొప్పదనాన్ని ప్రదర్శింప చూచినచో పైవిధంగా పలుకుట సర్వసామాన్యం.

"నీవసర్వంబుదలపోయ నీరజాక్ష"
(ఆంధ్ర మహాభాగవతము-అష్ట.స్కం. 387 ప)

నారదవచనముచే దేవతలు రాక్షసులతో యుద్ధాన్ని చాలించి విష్ణువు వద్దకు వెడలిరి. అచట భగవంతుని ప్రార్థించి నీవేసర్వస్వమని అతనిని వేడికొనిరి. కష్టములలో ఉన్నవారు భగవంతునిగూర్చి పైవిదంగా పలుకుట సర్వసామాన్యం.

"ఎచ్చట బుట్టినచ్చటికి నేగుటనైజము ప్రాణికోటికిన్"
(ఆంధ్ర మహాభాగవతము-సం.స్కం. 46 ప)

సుయజ్ఞుడను రాజుమరణించగా విలపించు బంధువులను, బాలరూపంలోనున్న యముడుచూచి, పైవిదంగా పలికెను. పుట్టిన ప్రతిప్రాణి మరణించునవనే వేదాంత సారాన్ని ఆవాక్యం తెలుపుచున్నది.

"మృతినొందినవారలు సేరవత్తురే"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 67 ప)

మరణించిన సుయజ్ఞుడను రాజుయొక్క బంధువులతో బాలరూపంలోనున్న యముడావిధంగా పలికెను. చనిపోయినవాు తిరిగిరారనునది నిత్యసత్యం.

"పరమాత్ము విష్ణునితరుల్ దర్శింపగానేర్తురే"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 148 ప)

భగవంతుని అతనిభక్తులే చూడగలరుగాని ఇతరులు చూడలేరని ప్రహ్లాదుడు తండ్రితో పలికెను. భగవంతుడు భక్తలోలుడుకదా.

"లేనివారికి, దిక్కెయ్యదియదియనాకు దిక్కునాకు మహాత్మా"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 265 ప)

"దిక్కులేనివారికి దేవుడేదిక్కు" అనునది సామెత.

ప్రహ్లాదుని విష్ణుభక్తినిచూచి కుపితుడై తండ్రి అతనిని నీకు దిక్కెవరని ప్రశ్నించగా పైవిధంగా సమాధానమిచ్చెను. భగవంతుడే అందరకు దిక్కని భావం.

"కర్మవిరహితులై హరిగనుటమేలు"
(ఆంధ్ర మహాభాగవతము-స.సం. 238 ప)

ప్రహ్లాదుడు బాలురకు భగవద్భక్తినిగూర్చి తెలుపుచు మానవుడు కర్మవిరహితుడు కావలెనని పలికెను. భాగవతం భక్తుల కధలకునిధి.

"కర్మానుగుణములుగాగ జగతి బుట్టి చచ్చుచు క్రమ్మఱ బుట్టునట్లు"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం. 858 వ)

పురంజనునితో నారదుడు కర్మసిద్ధాంతాన్ని గూర్చి తెలుపుచు, పూర్వజన్మ కర్మను అనుసరించియే ప్రస్తుత జన్మము కలుగునని తెలిపెను.

"ఆత్మ నిత్యుండు"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 237 వ)

నారదోక్త ప్రకారముగా బాలకులకు ప్రహ్లాదుడు ఇంద్రుడు తనతల్లిని చెరబట్టిన విధానాన్ని, నారదుడు ఆమెను చెరనుండి విడిపించిన విధానాన్ని తెలుపుచు, ఆత్మ నిత్యమని పేర్కొనెను. చావు దేహానికే కాని ఆత్మకు కాదని భావం.

"పుణ్యపరులకు దాతవ్యంబుగాని వస్తువులేదు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 82 వ)

వ్యాసుడు శుకునకు దానగుణవైభవాన్ని గూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. కావ్యుడనురాజు తన ప్రాణాలను ఇచ్చి బ్రాహ్మణుని రక్షించెననీ, శిబి చక్రవర్తి తన శరీరాన్ని కోసియిచ్చెనని తెలుపుచు పుణ్యాత్ములకు దాతవ్యంగాని వస్తువులేదనెను. "పరోపకారార్థ మిదం శరీరం" అనునది ఆర్యోక్తి. పుణ్యపురుషులు తమ శరీరాన్ని పరుల సుఖమునకే ఉపయోగించెదరని భావం.

"మేలుచెప్పెనేని మేలంద్రులోకులు
చేటుచెప్పెనేని చెట్టయంద్రు"
(ఆంధ్ర మహాభాగవతము-ప్ర.స్కం. 304 వ.)

"పెడితే పెళ్ళిగోరుతారు, పెట్టకుంటే చావుగోరుతారు" అనునది తెలుగుసామెత.

పొగిడేవ్యక్తినుండి జాగ్రత్త పడవలసిందిగా పైవాక్యం తెలుపుచున్నది. లోకరీతికి నిదర్శనం.

"దీపముచే దీపించిన దీపమురెండుగాదె"
(ఆంధ్ర మహాభాగవతము-తృ. స్కం. 454 వ)

"దీపముచే మరోదీపము వెలుగునట్లు" అనునది జాతీయం.

దితితన పతితోసంతానేచ్ఛను ప్రకటించుచు పైవిధంగా పలికెను. పతిప్రేమచే,

అతని రూపాన్ని తనలోనిడికొని తనయుని జన్మకు కారణమై, తల్లి కావలెనను కోరికను తెలుపును. ఏస్త్రీయైనను సంతానవతి కావలెనని కోరుకొనును.

"భగవద్భక్తులు సుజనులు, దగవెఱిగి పరోపకార
తాత్పర్య వివేకగరిష్ఠులైచరింతురు"
(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 164 వ)

విదురుడు శోకతప్తుడైన యుద్ధవునితో పైవిధంగా పలికెను.
సజ్జనులు, భగవద్భక్తులు న్యాయమెరిగి ప్రవర్తించెదరని భావం.

"శుక్తిరజత భ్రాంతియుబోలె"
(ఆంధ్ర మహాభాగవతము-ద్వి.స్కం. 252 వ)
"శక్తిరజతభ్రంతి" సంస్కృత న్యాయం.

బహ్మతపస్సునకు శ్రీమన్నారాయణుడు మెచ్చి జగన్నిర్మాణమునకై అను మతిని ఇచ్చిన సందర్భములోనిది. ప్రపంచము మాయాన్వితమని తెలుపుటకు పై సంస్కృత న్యాయాన్ని ఉదాహరింపవచ్చును.

"సత్పురుషులగువారు దేహాభిమానులుగారు"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం. 541 వ.)

పృథుచక్రవర్తి తాను చేసిన యాగాన్ని ఇంద్రుడు భంగపరచినను ఔదార్య ముతో అతడు ఇంద్రుని క్షమించును. నారాయణుడు చక్రవర్తిపై ప్రసన్నుడై అతనిని అనుగ్రహించును. మహాత్ములైనవారు దేహాభిమానులుగారనే సత్యాన్ని తెలుపు చున్నది.

"మనమెజన్మకారణంబు"
(ఆంధ్ర మహాభాగవతము-చ.సం. 890 వ)

జన్మకు కారణము మనస్సేనని పురంజనునితో నారదుడు పలికెను. కావున మనస్సును జయించినవానికి పునర్జన్మ కలుగదని భావం.

"తత్త్వనియోగంబుమిగులనిత్యంబు"
(ఆంధ్ర మహాభాగవతము-పం.స్కం. 160 వ)

అంగిరసుడను రాజు ఒక వృద్ధబ్రాహ్మణుని శరీరాన్ని చూచి అవమానం చేయును. అతడప్పుడు రాజునకు శరీరం నిత్యంకాదనియు తత్త్వయోగము నిత్యంకావున

సజ్జనుడెన్నడును శరీరానికి ప్రాధాన్యాన్ని ఇవ్వడని తెలిపెను. "అనిత్యాని శరీరాణి అని గీతాకారుడు పేర్కొనెను. ఎవరైనను భగవంతునిలో ఐక్యమగుటకే యత్నింపవలెనని భావం.

"పూర్వజన్మముకర్మమ ద్రోవన్"
(ఆంధ్ర మహాభాగవతము-ఏకాదశ. స్కం. 25 ప)

బ్రాహ్మణ శాపానికి హరి, హర, బ్రహ్మలు సైతం భీతిచెందెదరనియు, ఎదిరించుట శక్యము కాదనుటవలన భాగవతకాలములో బ్రాహ్మణప్రాధాన్యము ఎట్లుండెనో తెలియుచున్నది.

"కాలంబతిచంచలము"
(ఆంధ్ర మహాభాగవతము-ద్వాదశ. స్కం. 5 ప)

శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు కాలమహిమను తెలుపుచు కాలము అతిచంచలమని పేర్కొనెను. కావున కాలాన్ని ఎదిరించక, కాలానుగుణంగా ప్రవర్తించువాడే గొప్పవాడని భావం.

"కుంపటిలో దామరలు"
(ఆముక్తమాల్యద - 2వ.ఆ. 69 ప)

వ్యర్థమైనపనులు చేయువారిని కుంపటిలో తామరలనుట సామాన్యం. ఒకగొప్ప తెలుగుపలుకుబడి.

"అంగిసుఖియైన నంగంబులటన్ మున్నెబాలసుఖులు"
(ఆముక్తమాల్యద - 3వ ఆ. 34 ప)

శరీరధారి సుఖంగా ఉన్నప్పుడు శరీరంసుఖంగానే ఉండును. సుఖాలన్నియు మనస్సుపై ఆధారపడి వుండునని అభిప్రాయం.

"తిర్యక్తిగతానుగతికయౌగా"
(ఆముక్తమాల్యద - 4వ ఆ. 25 ప)

"గొర్రెలమందవల్లె" అనేది తెలుగు పలుకుబడి. ఒకరివెంట ఒకరు అనాలోచితంగా వెడలు మూర్ఖుల మనస్తత్వాన్ని

"కారణగుణంబుగలుగవే కార్యములన్న"
(ఆముక్తమాల్యద - 4వఆ. 174 ప)

ఏకార్యమైనను కారణప్రేరితమేనని భావం.

"ఇంటిలో దేకుముల్లయ్యె"
(ఆముక్తమాల్యద - 5వఆ. 84 ప)

ఇంటి శత్రువును ఈశ్వరుడైనా పట్టుకొనలేడనీ, అందువలన ఇంటి శత్రువుతో జాగ్రత్తగా ఉండవలసిందనే విషయాన్ని తెలుపుచున్నది.

"ఏకుమేకైనట్లు" అనేది తెలుగు పలుకుబడి.

"మసిపాత మానికము"
(ఆముక్తమాల్యద - 6వఆ. 5 ప)

బీదవారికి మసిపాతమే మానిక్యం. గొప్పదనాన్ని వస్తువులో చూడకూడదనే అభిప్రాయాన్ని తెలుపుచున్నది.

"మీన్మ్రింగిన గ్రుక్కన్వారధికిం గొఱతయె"
(ఆముక్తమాల్యద - 6వఆ. 64ప)

సముద్రంలో ఒకచేపను మ్రింగినంత మాత్రమున, సముద్రానికెట్టి నష్టం కలుగదు. విజ్ఞాన సాగరములోని ఒకబిందువునుగ్రోలి విర్రవీగెవారినిగూర్చి తెలుపును.

"పుట్టునుమఱినూతులుత్రవ్వ జేతాళముల్"
(ఆముక్తమాల్యద-6వఆ. 65 ప)

"తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు" అని వేమనశతకకారుడు నుడివెను.

తరచిచూచినయెడల ఎవ్వరికైనను తప్పులు దొరుకుననే విషయాన్ని ఈ సామెత తెలుపుచున్నది.

"అగస్తినీటిని దేర్చుట"
(ఆముక్తమాల్యద - 4వఆ—178 ప)

అగస్త్యుడు సముద్రజలాన్నంతటిని ఒక్కగ్రుక్కలో మ్రింగెను. అటువంటి వారికి ఎవ్వరును నీరును ఇవ్వలేరని భావం. గొప్పవారికి ఎవ్వరును సహాయము చేయలేరని భావం.

"కంచుటద్దములను బూడిదతో తోముట"
(ఆముక్తమాల్యద-4వఆ. 180 ప)

కంచుటద్దములను బూడిదతో తోమిన వ్యర్థమగును. అట్లే పాత్రమెరిగి దానం చేయవలెనని భావం. ఉచితానుచితములను ఎరిగి ప్రవర్తించువాడే గొప్పవాడనీ. అట్లుకానియెడల వ్యర్థుడగుననియు భావం.

"వేటగాడు నల్లగోలనిచ్చి సివ్వంగిందిగుచును"
(ఆముక్తమాన్యాద - 4వఆ. 193 ప)

వేటగాడు ఏవిధంగా నల్లగోలనుఏంచి సింహాన్ని వలలోవేసికొనునో, అట్లే కొందరు మాయమాటలుచెప్పి ఎదుటివారిని మోసంచేసెదరు. అట్టివారితో జాగ్రత్తగా నుండవలెనని భావం.

"ఆహారదోషము విజ్ఞాన నాశనమునకు మూలము"
(ఆముక్తమాల్యద–4వఆ. 194 ప)

ఆరోగ్యకరమైన శరీరములోనే మనస్సు సైతం ఆరోగ్యంగా ఉండును. సరియైన ఆహారమున్న యెడల శరీరం ఆరోగ్యంగా ఉండును. "అన్నం పరబ్రహ్మ స్వరూపం" అను వేదోక్తి కలదు.

"శరత్తున అగస్త్యార్ఘ్యము"
(ఆముక్తమాల్యద - 2వ ఆ. 175 ప)

అగస్త్యుడు సముద్రంలోని నీటినంతయు గ్రోలెను. శరత్కాలము దానికి తోడుగా అగస్త్యునకర్ఘ్యమివ్వవలెను. అవసరమునకు నీరులేకున్న ఎంతకష్టమగునో పైసామెత తెలుపుచున్నది.

"తప్తపాత్రయందుంచిన పాలుచిక్కనగును"
(ఆముక్తమాల్యద - 2వ ఆ. 176 ప)

వేడిపాత్రయందుంచిన పాలు చిక్కనైనట్లు, కష్టముల నెదిరించిననే మానవుడు ఔన్నత్యాన్ని సాధించునని భావం. "కష్టేఫలీ" అనునది సంస్కృతలోకోక్తి.

"కాలబడసిన ముత్తెము సున్నమగును"
(ఆముక్తమాల్యద - 5ఆ. 61 ప)

ఏవస్తువును ఎట్లు కాపాడుకొనవలెనో పై సామెత తెలుపుచున్నది. ముత్యమైనను కాలితడిసినచో సున్నమగును. "తమతమ నెలవులుడప్పిన తమ మిత్రులె శత్రులౌట తథ్యమ"ని సుమతీ శతకాయుడు తెలిపెను.

"మంత్రజపక్రమము - ప్రయోగము"

(ఆముక్తమాల్యద-5వ ఆ. 86 ప)

ఏమంత్రముకైనను, ఏసిద్ధాంతమునకైనను ప్రయోగం ముఖ్యము "Practice makes man perfect" అను ఆంగ్లసూక్తి 'మాటలుకాదు చేతలుకావాలి' అను తెలుగు సామెతయు పై అర్థాన్నే సూచించుచున్నవి.

"ఉప్పుచిందియినుమడియగును"

(ఆముక్తమాల్యద-7వ ఆ. 22 ప)

ఉప్పునుచిందినచో రెండింతలగును. అట్లే తనకంటె తక్కువస్థాయిలో ఉన్నవారితో ఎట్లున్నను అవమానమే సంభవించునని భావం. స్నేహం ఎప్పుడును తగువారితో చేయవలెనని భావం.

"కొండంతటి దేవరకును కొండంతటి పత్త్రి"

(విజయవిలాసము - ప్ర.ఆ. 16 ప)

కొండంత దేవునకు కొండంత పత్త్రిని పెట్టలేరు. "భక్తికలుగు కూడు పట్టెడైనను చాలు"నని వేమన తెలిపెను. భక్తిముఖ్యమని భావం.

"మొగమొకయింతై బుజాలుమూడై"

(విజయవిలాసము - ప్ర.ఆ. 39 ప)

మొగమువికసించి ఉత్సాహంతో భుజములుబ్బినవని భావం. మిక్కిలి సంతోషాన్ని వ్యక్తపరచే తెలుగు పలుకుబడి.

"గోరంతయుజవదాటన్"

(విజయవిలాసము-ప్ర.ఆ. 57ప)

తెలుగు పలుకుబడి. ఆజ్ఞాబద్ధుడైనాడని అర్థం.

"చంకజేతులు పెట్టుక"
(విజయవిలాసము-ప్రఆ. 60 ప)

వినయవిధేయతలతో ప్రవర్తించు మనస్తత్వాన్ని తెలుపును. తెలుగుపలుకుబడి.

"కాలిన శూలము ల్చెవులలో నంటించినట్లు"
(విజయవిలాసము-ద్వి. ఆ. 100ప)

కాలినశూలాన్ని చెవికి అంటించినట్లయితే ఎంత బాధకలుగునో అంతబాధ పెట్టేవాడని భావం.

"అరచేతిలోని నిమ్మపంటివలె"
(విజయవిలాసము-ద్వి.ఆ. 113ప)

"అరచేతిలో వైకుంఠము" అనునది తెలుగుపలుకుబడి.

"మిన్నువిరిగి మైబడినరీతి"
(విజయవిలాసము-ద్వి.ఆ. 149ప)

తెలుగు పలుకుబడి.

"నిమ్మకెరువు వేసినచందంబున"
(విజయవిలాసము-ద్వి.ఆ. 167ప)

వ్యర్థమయిన పనులుచేయువారిగూర్చి తెలుపునది.

"నోరారమాట్లాడు"
(విజయవిలాసము-ద్వి.ఆ. 167ప)

తనివిదీరమాట్లాడినట్లు. తెలుగు పలుకుబడి.

"తలప్రాణముతోకకువచ్చె
(విజయవిలాసము-ద్వి.ఆ. 176ప)

మిక్కిలి కష్టతరమైనదని భావం.

"మొలనూలు ముట్టగట్టుట"
(విజయవిలాసము-ద్వి.ఆ. 209ప)

మిక్కిలి చనువును సూచించు మనస్తత్త్వము.

"నీళ్లలోనిముల్లు"
(విజయవిలాసము-ద్వి.ఆ. 256ప)
మెత్తగానుండి అపకారము చేసేమనస్తత్వాన్ని తెలుపుచున్నది.

"పదివేలును నేలపనికిమాలినమాటన్"
(విజయవిలాసము-ద్వి.ఆ. 277 ప)
వ్యర్థమైన మాటలుకాక, చేతలు ముఖ్యమని భావం.

"కయ్యానికి కాలుదువ్వు"
(విజయవిలాసము-తృ.ఆ. 26ప)
అనవసరముగా పోట్లాడు మనస్తత్వాన్ని తెలుపు పలుకుబడి

"నిప్పుద్రొక్కిన చందమున"
(విజయవిలాసము-తృ.ఆ. 29 ప)
"తట్టంబడిన పులుగుచందంబున"
(విజయవిలాసము-తృ.ఆ. 29ప]
"ఆర్చెదో తీర్చెదో"
[విజయవిలాసము-తృ.ఆ. 184 ప.]

"ఆర్చేవాడివా, తీర్చేవాడివా" అనునది తెలుగు సామెత. వ్యర్థముగా మాట్లాడు వారిగురించి తెలిపే పలుకుబడి.

"ధాతవ్రాసిన వ్రాతకు దప్పగలదె"
[సారంగధర చరిత్రము-ద్వి.ఆ. 29ప]
భగవన్నిర్ణయాన్ని ఎవ్వరును మార్చలేరని భావం.

"తొలుజన్మంబున జేసిన కొలయునుపుణ్యంబు కట్టికుడుపకపోనే"
[సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 33 ప.]
హిందూధర్మ ప్రకారం కర్మ సిద్ధాంతాన్ని తెలుపుచున్నది.

"మెత్తనగుచోటనె గుద్దలివాడియేగదా"
[సారంగధరచరిత్రము—ద్వి.ఆ. 38 ప.]

"మెత్తనివాని జూచిన మొత్తబుద్ధగు" అనునది తెలుగు సామెత. బలహీనుడైనవానినెవ్వరైనను అవమానం చేసెదరని భావం.

"అతివినయము ధూర్తలక్షణము"

[సారంగదరచరిత్రము-ద్వి.ఆ. 88 ప.]

"సుఖమున నేటికి రాయబారముల్"

[సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 88 ప.]

"చీరకజిక్కినయది మొదలుగా బడ్డ కుట్టులు"

[సారంగదరచరిత్రము-ద్వి.ఆ 150 ప.]

కష్టాలన్నియు కలసివచ్చుననే భావాన్ని తెలుపు తెలుగు పలుకుబడి.

"వినాశకాలే విపరీతబుద్ధి"

(సారంగదరచరిత్రము-ద్వి.ఆ. 144 ప.)

చెడురోజులు దాపురించిన బుద్ధివక్రించునని భావం.

"గాలిగలయప్పుడె తూరుపాఱబట్టుము"

(సారంగదరచరిత్రము-ద్వి.ఆ. 167 ప.)

'Make hay while sun shines' అను ఆంగ్లసామెతకు సమానార్థకం. ఎప్పటిపని అప్పుడే చేయవలయునని భావం.

"ముంజేతికంకణమున కద్దంబేల"

(సారంగదరచరిత్రము-ద్వి.ఆ. 230 ప.)

తెలిసినవారికి ఎక్కువ చెప్పవలసిన అవసరం లేదని భావం.

"మగవాడు బొంకెనాయలదడి గట్టినటులు"

(సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 250 ప.)

మగవాడు సరిగా అబద్ధమాడలేడని భావం.

"ఆడుది బొంకెనా గోడవెట్టినట్లు"

(సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 250 ప. )

ఆడవారి మనస్తత్వాన్ని తెలుపు సామెత

"ఇంట గెలిచి రచ్చ గెల్వవలెఁ దగు"

[సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 261 ప.]

ఇంటగెలిచినవాడే రచ్చగెల్వదగినవాడగునని భావం.

"నిప్పునినంతనె నోరుపొక్కదుగదా"
(సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 263 ప.)

మాటలుకాదు చేతలు ముఖ్యమని భావం.

"కధకుకాళ్లు, ముంతకు జెవులు"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 18 ప.)

వ్యర్థమైన మాటలనియర్థం.

"మందుల్గదా భూపతుల్"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 18 ప.)

రాజులాలోకింపలేరని భావం.

"చెవులెకన్నులు రాజులకుందలపగన్"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 52 ప.)

రాజులకు చెవులె ఉండునుగాని మనస్సుండదగని భావం. కావున వారితో నున్నప్పుడు బహుజాగ్రత్తతో మెలగవలెనని భావం.

"నోరిలోపలన్ వ్రేలిడినప్పుడున్ గఱవనేరడు"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 58 ప.)

"నోట్లోవేలుపెడితే కొరకడు" అను సామెతకు దగ్గరగా ఉన్నరూపం. అమాయకుడని భావం.

"రాజుమొత్తగా మొగసాలకున్మొఱ"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 80 ప.)

వృథాప్రయాస అని అర్థం. రక్షించేవాడే దండించినప్పుడు అతన్ని మరెవ్వరు రక్షించలేరని భావం.

"ఉల్లిదిన్నకోమటి పలెనూరకున్నవాడు"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 164 ప.)

చేసినతప్పును కప్పిపుచ్చుకొనే మనస్తత్వాన్ని తెలుపుపలుకుబడి.

"సాహసం షడ్గుణాచ్చైవ"
(సారంగధరచరిత్రము-తృ.ఆ. 216 ప)

"విజయమో, వీరస్వర్గమో" అనునది తెలుగుసామెత. సాహసమున్నవారిని ఎవ్వరును ఏమి చేయజాలరు.

"తలతాకిని వాపజేసిన జలజాక్షులనమ్మరాదు"
(సారంగధరచరిత్రము-ద్వి.ఆ. 8 ప.)

ఎట్టిపరిస్థితులలోను స్త్రీని నమ్మకూడదని భావం.

"మీమాటలు మంత్రములు"
(మనుచరిత్రము-ప్ర.ఆ. 62 ప.)

గౌరవభావాన్ని సూచించు తెలుగుపలుకుబడి మాటతీరును బట్టి గౌరవం లభించునని భావం.

"నీటబుట్టినవాడు కాడోటునహిన్"
(మనుచరిత్రము-తృ ఆ. 41 ప)

కష్టాలలో వృద్ధిపెరిగినవానిని మరిన్ని కష్టములు బాధింపవనే భావాన్ని తెలుపుతుంది.

"క్షణికిణముల్ జవరాంద్రచిత్తముల్"
(మనుచరిత్రము-తృ ఆ. 61 ప.)

స్త్రీలమనస్సు చంచలమైనది కావున వారిని నమ్మకూడదని భావం.

"మతముచెడ సౌఖ్యమయినను వలయుగలుగ"
(మనుచరిత్రము-తృ.ఆ. 103 ప.)

"వ్రతముచెడ్డా సుఖము దక్కాలి" అను సామెతకు గ్రాంధికరూపం.

"రెంటికిన్ జెడినరేవడ"
(మనుచరిత్రము6తృ.ఆ. 105 ప)

ఉభయభ్రష్టత్వమని భావం.

"క్రొత్తానికి చిక్కిన తేటి విధంబు"
(మనుచరిత్రము-తృ.ఆ. 134 ప.)

"పాత ఒక రోత కొత్త ఒక వింత" అనేభావాన్ని తెలుపుతున్నది. కొత్తదన మనిన ఎవ్వరికైనా మోజుండునని భావం.

"మృత్యువు దాగెడిచోటలేనొకా"
(మనుచరిత్రము—చ.ఆ. 105 ప)

ఎచ్చటఉన్నను వచ్చే మృత్యువును తప్పించలేరని భావం.

"గుంట్రాదాచినపెండ్లి యేమిటికి జిక్కున్"
[మనుచరిత్రము-పం.ఆ. 18 ప.]

"గుంట్రాయిదాచిన పెండ్లి ఆగునా" అను సామెతకు గ్రాంధికరూపం.

"పూవునుందావియుబోలె"
[మనుచరిత్రము-ష.ఆ. 67 ప]

పరస్పరం ప్రేమతో కలసియుండుట అని భావం.

ఇట్లుప్రాచీన సాహిత్యములోనున్న నీతిసందేశములకు సంబంధించిన సామెతలపరిశీలించుటైనది.

## -: ఇ త ర ము లు :-

"దానగుణము శ్రద్ధలేనివానికి లేదు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-పం.ఆ. 250 ప.)

దానగుణము, శ్రద్ధ గుణములు మానవునకుండవలసిన దైవగుణాలని గీతకారుడు పేర్కొనెను.1

తులాధారుడు జాజలికి తెలిపిన బ్రహ్మగీపతోనిది. శ్రద్ధలేని వ్యక్తి దానం చేసినను దానఫలాన్ని అనుభవింపలేడు. ఏ పనినైనను శ్రద్ధతో చేయవలెను.

"దేవతీర్థములు చూచినంతనె కోర్కెలిచ్చునే"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1506 ప.)

---

1. అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞాన యోగవ్యవస్థిత
దానందమశ్చ యజ్ఞశ్చస్వాధ్యాయ యస్తపార్జవమ్
........................ ............ శ్రద్ధ... ... ....
భగవద్గీతాతాత్పర్యదర్పణము—(701 పే. 707 పే.)
(భగవద్గీత—16వ అధ్యాయము 1-4 శ్లోకములు)

కృష్ణుడు అక్రూరుని హస్తినాపురానికి పంపును. దేవతీర్థాలు కనినంతనే కోర్కెలు నెరవేరవనియు, సజ్జనుల సాంగత్యాన్ని అవసరమని పలుకును. పుణ్య తీర్థ దర్శనముతో బాటు సజ్జన సాంగత్యము కూడా అవసరమని భావం.

"పుత్తడిబొమ్మ కైవడిన్"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 238 ప.)

"పుత్తడిబొమ్మ" అనునది తెలుగు పలుకుబడి. అమ్మాయి అందంగా ఉన్న యెడల "పుత్తడిబొమ్మ"వలె ఉన్నదనుట పరిపాటి. రుక్మిణి "పుత్తడిబొమ్మ" వలె అందముగానున్నదని కవి వర్ణించెను.

"మాటలు వేయు నేటికిన్"
(ఆంధ్ర మహాభారతము-దశ.స్కం. 766 ప.)

"మాటలు వేయేల" అనునది పలుకుబడి. సహదేవుడు ధర్మజుని చూచి, కృష్ణుని సంతుష్టుని చేసిన అందరను సంతుష్టుల చేసినట్లేనని, దీనిని చెప్పుటకై "మాటలు వేయు నేటికిన్" అని పలుకును. పలుమార్లు చెప్పవలసిన అవసరము లేదని భావం.

"తామర తంపరై"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 276 ప.)

'దినదినాభివృద్ధియై' అని అర్థము. తెలుగు పలుకుబడి. రుక్మిణీ కళ్యాణము కన్నులవండు వొనరించినది. వారి దాంపత్యం పుత్రులుదయించుటచే "తామర తంపరై" వర్ధిల్లినది. తామర సరస్సంతయు వ్యాపించును. అట్లే మిక్కిలి అభివృద్ధి చెందువారిని గూర్చి పై విధంగా పలికెదరు.

"నీ దయ వారి భాగ్యంబు కొలది"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 641 ప.)

'నీ దయ-వాడి ప్రాప్తము'మనది తెలుగు జాతీయము. ఒకనాడు విప్రుడు జరాసంధ భీతులైన రాజుల తరంపున కృష్ణుని వద్దకు వచ్చి-వారిని రక్షించవలసినదిగా వేడుకొని, "నీ దయ వారి-భాగ్యంబు కొలది" యని పేర్కొనెను. దయామయుడైన భగవంతుని కరుణకు కేవలం అదృష్టవంతులైన వారె నోచుకొనెదరని భావం.

"వనరుహనాభ దాసజనవర్గముకుంగలవేయసాద్యముల్"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 710 ప.)

'నాకన్న ఘనులమ్మ నా భక్తిపరులు' అనేది ప్రచారములో ఉన్న సామెత. భగవంతుడు భక్తులపై ఎనలేని అనురాగాన్ని చూపునని భావం. కృష్ణుడు పాండవాగ్రజుని ప్రార్థనతో హస్తినలో ఉండుటకే నిర్ణయించుకొనును. భగవద్భక్తులకు అసాధ్యమేమి లేదని భావం.

"కన్నులకఱవుదీర"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 869 ప.)

కృష్ణుని సౌందర్యాన్ని గోపికలు కన్నులకఱవు తీరునట్లుగా గ్రోలిరని కవి వర్ణించెను. 'కన్నులకఱవుదీఱ' అనునది తెలుగు పలుకుబడి.

"అనిశము మాఱాడుసుతులధములు"
(ఆంధ్ర మహాభాగవతము-నవ.స్కం. 558 ప.)

"తండ్రి మాట జవదాటరాదు" అనునది సాంఘిక న్యాయం. తండ్రి మాట నెదిరించు కుమారులధములని పూరుండు యయాతితో చెప్పెను.

"నోచిన నోములెల్లనునీవయై"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 129 ప.)

దేవకీదేవి భగవంతునితో తనసంతానాన్ని కంసునిబారినుండి కాపాడవలసిందిగా ప్రార్థించును. పుట్టిన ప్రతికుమారుని కంసుడు చంపుచున్నాడనీ, నానోచిన నోములెల్ల నీవేయై నన్నతని నుండి కాపాడవలసిందని ఆమె అతనిని ప్రార్థించెను. గొప్ప పలుకుబడిగా భాషలో స్థిరపడింది.

"పుట్టువెన్నడునెరుగని పొట్టిపడుగు"
(ఆంధ్ర మహాభాగవతము-అ.స్కం. 536 ప.)

పొట్టిగాఉన్న గొప్పవారినిగూర్చి సామాన్యంగా అట్లుపలికెదరు.

వామనుని గూర్చితెలుపుచు, భగవంతునకుజన్మ, మరణాలుండవని కవి పేర్కొనెను. వామనుడు భగవంతుని రూపం కదా.

"ఏకపుత్రుడు ననపత్యుడునొక్కరూపమని"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ. ఆ. 181 వ)

"అపుత్రస్యగతిర్నాస్తి" అనేది సంస్కృతలోకోక్తి, అట్లే బహుసంతాన ముండవలెనను విశ్వాసము మహాభారత కాలములో నుండెనని పైవాక్యం తెలుపుచున్నది.

"సముద్రంబుసొచ్చుయేఱులుంబోలె"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 169 వ)

"నదీనాం సాగరోగతిః" అనేది సంస్కృతలోకోక్తి, పైవాక్యాన్ని సంస్కృత లోకోక్తికి ఆంధ్రానువాదంగా చెప్పవచ్చును.

సైంధవుని ఎట్లయినను పట్టుకొనవలెనను అర్జునునకు ఎదురుగా కౌరవ సైన్య ముండెను. సైన్యాన్ని ఎదిరించి సైంధవుని అతడు పట్టుకొనెను. సముద్రంలో కలిసే ఏరులవలె సైన్యసమూహమంతయు అర్జునునిచే పరాజితమయ్యెను.

"మూడగ్నులయొద్దను నాల్గవయగ్నియనన్"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-స. ఆ. 153 వ)

పరాశరుడు రాక్షస సంహారార్థము యజ్ఞాన్ని ఒనరించుచు మూడగ్నులమధ్య కూర్చున్న విధానం మూడగ్నులవద్దనున్న నాల్గవయగ్నివలె ఉన్నదని కవివర్ణించెను. అగ్నిశుచికి సంకేతము. "వాడొట్టినిప్పురా" అనేది తెలుగు జాతీయము.

"కన్నులుపెడినట్లున్నది"
[ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 51 వ)

బలవంతులైన పాండవసైన్యంముందు, చివరకు మిగిలిపోయిన సైన్యాన్ని చూచిన కన్నులుపెడినట్లున్నదని, సంజయుడు దైన్యంగా ధృతరాష్ట్రునకు తెలిపెను. చక్కని తెలుగు పలుకుబడి.

"మాటలువేయునేల"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ప్ర. ఆ. 103 వ)

"మాటలువేయేల" అనేది చక్కని తెలుగుపలుకుబడి.

సంజయుడు ద్రోణుడుచేయు సమరాన్ని వివరించు సన్నివేశంలో ధృతరాష్ట్రునితో పలికెను.

"అనలకణమించుక జాలదె కాల్పంగనుగ్ర శైలాటవులన్"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ష.ఆ. 117 ప)

కణికనీతినుండి గ్రహింపబడింది.

"నిప్పంటించి వచ్చినాడు" అనేది తెలుగు జాతీయం. చిన్న నిప్పురవ్వ ఎంతగొప్ప అడవినైనా కాల్చివేయును. కావున ఎవ్వరైనను. ఇతరులతో సంభాషించినపుడు జాగ్రత్తగా ఉండవలెనని భావం.

"శ్రీవిహీనుల గరంబర్థింతురే కామినుల్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ష.ఆ. 165 ప.)

"డబ్బులేనివాడెందులకు కొరగాడ" ను సామెతకలదు. రాజ్యము, సంపదలను కోల్పోయిన పాండవులను ఆశ్రయించుటకంటె, తనను ఆశ్రయించి పరిణయమాడిన శ్రేయమని సైంధవుడు ద్రౌపదితో పలికెను.

"చాతకప్రకరములు పర్జన్యుగోరునట్లు"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 344 ప.)

ఏవిధంగానైతే చాతక పక్షులు మేఘాలరాకకు ఎదిరిచూచునో, అట్లే తన పరివారం సైతం కృష్ణుని రాకకెదురుచూచునని ధర్మరాజు కృష్ణునితో పలికెను. "మేఘానికై ఎదురుచూచుచాతక" మనునది తెలుగుజాతీయము.

"సముచిత హింసనమరయనహింస"
[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 111 ప.]

కౌరవుల మరణం ధర్మరాజును బాధింపచేయును. కౌరవులు దుర్మార్గులనీ, దుర్మార్గుల సంహరించి సన్మార్గుల, రక్షించుట హింసకానేరదని ద్రౌపది ధర్మజునకు తెలిపెను.

"పురుషుండు సెఱుపండుసెడడు"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-ప్ర.ఆ. 198 ప.)

శ్రీకృష్ణుడర్జునునకు తత్త్వజ్ఞానమును ఉపదేశించుచు నైవిధంగా పలికెను. ప్రపంచానికి కర్త, భర్త భగవానుడేనని తెలిపెను.

"ఏలకుంగోలకుదెచ్చినట్టై"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-ద్వి.ఆ. 333 ప.)
"పలకు గోలకుదెత్తురు"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-తృ.ఆ. 88 ప.)

"కకావికలుచేయుట" అని అర్థం.

"ఏలకుగోలకు దెచ్చుట" అనునది గొప్ప తెలుగు పలుకుబడి.

"పేరడవిగూల్చు పెనుగాలికై వడి"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 310 ప.)

అర్జునుడు కౌరవ సైనికులందరిని నశింపచేయుట, పేరడవిని పెనుగాలి నష్టము చేసినట్లుగా ఉన్నదని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెను.

"రోయుతీగ కాళ్లంబెనగెందాను"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-పం.ఆ. 220 ప.)

"ఆడబోయిన తీర్థమెదురైనట్లు"

"వెదకబోయినతీగ కాలికిదగిలినట్లు" అనునవి తెలుగుసామెతలు. భీష్ముడు ద్రోణుడు విచారించుటకని అతనికి ధన, కనక, వస్తు వాహనాదులను ఇచ్చును. ద్రోణునకు వెదకబోయిన తీగకు కాలికిదగిలినట్లు సంతోషము కలిగెను.

"నిదురపోవునట్టిదిగాదె"
(ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ.)

కృపాచార్యుడు అశ్వత్థామతోనిదురించినవారిని చంపగూడదని సలహాయిచ్చెను. నిదురించినవాడు చనిపోయినవానితో సమానమని భావం. చావును పెద్ద నిదురగా భారతీయులెంచిరి.

"అగ్నిజ్వాలోత్కరముపయిమిడుతయుబుకకరణి"
[ఆంధ్ర మహాభారతము-సౌప్తికపర్వము-ప్ర.ఆ. 23 ప.]

"అగ్నిలోబడుమిడుతలవలె" అనునది తెలుగుసామెత. పాండవులనెట్లయిన చంపెదనని అశ్వత్థామ దుర్యోధనునితో పలుకును. వారిని ఎదిరించుట అగ్నిలోపడే మిడుతలవంటిదని తలచి నిదురించినప్పుడు చంపుటకు నిశ్చయించుకొనెను.

"ఇంటచిచ్చిడుచాడ్పున"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 393 వ.)

"వాడు ఇంటికినిప్పుపెట్టువాడురా" అనునది తెలుగుజాతీయం. ఇంటికి నిప్పు పెట్టుట నీచమైనక్రియ. అనగా అట్టివానికి ఉపకారము చేసిన ప్రతిగా అపకారమే చేయును. కావున అట్టివానికి ఉపకారములెట్టి పరిస్థితిలోను చేయకూడదని భావం.

భీముడు గదా యుద్ధమున దుర్యోధనుని తొడలు విరిచి, ఎడమ కాలితో అతని తలపై తన్నెను. ఈ ఘోరదృశ్యాన్ని ఎందును చూడబోమని దృతరాష్ట్రుడు సంజయునితో పలుకుచు ఈ చర్య ఇంటికి నిప్పుపెట్టు చర్యవలె హేయమైన, నీచమైన చర్య అని పలికెను

''దీపంబువలన నొండొక దీపంబుప్రభవించినట్లు''
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 90 వ )

శకుంతల దుష్యంతునితో తన ప్రేమగాడను వివరించుచు, పుత్రోదయానికి దుష్యంతుడే కారణమని తెలుపును. ఇరుశరీరముల కలయిక వలననే పుత్రుడుద-యించును. కావున దుష్యంతుని తనను స్వీకరించవలసిందిగా ప్రార్థించును. "దీపముచే మరొక దీపము వెలుగునట్లు" నునది సామెత.

"కుంభనిక్షిప్త భుజగంబుచందంబున"
(ఆంధ్రమహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 10 వ.)

"కుండలోనున్నపామువలె" అనునది సామెత. కుమారులు యుద్ధములో చనిపోయిరని తెలిసిన ధృతరాష్ట్రుడు మిక్కిలి రోదించుచు, కుండలోనున్నపామువలె ఉండెను. మిక్కిలిగా కుండలోఉన్నపాము బుసలు కొట్టును అనగా అతడు మిక్కిలి బాధతో, కోపముతో ఉండెనని భావం.

"ఖింతకూరలు గ్రుడ్డుపువ ప్లేఢ్కసేయు"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ. 93 వ.)

ధర్మరాజుమాటలకుసమాధానంగా దుర్యోధనుడు పైవిధంగా పలికెను. రకరకాలకూరలు కడుపునకు సంతోషాన్ని కలిగించినట్లు, తాను గదను ధరించి వివిధరీతులలో పాండవులను, వారిబంధుతతిని సంహరింతునని తెలిపెను. దుర్యోధనుని యుద్ధప్రీతిని పైవాక్యం తెలుపుచున్నది,

"కొండగూలినట్లు"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 320 వ.)

ధృష్టద్యుమ్నుఁ, సాత్యకులచే సాల్వుఁడేనుగుతో క్రిందపడిపోవుట కొండ గూలినరీతివలె ఉన్నదని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను. "కొండవలెనున్నాడు" కొండగూలినట్లు పడిపోయిననునవి తెలుగు జాతీయాలు.

"కోపపరుపాలికి భామలువోవనోపరే"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-చ.ఆ. 38 వ.)

ఇంద్రుడు విశ్వామిత్రుని తపోభంగానికై మేనకను పంపుటకు నిశ్చయించును. కోపముగలవారిచెంతకు స్త్రీలు పోవుటసమంజసం కాదనీ, తనకు భయంగాఉన్నదనీ ఆమెపలికెను. కోపపరులవద్దకెవ్వరును పోవుటకిష్టపడరు.

"ఎంతయోటుపడిన నంతియజూదంబునందుదగులు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ద్వి.ఆ. 63 వ.)

కలి ప్రభావముచే పుష్కరుడనువాడు నలుని జూదమునకు ఆహ్వానించును. ఆ జూదములో నలుడు ఓడిపోవును. ఓడినకొలది మరింత పంతంతో ఆడి తుదకు సర్వస్వమును కోల్పోవును. "జూదమాడుట తగదను" సత్యాన్ని తెలుపుచున్నది.

"సర్వభూతంబులు నాహారంబున జీవించి వర్ధిల్లు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-తృ.ఆ. 279 వ.]

"శ్యేనాః కపోతాన్ ఖాదయన్తి" అనునది వేదవాక్యం. కావున తాను కపోత మును చంపి తినుటలో తప్పు లేదని గ్రద్ద శిబి చక్రవర్తితో పలుకు సన్నివేశము లోనిది. అందులకే 'అన్నం పరబ్రహ్మ స్వరూపమ'ను సామెత కలదు. జీవుల న్నింటికి ఆహారమవసరం. ఏ జీవికి ఏ ఆహారము అవసరమో భగవంతుడే నిశ్చ యించెనని భావం.

"విధాతు నియోగంబునంబుణ్య పాప ఫలంబు సంప్రాప్తించు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము—ప్ర.ఆ. 230 వ.[

భగవంతుని ఆజ్ఞ వలననే సర్వకార్యములు సిద్ధించుననీ, పాప, పుణ్యాలు

పూర్వజన్మ కర్మననుసరించి ప్రాప్తించునని ధర్మజుడు ద్రౌపదికి తెల్పెను. హిందూ మత విశ్వాసాన్ని తెలిపెడు వాక్యం.

"దైవమానుషంబులు గర్మఫల ప్రాప్తికి నిమిత్తంబులు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 233 వ.]

ఫల ప్రాప్తికి దైవసహాయంతో పాటు పురుష ప్రయత్నం కూడా అవసరమని ద్రౌపది ధర్మజునకు తెలిపెను.

"ప్రాణవిగతు సుఖ దుఃఖములు రెండువిడుచునట్లు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 244 వ.]

సుఖ దుఃఖాలు ప్రాణములున్నంత వరకే. చనిపోయిన వారికి వీనితో ఏమియు అవసరము లేదనీ, ధర్మ మార్గాచరణమే మానవునకు ముఖ్యమనీ ధర్మరాజు భీముని తో పలికెను. అది నిత్య సత్యం.

"నికృతిపరుల నికృతిజేసి నిర్జించిన బాపంబు లేదు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 395 వ.]

"మోసమును మోసముచే జయించవలెను"
"ముల్లును ముల్లుతోనే తీయవలె" ననునవి సామెతలు.

దుర్యోధనాదులు దౌర్జన్యం చేసి రాజ్యాన్ని పొందిరి. కావున వారిని మోసం చేసి రాజ్యాన్ని తిరిగి సంపాదించుటలో తప్పులేదని ధర్మరాజుతో భీముడు పలికెను. దుర్మార్గులను మోసం తోడనే జయించవలెనని భావం.

"జలంబులతోనగ్ని యుపశమిల్లునట్లు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 22 వ.]

శౌనకుడు ధర్మరాజుతో ఈవిధంగా పలికెను. ఏ విధంగానైతే జలముచే అగ్ని చల్లారునో, అట్లే శోక సంతప్త మైన హృదయానికి హితవాక్యాలు ఉపశమనము కలిగించునని భావం.

అరణ్యవాసానికై బయలుదేరిన పాండవులతో హస్తినలోనున్న ప్రజలు భూసురులు మిక్కిలి దుఃఖంతో హస్తినను వదలి వెడలకూడదని ప్రార్థించెదరు. ఆశ్రితులను ఎప్పుడును వదలకూడదని ఆర్యోక్తి.

"పద్మ పత్రంబు నీరంబొందనియట్లు"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 24వ]

"తామరాకుమీద నీటిబొట్టువలె" అనునది తెలుగు జాతీయం. ఉత్తముడైన వ్యక్తి నీరంటని పద్మపత్రమువలె, సంసారంలో ఉండికూడ వ్యామోహరహితుడై ఉండవలెనని శౌనకుడు ధర్మరాజుతో పలికెను.

"వాతాపి తడయక మ్రింగిన తపసియట్ల"
[ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-ప్ర.ఆ. 116 వ]

"జీర్ణం, జీర్ణంవాతాపిజీర్ణం' అనునది తెలుగు సామెత. బకాసురుని తమ్ముడైన కిమ్మీరుని, వాతాపి తపసిని మ్రింగినరీతిగా చంపితినని ధర్మరాజుతో భీముడు తెలిపెను.

"జూదంబు కతమునఖేదంబు గొకుండనేరదు"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వం-ద్వి.ఆ. 157 వ)

జూదంవలన మిత్రులే శత్రులగుదురని ధర్మరాజుతో విదురుడు పలికెను. జూదమాడుట పనికిరాదని, భావం.

"తమలోనజూదంబు వాదునగుట, గలహమూలంబు యెట్టిశాంతులకైన"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వం—ద్వి.ఆ. 131 వ)
జూదంవలన కలుగు నష్టాలను ధృతరాష్ట్రునకు విదురుడు తెలిపెను.

"ఏందుపాపవృత్తంబు జూదంబు"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 166 వ)

జూదమాడుట కాహ్వానించిన దుర్యోధనునితో ధర్మరాజు పైవిధంగా పలికెను. జూదమెన్నడును పాపకార్యమే.

"కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గ నరక నిమిత్తములు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము—అ.ఆ. 33వ)

మానవుడెన్నడు కీర్తినితెచ్చు కార్యములనే చేయవలయునని భావం.

"ఒక్క నక్కనిచ్చి సింహమ్ములనిల్పికో"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 181 ప)

నక్కలాంటి శకునికొరకు, సింహములవంటి పాండవుల వదలుకొనుట సమంజసముగాదని విదురుడు ధృతరాష్ట్రునితో పలికెను. జూదంవలన నష్టములేగాని లాభములుగలుగవని భావం.

"అన్యులకయి అన్యులు జూదంబు ఆడుట యెంతయు విషమంబు"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 175 వ)

అసలు జూదమాడుటే తప్పు, అదిగాక ఇతరులకొరకు జూదమాడుట మరింత తప్పని ధర్మరాజు దుర్యోధనునితో పలికెను. శకుని దుర్యోధనుని పక్షమున జూద మాడుట సమంజసముగాదని భావం.

"పరదుఃఖనివారణంబు పరమపుణ్యంబు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-ష.ఆ.285 వ)

"పరోపకారార్థ మిదంశరీరమ్"

అను ఆర్యోక్తి కలదు. ఇతరుల దుఃఖ నివారణమే గొప్పకార్యమని కుంతి బ్రాహ్మణునితో పలికెను.

"కుక్కవాతబడిన హవ్యమభంగిన్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 157 వ)

"కుక్కనాకినకుండ" అనునది తెలుగు జాతీయం. పదినెలలు రావణుని వద్దనున్న సీతను తాను నమ్మలేననీ, రావణుడపవిత్రుడు గావున, తన అనుమానానికి తప్పులేదనీ, సీతను తానుఏలుకోనని శ్రీరాముడు సీతతో పలికెను. ఎట్లయితే కుక్క తినిన హవ్యము యజ్ఞఫలానికి పనికిరాదో, అట్లే తానామెతో జీవనమును గడపలేనని తెలిపెను.

"అరచేతితో సూర్యున్ని బంధించలేర" మనది ప్రసిద్ధమైన తెలుగు సూక్తి.

కన్యగా ఉన్నపుడే కుంతిదేవి కుమారునిగని, సంమానికి వెఱచివదలివేయును. కర్ణుడు మిక్కిలి అందగాడు.

"మృతదేహంబునకు నలంకృతిజేసినయట్లమృతుని కీర్తిదలంపన్"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము-స.ఆ. 300 ప)

ఇంద్రుని కపటనాటకాన్ని తెలుపుచు, చనిపోయి కీర్తిసంపాదించేబదులు బ్రతికియుండుట శ్రేయస్కరమని తెలుపును. శవమునకు అలంకరణం చేసినప్పటికి ప్రయోజనం లేదు.

పనికిరాని అలంకరణాన్ని "శవాలంకార' మనుటకలదు.

"ఆవులింత, తుమ్ము, హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ప్ర.ఆ. 137 ప)

ధౌమ్యుడు పాండవులకు సేవాధర్మాలగూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. సాంఘిక మర్యాదను తెలుపు సామెతగా చెప్పవచ్చును.

"కూర్చుట సూత్నరత్నమున కుంకనకంబునకుందగున్"

తిక్కన భారతరచనకు ఉపక్రమించుచు, రత్నమునకు బంగారము కూర్చిన ఎంత అందముగానుండునో, తాను రచించిన మహాభారతాన్ని మనుమసిద్ధి రాజునకు అంకితం ఇచ్చిన అంతే బాగుండునని భావించెను. "బంగారమునకు తావి యచ్చినట్లు" అనునది తెలుగుసామెర.

"అంతపట్టిచూడగలరెయెట్టివారు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-192 ప) [ప్ర.ఆ.]

ధర్మరాజు సన్యాసివేషములో విరాట మహారాజును కొలుచుటకై ఆస్థానమునకు వెడలును. అచ్చటనున్న రాజతనినిగూర్చి నీవెవ్వరవు, నీగురించి మొత్తం తెలుప వలసిందని ప్రశ్నించగా ధర్మరాజు నర్మగర్భంగా పైవిధంగా పలికెను. తాను నిజం చెప్పకూడదు, అట్లని అబద్ధం చెప్పకూడదు. కావున మధ్యేమార్గంగా పైవిధంగా సమాధానమిచ్చెను. ఎట్టివారికైనను మొత్తాన్ని కనుగొనుట సాధ్యంకాదుగదా.

"వేగిరపాటువలనుగాదు వెరవుతోడ్షన తప్పించుకొనవలయు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ద్వి.ఆ. 58 వ)

కీచకుడు తన అక్కయైన సుధేష్ణతో సైరంధ్రిని తనమందిరమునకు పంప వలసిందని ఒత్తిడిచేయగా, నర్మగర్భంగా తానట్లుపలికెను. ఇది నిత్యసత్యము. తొందర పడినవారు ఏ పనియు చేయలేరని భావం. "ఉపాయమున్న వాడికి అపాయము లేద"నునది తెలుగు సామెత.

"బలుగాలి బేర్చుదావానలు మొక్కరుడార్పబోయినను దీఱునె"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-చ.ఆ. 214వ)

కృపాచార్యుడు కర్ణునితో అర్జునుని యుద్ధానికి కవ్వించరాదని పలుకుచు పైవిధంగా పలికెను. బలవంతునితో యుద్ధమునకు తలపడుట మూర్ఖత్వమని పైవాక్యం తెలుపుచున్నది.

"మంటలో మిడుతలు సొచ్చినయట్లు"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-పం.ఆ. 33 వ)

"మంటలోపడు మిడుతవలె" అనునది సామెత

గోగ్రహణమునకై వచ్చి కౌరవసైన్యముతో అర్జునుడు యుద్ధంచేయ దొడగెను. మంటలో పడినశించెడు మిడతలవలె వారతని బాణములకు ఆహుతి ఆయిరని భావం.

"జూదమిచ్చట నాడంగరాదుసుమ్మ"
(ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-పం. ఆ. 204 వ)

దుర్యోధనునితో ఉత్తరగోగ్రహణ సమయమున అర్జునుడు పైవిధంగా పలికెను. ఎవరైన మోసముచేసినయెడల వారినిగూర్చి పైవిధంగా పలుకుట సర్వ సాధారణం. మోసముచేయరాదని హెచ్చరించుట.

"ఉద్రేకులైనవారు చెడువారు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ప్ర.ఆ. 44వ)

"కోపముననఘనతకొంచెమైపోవును" అని వేమన శతకకారుడు తెలిపెను.

వాసుదేవుడు ద్రుపదుని దుర్యోధను వద్దకు రాయబారిగా పంపవలసినదిగా పాండవులను కోరును. కోపముచే గౌరవమునశించును. ఉన్నతుడైన వ్యక్తికి కోపం తగినదికాదని భావం.

"మడుగుజీరయందు మసిదాకినట్లు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ప్ర.ఆ. 295 ప.)

మురికి మడుగులో పడిన వస్త్రం ఏవిదంగానైతే మురికియగునో, అట్లే దుర్యోధనుని వలన కురువంశమునకు అపకీర్తి కలిగెనని సంజయుడు ధర్మరాజుతో రాయబార సమయమున పలికెను. చెడువారితో స్నేహం కూడదని భావం.

"మంటలో మిడుతలుదగ్రవృత్తినుఅకదలచునట్లు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 200 ప.)

'మంటలో పడే మిడుతలవలె' అనునది ప్రసిద్ధమైన సామెత. పాండవులతో వైరం కూడదని తెలిసినను, పుత్రవ్యామోహంచే దుర్యోదనుని ధృతరాష్ట్రుడు వారింపలేకుండెను.

"మిన్నంచినయట్టివాని పొడవెంతన్నట్లు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 174 ప.)

సాక్షాత్తు శివుని జయించిన వానికి కౌరవ సైన్యాన్ని జయించుట ఒకలెక్కా- అని భీష్ముడు ధృతరాష్ట్రునితో పలికెను. అర్జునుని గొప్పదనాన్ని గూర్చి తెలుపుట 'మిన్నందినయట్టివాని పొడవెంతన్నట్లు'ండునని భావం. ఆకాశము వరకు ఎదిగిన వాని లెక్కించ పనిలేదు.

"చిచ్చునకు తోడు గరువలివచ్చుగతిన్"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 191 ప.)

గరువలి యనగా *గాలి* అని అర్థము. అగ్నికి తోడుగా *గాలి* ఉన్న యెడల మంటలు మరింత ఉధృతముగానుండును. 'అగ్నికి *గాలి* తోడన్నట్లు' అనునది తెలుగు సామెత. భీమార్జునుల కలయిక అగ్నికి వాయువు తోడైనట్లుండునని భావం.

"శిల్లలనగ్ని పుట్టినట్టిదియ్యె"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-ద్వి.ఆ. 125 ప.)

ధర్మరాజునకు కోపం రాదు. అతని కోపము నీటిలో పుట్టిన అగ్నివలె భయంకరమైనదని సంజయుడు ధృతరాష్ట్రునితో కృష్ణుడు చెప్పిన మాటలను చెప్పెను. "Beware the fury of patient man" అని ఆంగ్లోక్తి.

"వాడిమిదప్పి నిప్పులు వేడిమి సెడినట్లు"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 197 ప.)

వాడిమి దప్పిన నిప్పులు ఏ విధంగానైతే వేడిమిని కోల్పోవునో, అట్లే రాజపుత్రులు సైతం తమ ప్రతాపాన్ని మరచిపోయి జీవించనెంచిన ప్రజలలో గౌరవాన్ని కోల్పోయెదరని భావం.

"తమతమ నెలవులు దప్పిన తమ మిత్రులె శత్రులౌట తథ్యము" అని సుమతీ శతకకారుడు తెలిపెను.

"దారుమంటపై చావిరిగ్రమ్మ నాశలభవర్గము చాడ్పున"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 398 ప.)

'మంటలలో పడ్డే మిడుతలవలె' అనేది సామెత. రాయబారిగా వచ్చిన కృష్ణుని పై కౌరవులు దండయాత్ర జేయుట మంటలలో బడే మిడుతవలె నుండునని, విదురుడు ధృతరాష్ట్రునకు తెలుపుచు, అట్టి చర్యనుండి విరమించుకోవలసిందిగా ఆజ్ఞాపించమని ధృతరాష్ట్రుని కోరును.

"రక్కెసతాల్మి"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 118 ప.)

'వాడొట్టి రాక్షసుడురా', 'రాక్షసప్పు ఓపిక' అనునవి తెలుగు పలుకుబడులు. భరింపశక్యముకాని సమయంలో సైతం ఓపికగా నున్న యెడల పై విధంగా పలుకుట సామాన్యం. దుశ్శాసనుడు చేసిన అవమానమును "రక్కెసతాల్మి"తో భరించితినని ద్రౌపది కృష్ణునకు తెల్పెను.

"మహాద్రి గదల్పకపోలునె"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 403 ప.)

"కోంకతో శికొన్నట్లు" అన్నా "తెలుసు పిలుకుటడికి దగ్గరగా ఉన్నది. ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో కృష్ణునవమానించుట మహాద్రి గదల్పకపోలునని నుడివెను.

కొండను కదల్చుట ఎంతటి కష్టమైన పనో, కృష్ణుని అవమానించుట అంతేనని, దానివలన వారే నష్టపోయెదరని పలికెను.

"వారి రాశికించెలియలి కట్టవాసె"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-చ.ఆ. 22 ప.)

కృష్ణ రాయబారము భంగమైనది. సముద్రం చెలియలి కట్ట తెగిన ఎంతటి నష్టము వాటిల్లునో అంతటి నష్టము వాటిల్లగలదని భీష్మద్రోణులు సుయోధనునకు తెలిపిరి. "సముద్రమునకు గండిపడుట" అనునది తెలుగు పలుకుబడి.

"మంటలో నుఱికిన మిడుతవోలె"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-62 ప.)

'మంటలో పడే మిడుతవలె' అనునది తెలుగు సామెత. యుద్ధంలో మరణించు సైనికులు యుద్ధాగ్నిలో పడి చనిపోయే మిడుతల వంటివారని కవి వర్ణించెను.

"కీడొనరించినవానికి కీడగుటరుదయ్య"
(ఆంధ్ర మహాభారతము—భీష్మపర్వము—ప్ర.ఆ. 68 ప.)

అపకారంచేసేవారికి నష్టంకలుగుననీ, పాండవులపకారముచేసిన కౌరవులును అందువలననే నష్టపోయిరని సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను.

"చూచెదవుగాక వేయిసెప్పనేల"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-తృ.ఆ. 182 ప.)

"వేయిచెప్పనేల" తెలుగుపలుకుబడి. అర్ధరాత్రి దుర్యోధనుడు భీష్మునివద్దకు వచ్చి పాండవులతో భీకర సమరాన్ని చెయవలెనని ప్రార్థించును. భీష్ముడు మహారధి "చూచెదవుగాక వెయిసెప్పనెల" అనిపలుకును.

"సముద్రింబులుసొచ్చిన యేఱులుంబోలె"
(ఆంధ్ర మహాభారతము-భీష్మపర్వము-తృ.ఆ. 30 వ.)

"నదీనాం సాగరో గతిః" అనునది సంస్కృత న్యాయం. ధృతరాష్ట్రునితో సంజయుడు యుద్ధవిశేషాలను తెలుపుచు కౌరవ సైన్యాలన్నియు సముద్రములో కలిసే నదులవలె అంతర్ధానమగుచున్నవని పలికెను.

"రెక్కలుగలపాముకైవడి"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 128 వ.)

సాత్యకి చేసినపనికి ద్రోణుడు కోపించి రెక్కలుగల పాము వలె అతనిపైకి దండెత్తెనని సంజయుడు దృతరాష్ట్రునకు తెలిపెను. "రెక్కలుగలిగినపాము" చక్కని తెలుగుపలుకుబడి.

"గుండ్లుదేలిబెండ్లుమునిగినట్లయ్యె"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 67 వ.)

చాలాప్రసిద్ధమైన తెలుగుసామెత. ద్రోణాచార్యుడు వృద్ధుడైనను, అతడు ప్రయోగించిన బాణములచే అర్జునుడు బాధపడుట గుండ్లుదేలిబెండ్లుమునిగినట్లయ్యెనని కవి వర్ణించెను. మహావీరునకైనను ఒకప్పుడుబాధలుతప్పవని భావం.

"చెలియలికట్టసముద్రమునిలిపినక్రియ"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 38 వ.)

దుర్మర్షణుడు పార్థుని ఎదిరించుట చెలియలికట్టచే సముద్రాన్ని నిలుప ప్రియత్నించినట్లుగా ఉన్నదని సంజయుడు ధృతరాష్ట్రునితోపలికెను. గొప్పవారిని అల్పులేమిచేయరని భావం.

"గతజలసేతుబంధనంబు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 29 వ.)

యుద్ధరంగములో జరిగినదానికై వగచుటగతజలసేతు బంధనమగునని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెను. జరిగిన నష్టానికి విచారించి ప్రయోజనం లేదనీ, మొదటనే జాగ్రత్తగా ఉండిన నష్టము కలిగియుండెడిదికాదని భావం.

"బూడిదలోనక్రమమెఱుంగవేల్చిననేయిబోలె"
(ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ద్వి.ఆ. 216 వ.)

"బూడిదలో పోసిన పన్నీర"నునది సామెత. సృంజయుడు తన కొడుకును పోగొట్టుకొని విలపించుచుండగా, నారదుడు షోడశరాజ చరిత్రను తెలుపుచు, మృత్యు దేవత నుండి ఎవ్వరును తప్పించుకొనలేరని పలికెను. అంతయును విని ఏమియు

మాట్లాడకుండ ఉండిన సృంజయునితో నారదుడు తాను చెప్పినదంతయు వ్యర్థమ య్యెనని బాధపడెను.

"తగు గాడ్పున మండు మహానలంబు పోల్కి"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 213 వ.)

"అగ్నికి తోడు వాయువన్నట్లు" అనేది సామెత. అర్జునుడు మహావేశము తో సైంధవుని ఎదుర్కొనిన రీతి పై విధంగా ఉన్నదని కవి వర్ణించెను.

"మంచు విరియించు భానుని పెరవు"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-తృ.ఆ. 168 వ.)

"ప్రొద్దు విడిచిన ఎండ
మొగన్ని విడిచిన ముండ" అనునది తెలుగు సామెత. అర్జునుడు కౌరవ సైన్యాన్ని ఛేదించి సైంధవునివైపు మంచు తొలగిపోగా వెడలు భానునివలె వెడలెను. తీక్షణమైన వాడియైన బాణములతో నొప్పించెను.

"కొఱవి గొఱివిందాకు తెఱగున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 44 వ.)

'మంటతో మంట ఢీకొన్నట్లున్నది' ప్రసిద్ధమైన ఉపమానం. సాత్యకి కృతవర్మల పోరాటము కొరివితో మరొక కొరివి తాకినట్లుగా ఉండెననగా సమవుజ్జీ లని భావం.

"పొగలేని మంట చందంబున"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-చ.ఆ. 32 వ.)

"పొగలేని మంట" అనునది తెలుగు పలుకుబడి. సాత్యకి కృతవర్మపై ప్రయోగించిన బాణములన్నియు పొగలేని మంట వలె వ్యర్థమయ్యెను.

"ఏలకును గోలకున్ దెచ్చె"
(ఆంధ్ర మహాభారతము-ద్రోణపర్వము-పం.ఆ. 301 వ.)

"కకావికలు జేయుట" అని అర్థం.
"ఏలకు గోలకు దెచ్చుట" అనునది తెలుగు పలుకుబడి.

ఆచార్య ద్రోణుడు పాండవ సైన్యమునంతయు బాణ ప్రహారములచే ఏలకు గోలకు దెచ్చెనని నకుల, సహదేవ, భీములర్జునునకు తెలిపిరి.

"పొగవాసి మెఱయు నగ్నినిబోలె"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 180 ప.)

ఒక చక్కని తెలుగు పలుకుబడి. అర్జునుడు ఇంద్రాస్త్రముచే సంశప్తకులను సంహరించెను. అతని బాణములనుండి వెలువడిన అగ్నిజ్వాలలలో మసి మాడియైనారని భావం. అర్జునుడు పొగవాసి మెరయు అగ్నివలె నుండెను.

"ఏలకు గోలకున్"
(ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ప్ర.ఆ. 154 ప.)

దృష్టద్యుమ్నుడు కృపాచార్యునితో తలపడి ఓడిపోయెను. సైన్యమంతయు ఏలకు గోలయ్యెను. చెల్లాచెదరై పోయెనని భావం. తెలుగు పలుకుబడి.

"రెక్కలు దెగియున్న శైలంబుల"
[ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 238 ప.]

"రెక్కలు తెగిన పక్షివలె" అనునది తెలుగు సామెత. యుద్ధంలో పాండవ కౌరవ సైన్యముల శవముల పరికించిన, రెక్కలు తెగిన మహాశైలములవలె పడి యుండినట్లుగా నగపడునని సంజయుడు ధృతరాష్ట్రునకు తెలిపెను.

'పట్టపగలింటి సూర్యుని పగిది"
[ఆంధ్ర మహా భారతము-అనుశాసనిక పర్వము-ప్ర.ఆ. 359 ప.]

ఒక చక్కని తెలుగు పలుకుబడి. గరుత్మంతుడు విష్ణుదేవుని మహిమలను మునులకు వివరించు ఘట్టములోనిది. విష్ణుదేవుని పరాక్రమము పట్టపగలింటి సూర్యునివలె మిక్కిలి తేజోవంతమైనదని గరుడుడు మునులకు తెలిపెను

"అగ్నియందు పడిన దూరియట్లు"
(ఆంధ్ర మహాభారతము-అనుశాసనిక పర్వము-ద్వి.ఆ. 166 ప.)

"అగ్నియందు పడు మిడుతవలె" అనునది సామెత. భీష్ముడు ధర్మరాజునకు గంగా ప్రభావాన్ని తెలుపు ఘట్టములోనిది. గంగానది లేని చాంద్రాయణ వ్రతాలెన్నియైనను నిష్ప్రయోజనములేదని తెలిపెను.

"ఆఱిన నిప్పులట్లు"

(ఆంధ్ర మహాభారతము-అశ్వమేధపర్వము-ద్వి.ఆ. 33 వ)

ఒకచక్కని తెలుగు పలుకుబడి ఇంద్రియములకు, మనస్సునకు గలిగిన తొలిసంవాద ఘట్టములోనిది. మనస్సు ఇంద్రియములతో మీరప్రయోజకులుగా "ఆరిన నిప్పులవలె" నున్నారని రెచ్చగొట్టెను. ఇంద్రియాలను జయించవలెననిన మొదట మనస్సును జయించవలెను.

"విధిపాడిమాలి యిట్టిపాటుదెచ్చె"

(ఆంధ్ర మహాభారతము-స్వర్గారోహణపర్వము-ఏకాశ్వాసము-26 వ)

తెలుగుసామెతగా ప్రయోగించవచ్చును.

నరకములోను తన తమ్ములనుజూచి ధర్మజుడు మిగులవగచును. ఎవరికి సహాయముచేయని సుయోధనాదులు స్వర్గములో నుండుటయు, తనతమ్ములు నరకంలో ఉండుటయు కేవలము విధికృతమేనని వగచును.

విధిపాడిమాలియిట్టిపాటు దెచ్చెననివగచును.

"మాటలువేయునేల"

(ఆంధ్ర మహాభారతము-దశ.స్కం. 1068 వ)

చక్కని తెలుగు పలుకుబడి. భగవంతునికాద్యంతములులేవని చెప్పుటకు మాటలు వేయునేల యనికవితెలిపెను.

"నఱుకబడినయడవి తెఱగున"

[ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ద్వి.ఆ.167 వ)

తెలుగు జాతీయంగా ప్రయోగింపవచ్చును.

విశ్వామిత్రుడు వశిష్ఠు చెంతనున్న ధేనువునవమానించగా, అతని రాజ్యంలో ఉన్న పశువులన్నియు నరుకబడిన అడవివలె నశించెను.

"చిచ్చొచ్చిడింగటైనయట్లు"

(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 118 వ)

తెలుగు పలుకుబడి ద్రౌపది తన బాధలను కృష్ణునకు రాయబారసమయమున వివరించు ఘట్టంలోనిది.

"అగ్గిసొరందలచునటుల"
[ఆంధ్ర మహాభారతము-కర్ణపర్వము-ద్వి.ఆ. 36వ)

పలుకుబడిగా ప్రయోగింపవచ్చును. అర్జునునితో యుద్ధానికి తలపడుట అగ్గిలోకి ప్రవేశించుట వంటిదేయని శల్యుడు కర్ణుని నిరుత్సాహ పరచెను.

"జూదంబునవెగ్గుపుట్టు"
(ఆంధ్ర మహాభారతము-సభాపర్వము-ద్వి.ఆ. 205 వ)

ఒక చక్కని సామెతగా ప్రయోగింపవచ్చును. విదురుడు దుర్యోధనునితో జూదము కీడును కలిగించును కావున జూదమాడకూడదని పలుకును.

"తృణప్రాయంబు"
(ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 282 వ)

"జీవితముతృణప్రాయంబు" అనునది సామెత. "తృణప్రాయంబు" చక్కని తెలుగుపలుకుబడి. "వాడెంత, గడ్డిపోచ" అని పలుకుట గమనించుచున్నాము. బ్రహ్మదేవుడు దేవతలతో బ్రాహ్మణుల ఆశీర్వచనమున్నయెడల రాక్షసులగెలుచుట తృణప్రాయమని పలికెను.

"చతురుల గొనియాడగమలజ భవువశమే"
(ఆంధ్ర మహాభాగవతము-ఏకాదశ. స్కం. 32వ)

ఒక చక్కని సామెతగా ప్రయోగింపవచ్చును. భక్తిప్రాధాన్యాన్ని వివరించు ఘట్టంలోనిది. నారాయణుని స్మరించు భగవద్భక్తులగొనియాడ బ్రహ్మతరము కాదని కవి తెలిపెను.

"దారువందువహ్నిచందంబు"
(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 497 వ)

చక్కని పలుకుబడిగా ప్రయోగింపవచ్చును. దితిగర్భస్థశిశువు "దారువందు వహ్ని"వలె పెరుగుచున్నాడని దేవతలు విష్ణుదేవునకు తెలిపిరి.

"క్రిములచే వ్యధింబడు క్రిముకింబోలి"
(ఆంధ్ర మహాభారతము-తృ.స్కం. 990 వ)

చక్కని తెలుగుసామెతగా ప్రయోగించవచ్చును. జీవి తాను సంసారములోని మాయకుబద్ధుడై మరలమరల జన్మమును ఎత్తుట క్రిములచే వ్యధంబడు క్రిమికినివలె నున్నదని గర్భస్థశిశువు భగవంతుని స్తుతించుచుపలికెను.

"మాటలువేయునేల"
(ఆంధ్ర మహాభాగవతము-తృ.స్కం. 1024 ప)

"మాటలువేయేల" అనునది తెలుగు పలుకుబడి. ఒకవిషయమును పలుమార్లు చెప్పవలసిన అవసరము లెదనిభావం.

"వినుతగుణశీల! మాటలువేయునేల"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం. 491 ప)

భూదేవి తమకేమి సహాయము చేయుటలేదని ప్రజలు పృథుచక్రవర్తితో విన్నవించుకొనిరి. రాజు కోపమునకురాగా భూదేవి సమాధానముగా తత్త్వదర్శనులైన సన్మనులకు మాత్రమే ఐహికాముష్మికము లభించుననియు, దీనికై మాటలువేయేల అనిపలుకును. "మాటలువేయేల" పలుమారులు చెప్పవలసిన అవసరము లేదని భావం. చక్కని తెలుగు పలుకుబడి.

"మహాత్ములకు నెగ్గొనరించెడి జన్మముల్ గాల్పనే"
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం-95 ప)

దక్షుడు తనభర్తయైన శంకరునవమానించగా సతీదేవి పైవిధంగా పలుకుచు, ఆత్మాహుతి చేసుకొనెను. సామెతగా ఉపయోగించవచ్చును.

"చంద్రువెనుచను చంద్రిచందంబున''
(ఆంధ్ర మహాభాగవతము-చ.స్కం-833 ప)

భార్యభర్తల సంబంధాన్ని తెలుపు చక్కని జాతీయం. చంద్రునివేంట వెడలే వెన్నెలవలెయని భావం. మలయకేతనుడు తన భార్యతో వెడలిన ఘట్టంలోనిది.

"రాతితెప్పబంగి"
(ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 268 ప)

చక్కని తెలుగు పలుకుబడి. వ్యర్థమైనదని భావం.

ఈర్ష్య, అసూయ, ద్వేషము, కోపములు కలిగి ప్రవర్తించు మానవులు రాతి తెప్పలవలె అధోగతి పాలయ్యేదరనియు, సజ్జనులు మాత్రమే సద్గతిని పొందెదరని భావం. పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుడు సజ్జన, దుర్జన భేదములను వివరించే ఘట్టంలోనిది.

"చేటులేనిపదవి నొప్పారువారువో భాగవతులు"
(ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 186 వ)

సామెతగా ప్రయోగించవచ్చును.

అజామిళోపాఖ్యానమున శుకమహర్షి భాగవతుల లక్షణాలను తెలుపుచు, చేటు లేనిపదవిని పొందినవారు మాత్రమే భాగవతులని పలికెను. "చేటులేని పదవి" అనగా పరమపదమని భావం.

"దిక్కులేకున్నవారల దిక్కునీవ"
(ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 339 వ)

"దిక్కులేనివారికి దేవుడేదిక్కు" అనునది సామెత. దేవతలు విష్ణువును స్తుతించుచు పైవిధంగా పలికిరి.

"రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు"
(ఆంధ్ర మహాభారతము-ష.స్కం. 343 వ)

"రజ్జుసర్పభ్రాంతి" అనునది సంస్కృతన్యాయం. తాడునుజూచి పాముగా భ్రమించువానివలె, మూర్ఖులు ఐహికసుఖములే గొప్పవని భావించెదరని దేవతలు భగవంతుని ప్రార్థించుచు పలికిరి. సజ్జనుడెప్పుడును ఇహముకంటె పరమునకె ప్రాధాన్యమునిచ్చును.

"కరవుదీర"
(ఆంధ్ర మహాభాగవతము-ష.స్కం. 332 వ)

తెలుగు పలుకుబడి. దేవతల కన్నుల కఱవుదీరునట్లుగా భక్తవత్సలుడైన విష్ణువు ప్రత్యక్షమయ్యెను.

"పవనచలిత దీపశిఖంబోలె"
(ఆంధ్ర మహాభాగవతము-స.స్కం. 13 వ)

"గాలికారిపోయే దీపమువలె" అనుసామెతకు గ్రాంధిక రూపమని చెప్పవచ్చును.

విష్ణువును నిందించిన శిశుపాలుడెట్లు అతనిలో ఐక్యమయ్యెనని ధర్మరాజు నారదుని ప్రశ్నించెను. ఆకథను వివరించు ఘట్టములోనిదావాక్యం.

"కరతలామలకంబై"
(ఆంధ్ర మహాభాగవతము-ఏకాదశ. స్కం. 43వ)

ఒకచక్కని తెలుగుపలుకుబడి. హరిని ధ్యానముచేయువారికి కైవల్యము కంతాలామలకమని భావం.

"వారినిగణింప బ్రహ్మవశమే"
(ఆంధ్ర మహాభాగవతము-దశ. స్కం. 1327 వ)

ఒక చక్కని తెలుగు జాతీయముగా ప్రయోగింపవచ్చును.

దేవాసురయుద్ధములోని హతులైన రాక్షసులు యాదవ కులములో రాజులుగ పునర్జన్మించిరన్ని, వారు నూటొక్క కులాలలో జన్మించిరని హరితెలిపెను. వారిని లెక్కించుటకు బ్రహ్మకుకూడ శక్యంగాదని తెలిపెను. ఎక్కువ విషయాలగూర్చి వివరించవలసినపుడు పైవిధంగా మాట్లాడుట సర్వసామాన్యం.

"పుత్తడిబొమ్మవోలె"
(ఆంధ్ర మహాభాగవతము-దశ.స్కం. 1169 వ)

చక్కని తెలుగు పలుకుబడి. సుభద్ర సౌందర్యమును వర్ణించు.ఘట్టంలోనివి.

"మాటలువేయునేల"
(ఆంధ్ర మహాభాగవతము-న.స్కం. 150 వ)

"హీనమానవు మనంబున బుట్టిన వెట్టివోలె"
[ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము-ప్ర.ఆ. 101 వ]

తెలుగు సామెతగా ప్రయోగింపవచ్చును. హీనులైన కౌరవులగూర్చి ఆలోచించుట వ్యర్థమని ధర్మరాజును సాంత్వనపరచుచు ద్రౌపదిపలికెను.

హరిభక్తులబొందవై ఘూరిసంపదల్"
(ఆంధ్ర మహాభారతము-శల్యపర్వము-ప్ర.ఆ. 305 వ)

సామెతగానుపయోగింపవచ్చును. శల్యుని కుమారులు పాండవులతో యుద్ధం చేసి ఓడిపోయెదరు. పాండవులకు హరి తోడుగానున్నవాడుగావున విజయం వారికే లభింపగలదని ప్రజలందరును భావించిరి.

"తపంబునకదా సకల సౌఖ్యంబులు సిద్ధించు"
(ఆంధ్ర మహాభారతము-అరణ్యపర్వము—ష.ఆ. 107 వ)

సామెతగా ప్రయోగింపవచ్చును. వ్యాసుడు తపోప్రాధాన్యాన్ని ధర్మరాజునకు వివరించుచు పైవిధంగా పలికెను.

"యజ్ఞకర్తయచూనె సర్వాధికుండు"
(ఆంధ్ర మహాభారతము-శాంతాపర్వము-ద్వి. ఆ. 228 వ)

యజ్ఞకర్త బ్రాహ్మణుడు. పైవాక్యమును సామెతగా ప్రయోగించవచ్చును.
భీష్ముడు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మములగూర్చి తెలుపుచు పైవిధంగా పలికెను. బ్రాహ్మణాధిక్యాన్ని తెలుపు సామెతగా పేర్కొనవచ్చును.

"వెనరుద్రుడు యజ్ఞమృగము వెనుగొనుమాడ్కిన్"
(ఆంధ్ర మహాభారతము—అరణ్యపర్మము-ష.ఆ. 325 వ)

సామెతగానుపయోగింపవచ్చును.

సారీచుడు బంగారు లేడిరూపమున సీతను భ్రమింపజేయును రామాజ్ఞబద్ధుడై లక్ష్మణుడతని అనుసరించును. ఎంతవారలైనను భగన్మాయనుండి తప్పుకొనజాలరని బావం.

"ఎల్లబలంబులకు మిక్కిలిత పోబలంబు"
(ఆంధ్ర మహాభారతము-ఆదిపర్వము-స. ఆ. 109 వ)

సామెతగా ప్రయోగించవచ్చును. వశిష్టునితపోబలం ముందు విశ్వామిత్రుడు ఓడిపోవుట తపోబలమే అన్నిబలములకంటె గొప్పదని తెలుపుచున్నది.

"లేగలేనిలేగటికుఱ్ఱచందంబున"
(ఆంధ్ర మహాభాగవతము-ప్ర.స్కం. 392 వ)

సామెతగా ప్రయోగింపవచ్చును. పరీక్షిత్తు సైన్యసమేతుడై వేటకు వెడలగా అచ్చట ధర్మదేవుడు వృషభరూపమున ఏకపాదుడై విలపించుచుండెను. అతడు లేగవెని లేగటిక్కుచ్చందంబున నుండెనని శౌనకుడనుముని సూతునకు తెలిపెను. తల్లిలేని పిల్లలు అందరికంటె బలహీనులని భావం.

"తామరతంపరైన"
(ఆంధ్ర మహాభారతము-ఉద్యోగపర్వము-తృ.ఆ. 353 వ)

తెలుగుపలుకుబడి. కౌరవులకు పాండవులతోడి పొత్తు వారివురిని తామరతంపరంగా నభివృద్ధి చెందించునని భీష్మద్రోణులు కర్ణునితో పలికిరి. పొత్తు ఉభయులకు క్షేమదాయకమని భావం.

ఇట్లు ప్రాచీన కావ్యములలోని సామెతలు, జాతీయములు, పలుకుబడులు, సంప్రదాయాలను పరిశీలించుటైనది.

సామెతలలో స్వారస్యం చెడకుండా ఉండవలెననిన వానిని ఉన్నవి ఉన్నట్లుగనే వాడవలెనని కొంతమంది పండితుల అభిప్రాయం.

దూడంనాంపల్లి గారు తమ అభిప్రాయాన్ని ఇట్లు వెలిబుచ్చిరి.

"సామెతను ఉన్నదున్నట్లుగా వాడుకుంటూనే అర్థం పర్థం చెడకుండా అందంగా శ్రుతిసుభగంగా వుంటుంది. లేదా సరసం విరసంగా మారి అసలుకెసరు పెట్టినట్లు అనర్థాన్ని తెచ్చిపెడుతుంది.1

ఏదిఏమైనను సామెతలు భాషకు సౌందర్యాన్ని, భావానికి గాంభీర్యాన్ని కలిగించుననుటలో సందేహంలేదు.

1. దూడం నాంపల్లి—ప్రబంధాల్లో ప్రజాసూక్తం
స్రవంతి - జూన్ 1982 (సాహిత్య మాసపత్రిక)

# శతక సాహిత్యములోని సామెతలు

శతకసాహిత్యంలోని సామెతలను ప్రత్యేకంగా విభజించుట కష్టం. పద్యములోని ప్రతిపాదాన్ని దాదాపుగా సామెతగానే పేర్కొనవచ్చును.

ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు
చూడచూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్య పురుషులువేరయా-
విశ్వదాభిరామ వినురవేమ
(వే మ న శ త క ము)

దీనిలో తుది పద్యపాదముతప్ప ప్రతిపాదాన్ని-ఒక సామెతగా గైకొనవచ్చును. ఉదాహరణమునకు

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడచూడ రుచులజాడవేరు"

ను ఒక సామెతగా గైకొని

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా".

ను మరొక సామెతగా చెప్పవచ్చును. లేదా మూడు పద్యపాదములనొక సామెతగా చెప్పవచ్చును.

ఆట్లే

"ఎలుక తోలుదెచ్చి ఏడాది ఉతికిన నలుపునలుపే గాని తెలుపుగాదు"

"అనగనగ రాగమతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తీయనుండు
సాధనమున పనులు సమకూరుధరలోన"

" చెప్పుచినెడుకుక్క చెఱకుతీపెఱుగునా "

"నీళ్లలోని మొసలినిగిడి యేనుగుబట్టు
బయట కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబలిమికాదయా"

మొదలగు ఉదాహరణములను ఎన్నింటినైనను, పేర్కొనవచ్చును. వేమన శతకాలన్నింటిని సామెతల సమాహారంగా పేర్కొనవచ్చును. సామెతలే పద్య పాదములుగామారెనో, పద్యపాదములే సామెతలుగా ప్రచారంలోనికి వచ్చెనో చెప్పుట కష్టం.

అట్లే ఇతర శతకాలను పరిశీలించినచో పై సత్యం గోచరమగుచున్నది.

"నొప్పింపక, తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు"
(సు మ తీ శ త క ము)

"తనకోపమె తనకు శత్రువు"
"తనశాంతమె తనకు రక్షదయ చుట్టంబౌ
"తన సంతోషమె స్వర్గము"
తనుదుఃఖమె నరకమండ్రు
(సుమతీ శతకము)

మొదలగు పద్యపాదాలన్నీ సామెతలుగానే ప్రచారంలోనికి వచ్చినవి.

అట్లే ఇతర శతకాలను పరిశీలించినచో శతకాలు సామెతలకు నిలయాలని మనకు తెలియును.

శతకములనగా వంద పద్యములున్న కావ్యం. కాని కొన్ని శతకములలో 108 మరియు అంతకుమించి పద్యములున్నవి. శతకాలు ముఖ్యంగా ఒక విషయాన్ని మనసునకు హత్తునట్లుగా వ్రాయబడిన పద్యముల సంపుటములని చెప్పవచ్చును. శతకాలలో ప్రత్యేక కథా వస్తువుండదు. వివిధ విషయాలపై, వివిధ సమస్యలపై సమాధానములుగా కనబడే పద్యాలు ఉండును. శతకాలలోని పద్యములు మానవ సమాకానికి హితబోధ చేయునవిగా ఉండును.

శతకములన్నింటిలోనికి సుమతి, వేమన శతకాలు ప్రజలనోళ్లలో బాగానలిగిన వని చెప్పవచ్చును. వేమన శతకములోని ప్రతి పద్యపాదమును ఒక సామెతగా ఉపయోగించవచ్చుననుటలో సందేహంలేదు. శతకాలు ముఖ్యంగా సమాజంలోని చెడును ఎత్తిచూపుచు, తరుణోపాయమార్గన్ని సున్నితంగా తెలుపుచు, హితబోధ చేయునవిగా ఉండును. శతకాలలోని ప్రతి పద్యపాదమును ఒక సామెతగానే చెప్ప వచ్చును. శతకాలు సామెతలుగా మారెనో, లేదా సామెతలే శతకాలలో చోటుచేసు కొనెనో అన్నట్లుండుటవలన ప్రత్యేకించి ఉదాహరణములిచ్చుట కష్టం. శతక వాఙ్మయమంతయు సామెతల పుట్టగానే ఉదాహరింపవచ్చును.

# జానపద సాహిత్యములో సామెతలు

సామెతను జానపద సాహిత్యప్రక్రియగా నెంచవచ్చును. జానపదసాహిత్యానికి విస్తృత ప్రయోజనాలున్నవనుటకు నిదర్శనంగా సోవియట్‌రిష్యా1 కమ్యూనిజాన్ని ప్రచారముచేయుటకు సామెతలను మరియు జానపదసాహిత్యాన్ని ఉపయోగించుకొనుటే నిదర్శనంగా చెప్పవచ్చును. రాజకీయంగా హిట్లర్ సైతం జానపదవిజ్ఞానాన్ని ప్రచారమునకు వినియోగించుకొనెననగా జానపద సాహిత్యానికి ఎంతవిలువ ఉన్నదో తెలియుచున్నది. ప్రజాబాహుళ్యానికి అర్థమయ్యేరీతిలో చెప్పవలెనని జానపద సాహిత్యప్రక్రియను మించిన మార్గంలేదనుటకు నిదర్శనంగా హిట్లర్‌నే గైకొనవచ్చును.

తెలుగులో విప్లవకవిత్వాన్ని ఒకవిధంగా జానపద సాహిత్యప్రక్రియగానే చెప్పవచ్చును.

"సామెతలు" జానపద సాహిత్యప్రక్రియలో ఒకభాగం-

2. R.S. Boggs అను పండితుడు సామెతలను జానపదసాహిత్యములో నొకభాగంగా నెంచెను. అతడుచేసిన విభజనము ఈ క్రింది విధంగా ఉన్నది.

A. General Folklore
B. Prose Narratıre
C. Ballad, Song, Dance, Game, Music, Verse
D. Drama
F. Custom
G. Geography
L. Language
M. Arts, Craft Archıtechtuie
N Food, Drınk
P. Belıef

---

1. సోవియట్‌రష్యా కమ్యూనిజాన్ని ప్రచారంజేయడానికి జానపదవిజ్ఞానం ఒక శక్తివంతమైన సాధనమని గ్రహించింది.
ఆంధ్రుల జానపదవిజ్ఞానం (12వ పేజి) R.V.S. సుందరం

2. తెలుగు జానపదవిజ్ఞానము - ప్రవేశిక
(13 మరియు 14 పే.) Dr. B. రామరాజు

S. Speech
V. Proverb (సామెత)
W. Riddle

పై దానినిబట్టి 'సామెత' అనేది జానపద విజ్ఞానంలో ఒక భాగమని తెలియుచున్నది.

పాశ్చాత్యులు కొంతమంది జానపదులను 'Vulgar man' అనగా మూర్ఖులుగా చిత్రించుట జరిగినది. జానపదులు ఎక్కువగా నిరక్షరాస్యులగుట వలనను, సామెతలు తరతరాలుగా మౌఖిక ప్రచారంలోనే ఉండుట వలనను, నవనాగరికులలో సామెతల ప్రయోగం సన్నగిల్లినదనే చెప్పవచ్చును. 'సామెత' జానపద సాహిత్యములోని ఒక ప్రక్రియ అని తెలియుటవలన, జానపద సాహిత్యమంతయు ఒక విధంగా సామెతల మయమనియే చెప్పవచ్చును. మన సాంప్రదాయక పండితులేగాక పాశ్చాత్య పండితులు సైతం సామెతలను ఈసడించిరనుటకు ఈ క్రింది వాక్యములెనిదర్శనములు.

Motherwell అను పండితుడు "Henders in Introduction to Scottish Proverbs" అను గ్రంథానికి ఉపోద్ఘాతాన్ని వ్రాయుచు ఇట్లు అభిప్రాయపడెను.

1"A man whose mind has been enlarged by education and who has a complete mastery over riches of his own language expresses **his ideas in his own words, and when he refers** to any thing beyond the matter under his view, glances towards on abstract principle, A Vulgar man, on the other hand, used those proverbial forms which tradition and daily use have made familiar to him, and when he makes a remark which needs confirmation, he clenches it by a proverb"

(భాషపై సాధికారికమైన పాండిత్యంగల వ్యక్తి ఒక భావాన్ని స్వంతమాటలలో మాత్రమే తెలుపుననీ, అనాగరికుడైన వ్యక్తి మాత్రం ఇంతకుముందే పడికట్టులుగా వున్న పదజాలాన్ని, సామెతలను ఆధారం చేసికొని భావాన్ని ప్రకటించునని పై వాక్యం యొక్క అభిప్రాయం.

పై అభిప్రాయాన్నే మరింత సూటిగా, ఘాటుగా చెస్టర్‌ఫీల్డ్ అను పండితుడు తెలిపెను.

2"By the middle of the Eighteenth Century, there seems to emerge a feeling in the mother country as well as in America that

---

1. Early American Proverbs and Proverbial Phrases
   B.J. Whiting (Introduction – xiv, xvi pages)
2. The Oxford Dickonary of English Proverbs.
   (Compiled by George Smith and Introduction by
   Janet E. Hasel tine) Introduction - xvii page

proverbs atleast taken seriously, have little place in elevated literature Lord Chester field may be said to sum up the new attitude when he wrote to his son on July 25, 1741.

(First Printed in 1774)

There is likewise, an awkwardness of expressions and words, most carefully to be avoided, such as false English, bad pronunciation, old sayings, and common as proverbs, which are so many proofs of having kept bad and low company,for example, if instead of saying that tastes are different, and that every man has his own peculiar one, you should let off a proverb, and say, that what is one man's meat as another man's poison, or else. Every one as they like, as the good man said when he kissed as cow, every body would be persuaded that you had never kept company with anybody above foot-man and house-maids.

పై అభిప్రాయాలను తక్కిన ఆంగ్ల పండితులు కూడ కలిగియుండిరనుటకు నిదర్శనాలు కలవు. బహుశః జానపద సాహిత్యమనిన పాశ్చాత్య సాంప్రదాయ పండితులక్కు,మన పండితులవలెనే చిన్న చూపు ఉండెడిదేమో.Aleyander Hamilton అను పండితుడు సామెతల ప్రయోగాన్ని ఎట్లు నిరసించెనో ఈ క్రింది వాక్యములు తెలుపుచున్నవి.

[1]"Most of his knowledge was pedantry, being made up of common place sentences and trite proverbs"

సామెతలు అనిన నీచమైన అభిప్రాయాలున్న పండితులున్నట్లే సామెతలపై గొప్ప అభిప్రాయమున్న పండితులుగూడగలరు.

ఉదాహరణమునకు Dr. Johnson అను పండితుడు, ఛెస్టర్ ఫీల్డ్ (Chester Field) పండితుని అభిప్రాయములు తప్పుల తడకలని, సామెతలు ఒక గొప్ప ప్రయోజనం కొరకు ఉద్దేశింపబడినవని ఘంటాపథంగా వివరించెను.

2 "As Dr. Johnson's antipathy toward Chester field was stranger than his love for proverbs, this may not be, one of the passages which led him to say that the ' Letters ' — "Teach the morals of a whore, and the manners of a dancing master"

---

1. Earlier American Proverbs and Proverbial Phrases. B.J. Whiting (Introduction - P. XV)
2. do .. (P. XV)

జాన్సన్ అను పండితునకు సామెతలపై గౌరవం కంటె, Chester Field పండితుడు తన కుమారునకు వ్రాసిన "Letters" అను గ్రంధము పైననే కోప మెక్కువ. అనగా ఛెస్టర్ ఫీల్డ్ అను పండితుని అభిప్రాయాలను అతడు గౌరవించ లేదనీ, సామెతలపై అతడు చేసిన వ్యాఖ్యాలను జాన్సన్ పండితుడు నిరసించెననీ తెలియుచున్నది.

అదృష్టవశాత్తు తెలుగు బాషలో సామెతల ప్రయోజనం, విలువలపై పండితు లకు ఎక్కువ భేదాభిప్రాయాలు లేవు.

సామెతలు జానపద సాహిత్య ప్రక్రియలలో ఒక భాగమని తెలిపినది.జానపద సాహిత్యములోని అన్ని శాఖలనుండీ సామెతలను ఎత్తిచూపుట కష్టసాధ్యమైనపని.

జానపద గేయాలలోని కొన్ని ఉదాహరణములను పరిశీలించుచు, సామెతకు జానపద సాహిత్యమునకున్న అవినాభావ సంబంధాన్ని పరిశీలించెదను.

జానపద సాహిత్యానికి సంబంధించిన సామెతలను ఈ క్రింది విధంగా విభజించవచ్చును.

1) పిల్లలకు సంబంధించిన సామెతలు.
2) పండుగలకు, వేడుకలకు సంబంధించిన సామెతలు.
3) స్త్రీలకు సంబంధించిన సామెతలు.
4) శ్రామికులకు సంబంధించిన పాటలలోని సామెతలు.
5) ప్రేమ (వలపు)కు సంబంధించిన పాటలలోని సామెతలు.
6) హాస్యమునకు సంబంధించిన సామెతలు.
7) బాధను తెలుపు సామెతలు.
8) పారమార్థికమునకు సంబంధించిన సామెతలు.
9) ఇతరములు

దీనిలో తెలిపిన ఉదాహరణములన్నియు[1] "ఆంధ్రప్రదేశ జానపద గేయాలు" అను గ్రంధమునుండి గ్రహింపబడినవి.

---

1. "ఆంధ్రప్రదేశ జానపద గేయాలు"
(తెలుగు విశ్వవిద్యాలయముచే ప్రచురితము)
సంపాదకులు: 1) శ్రీ బి. రామరాజు 2) శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి 3) శ్రీ నేదునూరి గంగాధరం 4) శ్రీ తూమాటి దోణప్ప

1. పిల్లలకు సంబంధించిన సామెతలు :

సాంప్రదాయ సాహిత్యములో బాలసాహిత్యం తక్కువేనని చెప్పవచ్చును. పిల్లల పెంపకానికి సంబంధించినవి,వారినిలాలించునవి మరియు పిల్లలకు సంతోషాన్ని కలిగించు సన్నివేశాల వర్ణనలను జానపద సాహిత్యంలోనేగలదు. పిల్లలకు సంబంధించిన గేయాలలోని సామెతలను, పలుకుబడులను, జాతీయాలను పరిశీలించెదము.

"మల్లెలు పూచినవి మొగ్గలేకుండ"
(పాడినవారు - మద్దూరి అన్నపూర్ణ - కృష్ణా జిల్లా - 4 పేజి)

ఆనందంతో వెల్లివిరిసిన పిల్లల ముఖాలు మల్లెలు మొగ్గలనునవి లేకుండా పూచినట్లున్నవని జానపదుల భావన. చాలా అందమైన పోలిక. మల్లెలవనంలోని పుష్పములవలె పిల్లల ముఖాలలో ఆనందము వెల్లివిరిసెనని భావం.

"ఆదివారమునాడు అమ్మన్న పుట్టె"
(పాడినవారు దే. సింహచలం - గోదావరి జిల్లా 5 పే.)

ప్రాసపైన మక్కువ ఉన్నదని తెలియుచున్నది. జానపదులకు శబ్దాలంకారములపై మోజు ఎక్కువనీ తెలియుచున్నది.

"బావాపేరూ బంతిపువ్వు—నాపేరు సన్నజాజులు"
(పాడినవారు—పానుగంటి నాగలింగమ్మ—6వ పే.)

బంతిపువ్వుకంటె సన్నజాజుల సువాసన ఎక్కువ. సన్నజాజులు సుకుమారముగా ఉండెను. బంతిపువ్వులు అందముగా మాత్రమే కనిపించును, కాని సన్నజాజులలోని సౌకుమార్యం బంతిపూలకులేదు. పైవాక్యములోచక్కని భావం ఇమిడియున్నది. ఒక చక్కని తెలుగుపడిగా చెప్పవచ్చును.

"బంగారుబొమ్మా
తంగెడుపువ్వు
కులదీపంబు
చక్కెర బొమ్మా"
(పాడినవారు — అంగర గంగమ్మ — తూ॥ గో॥ జిల్లా 9 వ పేజి)

జానపదుల పోలికలలో ఎక్కువ భాగము అనుభవములో, వ్యవహారములో ఉన్నవి మాత్రమే కనబడును. బంగారుబొమ్మ, తంగెడుపువ్వు, కులదీపము,

చక్కెరబొమ్మ అనునవి చక్కని తెలుగు పలుకుబడులుగా ప్రసిద్ధి చెందినవి. పసి-పిల్లలు ఎవ్వరికైనను అందంగా కనబడుటలో ఆశ్చర్యములేదు.

"కొండలవుండే సిన్నోడు
సెట్టుమీదవుండే పిట్టన్నా"
"కుమ్మరోనింటికూరమ్మ"
ఆకసానబొయ్యే కాకమ్మ
అప్పడాలమ్మె కుప్పమ్మ
(పాడినవారు వెంపటి అచ్చమ్మ విశాఖజిల్లా 10 నుండి 12 పేజీలవరకు)

పసిపిల్లలు జానపదుల దృష్టిలో ఎట్లుండిరో పై గేయపంక్తులు తెలుపుచున్నవి. ప్రతి పంక్తిని ఒక పలుకుబడిగానే చెప్పవచ్చును. తమకు తెలిసిన వస్తువులతో పోల్చుట జానపదుల ప్రత్యేకత.

"చిలకపిట్ట
హంసతెలుపు"
మంచుబల్లి
నరమామిడి
(పాడినవారు తాడేపల్లిబుల్లి వెంకయ్య-మంగము సుబ్బన్న 13 మరియు 14 పేజీలు)

పిట్టలతో, హంసలతో, మంచుతో, మామిడితో పిల్లలను పోల్చుట జాన-పదులకే చెల్లినది. ప్రతి పంక్తియు ఒక పలుకుబడియే.

"నారాయణ నారాయణ నక్కతోక
నారాయణ పెండ్లాము కుక్కతోక"
(పాడినవారు వడ్లూరి నారాయణ రెడ్డి అనంతపురము జిల్లా 15వ పేజి)

పిల్లలు పరస్పరం పరిహాసపూర్వకంగా పలికేమాటలు, ముఖ్యంగా గ్రామీణులు మాట్లాడేవి. గ్రామాలలోపిల్లలేకాదు పెద్దలు సైతం పరిహాసాలాడుకొనెదురు. ఇవన్నియు జాతీయములే.

"అపిమసిగాడు
కల్లిముంత దిరిగితె కందిగింజంత
తేజీగుత్తిం"
(పాడినవారు వడ్లూరి నారాయణరెడ్డి అనంతపురం జిల్లా 16వ పేజి)

పై పదాలు ఒకదానికొకటి సంబంధము లేనివి. జానపదులుచేసే పోలికలు సైతం ఒకక్రమాన్ననుసరించవు. వారికితోచినవిధంగా చమత్కారంగా వానిని కూర్చుట కానవగును.

"చింతవానితొట్టిలోన చిలుకలున్నవి"
(పాడినవారు వడ్డేపల్లి గుత్తమ్మ అనంతపురం జిల్లా 17వ పేజి)

మొదటపరిహాసోక్తులు, తరువాత పలుకుబడులుగా మారినవి.
"పనిచేయనినాబట్టకి బువ్వేవరు పెడతారు
సద్దితిన్ననాబట్టకి నీళ్ళెవరు యిస్తారు
గుళ్ళోపడుకున్న నాబట్టను యెవరులేపుతారో"
(పాడినవారు బోయినీని నారాయణ అనంతపురము జిల్లా 19వ పేజి)

ఇచ్చట బట్ట అనునది మనుష్యపరంగా సంబోధించబడినవి. ముఖ్యముగా పసిపిల్లలు ముసుగుదన్ని పడుకొనెదరు కావున కప్పుకొనిన బట్టను సంబోధించినట్లుగా జానపదుడు తన భావాన్ని వ్యక్తపరచెను. పంచతంత్రంలోని నీతికథలను జంతువుల పాత్రలద్వారా గ్రంథకర్త ఎట్లు తెలిపెనో అట్లే జానపదులు అన్యాపదేశంగా నీతిని ఉపదేశించిరని తెలియుచున్నది. బహుశః ఈ గేయము నేతపనివారలచే పాడబడి యుండును. సోమరియైనవానికి కార్యసిద్ధి కలుగదని భావం.

"కోణ్ణిగట్టేసుకో - కోడికిన్ని గింజలేసుకో
కుక్కనుగట్టేసుకో - కుక్కకింత కూడేసుకో
గాడిదను కట్టేసుకో - గాడిదకింత కూడేసుకో"
(పాడినవారు - వడ్లూరి నారాయణరెడ్డి - అనంతపురము జిల్లా - 22వ పే.)

దేనిని పెంచుకున్నప్పటికిని ఇతరులపై ఆధారపడకుండా వాటిని పెంచుకొనుట కర్తవ్యం. ఆలికి అన్నముపెట్టుట ఊరికి ఉపకారం చేయుట కాదుగదా. ఎవరి పిల్లలకు వారే ఆహారాన్ని సమకూర్చుకొనవలెననీ, భోజనపానీయాదులకు ఇతరులపై ఆధారపడి ఉండకూడదనే విషయాన్ని నుతిమెత్తగా తెలుపుచున్నది.

"పొదుగూరురెడ్డి - కిరసనాయిలు బుడ్డి"
(పాడినవారు మస్తానక్కగారి రామగాడు, రాకట, అనంతపురం జిల్లా, 23వ పే.)

"ఓడూరి పటేలు మరోవూరి తలారి" అను సామెతను తలపించుచున్నది. ఎవ్వరికైనను స్థానబలమే ముఖ్యమని భావం.

"కోమటి కొండప్ప జుట్టోజి
జుట్టుజిట్టోజి నాకింత ముట్టోజి"
(పాడినవారు మరం రామేశప్ప రాకట్ల అనంతపురము జిల్లా 24వ పే.)

కోమటివారు పిసినికొట్టువారు, వారేమియు దానము చేయరనే విశ్వాసము ప్రజల కలదు. కోమటివారిని ఆశ్రయించిన జుట్టే మిగులును కాని మరేమియు దొరకదని వ్యంగ్యంగా తెలుపు సామెతగా పేర్కొనవచ్చును.

"కట్టెలుతేరా తిమ్మ
కడుపు నొస్తాదమ్మా
పిన్నెగిన్నె తీసుకోరా తిమ్మా
ఇంతేజాలుమాయమ్మా"
ఇంట్లోపడుకోరతిమ్మ
ఇంతేచాలు మాయమ్మ
(పాడినవారు వడ్లూరి నారాయణరెడ్డి రాకట్ల అనంతపురం జిల్లా 25వ పే.)

"పనికిబోయినారా శివ్వ
చాతకాలేదవ్వా
చిప్ప (గిన్నె) తీసుకోర శివ్వా
అందుకు తయ్యారవ్వా"

అనునది తెలంగాణంలో ప్రసిద్ధమైన జానపద సామెత. పైగేయపాదాలు సోమరి మనస్తత్వాన్ని తెలుపుచున్నవి. "తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు" అను సామెత కలదు. అమిత భోజనం చేసేవాడు, పనిలో అసమర్థుడనీ, అసమర్థుడైనవాడే ఏదోఒక మిషతో పనినుండి తప్పించుకొనునని భావం.

"తాగేటి నీళ్లులేవు
తందన్నబాయి"

"తందన్నబాయి" అనగా నీళ్లులేనిబావి అని అర్థం. "మింగమెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె" అను సామెత కలదు. పై గేయపాదంకూడ అదేభావాన్ని తెలుపుచున్నది.

(పాడినవారు-మల్లంగి వెంకటరమణప్ప-రాకట్ల అనంతపురము జిల్లా 26వ పే.)

"వాగీనాగీ నల్లేరు
నాగిని పట్టుకు తన్నేరు
గూబల్ని పట్టుకు తన్నేరు
గుత్తికొండజూపేరు"

(పాడినవారు-కోరకోళ్ల రామన్న - సొల్లాపురం-అనంతపురము జిల్లా - 23వ పే.)

"బావా బావా పన్నీరు
బావను పట్టుక తన్నేరు"

అను పాటలాంటిదే పై గేయం కూడ పిల్లలు ముఖ్యంగా బావను ఆట పట్టించు సన్నివేశములో పాడుకొనెడి పాట.

పిల్లలకు సంబంధించిన సామెతలను, పలుకుబడులను పరిశీలించుటైనది. పిల్లలలో ఉన్న హాస్యభావనల్ని, వాని మనస్తత్వాన్ని ప్రతిబింబించు పలుకుబడులెన్నో జానపద సాహిత్యములో కలవు. జానపద సాహిత్యము అంతయు చక్కని పలుకుబడులతో, జాతీయాలతో నిండినదని చెప్పవచ్చును.

## 2) పండగలకు (వేడుకలకు) సంబంధించిన సామెతలు :

భారతీయ జనజీవనములో పండుగలకొక ప్రత్యేక స్థానం కలదు. వేరే మతములలోనున్న పండుగల కంటె హిందూ మతములో పండుగలసంఖ్యఎక్కువ, దాదాపు సంవత్సరమంతయు ఏదో ఒక పండగగా గడపవచ్చునేమో. భారతీయ జీవన విధానానికి పండుగను ఒక నిదర్శనంగా పేర్కొనవచ్చును. తెలుగు వారి పండుగలను ఎక్కువే. పండుగలన్నీ ఎక్కువ చేయునది. పండుగలంటే ఎక్కువ ఆనందాన్ని పొందునవి జానపదులేనని చెప్పవచ్చును. ప్రతి చిన్న అనుభవాన్ని ఒక పండుగగా జానపదులు మలచికొనిరేమో.

"ఎత్తుకొన్న బిడ్డ ఎడబాయకుండా
చంకనబిడ్డ సడలాకుండా
చేతి గాజులు చెరగాకుండా"

(పాడినవారు-సంపన్నమడుగుల వెంకటమ్మ-గుంటూరు జిల్లా-32 పే.)

స్త్రీలకు గాజులపై మోజునుపై పలుకుబడులు తెలుపుచున్నవి. చదువుకొనని పల్లెటూరి వారికే సంతానమెక్కువ అనునది అందరకు తెలిసినదే. పల్లెటూరి స్త్రీ ఒక

చంకలో బిడ్డనెత్తుకొని, భుజముపై మరొక బిడ్డనెత్తుకొని సంతకు బయలుదేరిన సన్నివేశాన్ని పై గేయపాదం తెలుపుచున్నది.

"నీలగిరి కన్నెలకు నిత్యమల్లె తోట
నిత్యమల్లె తోటలో నిమ్మల్ల బావి
బుడిగి, బుడిగి చెంబు అందరకు మనసు"
(పాడినవారు-చింతాసోమి దేవమ్మ-నెల్లూరు జిల్లా-33వ పే.)

జానపదులకు శబ్దాలంకారాలనిన మోజను విషయాన్ని, పరిసర ప్రాంతముల వర్ణనపైగల మక్కువను పై పలుకుబడులు తెలుపుచున్నవి.

"ముత్యాల వాకిటిలోను వజ్రాల వానగురిసె
వజ్రాల వాకిటిలోను రత్నాల వానగురిసె
ఎక్కా గుర్రాలిస్తా ఏలా రాజ్యాలు యిస్తా
అన్నా నీ కూతురునిచ్చి అరణామియ్యరా"
(పాడినవారు-వెంపటి అచ్చమ్మ-విశాఖ జిల్లా)

మేనరికానికి తెలుగు సమాజంలో ఎంత ప్రాధాన్యమున్నదో పై సామెతలు తెలుపుచున్నవి. మేనరిక సంబంధమును ఎట్టి పరిస్థితులలోను వదలకూడదను భావం మన పూర్వీకులకుండెడిది. గ్రామాలలో నేటికి సైతం మేనరిక సంబంధాన్ని వీలైనంత వరకు వదలుకొనరు.

"బావగారి జుట్టుకూ బంతీపూలు జుట్టేరు
వీధీ వీధుల దిప్పే వింతగా జూచేరు"
(పాడినవారు-కొత్తపల్లి శేషమ్మ-తూ॥గో॥ జిల్లా-36వ పే.)

మరదళ్లు బావను ఆట పట్టించే సమయంలో పై విధంగా పాడుకొనెదరు. చక్కని తెలుగు పలుకు బడులకు జానపద సాహిత్యం నిలయమని చెప్పవచ్చును.

"సున్నంగా తలదువ్వి నూగాయ జడవేసి
ముడిసెనే సిరిలక్ష్మి మునికొప్పుమిందా"
( పాడినవారు- కోనంకి దేవేంద్రప్పగారి శివమ్మ-కర్నూలు జిల్లా-37వ పే.)

"నూగాయ జడ" చక్కని తెలుగు పలుకుబడి, అమ్మాయిని అలంకరించే విధానాన్ని తెలుపుచున్నది.

"అగ్గసాల బాయికీ హంస కావాలి"
(పాడినవారు-మేకల అలిమేలమ్మ-గుత్తి-అనంతపురము జిల్లా-38వ పే.)

"బాయి" అనునది స్త్రీని గౌరవంగాగాని, వ్యంగ్యంగాగాని పిలిచే పదం. సామాన్యంగా అంజలీ బాయి, రమాబాయి అని పిలుచుట గనుచున్నాము. "హంస" 'హంస' అనగా శ్రేష్ఠమైనదని అర్థం. గుణవతిగాని స్త్రీని 'హంస' అనగా గొప్ప స్త్రీగా గౌరవించనవసరములేదని విశేషార్థం.

"ములక చెట్టు కిందా మున్నూర్ల దోవల్లూ"
(పాడినవారు-తూమాటి తిమ్మక్క, రాకట్ల రాయదుర్గము-అనంతపురము జిల్లా-51పే)

ఎవ్వరైనా పొగడిన యెడల "నన్నవసరంగా ములగ చెట్టెంచెక్కించకు" అనుట సామాన్యం కావున ములగచెట్టును ఎక్కగూడదని భావం. "ములకి చెట్టు కిందా మున్నూరు దోవలనునదొక పలుకుబడి.

"చుక్కవోలె పాగజుట్టి చూచినావు దేశమెల్ల"
(సంపాదకులు-1954లో సేకరించినది-60వ పే.)

కాముని పున్నమి సందర్భములో వెన్నెల రాత్రులందు స్త్రీలందరు గుమిగూడి వెన్నెల పులుగులవలె వీథులన్ని తిరుగుచు, పాటలు పాడుచు, ధనికులను యాచించు టకద్దు. ఈ పాటలో పచేలు వ్వర్ణన గలదు. "చుక్కవోలె పాగజుట్టి చూచినావు" అనునది ఒక చక్కని తెలుగు జాతీయమని చెప్పవచ్చును.

"మచ్చులవారు మా బావ గారు
రచ్చాలకేగ్గునమ్మా"
(పాడినవారు-లక్ష్మీబాయి అను బాలిక పాడిన పాట-ముస్తాబాదు-
కరీంనగర్ జిల్లా—(1956)-64 పే.)

బావను ఆటపట్టించేపాట. "మా బావగారు వచ్చులవారనునది తెలుగుపలుకుబడి

"పెండ్లికి వచ్చిన పెద్దలే సాక్షి"
(1952లో సేకరించబడినది-మడికొండ-వరంగలు జిల్లా-67వ పే.)

ఏ పెళ్లికైనను-పెళ్లికి వచ్చిన పెద్దలే సాక్షిగా ఉండెదరు. మోసం చేయు భర్తలకు బహుశః పెద్దలేబుద్ధి చెప్పవలెననే ఉద్దేశ్యంతో పెళ్లికి అతిథులను పిలుచుట అను ఆచారమేర్పడియుండవచ్చును.

"సోడు సోడు ముత్యాలిత్తా
సుమ్మ పూల దండలిత్తా"
(పాడినవారు-నర్సమ్మ-బొప్పాపురం, కరీంనగరము జిల్లా-70వ పే.)

ప్రియుని కొరకు ఏ త్యాగమునకైన స్త్రీ సిద్ధపడునను భావాన్ని ఆగేయపాదం వివరించుచున్నది. స్త్రీకి పతియే నిజమైన భూషణం కదా.

## 3. స్త్రీలకు సంబంధించిన సామెతలు :

జానపద సాహిత్యంలో స్త్రీలకు సంబంధించిన సామెతలు ఎక్కువగా ఉన్న వని చెప్పవచ్చును. జానపద గేయాలను ఎక్కువ పాడెడివారు స్త్రీలగుట ఒక కారణముగా చెప్పవచ్చును.

"ఎగ్గు సిగ్గులమారి వ్యాపారి శివుడా
ఏమనిపాడేది యిందరిలోన''
(పాడినవారు-సంపన్మదుగుల వెంకటమ్మ గుంటూరు జిల్లా-73వ పే.)

శివునకు ఇద్దరు భార్యలు. ఏ భార్యయైనా సవతి పోరును సహించదు. వ్యంగ్యంగా అదే భావాన్ని ఈ గేయం తెలుపుచున్నది."ఎగ్గు సిగ్గులమారివ్యాపారి" చక్కని తెలుగు పలుకుబడి.

"సూర్య బాణము తొడిగి సూర్య రథమెక్కి
నా పుణ్యముల రాశి వచ్చెనని పాడు"
(పాడినవారు-సంపన్మదుగుల వెంకటమ్మ-గుంటూరు జిల్లా-73వ పే.)

"నా పుణ్యముల రాశి" చక్కని తెలుగు పలుకుబడి. ప్రియుని కొరకై ఎదురు చూచి ప్రియురాల భావాలను తెలుపుచున్నది.

"చూలింత బాలింత సుఖము గోరితే
లేత మామిడి చెట్టుపూత గోరింది"
(పాడినవారు-వెంటూరి గంగమ్మ తూ॥గో॥జిల్లా-74వ పే.)

"మామిడి చెట్టు పూత" అనునది పలుకుబడి.

బాలింతను లేతమామిడి చెట్టుతో పోల్చుట జానపదుల ప్రత్యేకత. ఏవిధంగానైతే పూతబట్టిన చెట్టు అందంగా కనిపించునో అట్లే సంతానవతియైన స్త్రీ జీవితము ధన్యమగునని భావం.

"పండుగొచ్చి తేను పిండికేచేటు
అల్లుడొచ్చి తేను అత్తకేచేటు"
(పాడినవారు వెంపటి అచ్చమ్మ విశాఖజిల్లా 75వ పే.)

"జామాత దశమగ్రహః" అనునది సంస్కృత లోకోక్తి. అల్లుడత్తవారింటికి వచ్చినయెడల, ఎన్నో మర్యాదలు చేయవలసి ఉండును. ముఖ్యంగా అత్తగారికి వంటశాలలో ఎంతోపని పెరుగును. ఎంత సహాయము చేసినను, అల్లుడత్తవారికి కృతజ్ఞుడుగా ఉండడు. పండుగ వచ్చినయెడల ఏదియెట్లున్నను పిండివంటలు చేయవలసి ఉండును. కావున పిండినష్టమగును. పండుగకు పిండి నష్టమైనట్లే, అల్లుడు వచ్చిన అత్తకు నష్టమగునని భావం. అత్తా అల్లుళ్ల సంబంధాన్ని తెలుపు చక్కని సామెత.

"అద్దరేతిరికాడ నిద్దురపొద్దు
చిటపటలాడించె నాచిట్టిబొజ్జ"
(పాడినవారు వెంపటి అచ్చమ్మ విశాఖ జిల్లా 75వ పే.)

"చిటపటలాడింది", "చిట్టిబొజ్జ" అందమైన తెలుగు పలుకుబడులు. ఆకలితో నున్నవారికి నిద్రపట్టదు. సరియైన ఆహారం గైకొనినచో నిద్రపట్టుననునది సత్యం.

"రాజులకు తగినట్లు రంభలొచ్చారు"
(పాడినవారు-కల్లూరి అప్పన్న-శ్రీకాకుళం జిల్లా 76వ పే.)

అనురూపదాంపత్యాన్ని తెలుపు సామెత. అందమైన కొడుకులకు తగినట్లుగా భార్యలు దొరికిరని భావం.

"అల్లుడల్లాడంటె ఒళ్లమండేను
అల్లుడత్తకుదెచ్చె అద్దాలరైక"
(పాడినవారు నూకసాయి సూరమ్మ-ప॥గో॥జిల్లా 79వ పే.)

"అత్తకు అల్లుడాశ-బాపనికి పప్పాశ" అనునది సామెత. అత్తను మంచిచేసుకొనవలెనని ఆమెకు అద్దాలరైకను దెచ్చుట మరిన్ని కట్నములకొరకేనని భావం.

"నిత్తెమల్లెలరైక నీకు అందమ్మ
నువుకన్నకూతురూ నాకు అందమ్మ"

(పాడినవారు-నూకపాడు సూరమ్మ ప॥గో॥జిల్లా 79వ పే.)

అత్తకు మల్లెపూలరైక ఇష్టం. అల్లునకత్త కూతురనిన ఇష్టం. అత్తా, అల్లుళ్ల సంబంధాన్ని తెలుపుచున్నది.

"నీలమ్మ నీమగడు నిన్నేలడమ్మా
ఏలకుంటె మానె ఎదురుంటెచాలు
నొష్టకుంకుమలుంటె యిష్టాలుదీరు
పసుపు ఒంటీనుంటె భయమేమినాకు"

(పాడినవారు-దేసినీడు సింహాచలం-విశాఖ జిల్లా 80వ పే.)

"నొష్టకుంకుమలుంటె యిష్టాలుదీరు"ను చక్కని సామెతగా ప్రయోగింపవచ్చును. భర్త ఎటువంటివాడైనను, భార్య అతని క్షేమాన్నే కోరుకొనుటకు చక్కని ఉదాహరణం.

"కలవారి కూతురాగారాబుపట్టి
కందుతావడబోసి కడుగుతున్నాది"

(పాడినవారు-దేసినీడు సింహాచలం-విశాఖ జిల్లా 84వ పే.)

"గారాబుపట్టి" చక్కని తెలుగు పలుకుబడి. స్త్రీ పుట్టింటిలో ఎంత సుఖంగా నున్నను అత్తవారింటిలో పనిచేయవలెనని సత్యాన్ని తెలుపుచున్నది.

"బాటంట పొయ్యేటి ఓదాసిరయ్యా
మాయన్న గోసాయి యాడ ఎదురాయె"

(పాడినవారు-జల్లు లక్ష్మమ్మ-అనంతపురము జిల్లా 89వ పే.)

అన్నాచెల్లెళ్ల అనుబంధాన్ని, అనురాగాన్ని తెలుపుచున్నది.

"బోరుబోరుమేళాలు బోగమాటల్లు
మల్లెపూదండల్లు మంగళారతులూ"

(పాడినవారు-సెక్కిరాళ్ల అయ్యమ్మ—కర్నూలు జిల్లా 92వ పే.)

పెళ్లిళ్లలో బోగముమేళాలుండుట ప్రాచీన ఆచారం. పెళ్లిపందిరి వర్ణన కనబడుచున్నది.

"అయిదేళ్లకుంగరాలు అస్తకడియాలు
పదియేళ్లకుంగరాల్ పాలకడియాలు
అత్తింటి కంపెనే అన్న రామన్నా"
(పాడినవారు-దాసరి ఓబుళమ్మగారి యంగటమ్మ అనంతపురం జిల్లా 94పే.)

పదేళ్లు దాటీదాటగనే ఆమె పెళ్లయింది. తన అన్నరామన్న తనకు పెళ్లిచేసె ననుటవలన బాల్యవివాహ విషయాన్ని పైవాక్యం తెలుపుచున్నది.

"ముక్కునా సెమటా ముత్యమై మెరిసే
మెడమీద పథకమూ అద్దమై మెరిసే"
(పాడినవారు-పాలేటి లక్ష్మమ్మ అనంతపురము జిల్లా 96పే.)

ఈ గేయాన్ని పరిశీలించిన జానపదులు స్త్రీని వర్ణించిన విధానం అమోఘ మనిపించును. తెలుగు జాతీయములతో చక్కని వర్ణన చేయుటలో జానపదులు సిద్ధహస్తులని తెలియుచున్నది.

"చిప్పగిరీనుండి చీటీవచ్చింది
చీటీతోమాయమ్మ చీరంపినాది"
(మురుకొండ అంజనమ్మ-అనంతపురము జిల్లా 97వపే.)

అత్తవారి ఇంటిలో సైతం స్త్రీ తన పుట్టింటి గొప్పదనాన్నే పొగడును. తల్లీ కూతుళ్ల ప్రేమను వర్ణించునదీ గేయం.

"రాగల్లయిసిరేటి వోరాజమచిలుకా
మొగుడెందుబోయెనే మొగముతిళదప్పే"
(పాడినవారు-బొల్మిని నారాయణమ్మ-అనంతపురము జిల్లా 99వపే.)-

స్త్రీకి అన్నిసంపదలకన్నా భర్తక్షేమమే ముఖ్యమని తెలుపుచున్నది. భార్యా భర్తల అనుబంధానికి దర్పణమువంటిదని చెప్పవచ్చును.

"సూర్యుని చేతికి సులగెకానైతు
పసులోని చేతికి పరిగెకానైతు"
(పాడినవాయి-గోవవ్వ చొప్పాపురం-సిరిసిల్ల కరీంనగరము జి॥ (1956) 105పే.)

(సులగె-కొమ్మ, పరిగె-కర్ర, బరిగె)

జాతీయంగా ఉపయోగించవచ్చును. ఎప్పుడు ఇతరులను దండించు అవకాశం కొరకు ఎదిరిచూచు మనస్తత్వాన్ని తెలుపుచున్నది.

"సామల దేశానికి నన్నియ్యబోకవ్వ
నేనుతినగలేను సామలబువ్వ
బావలమీదికి నన్నియ్యబోకవ్వ
భారిదొడ్ల పెండ నేదీయలేను
మరదుల మీదికి నన్నియ్యబోకవ్వ
మల్లెచెట్టుకు నీళ్ల నేపోయలేను"

కరువుప్రాంతానికి తననివ్వకూడదనుచు, బావామరుదులు ఎక్కువగా ఉన్న యింట్లోకి తనను యివ్వకూడదనీ, అట్లే పనులు ఎక్కువగా చేయవలసివచ్చు యింటి లోకి తననివ్వకూడదని ఆమెతల్లితో చెప్పెను. తాను భర్తకుమాత్రమే సేవచేసెదనని తెలుపుటవలన స్త్రీ మనస్తత్వాన్ని తెలుపుచున్నది.

అదీగాక

"సవతులమీదికి నన్నియ్యబోకవ్వ
సముద్రములోతుదిగి నేచూడలేను"

బహుభార్యాత్వమున్న రోజులలోనిదని చెప్పవచ్చును. సవతిగా వెళ్లటకంటె సముద్రాన్ని ఈదుట సులభమని భావం.

(పాడినవారు-మాదిగ పోచమ్మ-పటంచెరువు మెదకు జిల్లా - 106,107 పేజీలు)

"కట్టమీది మఱ్ఱికాయల్లమాను"

ఆడుబిడ్డ తన అన్నగారితో తనకు రావలసిన అరణం మరియు కట్నాలను గూర్చి చెప్పుకొనునట్టి గేయం.

కట్నముతేని స్త్రీని అత్తవారింటిలో అవమానపరచెదరనీ, అసహ్యించు కొనెరనీ భావం. వరకట్న దురాచారం ఎంతవరకు దారితీయునో పైవాక్యం తెలుపుచున్నది.

"పొంగుబొంగే కల్లు బుంగెడంతాదెస్తు"

(గుడికనపర్తి ద్వారా సేకరించినది-1954, 111వ పే.)

కల్లుపై గ్రామీణులకుండే ఇష్టాన్ని, కల్లుతో ఏపనియైనను జరుగుననే అభిప్రాయాన్ని తెలుపుచున్నది.

"కోడలా కోడలా కొలికిముత్యామా
పచ్చపాలామీది మీగడేమాయే
వేడిపాలమీది వెన్నలేమాయే
.. ....
.. ..
.
అత్తనువ్వుబెట్టిన ఆరళ్లవలన
మానన్నగానైతి మంచేలేదురు"

(దేవునూరులో సేకరించినది (1952) 114 పే.)

అత్తాకోడళ్ల సంబంధానికి అద్దం పట్టునటువంటివి. అత్తాకోడళ్లు కలసియుండుట, ప్రేమకలిగియుండుట చాలా తక్కువనియే చెప్పవచ్చును. కోడలు చేసిన ప్రతిపనికి అత్త ఏదో వంక బెట్టగా, నాజన్మ ఎందులకు, నేను మానైనా గాకపోతినని కోడలు బాధపడుట పై గేయంలో కాననగును.

అత్తాకోడళ్ల సంబంధాన్ని తెలుపు చక్కని జాతీయంగా దీనిలోని ప్రతివాక్యాన్ని ప్రయోగింపవచ్చును.

"సామినాకు సంతానందయ చేయరాదా"

(గూడూరి కనపర్తిగారి ద్వారా సేకరించినది-కరీంనగరము జిల్లా 115 పే.)

వివాహం సంతానంకొరకేనని ఆర్యులు పలికిరి. సంతానము భార్యాభర్తలకు, కుటుంబ సభ్యులకు సంతోషాన్ని కలిగింపజేయును. సంతానం స్త్రీకి ఒక ప్రత్యేక గౌరవాన్ని కలిగింపజేయును. సంతానవతిగాని స్త్రీని గొడ్రాలని అవహేళన చేయుట సమాజంలో చూచుచున్నాము. కావున సంతానాన్ని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించు స్త్రీ వేదన దానిలో కాననగును.

స్త్రీలకు సంబంధించిన సమస్యలు, స్త్రీల ఆచారాలు, కుటుంబంలో వారిపాత్ర మొదలగునవన్నియు జానపద సాహిత్యంలో ప్రస్ఫుటంగా వర్ణింపబడినది.

## 4) శ్రామికులకు సంబంధించిన సామెతలు :-

శ్రమశక్తితో జీవించువారు శ్రామికులు.

"చుట్టున్నకావలా చుక్కలాబోలు
నడుమకమ్మరిబిడ్డ చంద్రుణ్ణిబోలు"

(పాడినవారు పరవతి అప్పమ్మ-విశాఖ జిల్లా 123 నుండి 127 పే.)

చక్కని తెలుగు జాతీయం. రైతులు కమ్మరిదగ్గరకు ఏదోపనిపై వెడలెదరు. కమ్మరి ఎవ్వరి మనస్సును నొప్పించకూడదని భావించి, అందరకు సహాయం చేయ వలెననుకొనును. రైతులందరి మధ్యనున్న కమ్మరి చుక్కల్లో చంద్రునివలె ఉండెనని జానపదులు చక్కని వర్ణన చేసిరి. చుక్కలెన్ని ఉన్నను చంద్రునికొరకే, రైతులంద రును కమ్మరికొరకే ఉన్నారని భావం.

"కుప్పెక్కి పాలిగాడు కూకలేయంగ
మండెక్కి పోలిగాడు మాటలాడంగ"

(పాడినవారు-పరపతి అప్పమ్మ-విశాఖజిల్లా 123 నుండి 127 పే.వరకు)

వివిధ వృత్తులలోని జనులకార్యాలను వివరించు జాతీయంగా పేర్కొనవచ్చును.

"పుట్టమీద - పాలాపిట్ట
కొట్టబోతే - తేలూకుట్ట
బావగారు - మంతారించె
భల్లూ భల్లూ - తెల్లవారె"

బావలను ఆటపట్టించే తెలుగు పలుకుబడులు.

(పాడినవారు-మంగము సుబ్బన్న తూ.గో.జిల్లా 133వ పే.)

"రాజసాలూ దంచబోతే
రామిరెడ్డి కొడుకుబెట్టే"

(పాడినవారు-మరసు బసవయ్యస్వామి-బళ్లారి జిల్లా 137పే.)

పెద్దవారిదగ్గర పనితీసుకొన్నను పల్లెటూరి ప్రజలు కృతజ్ఞతతో ఉండెదరను టకునిదర్శనం.

"అగ్గివంటీ దేవుడమ్మా
ఆతారీ రంగనాయకులూ"

(పాడినవారు-కొమ్మినేని లక్ష్మయ్య, భరతయ్యలు తా॥బద్వేల్, జి॥ కడప)

భగవంతుని మహాత్మ్యాన్ని, పవిత్రతను తెలుపు జాతీయం.

"గుట్టగుట్టా దిరుగలేసూ
గూనిమేకలు కాయలేనూ

పచ్చిపాలు తాగలేనూ
పాయందాన్ని పట్టలేనూ
(అనంతపురము జిల్లాలోనివారు పాడినవి-146 పే.)

ప్రేమగావుండే స్త్రీని భార్యగా పొందుట కష్టమనే విషయాన్ని ఈ గేయం తెలుపుచున్నది. చక్కని తెలుగు జాతీయములతో కూడినదాగేయం.

"నిమ్మముల్లూ రొమ్ముమనాటే
నీలిరైకా సిగ్గుదేలే"
(అనంతపురము జిల్లాలోనివారు పాడినవి—146 పే.)

శృంగార భావాన్ని తెలిపే జానపదగేయం. చక్కని తెలుగు జాతీయంగా ప్రయోగింపవచ్చును. శ్రామికులు తమ అలసత్వాన్ని పోగొట్టుకొనుటకై పాడే పాటగానెంచవచ్చును.

"అడుగనైతే అడుగరాదో
ఆడదానికి వలపులేదో
కొంగుమూసే కడకుబోతే
కోప్పడకురా కోడెకాడా"
(పాడినవారు-సెక్కరాళ్ల, పత్తికొండ తాలూకా జిల్లా కర్నూలు-148 పే.)

ప్రేయసీ ప్రియుల వలపు కలహాలను వివరించు గేయం. ప్రశ్న - జవాబు రూపములోనున్న గేయములలో తెలుగు పలుకుబడులున్నవి. "కొంగుమూసేకడకు" అనునది తెలుగు పలుకుబడి.

"యేటిమీదబోయ్యేటి యెరకల్లసానీ
యీనదీసల్లింది యిసనకర్రల్లు (149 పే.)

వృత్తిధర్మాన్ని తెలుపు తెలుగు జాతీయం. జానపద సాహిత్యంలో వృత్తి ధర్మాన్ని తెలుపుగేయాలు కలవు.

"మేడకన్న చక్కనిది మేదారిగుడిసె
నీకన్న చక్కనోడు నామేనమామ" (150 పే.)

చక్కని తెలుగు జాతీయంగా ప్రయోగింపవచ్చును. డబ్బుకన్నను, అందం కన్నను ప్రేమయే గొప్పదనే విషయాన్ని తెలుపు జాతీయం.

"నెత్తినిండా సీళ్లకడవా సేతిలోన సద్దికూడు
యెంతకొట్టుకున్నాను కదలాదు పెడుసూ" (152 పే.)

"నెత్తినిండా నీళ్లకడవా సేతిలోన సద్దికూడూ" అనేది తెలుగు పలుకుబడిగా ప్రయోగింపవచ్చును.

"చింతాకు సట్లుదీసి యిల్లలికినానూ
అక్కచూతువు రాయెనాయిల్లుతీరూ (153 పే.)

తనకున్న దారిద్ర్య బాధను తెలుపుతుంది అక్కతో. పలుకుబడిగా ప్రయోగింపవచ్చును.

"వానాగొట్టదాయే వరుదెల్లదాయే
అవ్వా మనవాకిట్లా వరుదెక్కడిదే" (159 పే.)

అత్తబాధచే కోడలు ఏడ్వగా ఇంటిముందు వరదలుగా ప్రవహించినదని, తన భార్యదుఃఖాన్ని సహించలేకపోవుచున్నానన్న భావనకాబోలు. చమత్కారమైన తెలుగు పలుకుబడిగా చెప్పవచ్చును

"ఏటికేతంబెట్టి ఎయిపుట్లు బండించి
ఎన్నడూ మెతుకెరుగరన్నా (162 పే.)

బీద కార్మికుల స్థితిగతుల తెలుపు జాతీయంగా పేర్కొనవచ్చును.

"రచ్చమీదగూసున్న రాజు చూసిండు
రారసుంకరోడ పోరయెలవాడ" (167 పే.)

ధనవంతులు పేదవారిపై చేసే దౌర్జన్యానికి దర్పణము వంటిది. ఒక స్త్రీ మానమునకు రక్షణలేదని భావం.

"అచ్చమునల్లచీరె కొంగున మల్లెపూలు
మొగనిమీదమన్ను కూలికిపంపెనన్న" (169 పే.)

కొత్తగా పెళ్లయిన శ్రామికస్త్రీ ఆవేదన. హాయిగా భర్తతో సుఖంగా ఉందామని అనుకున్నను, భర్త ఆజ్ఞచే విధిలేక కూలికి పోవలసివచ్చెనని భావం. శోభన మునాడు సైతం బాధలు తప్పవని భావం. బీదవారి బాధలను తెలియజేయు చక్కని జాతీయం, శ్రామికుల మనోభావాలకు ప్రతీకయని చెప్పవచ్చును. ఇంకెన్నియైనను ఉదాహరణములనివ్వవచ్చును.

## 5) ప్రేమ (వలపు)నకు సంబంధిచిన సామెతలు .

జానపద సాహిత్యంలో, జానపదులవల్లె సూటిగా నిష్కల్మషమైన ఉపమానాలతో కూడిన సామెతలున్నవని చెప్పవచ్చును.

"చెల్లెలా! చెల్లెలా! చేమంతిమొగ్గా
మరదిడుఃళ్లోలెడు మల్లెలెక్కడివి" (175 పే)

చిలిపి చెల్లెలి వలపునుగూర్చి ముద్దుముద్దుగా ప్రశ్నించె తెలుగు పలుకుబడిగా చెప్పవచ్చును.

"అల్లిపువ్వు ఎంతున్న అందమెంతున్న
ఆడవారెంతున్న అలిసరిరారు" (175 పే)

పరస్త్రీ సంబంధం పనికిరాదనీ, భార్యపైమాత్రమే భర్తకు ప్రేమ ఉండవలెననీ తెలిపెడు సామెతగా చెప్పవచ్చును. అల్లిపువ్వులో సువాసనలేదు.

"మొగలిపూవెంతున్న మోహమెంతున్న
మొగవారెంతున్న మొగునిసరిరారు" (175పే.)

స్త్రీకి భర్తయే ప్రత్యక్షదైవం. పరపురుషలతో సంబంధం సమంజసమైనది కాదని భావం. మొగలిపువ్వులో వాసనలేనట్లే పురుషుల పొందులో వలపుండదనిభావం.

"మొలబంటి నీళ్లల్ల మొగలిపూసింది
మొగలిపూవంటిది మొగవారిమనసు" (175పే.)

మగవారి మనస్తత్వాన్ని తెలుపుసామెతగా ప్రయోగింపవచ్చును. వాసనలేని మొగలిపువ్వు వంటిది మగవానిమనస్సని భావం.

"అలబంటినీళ్లల్ల అల్లిపూసింది
అల్లిపూవంటిది ఆడవారిమనసు" (175పే.)

అల్లిపూవువలె సువాసనలేని, సౌకుమార్యంలేనిది ఆడవాళ్లమనస్సనే కొంత మంది పురుషుల అభిప్రాయాన్ని తెలుపుసామెతగా చెప్పవచ్చును.

"కొత్తగపెండ్లాయె కొన్ని దినములాయె
అత్తింటికోడల్ని అగవు సేయకురా" (193పే.)

ముందుముందు అత్తతో ఎట్లయిన బాధలుతప్పవు. కావున కొత్తపెళ్లికూతురనైన తననుఇబ్బందిపెట్టకుమని వలపుతో, బాధతో తనభర్తతో చెప్పుకునేస్త్రీ అభిప్రాయంగా చెప్పవచ్చును. లోకరీతిని చెప్పు చక్కని లోకోక్తిగా కూడ లెక్కించవచ్చును.

"అడ్డగోడలెగిరిపోయి ముద్దులాడివస్తానంటె
చేసికొన్నపాపిమొగడు ఆడకావలో" (189 పే.)

**"Stolen kisses are always sweet"** అను ఆంగ్లసామెత ఒకటున్నది. అక్రమసంబంధం కొంతమందికెక్కువ రుచికరంగా ఉండుననుటకు పైసామెతను ఉదాహరణంగా గైకొనవచ్చును.

"మాయత్తచెవిటిది మామగుడ్డోడు" (193 పే.)

అత్తమామలు ఎట్లుండవలెనో ఆలోచించే ఒక కోడలి భావనకు దర్పణమా-జాతీయం.

"వక్కమీదా వక్కబెట్టి వక్కలో యేలక్కబెట్టి"
వక్కగొరికినట్లునీసెక్కు గొరికెదెన్నడూ" (194 పే.)

ప్రేయసీ ప్రియుల మనోభావాలకు దర్పణము

"ఆకుమీదా ఆకుబెట్టీ ఆకులో సున్నాము బెట్టీ
వెన్నగరిగీనట్లు నీమనసు గరిగేదెన్నడూ" (194 పే.)

"వెన్నగరిగీనట్లు" "నీమనసుగరిగేదెన్నడూ" అనునవి గొప్పతెలుగు తలుకుబడులని చెప్పవచ్చును.

"పచ్చికొబ్బరివలె పాయామున్నది సామీ
పాయామెవ్వరిపాలు జేతూర జాణా" (195 పే.)

పాయమనగా "ప్రాయము" (వయస్సు) అని భావం. చక్కని తెలుగు పలుకుపడులతో గూడిన సామెతగా చెప్పవచ్చును.

"అరటిబొందెలవాలె తొడలూవున్నవి సామీ
తొడలూ యెవ్వరిమీదయేతూర జాణా" (195 పే.)

ప్రియునిపై ప్రియురాలునకుగల శృంగారభావాన్ని తెలుపుచున్నది.

"చెరకూ తుంటలవలె చేతులున్నవిసామి
చేతులెవ్వరిమీదాయేరూరజాణా" (195 పే.)

"నిమ్మపండులవలె రొమ్ములున్నాయిసామీ
రొమ్ములెవ్వరిచేతికిత్తూరజాణా" (195 పే.)

పై గేయ పంక్తులన్నీ శృంగార రసానికి చెందినవి. ఒక గడుసు ప్రియురాలి మనోభావాల రూపమని చెప్పవచ్చును. ప్రబంధముల ప్రభావం కొంత జానపద గేయాలపై ఉన్నదనుటకు ఉదాహరణాలుగా చెప్పవచ్చును.

"కూలికిపోతే నాకే రారా - నాలికిపోతే నాకే రారా
నీ మునుము నేనే కోస్తా - నా మునుము నేనే కోస్తా" [202 పే.]

తనకు నచ్చిన వ్యక్తిపై ఎంతటి ప్రేమనైనా కనబరుస్తుందనుటకు పై ఉదాహరణముల చెప్పవచ్చును. 'మునుము' అనగా పండిన చేనిలోని ఒక భాగము. కోసేముందు పొలాన్ని మునుములుగా విభజించి, మునుములను కోసిన పిధంగా కూలి డబ్బులను ఇచ్చెదరు. ఒక్కొక్కరు రోజునకు కొన్ని మునుములను కోయ వలసి ఉండును. తాను ప్రేమించిన వ్యక్తి చేయవలసిన పనిని తాను చేయుటకు సిద్ధమేనని ఆమె తెలిపెను. అతనికై అదనంగా శ్రమించుటకైన సిద్ధమేనని భావం. పల్లెపడుచులు ప్రేమను వ్యక్తీకరించు విధానానికి దర్పణము వంటిదా సామెత.

"పొట్టిదాన్నను కున్నవేమొ - పొందదేమొ నీదు మనసు
పొట్టిదాన్ని గట్టితనము - పట్టెమంచం ఎక్కిచూడు [213 పే.]

"నల్లదాన్నను కున్నవేమొ - పొందదేమొ నీదుమనసు
నల్లరేగడి దున్ని చూడు - తెల్లజొన్నలు పండవేమొ"
......... 213 పే.

వలపునకు శరీర బలహీనత లేపి అడ్డురావని చిలిపిగా తెలిపే ప్రియురాలి మనోభావాలు పై గేయ పంక్తులలో కనుపించుచున్నవి.చక్కని తెలుగు పలుకుబడులు గానెంచవచ్చును.

"నల్ల నల్ల దానినని - నానదేమొ నీదు మనసు
నల్లనీ నేరేడు పండు - నానా రుచూలుండు"

"ఎఱ్ఱవాన్ని జూసితేను - ఎగురునేమొనీదుమనను
ఎఱ్ఱదైనా మేడిపండు - ఇప్పుతేను పురుగులుండు" 218 పే.

"మేడిపండుచూడ మేలిమైయుండును
పొట్టవిచ్చిచూడ పురుగులుండు
పిరికివానిమదిని బింకమీలాగురా" అని వేమనశతకకారుడు పేర్కొనెను. పైపైమెరుగులకు ప్రాధాన్యాన్ని ఇవ్వక, అంతరంగానికే ప్రాధాన్యాన్ని ఇవ్వవలెననే సత్యాన్ని పైగేయపంక్తులు తెలుపుచున్నవి. చక్కని సామెతలుగా ప్రయోగింపవచ్చును.

## 6) హాస్యమునకు సంబంధించిన సామెతలు :-

జానపదసాహిత్యములో హాస్యరసమునకు సంబంధించిన సామెతలను పరిశీలింతెవము. జానపదులు నాగరికులకంటె హాస్యప్రియులని చెప్పవచ్చును.

"ముసలాడుమాతాత పసినిమ్మపండు
పడుచుదానిని పెండ్లాడి పైకాపులుండె" 221 పే.

ముసలితనంలో వివాహమాదేవ్యక్తులగూర్చి వ్యంగ్యంగా వారిస్థితిని గూర్చి తెలుపుసామెత. "పడుచుదానిని పెండ్లాడి పైకాపులుండె" చక్కని తెలుగుపలుకుబడి పెళ్లిచేసుకొని, ఆమె ఎచ్చటికైనావెడలి ఎవరితోనైనా ప్రేమకలాపములొనరించునో యని కావలాగనుండుటకు మాత్రమే నతడు పనికివచ్చును. పడుచుదానికి ముసలి మొగుడు కూడదని భావం.

"సుక్కలకోక కొన్నాడా
మూర తక్కువని ముండలకిచ్చాడా" 222 పే.

ఏదో ఒక వంకతో తనకు చెందవలసిన చీరను దక్కనీయకుండా వేశ్యపాలు జేసెనని అక్కసుతో భార్య పలికిన మాటలు. వేశ్యాలోలుడైన భర్త మనస్తత్వాన్ని తెలుపు సామెతగా చెప్పవచ్చును.

"అత్తకూతురువని అడిగితినిగాని
అతిజాణవే యౌట నిన్నునేనెరుగ" 224 పే.
"మామకొడుకువని మన్నించితినిగాని
మాటకారుడవౌట నిన్నునేనెరుగ" 224 పే.

బావామరదళ్ల సరసోక్తులు, పంహాసోక్తులు, చక్కని తెలుగు పలుకుబడులుగా ప్రయోగింపవచ్చును.

"యింటి మొగుడూ దండుకుబోతే
సద్దీగట్టను గుడ్డేలేదూ
పరాయిమగడు దండుకుబోతే
నాగులచీరా నడిమికిజింపే" 234 పే."

భర్తకన్న పరాయి మగనిపైనే మక్కువచూపే గడుసు స్త్రీ మనస్తత్త్వాన్ని తెలుపు సామెతగా చెప్పవచ్చును. "పెరటిచెట్టు మందుకు పనికిరాద"ను సామెత గలదు. ఆ భావాన్నే హాస్యంగా పై గేయపాదం తెలుపుచున్నది.

"బళ్లారిలోన బెల్లంబెండమ్మినట్లుంది" 235 పే.

బెల్లమునకు బళ్లారి ప్రసిద్ధి. ప్రయోజన శూన్యమైన పనులు చేయకూడదని హితవుచెప్పే సామెత.

"అంకారి బింకారి యింకారితేలూ
యింకాను సౌడమ్మ సంకలోజెలికే" 236 పే.

ఏదోఒక వంకతో పనిమానుకునే సోమరిగూర్చి వ్యంగ్యంగా అవహేళన చేయుసామెతగా చెప్పవచ్చును.

"కోడికోడి దంచితే కొణితెడేఆయె
చెరిగి చెరిగి దంచితే చేరెడేఆయె" 238 పే.

ఎంతపొదుపు చేసినను తమకుదక్కేది తక్కువేనని బాధపడుట.

"సన్నబియ్యం కోడిపెట్టా మేముపెడదామంటిమీ
రాగిముద్దావులవచారు నాకికావలెనంటివీ"
పచ్చిబోగం చిన్నదాన్నీ పక్కవేస్తామంటిమీ
యెంటజాకిన గుల్లికుక్కా నాకికావలెనంటివీ" 241 పే.

నీచమైన అభిప్రాయాలు, నీచమైన అలవాట్లు కలవాడనని పరోక్షంగా ఈసడించుట దీనిలోకానవగును. కొంతమంది గౌరవానికి అనర్హులవి పలుకు చమత్కార భాషణం దీనిలో కానవగును.

"కట్టనూరికాడ - కర్నాలబాయిల
తానమాడబోతె - దానమైపోతివి" 251 పే.

అనుకోని కష్టాలెదురుపడెనని విచారించుట "దానమై" పోవుట అనగా చనిపోవుట అని అర్థం.

"గిద్దెడూబియమొండిగద్దల్లజంపి
గూడెల్లగిచ్చిరే మీయన్నగార్లూ" 242 పే.
"ఆరుజాట్లన్నామూ మూడుజాట్లముద్దపప్పు
చాలకేమూవొదినసరితెడ్డునాకే" 244 పే.

ఆరుచేటల అన్నం, మూడుచేటలముద్ధపప్పు తిన్నప్పటికినీ వదిన ఆకలి తీరలేదని హాస్యంగా మరదలు సంభాషించినతీరుపై జానపదగేయభాగంలో కనిపించు చున్నది. వదినా మరదళ్ల, బావా-మరదళ్ల హాస్యోక్తులను చక్కని జాతీయాలుగా ప్రయోగింపవచ్చును.

అట్లే

"నీళ్లయిస్తామంటె-చిల్లూలచెంబాయె
పీటవేస్తామంటె-పిల్లసందాడెనమ్మా" 249 పే.
"చాపవేస్తామంటే-సందుకొంచెమాయె
కల్లూదెస్తామంటె-చెల్లానిపైసాయె" 249 పే.

కనీసమర్యాదలుకూడ చేయకుండా మరదలు వదినతో సంభాషించినరీతి కాననగును.

అది సరిపోదన్నట్లుగా

"సామలుదంచుదామంటె-సన్నానిధాన్యమాయె
కొఱ్ఱలుదంచుదామంటె-కొత్తధాన్యమాయె" 249 పే.

అని తప్పించుకొనును.

ఇంకను

"కోడినిగోస్తామంటె-గుడ్లమీదికోడాయె
వడ్లుదంచుదామంటె-ఇత్తనాలవడ్లువదినె" 249 పే.

తాను కోడిని కోసి ఆమెకు మర్యాదచేయలేకపోయితిననీ, వడ్లేమో విత్తనాల కొరకు అనగా పంటకొరకు ప్రత్యేకంగా దాచినవికాబట్టి వంట వండలేకపోయితినని గడసుగా సమాధానమిచ్చును. కనీసం వదిన ఇంటికివచ్చినందులకు ప్రేమనైనా

చూపినదాఅంటే అదే లేదని ఈ క్రింది గేయపాదం తెలుపుచున్నది.

"కౌగిలిచ్చుకుందామంటె-కడుపూలబల్లవదినె
కండ్లచూస్తామన్న కండ్లొచ్చెనాయివదినా" 249 పే.

ఇట్లువదినా, మరదళ్ల హాస్యోక్తులను, పరిహాసోక్తులను తెలుపు జాతీయాలెన్నియో కలవు.

భర్తకంటె ప్రియునకే గౌరవమిచ్చె గడుసుస్త్రీలు ఉన్నారనుటకు నిదర్శనంగా ఈ క్రిందిపంక్తులను పేర్కొనవచ్చును. జీవితానుభవాన్ని కాచి వడబోసినట్లుగా సూటిగా తెలుపు జాతీయాలుగా వానిని పేర్కొనవచ్చును.

"ఇంటిమగనికి ఈతకల్లు
బైటిమగనికి తాటికల్లు
నడుమదిరిగే కుంటెనకానికి
కందుకూరికషాయిసార"

ఈతకల్లుకంటె తాటికల్లు నాణ్యంలో కొంతతక్కువ. శ్రేష్ఠమైన ఈతకల్లును బయటివానికే ఇచ్చినదని భావము. ఇవిచాలదన్నట్లుగా వీరివురికంటెను నడుమదిరిగే కుంటెనకాడు (Broker లాంటివాడు) మరింత అదృష్టవంతుడు. అతనికి విలువైన కషాయిసార ఇచ్చినది.

అట్లే

"ఇంటిమొగనికి యెడ్లబండి
బైటిమొగనికి గుఱ్ఱాలబండి
నడుమదిరిగే కుంటెనకానికి
చెన్నపట్నం రైలుబండి" 254 పే.

అదొక్కటే చాలదన్నట్లుగా

"ఇంటిమొగుడు పైనంబోతె
ఈతబరిగె చేతికిత్తు
బైటిమొగుడు పైనంబోతే
బంగరికచ్చుల బల్లెమిత్తు" 249 పే.

పైనం అనగా ప్రయాణము. పూర్వము ప్రయాణమునకు వెడలేముందు చేతిలో ఒకకర్రనుంచుకొనుట ఒక ఆచారం. "పెరటిచెట్టు మందుకు పనికిరాద" న్నట్లుగా భర్తఅంటే గౌరవం లేదేమో.

భర్తకష్టాలలో పాలుపంచుకొనెడి భార్యలు ఉన్నారనుటకు నిదర్శనంగా

"పెరువెన్కసేనుగొను బాలోజిగౌడా
సెవులగంటీలమ్మికద్దు బాలోజిగౌడాను" 256 పే.

పేర్కొనవచ్చును. చెరువువెనక పొలము సంవత్సరమునకు మూడుపంటలనిచ్చును. చెవులగంటీలు స్త్రీకి ప్రియమైన ఆభరణాలు. సామాన్యంగా ఏస్త్రీకైనను బంగారమనిన మోజెక్కువ. కాని ఇచ్చట సారవంతమైనభూమి కొనుగోలుకై తన శరీరంపైనున్న బంగారాన్ని అమ్ముటకు సిద్ధపడెననగా చేనువిలువతోబాటు, భర్తకష్టాలలో పాలుపంచుకొనవలెననే మనస్తత్త్వం తెలియుచున్నది.

"ముసలోడుమొగుడైనమూతిపుండైన
పొత్తునాతినుమంచునిత్తెపోరాడు" 257 పే.

ముసలివాడితోపొందు, మూతిమీదిపుండువలె అనర్థదాయకమని భావం. పడుచు పెళ్లాన్ని నమ్మలేక కలసితినుమనియే బాధించును. ముసలివారితో బాధపడే పడుచు పెళ్లాలదీనావస్థను తెలుపుచక్కని సామెత.

"విలబడూముసలమ్మకూడిపోదాము
సుద్దబొండలకాడసద్దితిందాము" 257 పే.

వృద్ధాప్యంలో భార్యాభర్తలు అన్యోన్యంగా కలసి ఉండవలెననే భావాన్ని మనోజ్ఞంగా తెలుపు సామెతగా ప్రయోగించవచ్చును

ఇట్లు కుటుంబజీవనములో హాస్యమునకు దర్పణములనదగిన సామెతలను పరిశీలించుటైనది.

## 7) బాధ (వేదన)ను తెలుపు సామెతలు :

ఎవరిజీవితంలోనైనా హాస్యంకంటె బాధలపాలే ఎక్కువ. ముఖ్యంగా గ్రామీణుల జీవితంలో అది మరీ ఎక్కువ అని చెప్పవచ్చును.

"కాముపులేదని - కలతపడినేమంటె
కాళ్లల్లోసీ పిల్లి - కలబలుకునేమో" 261 పే.

అసలే బాధలోవున్న తనకు అపశకునములెదురై మరింత బాధను కలిగించి

నదని భావం. బాధలన్నీ కలసికట్టుగా వచ్చునన్న సత్యాన్ని తెలుపు సామెతగా ప్రయోగింపవచ్చును.

"మన్నంగ తలదువ్వి నూగాయ జడవేసి
సొందుపెంబడి బోతువుంటె సందమామనుకొంటి" 272 పే.

"సందమామనుకొంటి" అనునది మనోజ్ఞమైన తెలుగు పలుకుబడి. అలంక రణంలో అమ్మాయి అందము ఇనుమడించుననుటకు నిదర్శనంగా పైవాక్యం పేర్కొనవచ్చును.

"యింటిలో మగదిక్కులేక యెద్దులిడిసే దిక్కులేక
సాకిరేవు బ ద్లకాడ కాకిశోకంజేసెనన్నా" 274 పే.

ఏ స్త్రీకైనా పురుషునితోడవసరమని తెలుపుచున్నది.

అస్లే

"వొంటిగాణ్ణికొట్టేదెందుకే వూరూరకూడెందుకే
మంచాలు యెక్కెదెందుకే లంచాలు తినేదెందుకే" 274 పే.

స్త్రీకి పురుషుడెంత అవసరమో, పురుషునకు స్త్రీ కూడ అంతే అవసరము. లోకరీతిని చాలా సమాజంగా తెలుపు జాతీయంగా పేర్కొనవచ్చును.

"తొక్కే సైకిలుబాయె తిరిగే కారూనుబాయె
యెద్దులబండి మనకొచ్చెనయ్యో కొడుకా వెంకట్రామిరెడ్డి" 280 పే.

ఒకప్పుడు సుఖాలలో తేలిపోయి, తర్వాత కష్టాలపాలైన వ్యక్తి జీవితచరిత్రను తెలుపుచున్నది. 'కలిమిలేములు కావడికుండల'నెడు భావాన్ని తెలుపు జాతీయంగా నెంచవచ్చును.

"సుద్ద బొందలకాడ నీ
సుద్దివియ్యంగానే
సుద్దితిన్నట్టాయెనే సిలకా" 289 పే.

ప్రేయసీ ప్రియుల సంబంధాన్ని మనోజ్ఞంగా తెలుపుగేయం. జానపద సాహిత్యంలోని పలుగేయపంక్తులను జాతీయాలుగా ప్రయోగించవచ్చును. సుద్ది-

అనగా స్మృతి అని అర్థము-ఆమె జ్ఞాపకానికి వచ్చినంతనే తాన్నన్నంతిన్నంత అనందాన్ని పొందెనమటవలన ఆమెపైఎంతటి ప్రేమను కలిగియుండెనో తెలియుచున్నది.

"కారీనరక్తమంతా - కడవల్లా నింపుకోని
చిల్లీన రక్తమంత - సీసల్ల నింపుకోని
హైకోర్టుకు పోతరు కొడకో" 292 పే.

కొడుకును కోల్పోయి దీనంగా విలపించే ఒక మాతృహృదయావేదన కాననగును కోర్టులలో న్యాయం తొందరగా, తేలికగా లభించదను అంతరార్థాన్ని సూచించు జాతీయంగా పేర్కొనవచ్చును.

జానపద సాహిత్యంలోని ఉపమానములన్నీ నిత్యజీవితానుభవంలోనివే. అందువలననే స్వచ్ఛంగా, నిత్యనూతనంగా ఉండును.

## 8) పారమార్థికదీమునకు సంబంధించిన సామెతలు :

భారతీయులు ఇహముకంటె పరానికే ఎక్కువ ప్రాధాన్యమునిచ్చిరి. ఎవరు చేసుకున్న పుణ్యం మాత్రమే వారిని కాపాడునని హిందువుల నమ్మకం.

"చేతిలో బెల్లం ఉన్నంతసేపూ కాకిబలగమంట" 296 పే.

"తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలుచేరు"నని సుమతీ శతక కారుడు తెలిపెను. 'కాకిబలగమ'ునది గొప్ప తెలుగుపలుకుబడి. సామెతగా ప్రయోగింపవచ్చును.

"ఏడ్చేరూ ఆర్చేరుగాని యెవరూరారువెంట" 296 పే.

ప్రపంచములో ఎవరైనను ఒంటరిగా జన్మించి, ఒంటరిగానే మరణించెదరు. బంధాలన్నీ మధ్యలో ఏర్పడినవే. జీవన సారాన్ని తెలిపే ఒక గొప్ప సామెతగా భావించవచ్చును.

"నీళ్లుపోసి కూర్చుండబెట్టిరీ మాయబొమ్మనంట" 296 పే.

మానవశరీరమొక మాయబొమ్మ అని జానపదుల భావన. శంకరాచార్యులవారి మాయాసిద్ధాంతమును తలపించుచున్నది. ఒకసామెతగా ప్రయోగింపవచ్చును.

ధన ధాన్యము తాయెవరి పదార్థము
ధర్మముతనవెంటా
చేసినపాపము చేసినపుణ్యం
వచ్చునుతనవెంటా" 297 పే.

పాప పుణ్యాలు మాత్రమే గణింపబడునని తెలిపే గొప్పలోకోక్తిగా చెప్పవచ్చును.

"భూతి పూసినవాడు లింగడూ
తులసిమాల వేసినవాడు రంగడూ" 300 పే.

శైవ, వైష్ణవుల గుర్తులను తెలుపుచున్నవి.

"తోలుకట్టినవాడు లింగడూ
పట్టుశాలువ కట్టినవాడు రంగడూ" 300 పే.

శివుడు తోలునుధరించువాడనీ, పీతాంబరాన్ని ధరించినవాడు విష్ణువనీ భావం.

"ఎద్దునెక్కినవాడు లింగడూ,
బొల్లిగ్రద్దనెక్కినవాడు రంగడూ" 301. పే

శివుడు వృషభాన్ని అధిరోహించగా, శ్రీమహావిష్ణువు గరుడారూఢుడైనాడని భావం. శైవ, వైష్ణవుల ప్రత్యేకతలను తెలుపు జాతీయాలుగా పైవానినెన్నవచ్చును.

"పంజరాల పావమ్మకొక్కడే ముత్యమ్మ" 302 పే.

పాతభూయిష్టమైన శరీరములోనున్న ఆత్మ ఒక్కటే ముత్యమువంటిదని భావము. "పంజరాల పావమ్మ" అనునది చక్కని తెలుగు పలుకుబడిగా చెప్పవచ్చును.

"ఆత్మలో పరమాత్మయున్నాడు బసవా" 304 పే.

ఆత్మలోనే పరమాత్మ ఉన్నాడనీ, అతనికొరకై వేరేచోట వెదకవలసిన అవసరము లేదనీ తెలిపే గొప్ప పారమార్థిక సామెతగా చెప్పవచ్చును.

"యిల్లువాకిలిరోసి యిల్లాలికడరోసి
యిడుపులేగతి ఆయెరో లింగయ్యా" 306 పే.

సతీదేవిని కోల్పోయిన శివుడు హిమాలయ పర్వతంపై ఉండి తపస్సు చేయ

దొడగెను. సుఖములన్నీ నశించెను, ఇంటిని, భార్యాపిల్లలను వదలినవాడు సుఖపడ డని భావం.

"కండ్లులేనివాడు చూచే
చేయిలేనివాడు కోసె" 321 పే.

భగవంతునిదయ ఉన్న యెడల కళ్లులేనివాడుకూడ చూడగలడనీ, చేతులులేని వాడు సైతం పనులుచేయగలుగునని భావం. భగవంతునిదయ ఉన్న యెడల ఏకార్యా న్నైనా చేయగలరని భావం.

"ఆలికడుపున మొగుడుబుట్టె
మొగనికడుపున ఆలిబుట్టె" 321 పే.

భర్తయే స్త్రీకి కుమారునిగా జన్మించుననీ, కూతురే భార్య ప్రతిరూపమనీ హిందువుల నమ్మకం. అనగా భార్యాభర్తల ప్రతిబింబములే వారి సంతానమని భావం.

"చింతచెట్టు కొనలమీద చిలుక ఉన్నదీ.
చిలుకపొట్టలోన బంగరు పలుకులున్నవీ" 324 పే.

మానవుని పుట్టించేది, జీవింపజేసేది ఒక అపూర్వమైన, ఎవరు తెలుసుకొనలేని శక్తియేనీ పైవాక్యం తెలుపుచున్నది. "చింతచెట్టు" శరీరాన్ని సూచించగా "చిలుక" ప్రాణానికి సంకేతమై ఉండును. చిలుకలోని బంగరుపలుకులనునవి. ఆత్మ రూపం గానెంచవచ్చును. గొప్ప పారమార్థిక సత్యాన్ని మామూలుమాటలలో చెప్పుట జానపదుని ప్రత్యేకత.

ఇట్లెన్నెని ఉదహారణములను ఇవ్వవచ్చును. భారతీయ జీవనంలో అంతర్నిహితంగా ఉండిన వేదాంత భావనగా గైకొనవచ్చును.

## 9) ఇతరములు :

"కానివారితోను కావించు చెలిమి
కట్టె విరిచే పొయిని పెట్టినట్లుండు" 333 పే.

తనకు సరిపడని వారితో స్నేహం చేయకూడదని భావం. అటువంటిస్నేహం అనవసరమైన భేదాభిప్రాయాలకు మాత్రమే దారి తీయునని భావం.

"అయినవారితో కావించు చెలిమి
ఆకు మడచీ మడతపెట్టినట్లుండు" 333 పే.

ఆప్తులతో స్నేహం అభిప్రాయ భేదాలకు తావివ్వదు. ఆకు మడచీ మడత పెట్టినట్లుగా వారి స్నేహము దినదినాభివృద్ధియగును.

"కాని వారీ మనసు కంట్లోది నలుసు
ప్రాణం పోయిందాక పక్కలో పోటు" 333 పే.

"కంట్లో నలుసు" "ప్రక్కలో పోటు" అనునవి తెలుగు పలుకుబడులు-చెడువారితో స్నేహము కూడదని భావం.

"అయినవారీ మాట అమృతంపు తేట
బ్రతికి ఉన్నందాక భాగ్యంపు మాట" 333 పే.

జానపద సాహిత్యమంతయు సామెతలకు నెలవు. కొన్ని జానపద గాథలు సామెతలను ఆధారం చేసికొని జనించగా, కొన్ని జానపద కథలనుండియే ఉద్భవించినవి.

జానపద సాహిత్యం మౌళికముగా మౌఖిక ప్రచారాన్ని ఆధారం చేసికొనినది కావున, మౌఖికానికి సామెతలే మిక్కిలి అనువైనవి కాబట్టి జానపద సాహిత్యంలో సామెతలు కోకొల్లలని చెప్పవచ్చును.

జానపద సాహిత్యంలో సామెతలను ప్రత్యేకంగా వింగడించుట కష్టం. మొత్తము సాహిత్యం సామెతలకు నెలవు అనియే చెప్పవచ్చును.

పై అభిప్రాయాన్ని దృష్టిలో వుంచుకొనే ఈ అధ్యాయాన్ని ముగించుట జరిగినది.

# ఆధునిక సాహిత్యములో సామెతలు

సామెతల ముఖ్య ఉద్దేశ్యం పామరులకు నీతిని నేర్పుటే అందువలననే సామెతలను పండితులు జానపద సాహిత్యంలోని ప్రక్రియగా పేర్కొనిరి. నాగరికత పెరిగిన కొద్దీ సామెతల ప్రయోగం తగ్గుచున్నదనుటకు ఉదాహరణంగా నేటి సాహిత్యాన్ని పేర్కొన వచ్చును. ప్రాచీన సాహిత్యమును, నేటి సాహిత్యము పరిశీలించి చూసినచో, ఆధునిక సాహిత్యంలో సామెతల ప్రయోగం తక్కువనే చెప్పవచ్చును.

ఆధునిక సాహిత్యంలో సామెతలు, ముఖ్యంగా వారపత్రికల వలనగాని లేదా ఏ పండితుని వలనగాని లేదా రాజకీయ నాయకుని విశేష సంభాషణా చమత్కృతి వలనగాని ఏర్పడి యుండవచ్చును.

ఆధునిక సాహిత్యంలో కాని, వ్యవహారంలో కాని సామెతల ప్రయోగం తక్కువనుటకు ఈ క్రింది వాక్యాలనే నిదర్శనంగా గైకొనవచ్చును.

[1]మరి ఈ కాలంలో సామెతను వాడుకోవటం చాలావరకు తరిగిపోయింది.

మన తరంవారికి సామెతను వాడుకునే సమయంలేదు. అసలు సామెత నోటికి వచ్చిన వాళ్లే తక్కువ. ఒకవేళ వచ్చినా, దానిని వాడుకొనే తీరుబాటు కానీ, సద్యః స్ఫూర్తిగానీ, నేటి యాంత్రిక జీవనంలో కానరావటంలేదు."

వార్తాపత్రికలలోగాని, వారపత్రికలలోగాని వచ్చే సూక్తులు చాలావరకు అనువాదాలే అని చెప్పవచ్చును. వివిధ భాషలలోని ముఖ్యమైన వాక్యాలను అనువాదము చేసి సూక్తులుగా వేయుట వార్తాపత్రిక ప్రచార సాధనాలలో ఒకభాగమై పోయింది.

ఉదాహరణమునకు "ఆంధ్రజ్యోతి" వారపత్రికలోని సూక్తులను పరిశీలించెదము.

---

1. సామెత... సి. వేదవతి (18వ పే.)

1) "శాసన సభ్యుడు తన ఓటర్లకన్నా తెలివి తక్కువవాడు కారాదు. వారు తెలివి తక్కువవారు కాబట్టే అతన్ని ఎన్నుకున్నారు.

— బెర్ట్రాండ్ రస్సెల్

2) "అందరిచేత మెప్పులు సంపాదించుకునేవాళ్లు సర్వనాశనమైపోతారు. సర్వనాశనమై పోయినవారినే లోకం మెచ్చుకుంటుంది"

— మార్కస్ ఆరిలియస్

3) విమర్శకుడంటే తన గడియారాన్ని ఇతరుల గడియారాలకంటె అయిదు నిమిషాలు ముందు పెట్టుకొనేవాడు.

— సెయింట్ బెల్.

4) ఆశతో జీవితం గడిపేవారు ఉపవాసాలతో మరణిస్తారు.

- ఫ్రాంక్లిన్

5) ఉత్తముల్ని వివేకం, మధ్యముల్ని అనుభవం, అధముల్ని అవసరం, జంతువుల్ని స్వభావం నడిపిస్తాయి.

- సిసిరో

6) కష్టపడడంకాదు, పరులకోసం కష్టపడడం తేనెటీగ గొప్పదనం.

- జాన్ క్రిసోస్టమ్

7) బ్రహ్మాండమైన తప్పులు ఎన్నో చేసినతర్వాత గాని ఎవరూ ఎప్పుడూ గొప్పవారు కాలేరు.

- గ్లాడ్‌స్టన్

8) ఒక పౌను చదువుని ఆచరణలో పెట్టడానికి పది పౌన్ల లోకజ్ఞానం కావాలి.

- పర్షియన్ సామెత

9) మూర్ఖునితో చెలిమి కత్తిని కౌగలించుకోవడం.

- బెంజమిన్

10) విరిగిపోవడంకంటె వంగిపోవడం మేలు.

- స్కాట్లండ్ సామెత

11) లక్ష్యాన్ని మరచిపోవడం విజయానికి కీలకం.

- బెంజమిన్ డిజ్రేలి

అనువాదములే కాక కొన్నిసామెతలను కూడ పత్రికలు సృష్టించినవి. ఏది ఏమైనను ఆధునిక సాహిత్యములో సామెతల సృష్టి, ప్రయోగము రెండును తక్కువేనని చెప్పవచ్చును.

ఆంధ్రజ్యోతిలో "ఈవారం సూక్తి" పేరవెలువడిన కొన్నిసూక్తులను ఉదాహరణంగా గైకొని ఈ అధ్యాయమును ముగించెదను.

"అలంకార శాస్త్రంచదివి మరీ ఆవడలు చెయ్యమన్నాట్ట."

ఆంధ్రజ్యోతి - 30-7-82

చాదస్తుల లక్షణమును తెలుపునది. ప్రతిదానికి శాస్త్రప్రమాణము కావలెనను వింతలక్షణముకల వారినిగూర్చి తెలుపునది.

"విలువైనది కొత్తదికాకపోవచ్చు - కొత్తదంతా విలువైనది కాకపోవచ్చు

ఆంధ్రజ్యోతి - 9-7-82

పాతకొత్తలమేలు కలయిక అవసరమని భావం. మంచి కేవలం కొత్తదో లేదా పాతదో కాదు. మంచి లక్షణములే మంచిని సూచించును.

"అయిష్టంవేరు - అసహ్యంవేరు. నీకు ఇష్టంలేని వ్యక్తులను అసహ్యించు కోవలసిన అవసరంలేదు. వారినిగురించి ఎక్కడా ప్రస్తావించడం మానేస్తేసరి."

- ఆంధ్రజ్యోతి - 16-7-82

ఏదిఏమైనను ఆధునిక సాహిత్యంలో సామెతల సంఖ్య తక్కువనియే చెప్ప వచ్చును. అందువలననే పలు ఉదాహరణములను ఇవ్వలేకపోయితిని.

# -: సామెతలు - విశేషాంశములు :-

*ఈ క్రింది విశేషాంశములను గూర్చి పరిశీలించెదము*

1) సామెతలు - మనస్తత్త్వ పరిశీలనము.
2) భాషావిశేషములు.
3) సామెతలు - కథలు.
4) ఇతర భాషలలోని సామెతలు.

## 1) సామెతలు — మనస్తత్త్వ పరిశీలనము.

సామెతలెందుకేర్పడినవనుటకు ఈ క్రింది కారణములను పేర్కొనవచ్చును.

1) సూటిగా, అర్థమగు రీతిలో విషయాన్ని తెలుపవలననే ఆకాంక్ష.

2) సూటిగా భావాన్ని తెలుపదలచినప్పటికి, అసలు విషయాన్ని మరుగుపరచి మరొక వస్తువునుదాహరణంగాగైకొని తెలిపినబాగుండును అను ఆలోచనవలన,

3) ఒకేమాటలోగాని, ఒకే వాక్యంలోగాని వీలైనంత ఎక్కువ విషయాన్ని తెలుప వలెను అనే ఉత్కంఠ.

4) తాను పొందిన అనుభవాన్ని తన తోటివారికి ఆనందం, ఆశ్చర్యాన్ని కలిగించే విధంగా తెలుపవలెననే కోరిక.

5) పామరులకు సైతం అర్థమయ్యేరీతిలో వాక్య నిర్మాణముండవలెనని తలంచుట.

6) అలంకారయుక్తమై, మనస్సునకు హత్తుకు పోవునట్లుగా తెలుపవలెననే ఆకాంక్ష.

పై కారణములలో కొన్నిగాని, అన్నిగాని సామెతలేర్పడుటకు అవకాశమును కల్పించియుండవచ్చును.

మానవస్వభావములో ఒక ప్రత్యేకత ఉన్నదని చెప్పవచ్చును. తనకు తెలిసిన విషయాన్ని పరులకు తెలుపవలెననే తపన కలవాడు మానవుడు. తనకు కలిగిన జయాపజయానుభవములను గూర్చి అతిశయోక్తులతో తనవారితో తెలుపుకొనే ప్రవృత్తికలవాడు. అట్లే. సుఖదుఃఖాలను, వానికిదారితీసిన పరిస్థితులను తనతోటి

వారితో తెలుసుకొనే మనస్తత్వము మానవునిలో ఉన్నది. అట్లు తెలిపేసమయములో కొంత వినూత్నత్వాన్ని, చమత్కారాన్ని మేళవించి తన ఉద్దేశ్యాలను సొగసుగా తెలుపుకొనే గుణంకలవాడు మానవుడు.

సామెతలు ఆధునిక సాహిత్యంలోకంటె ప్రాచీన సాహిత్యంలోను, జానపద సాహిత్యంలోను కనబడుటకు కారణములు, మానవుని సాంఘిక జీవనములో వచ్చిన మార్పులేయని చెప్పవచ్చును.

ఆధునిక కుటుంబవ్యవస్థతో ప్రాచీన కుటుంబ వ్యవస్థనుపోల్చినను లేదా నాటి జీవన శైలిని, నేటి జీవనశైలి పరికించినను కారణములు తెలియనగును.

పూర్వసమాజంలో ఉమ్మడి కుటుంబవ్యవస్థ ఉండేది. కావున అత్తాకోడండ్రకు, భార్యాభర్తలకు, అన్నదమ్ములకు, అత్తా అల్లుండ్రకు, అత్తమామలకు, తల్లిదండ్రులకు, వదినెమరదళ్లకు, బావామరదులకు, బావామరదళ్లకు- ఇట్లు ప్రతివారికిని సంబంధించిన సామెతలెన్నో ఏర్పడుటకవకాశముండెను. కాని ఆధునిక సమాజములో కుటుంబవ్యవస్థ చాలావరకు మార్పునొందినది. నేడు ఎచ్చటచూచినను చిన్నకుటుంబములే కాననగును. ఉమ్మడి కుటుంబవ్యవస్థ దాదాపు మృగ్యమనే చెప్పవచ్చును. బ్రతుకుతెరువునకై ఉద్యోగి తనవూరును, కన్న తల్లిదండ్రులను వదలి, ఒక్కొక్కమారు భార్యాసమేతుడై, ఒక్కొక్కమారు ఒంటరివాడై వేరే గ్రామమునకో, పట్టణమునకో వెడలవలసి వచ్చుచున్నది. పరిమితకుటుంబ ఆవశ్యకతవలనను, పెరిగిన ధరలవలనను భార్యాభర్తలు, వారిపిల్లలు అదికూడ ఒక్కరిద్దరు మాత్రమే ఒక కుటుంబములో ఉండుట గమనించుచున్నాము. అదీగాక భార్యాభర్తలు ఇరువురు ఉద్యోగం చేయునెడల వారికి తీరికగా మాట్లాడుకొనే అవకాశము సైతం మృగ్యమని చెప్పవచ్చును. పైవానికితోడు అధికధరలు, ఆకాశమునంటుచున్న ఇంటిబాడుగలు మొత్తం కుటుంబమంతా ఒక ఇరుకుగదిలో ఉండవలసిన పరిస్థితిని కల్పించుచున్నవి. కావున సంభాషణమంతా పొడి, పొడిమాటలకే పరిమితమై, తానుపనిచేసే కార్యాలయంలోని అవకతవకలన్ను గూర్చి చర్చించుటకొరకో లేదా తాను పొందబోయే చిరు ప్రమోషన్ల చర్చకో పరిమితమగుచున్నది. కావున అందంగా సంభాషించుకొనుటకు అవకాశం దాదాపు లేదనే చెప్పవచ్చును. అట్టి సమయములో సామెతలు ఉప్పవించుటకు అవకాశమెక్కడిది?

అట్లే సంఘజీవనాన్ని గమనించినప్పటికిని ఈభేదం ప్రస్ఫుటంగా కనబడుచున్నది. ఈనాటి పల్లెజీవనమునకు, పాతకాలపు పల్లెజీవనానికి చాలా భేదమున్నది.

పట్టణాలలోని సంగతి చెప్పుటకే వీలులేదు. ఎవరికివారే యమునాతీరే-చాలా సందర్భాలలో ప్రక్కయింటిలో నివసిస్తున్నవారెవరో తెలియకపోవుట, వారేమిచేసినను మన కెందుకులే అనే నిర్లిప్తతాభావముండుట అందరకును అనుభవమే. పల్లెప్రజలలో సైతం పాతకాలపు ప్రేమలుగాని, ఉమ్మడిగా ఏవిషయాన్నైనా కలసి చర్చించుకొనే మనస్తత్వంగాని నేడు లేవనియే చెప్పవచ్చును. చర్చల అనంతరం పెద్దల మాటలను పాటించి వారి అభిప్రాయాలకు గౌరవమివ్వవలెనను తలంపు వచ్చుటకవకాశమేలేదు. బదులుగా ఈనాటిపల్లెలు పార్టీపరమైన భేదాలతో, పరస్పర వైషమ్యాలతో, రాజకీయ కక్షలతో కుళ్లిపోవుచున్నవని చెప్పవచ్చును.

పై సన్నివేశాలను ఆధునిక సాహిత్యంలో సామెతలుద్భవించకపోవుటకు కారణాలుగా పేర్కొనవచ్చును. ప్రశాంత జీవనములోనే సామెతలు ఉదయించుటకవకాశమెక్కువేమో.

## 2) భాషావిశేషములు:

సామెతలు జనసామాన్యములో నలిగిపోయిన పదబంధాలు. ఒక భావమును స్పష్టంగా చెప్పదలచుకొనినపుడు సామెతలనుపయోగించుట సర్వసామాన్యం.

సామెతలలో సమతాభావముండునని సంపత్కుమారాచార్యులు గారు అభిప్రాయపడిరి. సామెతలు సామాన్యంగా ఉపమ, దృష్టాంతాది అలంకారభరితములై ఉండును. సర్వాలంకారములకు భూషణమనదగిన ఉపమాలంకారయుక్తమైన సామెతలేఎక్కువ.

కొన్ని ఉపమానములు సామెతలవలె భాసించును, కాని సామెతలు కావు. సామెతలను గుర్తించుటలో జన సామాన్య ప్రయోగమునే కొంతవరకు ఆధారంగా గైకొనవచ్చును.

భాషావిశేషములను ఈక్రింది విధంగా తెలుపవచ్చును.

(i) సామెతలలో సమత ఉండును.

సామాన్యంగా సామెతను రెండు దళములుగా విభజింపవచ్చును.

"అంబలి తాగేవానికి
మీసాలెత్తేవాడొకడు"
"అంగట్లో అన్నీ వున్నాయి!
అల్లునినోట్లో శని వుంది"

"చంకన పిల్లనెత్తుకొని!
ఊరంత తిరిగినట్టు"

పై సామెతలను పరిశీలించిన రెండు దళములు సుస్పష్టముగా కనిపించును.

"అంబలి తాగేవానికి" ఒకభాగము కాగా
మీసాలెత్తేవాడొకడు" అనునది రెండవ భాగమగును.

అట్లే తక్కిన సామెతలలో సైతం దళవిభజనం కనపడుచున్నది. సామెత లను పలుకుటలో ఒక లయ కూడా కాననగును. ఆ 'లయ'యే సామెతకు ప్రాణమని చెప్పవచ్చును. పై సామెతలను పరిశీలించిన ఆ విషయం తెలియును.

**(ii)** సామెతలు ముఖ్యంగా పోలికను ఆధారం చేసికొని వుండును.

ఉపమాలంకారము గాని, దృష్టాంతాలంకారము గాని సామెతలలో ఎక్కువగా గోచరించును. ఒక్కొక్కప్పుడు వ్యాజస్తుతో లేదా వ్యాజనిందో లేదా అతిశయోక్త్యలంకారమో వానిలో కనబడును.

వివిధ అలంకారములకు ఉదాహరణంగా ఈ క్రింది సామెతలను ఉదాహరణగా పేర్కొనవచ్చును.

"చెప్పుదినెడి కుక్క చెరకు తీపెరుగునా"
ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు"
"రామునివంటి రాజుంటే, హనుమంతుని వంటి బంటు వుండును"
"ఎద్దునెక్కినవాడు శివుడు, గద్దనెక్కినవాడు విష్ణువు"
"అందచందం లేని మగడు మంచమునిండా ఉన్నట్లు"

**(iii)** సామెతలలో ప్రయోగింపబడు బాష అందరకు అర్థమగు రీతిలో నుండును.

అందరకు అర్థముగానట్లయితే దానిలో స్వారస్యమే ఉండదు. పైపెచ్చు "సామెత" జానపద సాహిత్యంలోని ఒక ప్రక్రియ. కావున, జానపదులకిందుబాటులోనున్న భాషలో ప్రయోగింపబడిన సామెతకే విలువ ఎక్కువయని చెప్పవచ్చును.

"ముప్పయ్యేళ్లు సాముజేసి, మూలకున్న ముసలమ్మను కొట్టినట్లు"

"కడివెడంత గుమ్మడికాయైనా, కత్తిపీటకు లోకువే"

మొదలగు సామెతలను పరిశీలించిన యెడల సామెతలలోని పోలికలన్నీ సామాన్య ప్రజలకర్థమయ్యే భాషను కలిగియుండునని తెలియుచున్నది.

**(iv) సామెతలు సమాజములోనున్న మంచి చెడులను తెలిపి, మానవులకు హితబోధ సేయును.**

సామెతలలో ఎక్కువ భాగము నీతి బోధకములనే చెప్పవచ్చును. కావుననే శతకములలోని పద్యపాదములు చాలావరకు సామెతలుగా ప్రసిద్ధి పొందినవి. సామెతల ముఖ్య ఉద్దేశ్యం సైతం సమాజమునకు హితబోధను ఒనరించుటయే.

"అందరూ శ్రీవైష్ణవులే, బుట్టెడు రొయ్యతేమైనట్లు"
భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు"
"డబ్బువ్వనివాడు బండి ముందెక్కును"

మొదలగు సామెతలను పరిశీలించినచో సమాజమునకు ఉపయోగపడుతూ, హితబోధ సేయుటే సామెతల ముఖ్య ధర్మమని తెలయుచున్నది. సామెతలలో ఎన్నియో లౌకిక సత్యాలు కానవగును.

## 3. సామెతలు - కథలు :

సామెతలలో కథలు - కథలలో సామెతలు కానవగును. కొన్ని ప్రసిద్ధములైన కథలను ఆధారం చేసికొని సామెతలు ఏర్పడగా, కొన్ని సామెతలను ఆధారం చేసికొని కథలు ఏర్పడెనని చెప్పవచ్చును.

సామెతలను ఆధారం చేసికొనిన కథలను పరిశీలింతము.

## నవ్వు నాలుగు విధాల చేటు

*రామాయణ కథకు సంబంధించినది*

సీతారాముల పట్టాభిషేక సమయములో లక్ష్మణుడకస్మాత్తుగా నవ్వెను. ఆ నవ్వు అచ్చట నున్నవారిలో రకరకాల అనుమానాలకు తావిచ్చెను.

పదినెలలు లంకలో వున్న సీతను, తాను భార్యగా మరల స్వీకరించినందు వలన నవ్వుచున్నాడేమోనని శ్రీరాముడు తలంచును.

లక్ష్మణుని నవ్వు, సీతకు లక్ష్మణుని శీలముపై శంకను కలుగజేసెను.

పట్టాభిషేకాన్ని చూచుటకై వచ్చిన ప్రజలు శ్రీరామునవహేళన చేయుటకే నవ్వారని భావించిరి. శ్రీరాముని పట్టాభిషేకం రాముని గొప్పదనం కాదనీ, లక్ష్మణుడే లేకున్నయెడల రామునకు రావణుని గెలుచుటకవకాశమెక్కడిదనే ఆలోచనను కలిగింపజేయును.

కాని లక్ష్మణుడు నవ్వుటకు పై కారణములేవి సరియైనవి కావు. ఆ విషయం తనకు తెలియును. అరణ్యానికి రామునితో వెడలునప్పుడు ఊర్మిళాదేవికి తన నిద్ర నిచ్చి, తాను మరల అయోధ్యకు వచ్చినప్పుడు ఆమె నిదురను గైకొనెను. ఇన్నాళ్లు తాను చూడని భార్య ఈనాడెదురుగా ఉన్నను అతడందువలన చూడలేకపోయెను. అదిగాక శ్రీరామ పట్టాభిషేకాన్ని తమ కన్నులకరవుదీరునట్లుగా ప్రజలందరు చూచు చుండగా, ఏ పట్టాభిషేకాన్ని కనుటకై తానిన్నాళ్లు తపించెనో, అట్టి ఉత్సవం తన కళ్లఎదుట జరిగినను తాను చూడలేకపోవుచున్నానని తనలో తానే బాధపడి, విధి విలాసమునకు ఆశ్చర్యముతో నవ్వెను. తనకిలా నిద్ర అడ్డువచ్చుచున్నదని విచిత్రం గా నవ్వుకొనెను.

కాబట్టి ఎవరైనను సభా మర్యాదను పాటించవలెననే విషయాన్ని, అట్లు కానిచో అనుమానములు వచ్చుటకాస్కారముండుననీ పై సామెత తెలుపుచున్నది.

## పదింటిలో పదకొండు

శ్రీరాముడు సర్వసన్నద్ధుడై, రావణాసురునిపై యుద్ధమునకు సిద్ధపడ్డ సమ యంలో విభీషణుడు రాముని వద్దకు వచ్చును. అట్లు ఎదురుగా వచ్చు విభీషణుని జూచి, మాయావియైన రావణుడే ఏదైనా పన్నాగం పన్నినాడేమోనని హనుమంతుడు మొదలైన వీరులందరును తలంచి అతనిని చంపుటకు అనుజ్ఞ ఇవ్వవలసిందిగా శ్రీరాముని కోరిరి. కాని శ్రీరాముడు అట్టి పనినుండి వారిని నివారించును పది తలల రావణాసురుని చంపుటకు సిద్ధపడినప్పుడు ఈ పదకొండవ తలను సంహరించుట మాత్రము ఏమి కష్టమగునని వారిని నివారించును. నిజంగా విభీషణుడే మోసం చేయ దలచిన అతడే నష్టపోవునని రాముడు వారికి సర్దిచెప్పును. పదితలలను సంహరించు టకు సిద్ధపడినప్పుడు, పదకొండవ తలను సంహరించుట మాత్రం ఏమంత కష్టమగు

నని ఎదుకు ప్రశ్న వేయును. కష్టములలో నున్నవారికే మరిన్ని కష్టములు కలుగును. కావున బాధపడక కష్టములను ఎదిరించవలెనని భావం. నష్టములలో నున్నవారికి మరింత నష్టములు కలుగును. కాని అప్పుడే సద సద్వివేక విచక్షణ అవసరమని భావం.

## అశోకవనములో సీత

రావణునిచే బందీయై సీతాదేవి అశోకవనంలో ఎన్నో మానసిక వేదనలను అనుభవించును. ఏదో ఒక మిషతో రావణుడు మాటిమాటికప్పుటకు వచ్చుటో లేదా ఆమె తన మనస్సును మార్చుకొనవలసిందిగా తన పరిచారకులతో సందేశము ను పంపుటో చేయును. వానినన్నింటిని సీతాదేవి తిరస్కరించును. సీత మనస్సు రామునియందే లగ్నమగుట వలన, అశోకవనంలోనున్న సీతాదేవి చింతాక్రాంతయై ఉన్నదే కాని, సంతోషమునేమాత్రము పొందలేకపోయెనని భావం. అశోకవనం చాలా అందమైన ఉద్యానవనమైనను ఆమెకు సంతోషాన్ని ఇవ్వలేకుండెను. బాధలలో నున్నవారు సంతోషాన్ని అనుభవింపలేరని భావం. బాధలలోనున్న స్త్రీని "అశోక వనంలో సీత"వలె నున్నావనుట సర్వసామాన్యం.

## రామాయణములో పిడకల వేట

రామాయణ కథా కాలక్షేపం రసవత్తరముగా జరుగుచున్న సమయంలో ఎవరో అనవసర ప్రసంగములతో విసిగించగా, ఈ సామెత ఏర్పడి ఉండవచ్చును. లేదా కథకుడు విషయ గాంభీర్యతను దృష్టిలో నుంచుకొని ప్రేక్షకుల మనస్సును రంజింపజేయుటకై ఏదైనా ఒక పిట్టకథను చెప్పియుండవచ్చును. కథలో లీనమై పిట్టకథ అసలు విషయాన్ని మఱచిపోయి, దానినే మరింత పొడిగించి అసలు కథకే పుచ్చువాటిల్లే విధంగా మార్చుచున్న సమయంలో ప్రేక్షకుడొకడు లేచి "రామాయణం లో ఈ పిడకలవేట యేమిట"ని ప్రశ్నించి ఉండవచ్చును. ఆ విధంగా జనవ్యవహార ములో ఈ సామెత వ్యాప్తి చెందియుండవచ్చును.

## అడ్డబొట్టువాడు, నిలువుబొట్టువాడు తగవులాడి సత్రం తగులబెట్టినట్లు

అడ్డబొట్టు శైవాచారాన్ని తెలుపును. నిలువుబొట్టు వైష్ణవాచారాన్ని తెలుపును. ఈ సామెత వైష్ణవ, శైవ మతస్థుల భేదాభిప్రాయాలను తెలుపుచున్నది. వారిరువురు

పోట్లాడి, అందరకు లాభాన్ని కలిగించే సత్రమునే తగులబెట్టిరి. వారి మత భేదాలు మరియు మతాచారాలు ఇతరులకు ఏమాత్రం లాభమును చేకూర్చకపోగా, వారి చర్యలు మాత్రం సత్రమును ఆశ్రయించిన వారందరకు నష్టాన్ని కలిగించినవి. మత వైషమ్యములు మానవులకు అపకారము చేయుననే నిత్యసత్యాన్ని ఈ సామెత తెలుపు చున్నది. అది నిత్యసత్యమని చెప్పవచ్చును.

## అద్దెకు వచ్చిన గుఱ్ఱాలు అగడ్తలు దాటునా

పూర్వం రాజులలో పరస్పర వైషమ్యములు అధికంగా ఉండెడివి. వారు తమ రక్షణార్థము రాజ్యము చుట్టు బలమైన కోటగోడలను కట్టుకొనెడివారు. అట్టి కోట గోడలను దాటవలెననిన మంచి నైపుణ్యం గల గుఱ్ఱాల అవసరం గాని, శిక్షణ పొందని గుఱ్ఱములతో ప్రయోజనముండదు. పైపెచ్చు అద్దెకువచ్చిన గుఱ్ఱాల్లు ఆ పనిని అసలు చేయజాలవు. కావున నాసిరకమైన వస్తువుల కొనుగోలు చేసే సమ యంలో గాని, బలహీనులను రక్షణార్థం వియోగించిన సమయంలో గాని ఈ సామెత ప్రయోగము కాననగును.

## అమ్మాయి పుట్టింది అంటే ఆయువు సగ్గం కుంగినట్టే

సమాజంలోని వరకట్న సమస్యకు అద్దంపట్టే సామెత. తల్లిదండ్రుల మనో భావాలకు ప్రతీక అని చెప్పవచ్చును. ఆనాటికీ, ఈనాటికీ ఆడపిల్లల తల్లిదండ్రులు పొందే మనోవేదనను తెలుపుచున్నది.

## ఆర్జిలకు పనులుకావు, ఆశీర్వచనాలకు బిడ్డలు పుట్టరు

పరస్పరము తగవులాడుకొనిన నష్టమగునే కాని లాభమెన్నటికి కలుగదు. కేవలం అర్జీలు పెట్టుకొన్నంత మాత్రాన అధికారులు పనిచేయరు. అర్జీలను సరియైన పద్ధతిలో అధికారుల దృష్టికి తీసుకొని రాగలిగిననాడే పనులు నెరవేరును. అలాగే పెద్దల ఆశీర్వాదం అవసరమైనను, వారి ఆశీర్వచనముచే మాత్రమే పిల్లలు కలుగరు. ఏ పనికైనను భగవదనుగ్రహముతో పాటు, మానవ ప్రయత్నము అవసరమనే విషయాన్ని తెలుపుచున్నది.

## ఆవుల మళ్లించినవాడే అర్జునుడు

*మహాభారతానికి సంబంధించిన కథ*

అర్జునుడు బృహన్నల రూపములో విరటుని కొలువులో నుండును. విరటుని కుమారుడైన ఉత్తరులకు రథసారథిగా బయలుదేరును. అచ్చటనున్న సైనికులంద

రును అతని రూపాన్ని చూచి మొదట సందేహించెదరు. కాని ఉత్తర కుమారుడు సైన్యాన్ని చూచి పారిపోవుటకు సిద్ధపడగా, బృహన్నల అతనినాపి, అతనికిబదులుగా తానే యుద్ధంచేయ నిశ్చయించును. యుద్ధంలో కౌరవ సైన్యాన్నంతను ఓడించి, గోవులను గ్రహించుకొని తిరిగి విరాట నగరమునకు వెడలు సమయంలో అర్జునుడే బృహన్నల రూపములో వచ్చెనని కౌరవ సైనికులు తలంచిరి. అప్పటినుండియు "ఆవులను మళ్లించినవాడే అర్జునుడ"ను సామెత ఏర్పడినది. కేవలం మాటలలో గాక చేతలలో కార్యాన్ని చూపవలెనని భావం. మాటల కంటె చేతలు కష్టమని భావం.

## కంచెలేని చేను, కన్నతల్లిలేని బిడ్డ

కం॥ చులకన జలరుహతంతువు
చులకన తృణకణము దూదిచులకన సుమ్మీ
యిలనెగయు ధూళి చులకన
చులకన మరి తల్లిలేని సుతుడు కుమారా
[అనంతామాత్యుడు - భోజరాజీయము]

భోజరాజీయములో అనంతామాత్యుడు తల్లిలేని బిడ్డలను ఎంత చులకనగా ప్రజలు చూసెదరో కళ్లకు కట్టినట్లుగా వర్ణించెను. గోవు తన దూడకు చెప్పు నీతి బోధలోనిదే ఆ పద్యం. ఇది నిత్యసత్యం. సమాజంలో తల్లిలేని పిల్లలు ఎన్ని ఇబ్బందులపాలు కావలసి వచ్చుచున్నదో పై సామెత మనకు తెలుపుచున్నది. కంచె లేని చేను ఏ విధంగానైతే రక్షణ లేకుండా నశించిపోవునో, అట్లే తల్లిలేని పిల్లలు సైతం బాధలను పొందెదరని భావం.

ఇట్లు ఎన్నెని ఉదాహరణములను ఇవ్వవచ్చును. ప్రతి సామెత ఏదేని ఒక గొప్ప నీతి సందేశాన్ని తెలుపునదై ఉండును. దాదాపు ప్రతి సామెత వెనుక ఏదో ఒక కథ ఉండుటయో లేదా ఒక సమాజ అనుభవసారముండుటయో జరుగును. సమాజపు అనుభవసారమే సామెతయని చెప్పవచ్చును.

### 4. ఇతర భాషలలోని సామెతలు :

సామెతలు సార్వజనినమైన సత్యాన్ని తెలుపును. కావున ఇతర భాషలలో సైతం వానికి సమతుల్యమైన సామెతలు కలవు. ముఖ్యంగా తెలుగు భాషకు అతి సన్నిహితములైన ద్రవిడ భాషలలో గాని, భారతీయ భాషలన్నింటికి మాతృతుల్య

మైన సంస్కృత భాషలోగాని తుల్యమైన సామెతలెన్నో కలవు. అంతర్జాతీయ భాషయైన ఆంగ్లభాషలో సైతం తుల్యమైన సామెతలు కొన్ని గలవనుటకు నిదర్శనములున్నవి.

## 1) తెలుగు - తమిళము

1. తెలుగు : "దొంగను దొంగే పట్టాలి"
   తమిళము: తిరుడనై పిడుక్క తిరుడనే వేండమ్.

2. తె॥ తేలుకు పెత్తనమిస్తే తెల్లవార్లు కుట్టును
   తమి॥ లేలుక్కు మణియం కుడుత్తాల్ నిమిషత్తుక్తు నిమిషం కొట్టుం.

3. తె॥ జగమెరిగిన బ్రాహ్మణునికి జందెమేలా
   తమి॥ వొడరింద పార్పానుక్కు పూనుల్ వేశిడుమా

4. తె॥ కుంటి గుఱ్ఱానికి జారిందే సాకు
   తమి॥ నొండికుదురైక్కు షరిక్కినదుశాక్కు

5. తె॥ తగిలిన కాలికే తగులును, నొగిలిన ఇల్లే నొగులును
   తమి॥ పట్టకాలిలే పడుం కెట్టకుడియే కెడుం

ఇట్లు ఎన్నెని ఉదాహరణములను ఇవ్వవచ్చును. భాష ఏదైనా భావమొక్కటే. ఏ సమాజములోనైనా మానవ గుణగణములు మారవు. కష్ట సుఖానుభవాలలో పెద్ద తేడా వుండదు. అట్లే ఒక సమాజపు అనుభవానికి మరొక సమాజానుభవానికి పెద్దగా తేడా వుండదు.

## 2) తెలుగు - కన్నడం

లిపిలో సారూప్యత మిక్కుటముగానున్న భాషలుగా తెలుగు. కన్నడములను పేర్కొనవచ్చును. లిపిలోనే కాదు, భావ ప్రకటనలో సైతం సారూప్యత ఉన్నదనే విషయాన్ని ఈ క్రింది సామెతలు బలపరుచుచున్నవి.

1) తె॥ అరచేయిచూపి అవలక్షణమనిపించుకొన్నట్లు
   క॥ అంగైయ్‌తోరిసి అవలక్షణ అన్నిపికొండహాగె

2) తె॥ అత్త కొకకాలం, కోడలుకొకకాలము.
క॥ అత్తగె ఒందుకాల, సొసెగె ఒందుకాల

3) తె॥ అల్పునికి ఐశ్వర్యంవస్తే, అర్థరాత్రిలో గొడుగు పట్టమన్నాడట
క॥ అల్పగ ఐశ్వర్యబందరె అర్థరాత్రి యల్లికొడెహిడిసికొండ

4) తె॥ ఆత్రగానికి బుద్ధిమట్టు
క॥ ఆత్రగారిగె బుద్ధిమట్టు

5) తె॥ కూడు ఉడికిన తర్వాత పొయ్యిమండును
క॥ అట్టమేలెఒలె ఉరియితు కొట్టుమేలె బుద్ధిమంతు

పై సామెతలను పరిశీలించిన ఎడల తెలుగునుండి సామెతలు కన్నడమునకు వచ్చెనో, కన్నడములోనుండి తెలుగు భాషలోకి ప్రవేశించెనో తెలుపుట కష్టమన్నట్లుగాతోచును. భాషలు వేరైనా, ప్రజల భావాలుఒక్కటేనని పై ఉదాహరణముల వలన తెలియనగును. సామెతలు సర్వకాల సర్వావస్థలకు చెందినవని చెప్పవచ్చును.

## 3) తెలుగు - సంస్కృతము

"తల్లి సంస్కృతంబు ఎల్లభాషలకును" అను నానుడికలదు. కావున చాలా సామెతలు సంస్కృత భాషలోనుండి వచ్చియుండవచ్చును.

1) తె॥ గంతకు తగినబొంత
సం॥ యోగ్యం యోగ్యే నయుజ్యతే

2) తె॥ తల్లిచాలు పిల్లకు తప్పుతున్నదా
సం॥ యాదృశీమాతా, తాదృశీపుత్రీ

3) తె॥ అంగిటబెల్లము, ఆత్మలో విషము
సం॥ విషకుంభం పయోముఖం

4) తె॥ బుర్రకు ఒకగుణము, జిహ్వకు ఒకరుచి
సం॥ లోకోభిన్నరుచిః

5) తె॥ ఏనుగుమింగిన వెలగపండు
సం॥ ఆజగామయదా లక్ష్మీర్నారికేల ఫలాంబువత్[1]

---

1 శ్లో॥ ఆజగామయదాలక్ష్మీర్నారికేల ఫలాంబువత్
నిర్గామయదా లక్ష్మీర్గజభుక్తన్ పిత్థవత్.

తెలుగునకు సమానార్థకమైన సామెతలెన్నో సంస్కృతమున కలవు. బహుశః సంస్కృతభాషలోనుండియే తెలుగులోనికి ప్రవేశించియుండవచ్చును.

## 4 తెలుగు - ఆంగ్లము

ఆంగ్లభాష అంతర్జాతీయ భాష-ప్రపంచములో ఉన్న భాషాపదములన్నీ ఆంగ్ల భాషలో కనుపించునవని అతిశయోక్తికాదేమో-ఆంగ్లభాషలోనికి ప్రపంచభాషలోనున్న పలుగొప్ప గ్రంధములు అనువదింపబడినవి. కావున ఆంగ్లభాషలో సమానార్థకములైన సామెతలెన్నో ఉండుటకు అవకాశమున్నది. ఆంగ్లభాషలో సమానార్థకములైన కొన్ని సామెతలను పరిశీలించెదము.

1) తె॥ అంగట్లో బెల్లము గుళ్లోలింగానికి నైవేద్యము.
ఆం॥ Willing to be liberal at the expense of others.

2) తె॥ అప్పు ముప్పు
ఆం॥ Debt is the worst poverty.

3) తె॥ కంకణాలచెయ్యి ఆడితే, కడియములచెయ్యి ఆడును.
ఆం॥ Where woman leads man follows.

4) తె॥ గోవులనుకోసి చెప్పులు దానము చేసినట్లు
ఆం॥ Steal te goose and give the giblets in alms.

5) తె॥ గోరంతవుంటే, కొండంత చేస్తాడు.
ఆం॥ To make a mountain of a mole-hill.

సామెతలు జనవ్యవహారములో నలిగిన మాటలని చెప్పవచ్చును. కావున అన్ని భాషలలోను సమానార్థకాలైన సామెతలుండుటకు అవకాశమున్నది. మానవుని గుణాలు మౌళికంగా ఏసమాజంలోనైనా ఒక్కటిగానే వుండును కావున సారూప్యం గల సామెతలు ఎక్కువగా ఉండుటకు అవకాశమున్నది.

## :- ఉప సంహారము :-

సామెతల విస్తృతినిబట్టి, వైవిధ్యాన్నిబట్టి వానిగురించి సమగ్ర పరిశోదన కష్టతరమైన పనియని చెప్పవచ్చును.

నాకుతోచినరీతిలో, ఒక పథకం ప్రకారము ఈ సామెతలను సవిమర్శకంగా చర్చించుట జరిగినది. బుధజనులకానందాన్ని కలిగింపగలదని భావించెదను.

సామెతలనుగూర్చి ఎంత పరిశోధన చేసినను తక్కువే. కావున మరిన్ని పరిశోధక గ్రంథములు వెలువడవలెనని ఆకాంక్షిస్తూ ముగిస్తున్నాను.



# అనుబంధము

## ఉపయుక్త గ్రంథసూచిక

### 1. తెలుగు


1) ఆంధ్ర మహాభాగవతము - బమ్మెరపోతన
(ఆం.ప్ర. సాహిత్య ఎకాడమి ప్రచురణ)

2) ఆంధ్ర మహాభారతము - కవిత్రయము
(18 పర్వములు)
(ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖచే ముద్రితము-1968)

3) ఆంధ్రుల జానపద విజ్ఞానము - R.V.S. సుందరం

4) ఆంధ్రప్రదేశ్ జానపద గేయములు (త్రివేణి)
తెలుగు విశ్వవిద్యాలయముచే ముద్రితము
సంపాదకులు :
- శ్రీ బి. రామరాజు
- శ్రీ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి
- శ్రీ నేదునూరి గంగాధరం
- శ్రీ తూమాటి దోణప్ప

5) ఆంధ్ర శతక వాఙ్మయోత్పత్తి - కీ.శే. డా॥ కె. గోపాలకృష్ణారావు

6) ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు, ప్రయోగములు - డా॥ సి. నారాయణరెడ్డి

7) ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు

8) ఆముక్తమాల్యదా సౌందర్యము - ఆచార్య శ్రీతుమ్మపూడి కోటేశ్వరరావు

9) కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

10) తెలుగు సామెతలు
ఆం.ప్ర. సాహిత్య ఎకాడమీ ప్రచురణము
సంపాదకులు :
డా॥ దివాకర్ల వేంకటావధాని
డా॥ యశోదారెడ్డి
- మరుపూరు కోదండరామిరెడ్డి

11) తాళ్లపాక కవులు - డా॥ వేటూరి ఆనందమూర్తి
12) తాళ్లపాకవారి పలుకుబళ్లు - రామలక్ష్మి ఆరుద్ర
13) తెలుగు పల్లెపదాలలో ప్రజాజీవనము - యెల్దంత రఘుమారెడ్డి
14) తెలుగు సామెతలు-జానపద సంస్కృతి - వి. దామోదరరావు
15) ఉత్తరహరివంశము - నాచనసోమన
16) తెలుగు జానపదగేయ విజ్ఞానం - డా॥ బి. రామరాజు
17) తెలంగాణా శ్రామిక గేయాలు - డా॥ జి. లింగారెడ్డి
18) తెలుగు వీరగాథా కవిత్వము డా॥ టి.వి. సుబ్బారావు
19) తెలుగు జానపద గేయగాథలు - డా॥ నాయనికృష్ణకుమారి
20) తెలుగు జాతీయములు సంపాదకుడు
- మధురకవి—నాళముకృష్ణారావు
21) తెలుగు సామెతలు-మానవ స్వభావము - బి. రామాచార్యులు
22) తెలుగు సామెతలలో సంఘజీవనము - టి.వి. రామనరసయ్య
23) తెలుగు పలుకుబడుల తీరుతెన్నులు డా॥ ప్రకాశచంద్రశతపథి
24) తెలుగు జానపద సాహిత్యము-పురాగాథలు - డా॥ రావి ప్రేమలత
25) తెలుగు జానపద విజ్ఞానము - డా॥ బి రామరాజు
26) తెలంగాణా పల్లెపాటలు - డా॥ బి. రామరాజు
27) నన్నయ్య ప్రసన్నకథా కవితార్థయుక్తి - విశ్వనాథ సత్యనారాయణ
28) ప్రబంధాల్లో ప్రజాసూక్తం - మాదంనాంపల్లి
29) ప్రజాకవి వేమన డా॥ ఎన్. గోపాల్
30) ప్రాజ్ఞనన్నయయుగము డా॥ దివాకర్ల వేంకటావధాని
31) ప్రజాసూక్తం - యువభారతి ప్రచురణ
32) బ్రహ్మవిద్యా భాండాగారము - శ్రీసచ్చిదానందస్వాములవారు
భగవద్గీతానిలయం జమ్మికుంట స్టేషన్
33) భగవద్గీత - స్వామి చిద్భవానందగారి
వ్యాఖ్యానముతో
34) మనుచరిత్రము - అల్లసానిపెద్దన
35) మేఘసందేశము - కాళిదాసు [సంస్కృతము]

36) మహబూబ్‌నగర్ జిల్లా కథలు - డా॥ బుక్కా బాలస్వామి

37) వేమనసూక్తిరత్నాకరము - నాదెళ్ల పురుషోత్తమశాస్త్రిలుచే పరిష్కృతము

38) వేమన్నవేదము - ఆరుద్ర

39) విజయ విలాస హృదయోల్లాసము - శ్రీ తాపీ ధర్మారావు వ్యాఖ్యానముతో

40) వేమన పద్యములు - గొల్లపూడి వీరాస్వామిచే ప్రచురితము

41) రంగనాథ రామాయణము - గోనబుద్ధారెడ్డి

42) రామాయణ విశేషములు - సురవరం ప్రతాపరెడ్డి

43) రామాయణము - వాల్మీకి [సంస్కృతము]

44) శాలివాహనగాథా సప్తశతీసారము - రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

45) సంస్కృతన్యాయములు - కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి - మట్టి నరసింహ శాస్త్రి

46) సామెత - సి. వేదవతి

47) సారంగధర చరిత్రము చేమకూర వేంకటకవి

48) సాహితీమంజూష కళాస్రవంతి ప్రచురణ

49) సూక్తిముక్తావళి.

~~~~
~~~~

## నిఘంటువులు

1. తెలుగు నిఘంటువు -బహుజనపల్లి సీతారామాచార్య
2. సూర్యరాయాంధ్ర నిఘంటువు

## ఉపకరించిన ఆంగ్ల గ్రంథములు


1. An Exordial Essay — J.G. Holland
2. The American Folklore — Allan Dundes
3. A Collection of Telugu Proverbs (Translated, Illustrated and explained together with some Sanskrit Proverbs) —M.W. Carr
4. An antiquity of Proverbs — D.E. Mervin
5. Before a Great Volume of Proverbs (ASRC హైదరాబాదుసౌజన్యంతో)
6. Book of Wisdom — Ben Sire
7. Curiosities of Literature The Phiosophy of Proverbs (ASRC హైదరాబాదు సౌజన్యంతో)
8. Canterbury Tales — Chaucer
9. Chinese Vocabulary — Doolittle
10. English Proverbs — John Ray
11. Essays — R.W. Emerson
12. Epistles — Homer
13. Essays-Machiavelli — Macaulay
14. Early American Proverbs and Proverbial phrases — B J Whiting
15. Epics, Myths and Legends of ndia — P. Thomas
16. Folklore and Life — Edited by Richard M. Dorson
17. The Folk Tale — Stith Thomson
18. Gnomologia — Thomas Fuller
19. The History of philosophy — Thomas Stanley
20. Hand Book of Proverbs — H.G. Bohn
21. Historical Sketches — J.H. Newman
22. Henderson's Introduction to Scottish proverbs — Motherwell
23. Lectures on the conduct of Understanding — Sydney Smith
24. Letters — Lord Chester Field
25. Legal Maxim — Sir John Mockintosh
26. Literary Studies — Bagehot
27. Letters — John Keats

28 Moral Lessons to Proverbs — Samuel Palmer
29 The Macmilian Book of Proverbs Maxims and Famous phrases, — Builon Stevenson
30 Mystery Windows — Lowell
31 Moral Essays in Proverbs — Samuel Palmer
32 New Dictionary of Thoughts — (ASRC, హైదరాబాదు సౌజన్యంతో)
33 Novum Organum — Francis Bacon
34 THE NEW TESTAMENT
35 Of Ancient and Modern Living — Sir William Temple
36 THE OLD TESTAMENT
37 The Oxford Dictionary of Quotations (New Edition) — Oxford University Press
38 The Oxford Dictionary of English Proverbs — Compiled by George Smith and Introduction by Haseltine
39 Poor Richard's Almanac — Benjamin Franklin
40 Pensee — Joseph John Bert
41 Psycho-Analysis — Sigmund Fraeud
42 Quotations — Edited by Frank D Souza
43 Racial Proverbs — S.G. Champion
44 Sandra Bellion — George Meredith
45 Sayings — F S Cozzen
46 Sermons — Robert South
47 Sermons to Young Woman — John Fordyce
48 Tolem and Taboo — Sigmund Fraeud

## Dictionaries

1 The Oxford English Dictionary
2 The Random House Dictionary
3 The Webster's Dictionary

## ప త్రి క లు

1. పలు పత్రికలలోని వ్యాసములు
2. ముఖ్యముగా ఆంధ్రజ్యోతి (దిన మరియు వార పత్రికలు)

## ఇ ం ట ర్వూ లు

1. శ్రీ ఆరుద్ర గారితో (మదరాసులో వారి నివాసగృహములో)
2. శ్రీ బూదరాజు రాధాకృష్ణ గారితో (ఎ.ఆర్. కృష్ణగారి ఇంటిలో)

